**సంజనించు** సం. అ. క్రి. జనించు, కలుగు, పుట్టు.
చ. అనిన. గృపాంగంబు హృదయాంబురుహంబున సంజనించెన, య్యవకుల రత్న మిట్లను. హరిశ్చం. 1. 215.

**సంజయుఁడు** సం. వి. అ. పుం. ధృతరాష్ట్రుని యాంతరంగిక భృత్యుఁడు. (ఇతఁడు వ్యాసమహర్షి వరముచే యుద్ధ సమాచారములన్నింటిని గ్రహించి జాత్యంధుఁడయిన ధృతరాష్ట్రునకుఁ దెల్పుచుండువాఁడు. కురుపాండవులకు సంధి చేయుటకై యితఁడు జరిపిన రాయబార మద్భుతమైనది).

**సంజల్పము** సం. వి. అ. పుం 1. సంభాషణము, సంలాపము. 2. అసంబద్ధ సంభాషణము. 3. గోల, కలకలము.

**సంజెపడు** అ. క్రి. సంధ్యాకాల మగు.
కం నడురేయి సంజెపడున,ప్పుడు వేగెడు వేళఁ జొచ్చి పోటునకు రిపుల్, గడఁగుదురు. భా. రా. యు. 1095.

**సంజవనము** సం. వి. అ. న. 1. పరస్పరాభిముఖముగా నుండు, 2. నాలుగిండ్ల నడిమి ప్రదేశము.

**సంజవఱుచు** (సంజ+వఱుచు) అ. క్రి. ఎఱ్ఱఁబఱుచు.
సీ జొఁదలఁ జదలేటి తేఁదరఁగలు బాలుఁడగు చందమామ నుయ్యాలలూఁపఁ, దొడవుల తలలఁ జెన్నడరు మానికముల చాయ దిక్కుల నెఱసంజ వఱుప. (ఇది శివస్వరూప వర్ణనము) హరి. ఉ. 6. 34.

**సంజాతము** సం. విణ. (అ ఆ అ.) 1. పుట్టినది.
సీ నిర్ణిద్రదారిద్ర్య నిరుపాధియుతసిద్ధ, సంజాత హృద్భల్లి. లంజతల్లి. నిరంకు 2. 41.
తే. గీ. ... శైత్యమాంద్యక సౌరభ్య సహితమైన, మలయ పర్వత సంజాత మారుతంబు. విక్ర. 1.97.
పెరిఁగినది. 2. కడచిపోయినది (కాలము).

**సంజీవనము** సం వి. అ న. 1. కలసి బ్రదుకుట. 2 మఱల జీవింపఁజేయుట, బ్రదికించుట. 3. నరక భేదము, ఇరువదియొక్క నరకములలో నొకటి. 4 చతుశ్శాల గృహము.

**సంజీవని** సం. వి. ఈ. స్త్రీ. 1. చచ్చిన వారిని మరల బ్రతికించెడి యొకానొక యోషధి.
సీ. ... సకలజీవోన్మేష సంజీవని యనంగ, బ్రకట నిద్రాముద్రఁ బాయఁజేసి. విక్ర. 1. 97.
2. బ్రదికించుట. 3. ఆహారము. 4. రఘువంశ కుమారసంభవ మేఘదూత కావ్యములకు మల్లినాథ కృత మగువ్యాఖ్య పేరు.

**సంజీవనౌషధి** సం వి. ఇ స్త్రీ. పునర్జీవము నొసంగునట్టి యోషధి (వృ. వి.).

**సంజీవప్రభుఁడు** సం. వి హనుమంతుఁడు.
కం. శుభకరుఁడగు సంజీవ, ప్రభుని చరిత్ర మఁట తత్ప్రబంధము సీతా,విభు పేరిటిదఁట గలవే, యుభయగతుల్ దీనఁగాక యొండొక కృతులన్. సమీర. 1. 29.

**సంజీవరాయుఁడు** వి. హనుమంతుఁడు.
మ. బ్రహ్మకైన మతిసేయన్ రాని సంజీవరాయని చారిత్రము. సమీర. 3. 135.

**సంజుఁడు** సం. వి. అ. పుం. 1. బ్రహ్మ. 2. శివుఁడు.

**సంజోక** వి. (సం. సంయోగః) 1. సవరణ, పరికరము.
గీ. అవధరింపుము పయిభూషణాంబరాదు, లీవిధంబున దాఁచి తా దేవదేవి,తాను వైష్ణవురాలి చందంబుఁ బూని, చాలఁదగినట్టి సంజోక సవదరించి. విప్ర. 3. 2.
తే ... ... అంతలోఁ బాదరసము, జోకగల తేజి నిండు సంజోకఁజేసి, యెదుట నటుదెచ్చి నిల్పె సాహిణి యొకండు. శుక. 1. 161.
2. బంధనము, కట్టు, (జీను) కట్టుట.
మ. .... ప,చ్చనివిల్కాని జయాస్పదం బగుజిరా సంజోకతేజీ విధం,బున నివ్వేళఁ బ్రభావతీ సుదతి చూపుల్ వెన్నెలల్ పర్వఁగాన్. శుక. 2. 265.
3. సన్నాహము;
తే. అనిన నంగీకరించి యయ్యంబుజాక్షి, యపుడె పైనంబుసంజోక లమరఁజేసి, చారణుని వెంట నింటివిచార ముడిఁగి, చనియెఁ దొలికోడి కూఁత ప్రొద్దువనె లేఁచి. శుక. 3.138. (సగము+జోక)
4 ఉభయముఖములయందుఁ దాఁకెడి కొనముడిగల డుబుడక్క యొక్క నడిమిత్రాడు (శ. ర.).

**సంజ్ఞ** సం. వి. ఆ. స్త్రీ. 1. చైతన్యము, చేతన.

2. బుద్ధి 3. జ్ఞానము, తెలివి. 4. సన్న, హస్తచాల నాదులచేత అర్థమును సూచించుట.

కం. కాసార సంజ్ఞతోడను, ఖాసిలుచున్నట్టి యొక్కపట్టణమున ... కళా. 5. 21.

ఉ ఇంతలెకాని నాకుచము లింతకు నెక్కుడులేవు కామినీ,సంతతిలోన లేఁత వని సంజ్ఞసురాశిఁ జేయుకై వడిం, గంతుని బెట్టుకోల యొకకన్నియ మారెడుపండ్లు పాణి,పద్మాంతరసీమ నుంచె సంసా కృతిఁ గందుకకేళి సల్పుచున్. నారి. 2. 108.
5. పేరు, నామధేయము.

6. (వ్యాక.) సంజ్ఞావాచకము, ప్రత్యేకవస్తు నామము. 7. గాయత్రీమంత్రము. 8. సూర్యుని భార్యపేరు (విశ్వకర్మకూఁతురు. యమీయ మాశ్వినులతల్లి).

సంజ్ఞపనము సం. వి. అ. న 1. చంపుట. 2. విన్న వించుట.

సంజ్ఞప్తి సం. వి. ఇ. స్త్రీ 1. తెలియఁబఱుచుట. 2. విన్నవించుట. 3. చంపుట 4. బలియిచ్చుట.

సంజ్ఞము సం. విశ. (అ. ఆ. అ) సంహతజానుకము. లోపలికి వంగిన మోఁకాళ్లుగలది, గాడిద మోఁకాళ్ల వంటి మోఁకాళ్లుగలది. 2. చైతన్యము గలది. 3. పేర్కొనఁబడినది; పేరుగలది వి. అ. న. ప్రమానిపసువు (వ్య. వి.).

సంజ్ఞానము సం. వి అ. న. జ్ఞానము, తెలివి, అవ బోధము.

సంజ్ఞాపనము సం. వి. అ. న. 1. తెలియజేయుట, తెలుపుట. 2. బోధించుట, నేర్పుట. 3. చంపుట.

సంజ్ఞావంతుఁడు సం. విశ. (త్. తీ. త్.) 1. చైత న్యము గలవాఁడు. స్ఫూర్తిగలవాఁడు. 2. పేరు గలవాఁడు.

సంజ్ఞావిపర్యయము సం. వి. అ. పుం. 1. చైతన్యము పోవుట. 2. తెలివితప్పుట.

సంజ్ఞాసుతుడు సం. వి. అ. పుం. శనైశ్చరుఁడు; శని గ్రహము.

సంజ్ఞి సం. విశ. (న్. నీ. న్.) 1. పేరుగలది, పేరు పొందినది

సంజ్ఞితుఁడు సం. విశ. (అ. ఆ. అ.) పేరుకలవాఁడు; పేరు పెట్టఁబడినవాఁడు

సంజ్ఞు సం. విశ (ఉ. ఊ. ఉ.) లోపలికి వంగిన మోఁకాళ్లు గలవాఁడు, ముట్టికాళ్లవాఁడు.

సంజ్వరము సం వి. అ. పుం. 1. అధికతాపము.
వ...పురాకృత కర్మవశంబుల గర్భస్థుఁడైన యర్భ కుండు సలాకను గ్రుమ్మచ్చున దిరిగిన చందంబున యోనిముఖంబున వెల్వడి మూర్ఛిల్లి యున్నయంత బహిర్వాయువంబునఁ దెప్పిలి యప్పుడు సంజ్వరము జనియించు. అమ్మహాజ్వర మహత్త్వంబున తుళ్ళి పాసాయాసఖేదంబులును మోహంబును బాటిల్లు. శివధర్మోత్తరము 2. 61.
సీ. ... సంజ్వరార్త ... కథా గ సమ్మద ప్రతిపాది దారుణతిమిర ... కా తాపవహ్ని. పంచతంత్ర. 1. 265.
2 వేఁడిమి అధికకోపము.

సండిశము సం. వి. అ. పుం. చిన్నపట్టుకాఱు.

సండీనము సం. వి. అ న. పక్షుల గతివిశేషము.

సండుఁడు సం. వి. అ. పుం. – షండుఁడు

సంత వి. 1. అపవాదము. (సం. సంస్థాన. తు. సంతె. త. చంతై)
చం. ఎసగును .... సెగ్గసవడిసంత ... అపవాదమౌ ఆం. ప. గుణ. 82.
2. (సం, సంస్థా, సంధా) (త. చంతై. తు. సంతె) నిర్ణయింపఁబడిన దినమువం దుంచెడి యంగళ్ల వరుస; 2. కొనువారి యొక్కయు నమ్మెడువారి యొక్కయుఁ గూటమి.
వ. కొండొక సన్నికృష్ట విప్రకృష్టభూముల నుండు గ్రామంబుల నుండి బేహారులు నానారూప వస్తు కలాపంబు లొక్కయూరికిం దెచ్చి సంకేతస్థలమ్మున నమ్ముటయు సంతయనంబడు. నీ. యా. పు. 18.
సీ. చెప్పనిపని నీళ్లుచేఁదెద వని పోవు, పంతకుఁ బొమ్మన్నఁ జింత సేయు. శుక. 2. 208.

ఉ. సంత నెన్నఁడో, జవ్వన మమ్ముకొన్న గడసాని
ననుం గవయం దలంచితే. ఉ. హరి. 1. 72.

వ. ఊరూరి సంతసంతకుం దిరుగఁ బెద్ద లింటింట
సంతరించిన పిలుకవాటు గోడిగల. ఆము. 4. 35.

3. వేదపాఠము.

వ్య. వేదము సంత చెప్పుకొనుచున్నాఁడు.

4. చెంత, పార్శ్వము.

ఆ స తవగ వియోగి సంతతిపై నలు,సంతదయయు
లేక సంతసమున, సంతసింపఁజేయు సంతతక్రూరమా
సంతరాకు మిఁక వసంత నీవు. రసిక. 6. 66.

5. సామీప్యము.

ద్వి. అంతకాంతకు భక్తులన్యదైవముల, సంతయు
నొల్లరు సహజంబు వినుము. బస. పురా. 197.
పు. 741 పం.

6. సమీప ప్రదేశము.

ద్వి. సంతల నిలిచి దూషకులు చెలంగ. బస. పురా.
192 పు., 5. 44 పం.

**సంతశిక** సం. వి. అ. స్త్రీ. పట్టుకారు; లోహకారుల
పనిముట్టు.

**సంతక్షణము** సం. వి. అ. న. ఎత్తిపొడుపుమాట.

**సంతతము** సం. విణ. (అ. అ. అ.) 1. వ్యాపింపఁ
జేయఁబడినది, విస్తరింపఁజేయఁబడినది. 2. ఎడ
తెగనిది, అవిచ్ఛిన్నమైనది.

చం. ... తచ్చ తురవిలాసినీగణము సంతతసేవ
యొనర్చు నీ మనోహితముగ నింక నేనవఁగ నెంతటి
దాసను. ఉ. హరి. 1. 77.

3. శాశ్వతమైనది, ఎల్లకాల ముండునది. 4. అధిక
మైనది; సమృద్ధమైనది. క్రి. విణ. ఎల్లప్పుడు.

ఉ. భంగము తోడ నున్ననను బంపు విరాటుని
మీఁద భూమికిం, జెంగట .... నాదయిన జీతపు
టూళ్ళులు సంతతంబు వానిం గడు గాసి సేయు
వతనిం జెఱుపం దఱియయ్యె .... భార. విరా.
3. 119.

**సంతతి** సం. వి. ఇ. స్త్రీ. 1. వంశము, గోత్రము.
2. సంతానము, అపత్యము.

ఉ. .... కామినీ, సంతతిలోన లేఁత నని .... నార.
2. 106.

ఉ.....చూపంబని లేదు వాని సుతసంతతికిన్. విజ్ఞా.
కాం. 3. 86.

3. విస్తరించుట, విస్తృతి, విరివి. 4. శ్రేణి, వరుస,
సమూహము.

5. వ్యాప్తి. వ్యాపించుట, 6. రాశి, ప్రోఁగు.
7. ఎడతెగ కుండుట, అవిచ్ఛిన్నత.

**సంతన(ము)** వి. (సం. సంధానమ్) 1. అమర్చుట.
2. కూర్పు, తాపుట.

మ. నెలతా సంతననిగ్గు లుప్పతిలు తిన్నెల్
మూలఁజా పెద్దటా,కుల నిద్దంపు జగా హజారమున
చంద్రా. 2. 37.

వ. కెంపు రాయోడు బిల్లల సంతన దొంతర చుట్టి
బలవంతుల వింతలు సంతరింప. ఇందు. 2. 44.

3. కూడిక, మేళనము.

సీ. తమ్మిమానికపుసంతన పట్టియల చేతఁ జొక్కపు
ముత్తెపు సోబనముల. ప్రబం. 1. 566

సీ. శృంగారభవనమాణిగ సంతనపు నునుప్రమాని
పల్కుల గొప్పమందసంబు. ఉత్తర హరిశ్చం.
2. 130.

సీ. కనువిచ్చి చూచె వాకటికల్వతేకు దొంతర
వసంతముల సంతనము మీఱు. అహల్యా సం.
1. 84.

**సంతనకట్టు**[1] అ. క్రి. (సంతన+కట్టు) 1. సంఘటి
ల్లించు, ఏకమగు.

సీ. సంతనకట్టి యుత్సాహసమేతులై యంతంబు
లేనిరథాశ్వములను. భార. ఆది. 2. 21.

ఉ. అంతులు మీటి మిక్కిలిగ జాఁగతనంబున
దొమ్మిచేసి దుర్దాంత పరాక్రమోన్నతులు దానవ
దైత్యులు వేల్పు వెజ్జుధన్వంతరిచేతి దుగ్ధమయ
వార్ధి సుధారస పూర్ణకుంభమున్, సంతనకట్టి
పుచ్చుకొని చయ్యన నేగిరి నిర్విశంకతన్. భీమ.
4. 86.

2. ఆయత్తపడు.

ఉ. ఇంతకుమున్న వాఁడు సనియెం గడుదవ్వుగఁ
బోవకుండ నత్యంతరయంబునం బటు రథావలి

యొప్పఁగ నేఁగుఁ దుర్గులై, సంతనకట్టుఁ దస్త్రములు శస్త్రములుం దొరుగుండు. భాఁ. అం. 6. 200.

కం. అంతః కరణంబున వటు, చింతిలి యుండుచుఁ బ్రపంచసృష్టికిని గ్రియో,దంతమ్ము లేక దుర్వ్యథ సంతనకట్టఁగ విధాత చాలండయ్యెన్. శివరాత్రి. 1. 57.

**సంతనకట్టు²** స. క్రి. 1. ధరించు, పూను. (సంతన+కట్టు) 2. ఆయత్తపఱుచు, సిద్ధముచేయు.

ఉ. అంతకుమున్న సిద్ధనగరావనినాథుని దండనాథుఁ డత్యంతబలాభిరాముఁడు మహారథ నాముఁడు సర్వసైన్యముల్, సంతనకట్టి. విక్ర. 4. 76.

**సంతనచే(సే)యు** స. క్రి. (సం. సంధానముచేయు) అమర్చు, తాపించు.

సీ. తలఁపు బాగసెలసంతన చేసినట్టి పెన్ జగతిపై ముత్యాలచవికె యెదుట. యయా. 4. 71.

**సంతపడు** (√ సంతన) అ. క్రి. వశ మగు, అనుకూల పడు.

**సంతపనము** సం. వి. అ. న. 1. వేఁడిచేయుట; కాల్చుట. 2. మిక్కిలి బాధపెట్టుట.

**సంతపఱుచు** స. క్రి. (√ సంతపడు) వశముచేయు, అనుకూలపఱుచు.

సీ. ముచ్చుచెక్కుటిఁ బట్టి ముకుఁద్రాడు కుట్టించి గంతగోనెకు దాని సంతపఱిచి (శ. ర. పా) నా. పంచ. 5. 18.

**సంతపాక** వి అంగడి పెట్టుటకు వేయఁబడిన పాక.

**సంతపాకతొత్తు** √ సంత. వి. గుడిసె వేటులంజె.

ఆ. వె కుక్కయే మెఱుఁగును గురులింగజంగంబుఁ బిక్కయొడిసిపట్టి పీఁకుఁగాక, సంతపాక తొత్తు సన్యాసి నెఱుఁగునా, విశ్వదాభిరామ వినుర వేమ. వేమ. 2. 88.

**సంతపించు** సం. అ. క్రి. పరితపించు; దుఃఖపడు.

వ. తమయొడయఁడు తమ్ము మిగులఁగూడియుండ మికి దుర్గమస్థల సంస్థిత లగుట జారక్రీడకుఁ బొసఁగమికిఁ గంతుశర సంతత సంతాపంబునకు సంతపించుచు. హంస. 5. 289.

**సంతపెట్టు** స. క్రి. (√ సంత) పొందుపఱుచు, ఒద్దిగ పఱచు.

చం. అనిపలుకఁగ నాసభికులప్పు డెఱింగి యితండు సెట్టి సీ,యును మొనఁగుక్ గుమారకుని నిమ్మని వారల సంత పెట్టినన్. పంచ. 1.

**సంతపేట** √ సంత. వి. సంతజరుగు నగర భాగము.

తే. గీ ఆఢ్యులై గోత్రకాలల వధివసించి, విటుల వేశ్యాజనముల చక్కటులఁ దీర్చు, వారలును గల్గి శంబరైరి సంత,పేట యన నొప్పు నవ్వేశవాట మునను. వైజ. 8 69.

**సంతప్తము** సం. విశ. (అ. ఆ. అ.) 1. తపింపఁ జేయఁబడినది, కాల్పఁబడినది. 2. మిక్కిలి బాధ పెట్టఁబడినది, బాధపడినది. 3. కాలినది, దగ్ధమైనది. 4. అగ్నిదగ్ధమైనది (బంగారు. మొ.) 5. అలసినది.

**సంతప్తవక్షుఁడు** సం. విశ. (స్త్రీ) శ్వాసము తగ్గిన వాఁడు,

**సంతఁబెట్టు** స క్రి. (√ సంత) విడుచు, త్యజించు.

వ. తదవసరంబున సుర లసురవిసర శరనికాయ జర్జరితకాయులై వెఱిగి పంతంబుల సంతఁబెట్టి బిరుదులువదలి కకెమి విడిచి వాసిపెడఁ బాని మానంబు మాని గుట్టు గట్టిపెట్టి ప్రాణపరాయణత్వంబునం. వరాహ. 11. 65.

తే. గీ. సర్వసంగంబు మిక్కిలి సంతఁబెట్టి, తపసియై యన్నతను జంప దగ్గఱిల్లు, నీదురాచార వర్తనుఁ డెల్లవారి, హతుఁడఁ గావించెకివిధి యెంతయధికుఁ డొక్కొ. శేష. 4. 42.

**సంతమకము** సం. వి. అ. పుం. ఊపిరిపీల్చుట మున్నగు వానియందు గలుగునొప్పి, ఊపిరికుట్టు.

**సంతమము** సం. వి. స్. న. 1. దట్టమగు చీకటి, గాంఢాంధకారము. 2 మహామోహము.

**సంతమసము** సం. వి. అ. న — సంతమము

**సంతము** సం వి. అ. పుం. తెఱచి దగ్గఱగాఁజేర్చిన యఱచేతుల దోయి.

**సంతరణము** సం. వి. అ న. 1. నది మొదలగువానిని దాఁటుట. 2. గెలుచుట, జయించుట.

**సంతరించు** స. క్రి. 1. గడించు; సంపాదించు.

మ. నరవిన్ దానము భోగమున్ మఱి వినాశం బన్నయిమ్మూడునై, ఖరులన్ మర్త్యులు సంతరించు

ధనసంఘాతం బపేతం బగున్, ధరలో నాద్యములైన
రెండు విధముల్ దప్పన్ ... మల్లభూ. నీతిశ. 34
తే.గీ. ఔర నీవు గడించిన వసుచు నాకొసంగ
కూడిన మఱి నేను సంతరించు, సొమ్ము మీఁదట
నీ క్రియ. శుక 3. 77.
వ....ఊరూరి సంత సంతకుం దిరుగఁ బెద్దలింటింట
సంతరించిన .... కొదమతట్టువగుంపు ... ఆము.
4. 85.
వ. ... అమృతంబు సంతరించినం గాని గాత్రంబు
యథేష్ట భోగంబులకు పాత్రంబు గాదు. దశా.
2. 141.
సీ. ... సంతరించిన యట్టి సకల పదార్థముల్, తగు
శీల నింటిలో దాఁచుటకును. దశా 3. 54.
చం. కిరవలివారి మేనులును గొనులుఁ గీల్ జడలుఁ
దొడల్ నడల్, తలులుఁ గుడుల్ మరుల్ కొలుపఁ
దా నిపు డెక్కడ సంతరించెనో, శరశత మైదు
కైదువుల జంత .... చంపూ. రా. 2. 99
చం. ధనమణి వస్తువాహవనితా జనతాదులు బల్మి
సంతరించిన యవి యందు ధర్మములు సేయక
యుండిననేమి యంచు నయ్యనివిషు లందఱున్
బగతు రంచు మహాపద లొందనున్నని, వ్వనుజుఁడ
వన్నఁ గల్గు నిరయంబు రయంబున రమ్మ పోరి
కిన్ ఉ. రా. 3. 48.
2 సంగ్రహించు, దొంగిలు, అపహరించు.
తే. గీ. ఇంతబంగారుగిన్నియ సంతరించు, వాఁడు
దీనికిఁ జోడైనపైడి పళ్లెరంబు చిటుపొటి గిన్నెలు
చెంబు సంతరించకుండునోకో యమ్మయెంచు
కొమ్మ. వైజ. 4. 25.
3. కలిగించు, పుట్టించు.
సీ సన్నుత సత్కవీశ్వరగాయక చకోరసమితి కానం
దంబు సంతరించి. వి. పు. 1. 39.
వ తేటిపిండునకు జలభ్రాంతి సంతరించు నెండ
మావుల చుఱుకునఁ బెండివడి క్రాఁగు. చంద్రాంగ.
2. 84
వ. దుర్గాధిపతు లేమేమ యని పీచు పీచోవు
లచ్చుమ్ములగు కౌముదీ గుచ్ఛమ్ముల సంతరింప.
మను. 5. 71.
4. తాల్చు, ధరించు.

గీ. గగనలక్ష్మి లతాతన్వికబరిమీఁద, సంతరించిన
ముత్యాల జల్లివోలె. కాశీ. 4. 186.
సీ. కేలుఁదామరయందుఁ గేదారవలయంబు, జడ
కుచ్చుమీఁదఁ బచ్చడపు దండ సంతరించి. హర.
తే. మగువ దేవర దివ్యనామము జపించు, నెమ్మన
మ్మున నిత్యవ్రతమ్ము గాఁగ, నచ్చముక్తాఫలై
కావళిచ్ఛలమునఁ, జన్నుఁగవ నక్షసూత్రంబు సంత
రించి. శృం. నై. 8. 63.
సీ. పయ్యెదమాఱుగాఁ బాఱుటాకు లమర్చి,
చాదునఁ దిలకంబు సంతరించి. హర. 5. 37.
సీ. లీల రుద్రాక్షమాలిక దక్షిణశ్రవశ్శష్కులీ శిఖ
యందు సంతరించి. కాశీ. 2. 64.
చం. అనవుడు మందహాసరుచి యౌవన పద్మము
నందలిర్పఁ జయ్యన నిశితాసి పుత్రిక కరాంబురు
హంబున సంతరించి. విక్ర. 2. 232.
5. చక్కఁబెట్టు, సవరించు, సరిపఱుచు,
చం. నెఱవుగ వన్నెవెట్టి రమణీమణి పయ్యెద సంత
రింపఁగా మఱచి. విక్ర. 4. 204.
వ. తదనంతరంబ యంతరంగంబు కొంత సంతరించి
కొని యతఁడు నారాయణున కిట్లనియె. ఉ. హరి.
4. 70.
6. రచించు, నిర్మించు.
సీ. సంతరించితి నిండుజవ్వవంబున యందు, హర్ష
నైషధ కావ్య మాంధ్రభాష. కాశీ. ఖం. 1. 8.
7. నెఱపు, చేయు, నడపు.
సీ. స్వర్భాల లాచెట్ల శాఖల చాటున, సంతరింతురు
కికురింతలాట, చెన్నబ. 5. 378.
వ. ప్రకృతి కాంత క్రంత సురకాంతలం గూడు
కొని సంతరింప ... ఆము. 6. 130.
8. సిద్ధముచేయు, సంగ్రహించు,
తే. నిత్యనైమిత్తికములైన నియమ విధులు, దీర్చి
పిండప్రదాన విధిని సదర్భ, మాషగోధూమయవ
చూర్ణ మధుతిలాది, సముచిత ద్రవ్యములు చాల
సంతరించి. వరాహ. 2. 78.
9. అలఁదు, పూయు.
సీ. కస్తూరి పునుఁగును గంధసారంబును సంపంగి
నూనెయు సంతరించి, హర. 4. 78.
10. పూను, వహించు.

వ. విశ్వవిశ్వంభరా క్రీడనంబు దనకు విదిర్చిన పరమ శాంతి యంతరంగంబున సంతరించి నిఖల ప్రపంచంబునకు నాధారంబై ప్రవర్తిల్లె. భీమ. 1. 31.

11. చేరఁదీయు, దరిచేర్చు.

కం. పలుఁగూఁత లఱచువానిం, గలుద్రావెడు వానిఁ జెవులు గఱచెడువానిం, బొలఁతులఁ దెచ్చెడు వానిం, దొలఁగింపక సంతరింపుదురు రాజన్యుల్. వేం. పంచతం. 1. 448.

12. పోషించు.

సీ. ... సంబళంబు లొసంగి సంతరింపఁగ లేమి విడిచిపోవఁ దొడంగె విబుధబలము దశా. 2. 51.

13. ఆదరించు (కం. సంతయిసు = శాంతపఱచు, తు. సంతెరిసు=ఓదార్చు, ఆదరించు).

వ. అంత వసంతుండు ... మూర్ఛిల్లి ... తన్నుం దాన సవరించుకొని ...రతిననేకోపాయంబుల సంతరించి యూఱడం బలికిన ....కుమా. సం. 5. 570.

14. చక్కఁగా దాఁటు.

**సంతరించుకొను** స. క్రి. √ సంతరించు. సరిపఱుచుకొను, చక్కఁబఱుచుకొను.

వ. అని కోపించి నెఱయం దలంచి తపోభంగభీతిం దన్నుదాన సంతరించుకొనుచున్న యగఱంగని... కుమా. సం. 7. 877.

**సంతర్జనము** సం. వి. అ. న. బెదరించుట, భయపెట్టుట.

**సంతర్పణ** సం.వి.అ.న. తృప్తి. (రూ. సంతర్పణము).

శా. సారాస్వాదనఁ బ్రాణపంచకము తృష్ణం బాసి సంతర్పణ, న్మూర్ఛింబోనసిఁద్రుంచి. ఆము. 6. 25.

2. ఆమెత.

వ్య. బ్రాహ్మణ సంతర్పణ జరిగినది.

**సంతర్పణము** సం. వి. అ న. 1. తృప్తిపఱచుట, తనివి కలిగించుట.

వ...మహాదేవికి సంతర్పణము సేయుట దుష్కర్మం బనరాదు. కళా. 4. 183.

వ. ... తొల్లి లోకోపకారార్థంబు దేవతాసంతర్పణంబు కొఱకు ... శివధర్మ. 1. 204.

2. ఉల్లాసపఱచుట, సంతోషపెట్టుట. 3. సంతోషము గలిగించు వస్తువు, ఉల్లాసకరమైన పదార్థము 4. ద్రాక్షాఖర్జూరాదులు చేర్చి నేయి పంచదారతోఁగూడిన పేలపిండితోఁ జేసినభక్ష్య విశేషము

**సంతసపడు** అ. క్రి. 1. సంతోషించు. (సంతసము + పడు).

కం. మతిఁబాండుకుమారుల సం,చత విని దుర్యోధనుండు సంతసపడియెన్. భా. ఆది 6 190

కం. జనకజకుశలముఁ దెలియం, జనుఁడని సంపాతి తెలుప సంతసపడి యా,తని గారవించి యంగద, హనుమన్ముఖు లచటుగదలి యటు చని రెదుటన్. చంపూరా. 6. 87,

మ. ... నుతిం,చును సౌఖ్యన్ రమియించు సంతసపడున్ సుజ్ఞాని సైతంబు. మల్లభూ. శృంగార శత. 41.

కం. వసుదాయినిరైన వసుధ, నొసఁగి నతనిఁదన్న తన్న రొసఁగె ననుచు సం,తసపడు భూతము లన్నియు. భా. అను 2. 326.

**సంతసము** వి. సంతోషము, ఆనందము. (సంతోషః క. సంతస).

గీ, చనును సంతోస మనఁగ సంతస మనంగ నలరు సంతోషము. ఆం. ప. గుణ. 2.

చం....చేసిన నెవ్వరైన మెచ్చునిపని యేను జేయుదునె సంతస మందుము కోర్కిఁ దీర్చెదన్. ఉ. హరి 2. 79.

తే. అంతిపురమున నుచితకృత్యములు దీర్చి, చంద్రశాలాస్థితుండైన శౌరికడకు, సంతసంబున వచ్చి యాసంయమీంద్రుఁ, డడుగులకు నెఱగుడును వతఁడాదరమున పారి. 2. 22.

కం. రాణింపఁ బల్కి తనపని, జాణైకొను. గొలుచు సంతసపుఁదఱి, ఆము. 4. 269.

ఉ. ... వేఱుసేయ కెవ్వానిగృహాంతరంబున భవాదృశ యోగిజనంబు పావన, స్నానవిధాన్న పానముల సంతస మందుచుఁబోవు నిచ్చలున్. మను, 1. 63.

7. తృప్తి.

చం. తను సగఁబాలు గోలువడి దానిన యిప్పుడు గోరుచీరికిన్, సముచితవృత్తి నిచ్చి తమసామున సంతస మందియున్కి యుత్తమము. భార. ఉద్యో. 1. 19.

**సంతసించు** అ. క్రి. √ సంతసము, సంతోషించు.

ఆనందించు. (రూ. సంతసిల్లు).

సీ. కృష్ణపక్ష విభావరీవేళలఁ జకోరసమితి చంద్రిక లంచు సంతసింప. ఉ. రా. 1. 54.

**సంతసిల్లు(లు)** అ. క్రి. √ సంతసము 1. సంతోషించు.

ఆ. ఏను జహ్నుకన్య నింద్రసమాన నీ,సద్గుణావళులకు సంతసిల్లి, భానుతేజ నీకు భార్యగా వచ్చితి. భార. ఆది. 4. 186.

గీ. సర్వభూతానుకంపకు సంతసిల్ల. హర. 1. 7.

చం. ... కంజదళాక్షుఁడు సంతసిల్లె నే,ర్పడియెను వజ్రనాభవధభారవహుం డిపు డంచు నాత్మలోన్. ప్రభా. 2. 23.

పంచచామరము. పులస్త్యమౌని సంతసిల్లి భూత లేంద్రుతోననున్ ఉ. రా. 3. 263.

ఆ హీనజన్మ మటుట యెవ్వఁడే నొకప్రాణి, సంతసిలుట ముక్తిపొంత గనుట, మేలె కాదె. ఆము. 6. 29.

సీ. నీతల్లి లచ్చేమ్మనే సంతసిల నోరెములు వెట్టుఁ బుడమి వేల్పులకు నెల్ల. అ. రా. బాల. 15.

**సంతానకము** సం. వి. అ. పుం. అయిదు విధములగు కల్ప వృక్షములలో నొకటి.

తే. గీ. తరుణ సంతానకచ్ఛాయఁ దలిరుఁజాన్పు, నందు నాసరోవరముల కభిముఖముగఁ,బవ్వళించెమదన పాద పల్లవంబు, లూరువులఁ జేర్చుకొని వాణి యొత్తుచుండ. కళా. 5. 15.

**సంతానము** సం. వి. అ. పుం. న. 1. వ్యాప్తి, విరివి. 2. అవిచ్ఛిన్నత, ఎడతెగమి. 3. విచ్ఛిన్న ధార, పరంపర. 4. వంశము, కుటుంబము. 5. సంతతి, పుత్త్రాదికము, అపత్యము.

సీ. కానక కన్న సంతానంబు కావునఁ గానక కన్న సంతాన మయ్యె. రామా.

సీ. కానక కన్నసంతానంబు శిశువులు. శృం. నై. 1. 109.

6. నందనవనమునందలి యైదు కల్పవృక్షములలో నొకటి.

కం. సంతానవాటికలునుం, జింతామణి వేదికలును శృం. నై. 5. 22.

**సంతానసంధి** సం. వి. ఇ. స్త్రీ. బిడ్డనిచ్చి పెండ్లి చేయుట మున్నగు వానిచేఁ గలిగిన పొందు (సంధి).

**సంతానిక** సం. వి. ఆ. స్త్రీ. 1. నురుగు, ఫేనము. 2. మీఁగడ. 3. సాలెగూఁడు. 4. ఖడ్గధార, కత్తివాదర.

**సంతాపనము**[1] సం. విశే. (అ. ఈ అ.) 1.కాలుచునది, దహించునది వి. అ. పుం. మన్మథునియైదు బాణములలో నొకటి. వి. అ. న. 1. కాలుట, బాధ, నొప్పి 3. భావోద్వేగము గలిగించుట.

**సంతాపము** సం. వి. అ. పుం. వేడి, అధిక తాపము.

సీ. తీవ్రాంశు సంతాపమునఁ జేసి కమరె నాఱెక్కలు గమరవయ్యె. భార. అర. 7. 21.

2. బాధ. 3. అధికకోపము. 4. పశ్చాత్తాపము. 5. తపస్సు. తపఃక్లేశము. 6.శరీరమును శుష్కింపఁ జేయుట.

**సంతాపించు** సం. అ. క్రి. పరితపించు, దుఃఖించు, వగచు.

కం. ... అనతిక్రమణీయమైన యాపద్విషయం,బున సంతాపింపంగాఁ, జనదని యెఱిఁగియును దగునె సంతాపింపన్. భార. ఆది. 6. 251.

కం. ఆపౌలస్త్యకుమారుని, శాపము విని పంక్తిముఖుఁడు సంతాపించెన్. ఉ. రా. 4. 237.

**సంతాపితము** సం. విశే. (అ. ఆ. అ.) 1. మిక్కిలి తపింపఁజేయఁబడినది, మిక్కిలి వేడిమి కలిగింపఁబడినది. 2. బాధింపబడినది,

**సంతి** సం. వి. ఇ. పుం. 1. అంతము, నాశము.. 2. కానుక. (చూ. సతి)

**సంతు** వి. (సం.సంతతిః) సంతతి, కొలము, వంశము.

తే. సంతు కొలము. ఆం. ప. నర. 2.

సీ. సంతు కొలము వంగసము వంగడము పదుగవంశసంజ్ఞయై యలరుచుండు. ఆం. భా. 2. 170.

సీ. ఇవిగదా తెలిమాపురవుతు సంతు పిసాళి, దొడ్డ నెజ్జ బవళించు నొడయ లయ్యె ... అనఁగ శౌరి చిన్నారియడుగు లమరు. (తెలిమాపురవుతుసంతు అర్జునుఁడు). ముకుందవి. 1. 48 పు. 1 ప.

2. సమూహము.

సీ. మగువల మొగము లా గగవారనిందంబు లొదవెఁ గాకని తేఁటిగొదమసంతు. కళా. 2. 78.

**సంతుష్టి** సం. వి. ఇ. స్త్రీ. సంపూర్ణతృప్తి. పూర్తిగా దనివి నొందుట.

తే. గీ. ... ... నయనసంతుష్టి గాఁగ, నరుగు దెంచుచున్న వాఁడభ్రవీధి. నీతఁ డెవ్వాఁడు. నిరం. 4. 10.

సంతొసము, సంతసము, సంతోసము, ఆనందము.

చం. అసురుల నిమ్మెయిం బ్రముదితాత్ములఁ జేసి పయోజనూతి సం,తొసమున నాకలోకపతిఁ దోకొని పోవు నెడం దదీయవ,క్త్రసరసిజంబు లజ్జ యనురాత్రి గడుం జెడియున్కిఁ గన్ గృపా,ఁస పరుఁడై హితార్థ మధురస్ఫుట సత్యమృదూక్తి నిట్లనున్. నిర్వ. 7. 14.

**సంతుష్టుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) మిక్కిలి తృప్తి నొందినవాఁడు.

**సంతోషణము** సం. వి. అ. న. సంతోషపెట్టుట.

**సంతోషము** సం. వి. అ. పుం. 1. తృప్తి. తనివి, ఆనందము, ప్రమోదము.

ఆ. వె. ... పనులదయ్యె మెఱుఁగుఁ బడఁతుల సంతోష, మేల నాకు ననిఁకఁ జాల నేను. భార. విరా 4. 60.

2. ధైర్యము.

**సంతోషించు** సం. అ. క్రి. హర్షించు, ముద మందు.

వ. ఇట్లు చరాచర ప్రపంచమునకుఁ బ్రాణం బైన సోముండు సంభవించిన సంతోషించి మధుకైటభా రాతియు నీరాకర మథనక్రీడచాలించి వైకుంఠంబు నకుం జనియె. వరాహ. 7. 63.

**సంతోసము** వి. సంతోషము, ఆనందము. (సం. సంతోషః).

గీ. చనును సంతోసమన సంతస మనంగ వలరు సంతోషము. ఆం. ప. గుణ. 2.

కం. ఆ సమయంబునఁ బువ్వులు, గోసి నృపాత్మజుఁడు దండ గొలుసొత్తులుగా, వేసరక కట్టి కడు సం,తోసము నివ్వటిలఁబోదివి తొలఁగఁగఁ బెట్టెన్. భోజరా. 5. 207.

మ. ... మత్పహృత్శోతఁ బ్రొద్దునదేఁ బిల్చెఁగఁ బంచికన్న కల సంతోసంబునన్ దెల్పెనన్. ఉ. రా. 1. 24.

**సంతోసిల్లు** అ. క్రి. (√సంతోసము) సంతసిల్లు, సంతోషించు, ఆనందించు.

కం. నీసైనికులెంతయు సం,తోసిల్లుచు నార్చి,రవుడు దుఃఖితులై కుం,తీసుతుల వారు దీన ద,శాసంగతులైరి బాష్పజలములు దొరఁగన్. భార. ద్రోణ. 2. 181.

**సంత్యక్తము** సం. విశ. (అ. ఆ. అ.) 1. పూర్ణముగా విడువఁబడినది. 2. దొంగిలింపఁబడినది, అపహరింపఁబడినది (విల్యము).

**సంత్యజనము** సం. వి. అ. న. పూర్ణముగా విడుచుట; సన్న్యసించుట.

**సంత్రాణము** సం. వి. అ. న. సంరక్షణము.

సీ. విబుధ సంత్రాణ ప్రవీణుఁడై నిఖిలైక, మతిఁ గాంచు నే మానవతిధవుండు. చంద్రికా. 1. 2.

**సంత్రాసము** సం. వి. అ. పుం. భయము, వెఱపు.

**సందంశ(క)ము** సం. వి. అ. పుం. పట్టుకారు, అక్షరము లుచ్చరించినప్పుడు దంతములను నొక్కుట, నరకభేదము. సందడి.

**సందంశిక** సం. వి. ఆ. స్త్రీ. చిన్న పట్టుకారు; శ్రావణము.

**సందడి** వి. ఒత్తిడి, రాయిడి, సమ్మర్దము. (త. సందడి)

సీ. రాజుల సందడి రాలినతొడవులు మురిసి రాలిన పొడిముగ్గు గాఁగ. భార. విరా. 3. 74.

ఉ. చిటికిమాటి కేకపథసీమ మెలంగఁగఁ బాటిగామి శృం,గాటక వీథి కేగెఁ బతి కాంతల సందడి కుల్కి. శృం. నై. 3. 93.

సీ. కరుల సందడి నొప్పుఘనసేన దుర్దమశీలతో నడవఁ బాంచాల విభుఁడు. భార. భీష్మ. 1. 112.

వ. నివారింపరాని మానవపరంపరల సందడుల మంద మందగమనుండై చని చని. చంపూరా. 4. 68.

ఉ.... తెల్వడియె సందడిగాఁ గదియం గడావళుల్ హరి.ఉ. 7. 52.

2. సమూహము.

తే. గీ. సందియంబుల సందడి డిందఁ జేసి, కందు లేనిమనీష సనందనాది, వందనీయుండ నైన నా యందుఁ గలదు, సీతారా. 2, 151.

ఉ. సొంతముగాఁగ శబ్దహృదయజ్ఞులుదా రుచిత ప్రయోక్తలై, వింతలుగాఁ బ్రబంధముల వీధులు ద్రొక్కఁగఁజాల శక్తులై, దొంతర జల్లి బొంత వెడ దూర్చి గతార్థము కూర్చు దుష్కవి, క్రాంతుల సందడిం దడవఁ జాలెఁ సజ్జులకుం గవిత్వముల్. కవి. పీఠి. 1. 16.

3 జనసమూహము.

వ. బలసికొను కోలాహలమ్ము లిమ్ముగ సందడులు నెడ గలుగన్. మను. 5. 71.

కం. సందడిలోఁబడి యిరువుర, ముం దక్షణ మాత్ర నరిగి మోదం బలరన్. దశకు. 3 48.

కం, మోహుం డతివైభవమున, సాహోయని కటిక వారి సందడి జడియంగా హేమరత్న ఖచిత మ,హా హర్మ్యము చొచ్చి యందు నాసీనుండై. ప్రబోధ చం. 2. 29.

వ. హారవిధాతలు వేత్రహస్తులయి తలంగుండు పాయం దొలంగుం డనుచు సందడి నెడఁగలుగఁ జేయ. హర. 4. 89.

సీ. సందడి గ్రవ్వడి పొంది పెక్కోలంబు లరసి. దశకు. 5. 130.

సీ. శరణీయు లెదురుగా శరణార్థి నేయుచు, నొయ్యొయ్య సందడి కోసరిలుచు. హర. 2. 87.

3. సాంద్రత.

ఉ .... యూప సం,ఘంబుల సందడిన్ నడువ గాల్దెరు వైనను లేక సాధుర,మ్యంబును శత్రు భీషణమునై పుర మొప్పుచునుండు నెప్పుడున్. జై. భా. 2. ६.

4. అల్లరి, జనసమూహధ్వని.

మ. అవలోకించి వయస్యలార కదురమ్యంబైన యీతోఁటలో,న వినోదింతము గొన్నినాళ్ళుచటఁ బెంటల్వెట్లు నీపాపి గాం,డ్ర వృథా సందడి గాని బొంద మనకేలా పాటిపోవంగఁ జే,యవలెం జేటన పెట్టి యంచు పెను పెంపై భీకర ప్రక్రియన్. వరాహ. 11. 75.

5. కలఁత, సంక్షోభము.

చం. వి, చ్చలవిడిఁచేర్చు నెవ్వగల సందడి డెందము గందె చేడ్పడున్. భార. విరా. 2. 293.

సీ. ... ఎవ్వనియందుఁ బ్రాకృతములైన, సత్త్వాది గుణముల సందడి లే దట్టివిమలుని... .... ...అము. 6. 103.

6. ఆటంకము, విఘ్నము.

కం. ... యుష్మ,త్సమధిక తపమునకు నేను సందడి నేయన్. భార. అశ్ర. 2. 140.

7. ఇఱుకు, సంబాధము.

చం. కనుఁగొని దర్పమందరముగా నతఁ డిట్లనుఁ బాండవాగ్రజ,న్మునకు వడిం బెనంగఁగ నను౦ బవ నాత్మజుఁ జూచువేడ్క ని,జ్జనతతి యంతకంత కిటు సందడిగాఁ దనయిచ్చఁ గ్రమ్మ దెంచునొ. భార. శల్య. 2. 231.

8. స్పర్శ, తాకుడు.

ఉ. ... కొమరు మాలెత గన్నుల నవ్వు దేరగా, సంబళి సంబళీ యఱుకు సందడికిం దలమంచుఁ బల్కుచున్. శివరాత్రి. 3. 40.

9. సంకులము.

వ. ... తత్సైన్యంబు లొక్కమొగిన మొనయుటను మనమూఁకలును సోమదత్త బాహ్లిక పురస్సరంబుగా నురవడించిన సందడికయ్యం బయ్యె...భార. ద్రోణ. 5. 86.

**సందడించు**[1] అ. క్రి. అతిశయించు, అధికమగు, హెచ్చు (రూ. సందడిల్లు).

తే. ...అవ్వేలఁది సనియె, జనకుఁ జూచెడు వేడుక సందడింప. భాగ. 4 స్కం. 77.

చం. అని ముని పల్కిన న్విని జనాధిపుఁ డూర్పులు సందడింప నె,మ్మనము చలింపఁగా నకట ! మత్సుకృతం బిటులుండ నేమిసే,యనగు ! మార్క. 5. 186.

చం. పలపలఁ దొల్త దొల్త నొకపాటిగ మాటికి నేటవాలుగా, జలకణముల్ నిగుర్చుచు వెసన్ జడి పైజడి సందడింపఁగా, జలధరపంక్తి దార్కొనుచుఁ జండకరుం గననీక దట్టమై, వెలసి మహాంబుధారల దివిన్ భువి నేకము చేసె నత్తఱిన్. ఇందు 3. 107.

తే. గీ. సరగ నేతెంచి యూర్వశులు సందడింప, రాజు ముందటఁ నిలిచె న భోజవదన. కాళ. 1. 47

తే. గీ. ... వకుళ విరిసె గౌను బలిసెఁ గోర్కులు మది సందడించె దళకు. 1. 86.

సీ. కనుచూపులను మన్మథుని మోహనాస్త్రంబు లందుఁ గాటుకమచ్చ సందడింప. విప్ర. 2. 186.

గీ. అమరలోకంబు నిర్జింప వనుపఁ బొంగి, సంగరోత్సాహ మెదలోన సందడింప, నడరు పెంపున నరుగు నయ్యర్జునునకు, నిర్జరులు హర్షమున నిట్లనిరి కడఁగి. హర. 7. 152.

ఉ.... కపోల మండలీ, దానమిళద్ద్విరేఫనినదంబుల ఘీంకృతి సందడింపవె, ల్లేనుఁగు మీఁద డీకొలిపి యింద్రుఁ డుపేంద్రునిఁ దాఁకె నుద్ధతిన్. పారి. 5. 18.

చం. ... క్రతుదుఁ విరోధిఁ గాంచి యెదనించిన కోపము సందడింపఁగన్. శై. భా. 2. 84.

శా. ... చెక్కిళ్లపైఁ దెల్పు రెట్టించెన్ గూర్కులు సందడించె నడ చండించెన్ మృదామోదముల్, గాంచెన్ వాతెఱ యోసిరించెఁ ద్రివళుల్ నానాఁటికిం బోటికిన్. విజ. 2. 26.

శా. చిత్తేజోమయు నొక్కమౌనిఁ గని భాషింపంగ నూహించుచోఁ, జిత్తానందము సందడింప వనుఁ బల్కెన్ శాంతవాక్యంబులన్. వరాహ. 6 135.

2. గుమిగూడు, మూఁగు.

ద్వి. రాసిన నవహేమరజములు దొలుఁగ, సందడించుచు మహాసంరంభ మెసఁగ, బృందారకారి తోఁ జేర్చి యిట్లనిరి.

రం. రా. యు. కాం 288 పు. 18 పం.

వ. కొండగొటియ ముఱుగుఁడు బొందులకు సందడించు కంకగృధ్రావళుల మొల్లంబుల మునుంగు పడు పల్లంబులును మను. 4. 87.

చం. గరుడుఁడు రాజహంసమును గంధగజంబును మేకఁపోఁతు శ్వాసరము వరుండు నక్రకుల చంద్రుఁడు నిట్టియు గుఱ్ఱ మెద్దు నిర్జరుల విమానముల్ మొదటి చావడిముందర సందడింప శ్రీహరి విధి వాసవాదులు నిజావసరాళ వసించి యుండగన్. కాళ. 4. 15.

3. కార్కొను, చుట్టుకొను, పెనఁగొను

వ. అగ్రభాగంబున వసచువారునునై సందడించు వైకుంఠనివాసులతో ముప్పదిమూడు కోట్ల దేవతలతో. ఉ. రా. 8. 284.

వ. కని తదీయమహామహిమకు నంతరంగంబులఁ గౌతూహలాద్భుతానందంబులు సందడింప నందఱుఁ దమలో నిట్లనిరి. నృసింహ. 3. 4.

మ. .... మది నీర్ష్యాక్రోధముల్ సందడింప. ఆము. 5. 74.

సీ. కమనీయ భూషణగణమణి ద్యుతులును శాతాయుధద్యుతుల్ సందడింప. భా. రా. బాల. 637.

కం. అనుచుఁ బునఃపునరభివందనములు నెమ్మనమునం దుదంచితసమ్మో, దనితాంతభక్తి సంతత, వినయంబులు సందడింప వేమఱుఁ జేసెన్. రాఘ. 3. 62.

శా. వీక్షించెన్ దరహాసయు న్మవమున వ్రీడాప్రమోదక్షమా, దాక్షిణ్యంబులు సందడింప నిలిచెం దత్సన్నిధానంబునన్. హర. 4. 25.

4. గోలపెట్టు.

ద్వి. కంతుహరుఁడ యొగ్గుగా కేమియంచు, సందడింపుచు నున్న జనుల వీక్షించి. పండితా. మహిమా 252.

ద్వి. మాయలు పన్నక మాదిగకొయ్య, జూపుము చూపు మెచ్చోట తన్పితివా, యని సందడించు నయ్యథమపారులను గని నూరసానమ్మ గారు కోపించి. పండితా. దీక్ష. 45.

5. సాంద్రమగు.

సీ. దైత్యపిశాచ భూతప్రేత ఢాకినీ సంరావములఁ తోడ సందడించు. వి. పు. 2. 48.

6. రొదసేయు, ప్రేలు.

ద్వి. చాకి చాకని యేల సందడించెదవు. బస. 82. పుం. 23 పం.

సీ. ఒకతె కప్రవు కళాచికఁ దేంట్లు సందడింపఁగ మిట్టిపడి కేలు బయలు పట్టు. వసు. 4. 75.

గీ. పడఁతి యాలతకూన పుష్పిణి యటన్నఁ, గేల నిపుడంటఁదగునె నీవేల యిప్పు, డలరు కొమ్మ

రణములగలదే దెలిసె, ... ప్రశంసింతి ద్విజరాజి సదసి ప. ఇందు 8 55.

7. విజృంభించు

ద్వి. ఇలవేయు వనవేల యీగురుద్రోహి ,తలదున్మి వైవక తక్క మేమనుచు, సందడింపంగ గురుస్వామి తచ్ఛిష్య, బృందంబు భావించి ... పండి. పురా. 110.

8. సంభ్రమమునొందు, తత్తరపడు.

గీ. ఇందుమతి యేమిదెల్పెదు నదుం గొంద,రిందు వదనలలో క్షితి గ్రందుకొనంగ, సందడింపుచు త్రైలోక్యవసాదవిభులు, సరగ నొనరింపఁ దెలిపొందె జనవరేణ్య. ఇందు. 2. 1[illegible]1.

తే. గీ. అధికతరరోషక్షిపణవ్యాఘ్రుఁ జూచి, బెగడి నలుదిక్కులకుఁ బోవు మృగముపోలి, సందడింపుచు వచ్చు నాజరతిఁ జూచి, ధారుణీదేవతనయుండు తల్లడిల్లి. నిరం కు. 2. 121.

9. వ్యాపించు.

సీ. చారు సహస్రమస్తక విభూషణ మణిచ్ఛాయలు దిక్కులు సందడింప. విప్ర. 8 100.

10. ప్రకాశించు.

సీ. ధాతుమించిన మంచి తమ్ముంట రాగంబు శ్రవణ భాగంబుల సందడింప, భ్రమదాస్పదంబైన పట్టు రెంటెము కటీస్థలిఁ గరము విభ్రమము సూవ. వరాహ. 11. 8.

**సందడించు[2]** స. క్రి కలవరపెట్టు.

ఉ. అంగన నిన్నుఁ గన్గొనినయంత ననంగుఁడు సంద డించెదున్. భాగ. 6 స్కం. 1 ఆ. 28.

2. హెచ్చరించు.

గీ. ముదితమానస లగుచు నమ్ముదితలెల్ల, విదితమగు వేడ్క దనర వేవేగ నపుడు, పెండ్లి పాటలు దన రంగఁ బ్రియమెసంగ. నొండొరుల సందడింపుచు నుచితలీల. ఇందు. 5. 72.

**సందడికయ్యము** — సంకులయుద్ధము. వి. దొమ్మి యుద్ధము.

వ. పెక్కులు పెక్కులును దలపడి యెడనెడంగల యన్ బెరయం గ్రమంబున సందడికయ్యంబు నూలుకొనినఁ గ్రందునం దమకించి యుభయ సైని కులున్మత్తులగతిం గవియ భార. భీష్మ. 1. 287.

వ. ఇవ్విధంబున నుభయబలంబులుం దలపడి సందడి కయ్యంబునం గదిసి. ఉ. హరి. 3. 27.

**సందడిగొను** — సందడించు. అ. క్రి, (√సందడి)

1. మించు; అతిశయించు.

కం. డెందమునఁ గొలువు వేడ్కలు, సందడిగొన నేఁగుదెంచి సంయమివరులన్, బృందారకులు న్నిల్చిరి, క్రందుగ జగదీశు మందిరద్వారమునన్. నృసింహ 1. 78.

2. మూఁగు, క్రమ్ము.

చం. పదువదగండ్లు పెల్లుగనుపట్టు మిణుంగురుఁ బుర్వులంచు నం,దడిగొను నింద్రగోపములు. విక్ర. 3. 62.

**సందడి జగడము** — సందడి కయ్యము. వి. సంకుల యుద్ధము.

కం. ఆసందడి జగడంబున, నాసురపతి మఱిఁది యనుచు నరయక తనపై, డాసిన నీమునఁగత్తిన్, బ్రేసెనదుము రెండుగాఁగ విద్యుజ్జిహ్వున్. ఉ. రా. 8. 384.

**సందడిపడు** — సందడించు. అ. క్రి. కలతపడు, క్షోభ పడు.

ఉ. అంబుజసంభవుండును బలాంతకుఁడున్ మొద లైన దేవసంఘంబులు వచ్చి నా కొలువుఁ గాంచఁ గఁగొరి యొకళ్ళొకళ్ళని, త్వంబును వాకిటం గవియ దండధరుల్ ప్రహరింపఁగాఁ గిరి, టంబులు డుల్ల సందడిపడన్ నరవానరులింక లక్ష్యమే, రామా. 7. 167.

2. గుమికూడు.

కం..... క్రిందటి పాతాళమునను గ్రీడించుచు నా, నందము నొందుచునుందుము, సందడిపడి నాగ కులము చతురత తోడన్. భాగ. 5. 2. 120.

3. ధ్వనించు, రొదసేయు.

**సందడిలు(ల్లు)** అ. క్రి. అతిశయించు, మించు.

తే. గీ. సంధడిలు వేడుక ఖలుమారందవాహ, ములు

తదాహార భూరిసముజ్జ్వల ప్రవాళ,ము లభీష్ట ఫల ములవోలి నొసఁగు, నావసంతంబు రతిరాజు దీవి నొసఁగ. చమత్కా. 1. 47.

సీ. నాట్యక్రియా సమున్నత మృదంగ ధ్వనుల్ సౌధాగ్రగృహముల సందడిల్ల. మత్స్యపు. 1.102.

2. ప్రకాశించు.

సీ. కోరకంబులు నిండుకొని, సందడిలునట్టి తార కంబులతోడఁ బ్రస్తరింప. చిత్రభార. 2. 89.

3. పెనఁగొను.

ఉ. మోదము సందియంబు దనమోమున సంద డిలంగ. దశకు. 9. 41

4. మూఁగు, క్రమ్ము.

తే. ఐదువతనంబు ప్రోక మాయమ్మ యనుచు, సతికిఁ గేలొగ్గుచువారు నై సందడిలిరి. రాఘ. 2. 70.

కం. ముందటఁ బిఱుదం గ్రేవల, డెందమునం గరము సందడిల వలదాయ, స్పంద శుభావహ ములు గో, బృందము లని మాకుఁ బుట్టుఁ బ్రియ మెల్లపుడున్ కాశీ. 2. 24.

**సందడీఁడు** విశే. (√సందడి) వ్యాపకుఁడు.

ద్వి అలయోగి హృదయంబు నరసెద ననుచు, దల పోసి తపసిడెందపు సందడీఁడు. పరమ. 44 పు. 12 పం.

**సందడికాఁడు** దే. విశే. సామాన్యుఁడు (శ. ర.), అప్రధానుఁడు.

సీ ఉపసర్జనాఖ్యుఁడై యొప్పును సందడికాండ్రు నా జిల్లర వాండ్రు నాఁగ. ఆం. భా. 3. 16.

**సందరము** వి – సంద్రము (సం. సముద్ర, ప్రా. సముద్ద. త. సముద్దిరమ్)

కం. అందంద యుద్భవించెను, సందరమున నింది రానుసంజాతములై, మందారకల్పతరుహారి, చందన సంతానపారిజాతాదు లొగిన్. హర. 6. 81.

కం. సందరమున నురువలెనె ము, కుందునిఁ బెండ్లి కిని బిలుచుకొని కేగెడుభూ, బృందారకుఁ గన్గొని యా, నందంబున వప్పయోధి నవ్వె ననంగన్. (శ. ర.) రుక్మి. 4 ఆ.

**సందర్భము** సం. వి. అ. పుం. 1. కూర్చుట, గ్రుచ్చుట, రచన సేయుట. 2. ప్రోగుచేయుట, రాశీకరణము 3. (కథ యొక్క) పాటిక, పరిష్కార బంధము. 4. అన్వయము. 5. ప్రబంధము, కృతి (శ్రీ. ని.). 6. ఉక్తివిశేషము.

కం. ఈ సందర్భము వీరలు, సేసినయది మేము వీరి శిష్యులము. నిర్వచనో. 10. 124.

కం సందర్భము నవరసరీతి, వ్యుత్పత్తి యగుచుఁ గవుల చెవుల జవులు దవుల నిండ, పొందిన దగుఁగా కూరక, యందదుకులు గూర్చు కవిత యందంబగునే. రఘురామా. 1. 17.

వ. అనంతరంబ యారాజు రాజకీరాభిలాష గర్భంబులైన సముచితాలాప సందర్భంబు లుపన్య సించిన నయ్యోగినీరత్నంబు. విక్రమా. 7. 16.

వ. స్థావరజంగమంబులకు దివ్యంబులకు గర్భసం దర్భ నిర్భరావిర్భావదుఃఖంబులు సమానంబులు. శివధర్మ. 5. 24.

7. సమయము (శ. ర).

**సందర్భశుద్ధము** సం. విశే. (అ. ఆ. అ.) 1. పొసఁగి యున్నది. 2. ఉచితమైనది. 3. సుసంబద్ధమైనది.

**సందర్భశుద్ధి** సం. వి. ఇ. స్త్రీ. 1. కావ్య రచనా వైశద్యము. 2. వస్తువిన్యాసము నందలి యౌచి త్యము.

**సందర్భించు** సం. స. క్రి. కూర్చు, రచించు.

వ. మహాప్రబంధంబు సందర్భింపం బూనియున్న సమయంబున. చం. రా. 1. 16.

**సందర్శనము** సం. వి. అ. న. 1. చూచుట.

తే. గీ. .... ద్వారవతి కేఁగి యతని సందర్శనంబు వడసి కానుకగాఁ బెట్టెఁ బార్థివేంద్ర.

2. నిదానించిచూచుట. 3. పరిష్కా విలోకనము. 4. దృష్టి, చూపు, కనఁబడుచుట. 5. ఆలోచనము. 6. విశదపఱుచుట. 7. కలియుట.

**సందర్శించు** సం. స. క్రి. చూచు.

మ....అ, విపులానాగనివాసనాకముల సంవీక్షించి వైధాత్రశౌరప్రదపురంబుల్ గని దేవి నిన్నిచట సందర్శింప నేతెంచితిన్. వరాహ. 11. 86.

**సందష్టము** సం. విణ. (అ. అ. అ.) 1. కఱవఁబడినది, కొఱుకఁబడినది. 2. దగ్గఱగాఁ నొక్కఁబడినది. 3. కాటు ము॥ వానితో నొక్కఁబడినది. వి. అ. న. ఉచ్చారణమునందలి యొక దోషము.

**సందానము** సం. వి. అ. న. 1. త్రాడు. 2. గొలుసు, శృంఖల. 3. బంధనము, నలుకుట. సం. వి. అ.పుం. ఏనుఁగు గండస్థలము నందలి మదము కాఱెడిస్థలము (విల్యమ్సు) (ఏనుఁగు మోకాలి దిగువ భాగము అని వాచ.).

**సందానితము** సం. విణ (అ. అ. అ.) 1. త్రాటితోఁ గట్టఁబడినది. బంధింపఁబడినది.

వ. చంద్రికానంకాశ కౌశేయశత సహస్రసందానితవితానోపశోభితంబును ... భీమ. 2. 127.

2. గొలుసుతోఁ గట్టఁబడినది.

**సందానిని** సం. వి. ఈ. స్త్రీ. గోష్ఠము, పశులసాల.

సీ. కామధుక్సందానినీ మధ్యదేశంబు రసవతి దేవతావిస్మమునకు. (అబ్ధి.) పాండు. 3. 142.

**సందావము** సం. వి. అ. పుం. 1. పాఱిపోవుట. 2. తిరోగమించుట.

**సందాహము** సం. వి. అ. పుం. పూర్ణముగాఁ గాలుట, దగ్ధమగుట.

**సంది** వి. (సం. సంధి) 1. సందు, మందడి, రెండు వస్తువుల నడిమి భాగము.

మ. పురిచేట్టు న్నిశరుండు సారణుఁడు నీభోజాంధకు ల్గాడి క,త్తెర గాయంబులు గండ్లముంగడల సందిం గొమ్మకొమ్మ న్నిరంతరముల్ సాదన దీవె లెత్తి చనుఁడు. ఉ. హరి. 2. 94.

కం. పడఁతులు వెంటనె ప్రియసతి, వడఁజనఁ బడవైవఁగాఁ గవాటము సందింబడి యొక్కతె జడ జిక్కెం, గడు విభునెద నాటు మదనఖడ్గముఁ బోలెన్. రాజవాహన. 5. 88.

మ. ... దం,తెలఁ దాపించిన కెంపుటింటికల సందిం బొంది రావజ్రగా, రెలఁజెన్నొ ... దశా 4.49.

సీ. అచ్చెల్వ చెవిసంది నమరు సంపెఁగ పువ్వుచాయల జివ్వాదిసౌరభంబు. ఉ. రా. 4. 184.

2. దండచేయి, బుజమునకు మోచేతికి నడిమి భాగము, సందిలి, ప్రగండము.

చం. వెడవెడఁ జంకఁజిక్కమున వ్రేలెడు చల్దియు సందిలోహపుం, గడియము క్రూరదృష్టిగల కన్నులు. వేం. పంచతం. 2. 8., ఆం. భా. 2. 138.

సీ ఒకకేల భసిత భస్త్రికతోడి బెత్తంబు సందిఁ గట్టిన తరుణేందుధరుఁడు. కాళ. 1. 30.

తే. ... రుదురాకలిడ్డ సంది, సూతసంహిత లిఖికించి చొరఁదొడఁగిరి. ఆము 4. 46.

తే. గీ. చుట్టుపువ్వుల సిగలు కస్తూరిబొట్లు, సంది తాయెతులునుఁ జెంపగందములును, గలిగి నవయస్కులగు కోడెకాండ్రఁగూడి, విటులు విహరింతు రవ్వీట వేశ్యవాటి. వై జ. 2. 45.

వ సోలు బొందులును, వ్రాలు సందులును, విడియ గోళ్లును, మిడియు వ్రేళ్లును, వలియు కన్నులును, నులియు వెన్నులును. చంద్రాంగ. 6. 93.

మ. .... సం, దుల దండల్ సవరించి కన్నుఁగవ కాంతుల్ కాటుకందీర్చి మం, దులతాయెత్తులు గట్టినన్. శబరపుత్రుల్ గూడియాడం బురిన్ కాళ. 3. 32.

3. సంధి (వ్యాక.).

తే. గీ. ... సందులు దెలియక కవితాకవితల రాజహంస కవులఁ గదిసి, కావుకావనెడి కాకవులు కవులె. ప్రబం. 1. 16.

4. సంధి విగ్రహాది షడ్గుణములలో మొదటిది. ఆం. భా. 2. 188.

5. జూదమాడుట కుపయోగించుకొను ముద్రావిశేషము.

సీ. మేటిజూదరియన వాటమైతివుటమై నాడు చుండుదు నే నహర్నిశములు, దృష్టియేమరక సందియు జాగరంబును దిగయును గరయు నాఁదేట పడిన యచ్చులోననే యచ్చైనఁ గైకొని మాటలాడినయట్లు వేటుగలుగ. ద్వా. 10. 88.

6. మంచెము, ఖట్వ.

**సందికడియ(డె)ము** వి. (సందిలి + కడియము) సందిట వేసికొనుకడియము

సీ. కావడియట్లు చిక్కము సందికడియంబు నూక లతోఁప పొగాకుతిత్తి. హంస. 2. 75.

సందికడెము వి. (సంది+కడెము) దండ కడియము, సందిట వేసికొను కడియము.

చం. మినమిన లీనుమేను నెఱమించుల కొంచెపు టంచుఁగమ్మలుం, గొనబగు ముద్దమోముసమకొన్న మెఱుంగుల కట్లదండయుఁ, గనుఁగవఁ గల్గు. శుక. 3. 105.

సంది(క్రంతుజగడములు వి. సందులలోను గొందుల లోను జరిగెడి చిలిపి కయ్యములు

వ. ఈ మహోత్సవంబులలో నిట్టి గలబలు సేయు దురే మేటిబంట్లకు సంది(క్రంత జగడంబులు గలవే యని తోడ్కొని చని. ద్వా. 7. 27.

సందిగ్ధబుద్ధి (మతి.) నం. విజ. (ఇ) సంశయాత్ముఁడు నమ్మకము లేనివాఁడు.

సందిగ్ధము నం. విజ. (అ. ఆ. అ.) 1. చక్కఁగాఁ బూయఁబడినది. 2. నిశ్చయము లేనిది, సందేహము గలది. 3. తప్పుగా గ్రహింపఁబడినది 4. సందేహింపఁబడినది. 5. స్పష్టముగా లేనిది (వాక్యము). 6. అపాయకరమైనది. 7. విషము పూసినది (విల్సమ్సు).

వి. అ. న. 1. సందేహము, నిశ్చయము లేమి. 2. పూయుట, రాచుట.

సందిగ్ధార్థము నం విజ. (అ. ఆ. అ.) సందేహాస్పద మైన యర్థము గలది. వి. అ. పుం. 1. సందేహాస్పద మైన అర్థము 2. వివాదాస్పద విషయము.

సందిటిదండ వి. ఆభరణవిశేషము.

సీ. ముత్యాలపేరులు మొలనూళ్ళు దోగిలి సందిటి దండలు సరవణులును ధనాభి. 3. 18.

(కొన్ని ప్రతులలో సందులదండలు అని యున్నది)

సందితము నం. విజ. (అ. ఆ. అ.) బంధింపఁబడినది. కట్టఁబడినది.

సందిదండ వి. బాహుపురి, కేయూరము. సందిటఁ గట్టుకొనెడు భూషణము (సందిలి+దండ).

సీ ... బాహుపురికాయెతు లనంగ, దండకడెము సందిదండనఁ గేయూర మమరును. ఆం. ప. పరి. 12.

సీ .... సందిదండ, లంగుళీయకములు హారికంకణ ములు. దశకు. 3. 77.

మ. ... స్తవవిస్ఫూర్తికి సందిదండల ధళల్ సాహోనినాదం బిడన్. మను. 5. 34.

సీ. అందంపుమైచాయ సందిదండలచాయ నుదిరి సంపఁగి మొగ్గయొప్పుగుప్పె. రాజవాహన. 3. 129.

సీ. సందిదండగఁ బెట్టుసవతిపబలు చుట్ట సికజుట్టు తలముళ్ళ వెళలిఖట్టు. చంద్రాంగ. 2. 58.

తే. గీ. మెఱుఁగుఁదీగెయుఁ బెద్దముక్కఱయు బెట్టి దండకాయెతులును సందిదండలునిచి, కేల గాజులు గాడసరాలు దొడిగి, ప్రేమఁ గైసేసి యద్దానిఁ బంపుచేసి. వైజ 4. 30.

తే. గీ. సందిదండలు నొడ్డాణ మందమైన, ముద్రి కలు హంసకంబులు మ్రోయుగజ్జె. హంస. 2. 190.

సీ. గరుడ పచ్చలకీలు కడియంబు లర్పింతు వందుకు నీయాస నెందదేని, తళుకుఁగెంపుల నందిదండలు చెల్లింతు. హంస. 2. 37.

వ. నిగనిగల తరఁగల యందంబు సందిదండల తళుకులకుఁ జెలికారంబు నెఱప కళా 6. 224.

ఉత్సాహాయుక్తగీతి,—

అందమైన కేలుగొప్పులందుఁ బూలు తేఁయల్, చిందనీక యుంచి సిగ్గు చెంగళించు జాళువా; నంది దండలుంగరాలు సన్నబన్న సరులు హొన్నం బెలున్. ప్రబం. 1. 273.

సందియపడు అ. క్రి. సంశయించు.

కం. దరహాసముతో మద్రేశ్వరుఁ డాలింగనము సేసి సందియపడ కిఁవరుగుమని పనుప నాతడు కరి పురికిం జనియె. భార. ఉద్యో. 1. 103.

సందియము వి. (సం. సందేహము) సంశయము.

సీ. ... సందియ మనుమాన మన సంశయంబు. ఆం. ప. గుణ. 88.

సీ. కర్ణార్జునుల యందు ఘనుఁడెవ్వఁ డగునొక్కొ యనుజనంబుల సందియంబు మాన్ప. భార. విరా. 4. 205.

ఎ. గీ. సామికకు నసాఫ... ...హాసమునఁ బాప, సంప్రయోగ మగుట ...యు... భా. ఆ. 1. 5.

ఆ. ఈ యుపాయములఁ భజించువాఁడు మోక్ష లక్ష్మికిఁ బతి, యగు నొకింత సందియంబు వలదు. భా. అశ్వ. 1. 225.

కం. ఇందేమియునుంగలదే, సందియ మస్మజ్ఞ యంబు సత్యము నీవీ, యాందోందని పలుకులు పలు, కందగునే యోడి యకట కక్కుటిలి మెయిన్. హరి. ఉ. 3 259.

కం. అనినఁ బందేశిఁ గృహపతి, కనియెన్ సంది యము దెలియ వడుగుట తప్పా. మను. 1. 74.

తే. తెలియ నానతియిమ్ము సందియము దీఱ. పారి. 1. 66.

తే. అతివముష్టి ప్రతిగ్రహోర్ధ్వావలగ్న, సందియము లేదు వలరాజుచాపయష్టి. శృం. నై. 3. 163.

చం. కలుగుట సందియంబగుట సందియంబయిన కౌనులు. విక్ర. 1. 27.

సీ. వెన్నెలలు దేంట్లగుట సందియము గలదె ... ఆము. 2. 30,

ఆ. వె. న్యస్తశస్త్రుఁడైన యాచార్యుఁ జంపిన, నెవ్వరొక్కొ వారికివ్విధంబు, బలిమిగలుగఁజేసి రలుకమై వనుచు సందియము వడఁగనేల తెలియ వినుము. భార. ద్రోణ. 5. 347.

సీ. ....... కర్ణార్జునులయందు ఘనుఁ డెవ్వఁడగు నొక్కొ, యనుజనంబుల సందియంబు మాన్ప, .. భార. విరా 4. 205.

విశే. (త. సందియమ్) సందిగ్ధము, సందేహము కలది.

సీ. అనుపమంబగు భారతాఖ్యానమున సందియము లైన యర్థంబు లర్థిమిమ్ము, నడుగ నేతెంచితి నని. మార్క. 1. 103.

**సందిలి** వి. సంది. ప్రగండము, దండ.

గీ. ...సంది సందిలనఁగఁ బ్రగండంబు చను. ఆం. వ. నర. 81.

తే. గీ. యోగివర్యుని సందిటి యొత్తులకును, రజిత కేయూరమణులు గాంచనముగాఁగఁ, దలఁపుడురు గాని రమ కుపధానమైన, కొప్పువిరులొత్తు చెలుఁగరు కొంతయైన. దశా. 3. 148.

సీ. గురు వెందపూసపే రొరయ సందిలిఁగట్టి. నీలా. 1. 81.

ఉ. సందిలి పట్టి యాడు మన నాట్యములాడుచు ముద్దులన్ మహా, నంద మొనర్చె బాలికదిన బును జుట్టపుఁ బూవుఁబోండ్లకున్ కళా. 6. 200

2. రెండుదండల నడిమిభాగము.

గి. సింహనాదంబు చేసిన నేదదేటి, కనలి శరచాప ములు గదాఖడ్గములును, గొన్ని సందిటఁ దవలావు కొలదిఁ బట్టి. ఉ. హరి. 3. 66.

కం. తెలివా సందిట సందెడు, నెటివెంద్రుక లాయతములు నీలము లవి యే, తెలఁగువ ముడిచిన నీకున్ గొఱఁతగలదె యవియ జట్టిగొను నీ విభునిన్ ప్రభా. 4. 153.

ఉ. కాళియభేదిఁ జూచుతమకంబున మజ్జనమాడి యాడి నీలాలక యొత్తు గంధసలిలార్ద్రకచంబులు చేన్నుదోయిపై, వ్రాలిన సందిటం బొదివి రాజ పథంబున కేగుదెంచె గోపాలకమూర్తి గాన శిఖి బర్హము కానుక దెచ్చెనో యనన్. పారి. 3 13.

**సందివీరులు** బ వ వి. పామరులు గొల్చు దేవతా విశేషములు.

సీ. పుట్టలమ్మయటన్నఁబో యొంతలేఁడను, సంది వీరులటన్న జాము గొణఁగు శుక 3. 49.

**సందిష్టము** సం. విశే. (అ. ఆ. అ) 1. సూచింపఁబడి నది 2 నిర్ణయింపఁబడినది. 4. తెలియఁజేయఁబడి నది, దూత ముఖమునఁ దెలుపఁబడినది. చెప్పఁబడి నది. 4. ఒప్పుకొనఁబడినది, సమ్మతింపబడినది. వి. అ న. వార్త, సమాచారము.

**సందిష్టుఁడు** సం. వి అ. పుం వార్తాహరుఁడు, సమాచారము తెచ్చుబంటు, దూత.

**సందిహానుఁడు** సం విశే. (అ. ఆ. అ.) సందేహము. గలవాఁడు, సందేహించువాఁడు.

**సందీపనము** సం విశే. (అ. ఆ. అ.) 1. జ్వలింపఁ జేయునది, ఉద్రేకముగలిగించునది. 2. కోపము పుట్టించునది.

సందీపనము వి. అ. పుం. మన్మథుని యొక్క బాణము లలో నొకటి. వి. అ. న. ఉద్దీపనము చేయుట.

సందీపించు సం. న. క్రి. 1. ప్రకటమగు.

మ. అవుఁగాకేమి నిజంబు తేటపడఁగా వచ్చెంచె గంధాక్షతా,ది విశేషంబుల శాంతిపారమును సందీపించె విశ్వేశ్వరున్ శివు నుద్దేశము జేసి ... భీమ ఖ. 135.

2. ఉద్దీపించు, అతిశయించు.

మ. అల గ్రీష్మర్తువునన్ .... .... వెన్నెలదారా గృహముల్ ప్రసూనములు సందీపింపఁజేయున్న రున్, లలితోత్సేక వికారమున్. మల్ల. శృం. 2. 87.

సందీపితము సం. విణ. జ్వలింపఁజేయఁబడినది, అతిశయింపఁజేయఁబడినది.

కం. ...అతం డాపొలఁతి దప్పియును సం,దీపితజఠ రాగ్ని యైన తెలఁగును గనుచున్. భార. అశ్వ. 225.

సందీప్తము సం. విణ. (అ. ఆ. అ.) 1. జ్వలింపఁజేయునది, మండింపఁబడినది.

శా. ...నూతుతల సందీప్తైక బాణాహతిన్, ద్రొల్లం జేసి ... భార. ద్రోణ. 4. 33.

2. ప్రకాశింపఁజేయఁబడినది

మాలిని. అకృతకమధురోక్తి వ్యాప్తసందీప్తసారా. భార. స్వర్గా. 97.

ఉ. సందగుఁగబ్బిగుబ్బలను జాదెడు తన్నయనాంబుపూరముల్, మందరమేరు శైలముల మాటికిఁ బాటుఝరంబులో యనన్. రాధికా. 4. 99.

3. ఉద్రేకింపఁజేయఁబడినది. 4. ప్రోత్సాహపఱపఁబడినది, పురికొల్పఁబడినది.

సందు స. క్రి. (త. చంది. క. సందిసు,) కూర్చు, సంధించు.

ఉ. ప్రక్కలు వంచు వంచి మునివండ్లను రాచును రాచి రాచి జొ,మ్మక్కిలఁజేయుఁజేసి తలయల్లన గాళుల సందు సంది లో,చక్కికి నొక్కు నొక్కు యిరుచంబడ గుమ్మడిమూట గట్టి వీ, పెక్కు దువాళిచేసి చలి యిక్కడ నక్కడఁ బెట్టు వేఁటువన్. క్రీడా. 45.

సందు వి. (సం. సంధి; క. సందు; త. చంతు) 1. ఎడము.

తే. అమృత [illegible] అదికి యదికి, వేయు వత్సరములు [illegible] విధము వాలిఁ, జేర్చి విధి [illegible] నీ మోము [illegible] శృం. నై. 5. 159.

మ [illegible] హేమక [illegible] ములతోఁ జేసే [illegible] వెలిం బొలయఁదో [illegible] చన్దోయి [illegible], దొలయన్. పా. 2. 11.

2. సెలము.

ద్వి .. తొడిఁబడనిదియె సందుగ వారిమీఁద పడి వైచఁ జూతురు చపలమానసులు. ద్వి. పరమ. 3. 214 పు.

తే. గీ. అఖలమోహిని యైన యయ్యాలరుబోడి, శైశవము వీడుకొన్నది సందుగాఁగ, వనుదినంబును రాజనందనులమీఁద, వేఁటలాడుచు మన్నాఁడు విషమశరుఁడు. శృం. నై. 8. 26.

3. ఇంటిప్రక్క నిరుకుగా నుండుచోటు.

చం. జలకము లాడఁగోరి బిర సాపని చీర సడల్చి సందుతో, పలికి జనంగ నీడనునుఁబల్కు వినంబడఁ దల్పుఁ దీయఁగా, వెలువడి వచ్చితిన్. హంస. 2. 64.

4. గొంది, ఇఱుకువీథి.

సీ... బతిమాలి వేఁడినఁ బదముల వ్రాలిన సందులఁ జొచ్చిన శరణ మనిన.... దశా 6. 135.

5. నడిమిభాగము, రెండు వస్తువుల నడిమిభాగము.

చం. జలజదళస్థతోయముల సందులఁ గ్రిందుగఁ దోఁచు మింటినీ, డలు గనుపట్టె నత్తటిఁ దటాకములన్. ఆ. 4. 151.

సీ. అలికనేత్రము కీర్తి యారజ్యమానమై తెప్పల సందుల నిప్పులుమిసె. హర. 7. 79.

6. (అవయవముల) సంధి బంధము, కీలు.

ద్వి. ఇంకఁ జెప్పులతోన యిట్లుంటవేని, శంకింప కిప్పుడ వందుసందులకు నఱుకుదు ననవుడు. బసవ. పు. 6. 22 వం.

తే. వాయు వంగంబులందు దుర్వ్యాప్తిఁ గదిరి,నొవ్వు దెవులును బుట్టించుఁ గ్రొవ్వు సెఱుచు, సందు లెడలించుఁ గ్రమమున సెందుఁబరఁగి, భార. అశ్వ. 1. 175.

7. రెళవి, మధ్యకాలము.

వ. దేవవ్రతుఁడు వాని నేయనొల్లని సందున నా సవ్యసాచి యతనివిల్లు దునిమి. భార. భీష్మ. 2, 195.

చం. కినుక మనంబునం గదిరి క్రీడి పితామహువిల్లు వ్రేల్మిడిన్, దునిమి నితాంతగాఢరయదోర్విభవం బున నొండువిల్లు గైకొనియెడుసందున న్నినిచెఁ గ్రూరశరంబు లురంబునందు. భార. విరా 5.176.

మ బలభిత్సూనుఁడు విస్మయాత్ముఁ డగుచున్ బ్రాయంబు నీకెంత ని,ర్మల చారిత్ర యనం దపోధ నుఁడు స ప్తాత్మాత్మజుం జూచి లె,క్క లెఱుంగన్ మృతులైన రోమశుల మార్కండేయులం జేర్కొ నన్, నలువల్ వింశతి సంఖ్య లేనెఱుంగ నంతం బొంది రిసందునన్. జై. భార. 8. 142.

8 అవకాశము, వీలు.

చం అని కొనియాడి యిప్పు డితఁ డాదట నప్పురి కేగెనేనిఁ ద,జ్జనపతియుం బ్రధానులును సర్వ జనం బులు వీని యూరుఁ,జే, రు నెఱిఁగిపోదు రిప్పుడొక రుండును గైకొనకుండు నన్ను మ,న్మనమునమన్న యిప్పని యొనర్చుటకు న్మఱి సందు లే దగున్. భోజరా. 5. 35.

కం. చిక్కనలగుడంబునఁ దల, వ్రక్కలుగా మోది చంపివైచిరి మఱియుం, బెక్కురఘుసంబులఁ బట్టిరి, యక్కాలసముమాని తనిసి రదిసందగుటన్,

సీ కైవర్తకశ్రేణి కనుబ్రామి యొక దొడ్డమనికి ప్రత్యుత్పన్నమతి వసించె వే పంచతం. 1 608.

సీ. తన మనోహరు పేరు వినినంతఁ గాంతకు మనసు రంజిల్లిన మదనుఁ డదియె. సందు చేసుక మానస సరోవరము నిండఁ గాలువల్ దీర్చిన.... దశా. 3. 15.

ద్వి. కోరికతో దీనికోస మిందులకు. సారంగధరుఁ డురా సందాయె నేఁడు. సారంగ. 1 ఆ. 14 పు. 23 పం.

తే. నీవు మఱి యింటిలోన గుర్రించుచున్నఁ, గడుపు నిండునె? దొంగఁజేరి గ్రాసముడుగు, పొన్నుమనుఁ బల్కునాథు నప్పాలఁ తి జార,కాంతు బొందుటకై సందు గలుగవలసి. శుక. 2. 371.

తే అగృహంబున నిచ్చా విహారమునకు, మనసు పఠు వులు వాఱ నేమాడ్కినైన, సందు గానక యినుప పంజరములోని, చిలుక పోలికఁదలఁకు నక్కులుకు లాఁడి. శుక. 2. 175

ద్వి. కలిగెఁబో సందు సాకడఁగినపనికి. హరిశ్చ. పూర్వ. 159.

ద్వి. నెపమున మముఁ బొందు నీకిదే సందు. హరిశ్చ. పూర్వ. 10 30.

9. వీలు, అనుకూల్యము.

సీ. అభ్రమార్గంబున నరుగుచు మదిలోనఁ గల హంబునకు సందుగలిగె నింత, కాలంబునకు నంచు గంతులు వైచుచు. వరాహ. 1. 38.

10. లోపము.

ద్వి. మాటసందులు పట్టి మన సొత్తిచూడ. హరిశ్చ. పూర్వ. 1400.

11. మర్మము, రహస్యము

సీ. సందెఱింగిన, దొంగ సాలెనగొట్టు. పిసాసి దిమ్మరి బెరజము బటాని చెన్నబ. 2. 24.

కం. కొందఱు శూన్యం బనియును, గొందఱు తేజ స్స్వరూపగుణనిధి యనియున్, గొందఱు కాలంబని యును, సందెఱుఁగక తలఁతు రుదిత సందేహము నన్. హ. వరాహ. 3. 34 పు.

కం. ఈ సృష్టి విధమే, భాసురముగ నెట్లు పెక్కు భంగుల నగునో యీ సందు తెలియఁజెప్పుము. భూసురవర తిలక చిత్తమున కింపెసఁగన్. వాసిష్ఠ. 3. 73.

12. మల్లవిద్యావిశేషము.

గీ. మల్లవిద్యా విశేషాల్ప మార్గములకు వలరుసం దన... అం. వ. నానా. 9.

ఉ. కొక్కెనచే బిగింప మెడ గొబ్బున కేల్ వడిఁ బెట్టుదీసి మేల్, కక్కితఁబట్టి త్రిప్పి చెయిలావున దున్నుక రెండుప్రక్కలన్, డొక్కర సందుప్రేయఁ దొడనొక్కుచు సంబెడఁజేసి త్రోసి వెన్, జక్కిను రా టమెక్కి వడిఁజాఱి కడంబడఁ డింకఁ బొర్లఁగన్. ప్రబం. 1. 87.

13. సందర్భము.

సీ. తనమాట యేమెఱుంగని యంగనకు జార,మను

కార మొనరిచు మందుగాఁగఁ, దనప్రౌఢిస దుగా వనిసుందరికి గోడ, చివ్వన దాఁటెను శ్రేణిగాఁగ. శుక. 1. 42.

కం. మానినిచిత్తం, బున గోపము పుట్టఁజే నృపుని దెస నొ, చ్చినసందువ. దశకు. 7. 47.

తే అచట నప్పుడట్ల నినుఁగూడి యలరినదియు, నట్లనీ వేఁగుచో వచ్చినదియు దాన,యగుచుఁ దోప సందడికి యెట్లాడనేర్చె మగువ గాదుర యిది పెను దగరగాని. కళా. 3. 196.

**సందుకట్టు** వి. (√సందు) త. సందుకట్టు క.

మ. సందుకట్టు. నడిమికాలము. ఆం. భా. 5, 32.

ఉ. రాజితతేజుఁ డైన దినరాజు తిరోహితుఁ డైన పిమ్మటన్, రా జుదయాద్రి పీఠము తిరంబుగ నెక్కెడు సందుకట్టునన్, భ్రాజితసత్పదంబునకు బాధ యొనర్చుచు జారచోరసం, పూజితమై తమంబు గడుఁ బొంగె నధర్మముతోడి జోడునై. నృసింహ. పు. 3. 81.

**సందుకా** (హిం. సందూక్) చిన్నపెట్టె.

**సందుకొను** స. క్రి (√సందు) 1. దక్కించుకొను, వశపఱచుకొను.

కం. ఈగజగామినిఁ గామిని, నేగతి నే సందుగొందు నిఁక నని విధుఁడున్, వేఁగుచు గురుఁ డిలు వెళ్ళన, చో గానముచేయు నవ్వుఁ జూచిన మ్రొక్కున్. వరాహ. 7. 20.

ద్వి, తోయజాలయసయిదోడు దా ననుచు, దోయ జనాభు పొందుట సందుకొనియె. ద్వి. ప. మ. 5. 442 పు.

2 గ్రహించు, కూర్చుకొను.

వ. తపని చిగురాకువకుం బ్రదక్షిణంబులు సేయు భ్రమరాళికిఁ దత్పయోజబీజాక్షమాలిక యని పోలికల సందుకొనుచు నందంద లతా కుందబృందంబులకు దూరంబారు నిందిందిరావళి యిందిరానందనుం డిందీవరగంధులపై వైచువాటు బల్లెం బని దాఁటుచు. రాజవాహన. 3. 114.

**సందుకొ(గొ)ను** అ. క్రి. (√సందు) 1. అవకాశము చేసికొను,

వ, కపులకొమ్మునం జిక్కి వేలుతురంగంబులును సందుకొని చొచ్చిన సుభటులు. భా. కర్ణ. 1. 193.

కం. భవళుఁడ వీవేనా యని, కవుఁగిటఁ గదియించి యెనరుగలబంధుఁడ వౌ, దువు నేఁటికైన వచ్చితి వవసర మిపుడైనఁ గలిగెనా యని పలుకన్.

తే. వారిమాటలు విని మదపతి మరియ, వచనమేజాణయో వినివచ్చి యిట్లు, సందుకొన్నాఁడు కార్యంబు చక్కనయ్యెఁ, గాంత యొనఁగూర్చు భవళుఁడే కలఁ డటంచు. శుక. 2. 517.

చం.... ముద్దియ యేగతి నట్లు రంభరూ, పున ధరియింప నేర్చితివి పొందుగ నెమ్మెయి సందుకొంటి వా,యవఘుని నట్లు గూఁడఁగ జిరాభినుత విధి. కళా. 4. 3.

2. వ్యాపించు.

తే. గీ. శంఖఘుంఘుమనినాదముల్ సందుకొనియె. ఉ. రా. 8. 165.

**సందుగము** సం. వి. అ. న. సంధ్యాగములు.

తే గీ. సకలసందుగములకుఁ దేజంబు గలుగ,మధుమదారంభ మణకువ మఱలఁ ద్రోవఁ, దేకువయు నారజంబునుఁ దేటపడఁగఁ, బురమునకు వచ్చె నొక కాపు పూవుఁబోడి.

(* సంధ్యంగములకు అని పాఠాంతరము) క్రీడా. 1 134.

**సందుగొట్టు** అ. క్రి. (సందు+కొట్టు) బిడ్డలకు సందు దోషము తగులు (శ. ర.).

**సందుదవ్వులు** = సందుగొట్టు (శ. ర.).

**సందువడు** అ. క్రి (సందు+పడు) (√ సందు) చిల్లిపడు.

సీ. మొనయించి కులుగాడెములలోన వేసిన, జముని దూతకు వెన్ను సందువడదె. కకు. 1. 129.

**సందువెట్టు** అ. క్రి. సందు అను మల్లబంధవిశేషము ప్రయోగించు.

వ. అరక్షోవైరి వారి కటిచేలంబు వట్టి యెత్తి యెత్తి వడుమ రాగెయిడి సందువెట్టి నవ్వివ నవ్విరోధికాలు కాలిలో నిడి వేధించి నిరోధించిన. భాగ.

10 స్కం. పూర్వ. 1345.

**సందుష్టము** సం. విణ. (అ. ఆ. అ.) 1. దోషము గలిగి పాడైనది, చెఱుపఁబడినది. 2. దుష్టము చెడినది.

**సందుసీనము** వి. మల్లబంధవిశేషము.

వ. కక్కకొక్కెస సందుసీనంబును నృసింహంబును నాదియగు ముప్పది రెండు విన్నాణంబుల నాణెంబు పరీక్షించి. హంస. 1. 206.

వ. కొక్కెస, కుమ్మరింపు, బోడింపు, సమసీసంబు సందుసీసంబు గొంతుమారును. మల్లుపురా. 3. 69.

వ. సందుసీసంబును కొంతుమారును సమసీసమ్మును చేకందవంబును కర్లవంబును. ప్రబం. 1. 78.

**సందుసుడి** విణ. అవకాశమును బట్టి వంచించునట్టి.

చం. ... సందుసుడి మాయలుగా మగవారి కృత్యముల్. మను. 3. 82.

(ఇది మాయలు అనుదానికి ముందే కనఁబడుచున్నది.)

**సందూషణము** సం. వి. అ. న. చెఱచుట, దోషము గలిగించుట, మలినము చేయుట, దోషారోపణము చేయుట, తప్పుపట్టుట, నిందించుట.

**సందూషితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. చెఱుపఁబడినది. దోషము గలదిగాఁ జేయఁబడినది. 2. హెచ్చినది, పెరిగినది (రోగము మొ.) 3. నిందింపఁబడినది. 4. అతిక్రమింపఁబడినది. 5. దుర్వినియోగము చేయఁబడినది.

**సందె** వి. (సం. సంధ్యా.) (క. సందె, సంజె.) 1. సంధ్యాకాలము. సంజ.

ఆ. వె. అనిన నట్టిదేవుఁ డంగజునకు లొంగి, సందెలందు దినములందు విడక, వేయివత్సరములు వెలఁదితో రమియించి, యర్ధదేహ మొసఁగఁడాయటన్న. దశా. 3 62.

తే. గీ సందెఁ దలయంటుకొనుట వస్త్రంబు లేక, మజ్జనముచేఁత విరియాకు మట్టగించి, తాల్చుటయు నిరుగేలను దల పుణుకుట భర్తగల భామినుల కళుఖప్రదములు. పి. శకుం. 4. 79.

చం. జగమున సంధెవేళయను చైత్రుని రాకకుఁ గ్రుంకుగట్టుతా నగమగుఁ గాన నందు జరఠాతపపల్లవరాజిఁ జేర్చి బా, గుగఁ బరిపక్వమైన ఫలగుచ్ఛము నిచ్చగ రాల్చు వైఖరిన్, తొగవగదాయయయ్యపఃతోయధి మున్గెను గుంకుమచ్ఛవిన్. ఉత్తర హరిశ్చం. 3. 102.

2. సంధ్యావందనము.

ఆ. వె. సందెవార్చ నేమి జపము సేయగనేమి, వేదశాస్త్రములను వెలయనేమి, పడఁతి గనినవాఁడు బాడుగాఁ గాఁడయా విశ్వదాభిరామ వినుర వేమ. వేమ. 2భా. 431.

తే. గడియలోఁ దెల్లవారె భాస్కరుఁడు గ్రుంకె, జాగు లేలంచు సందెపై సందెవార్చు. శుక. 2. 458.

**సందెచీఁకటి** వి సంధ్యాకాలమందగు చీఁకటి.

కం. ఇటువంటయ్యలె కారా, చిటుకు మనకయుండ సందెచీఁకటి వేళన్, ఘటచేటీవిటులై యి, క్కటకంబునఁ దిరుగువారు కంజదళాక్షీ. వైజ. 2. 18.

**సందెజాము** వి. (√సందె) రాత్రి మొదటి యామము.

గీ. అనిన నట్లకాక యని వల్లియును జీర, పేనునేకశయ్యఁ బ్రీతినుండఁ బేనుకన్ను మొఱఁగి ప్రియపడి భూమీశుఁ గదిసి సందెజామె కఱచె నల్లి. నా. పంచ 1. 321.

సీ. జాములఁబడి సందెజాము పోయినదాఁక వరపుడు పనులు సర్వంబుదీర్చి. హరిశ్చం, 5. 55.

**సందెమల్లియ** వి. ఒక తీఁగె, రుద్రాక్షి (వృ. వి).

**సందేశకము** సం. వి. అ. న. వార్త, సమాచారము.

**సందేశము** సం. వి. అ. పుం. 1. సమాచారము, వార్త. 2. వాచికము, చెప్పి పంపిన సమాచారము. 3. ఆజ్ఞ, నియోగము,

**సందేశవాక్కు** సం. వి. చ్. స్త్రీ. చెప్పి పంపిన వార్త.

**సందేశహరుఁడు** సం. వి అ పుం. 1. వార్తాహరుఁడు, సందేశము తీసికొని పోవువాఁడు, దూత. 2. రాయబారి (ఇట్లే సందేశహారకుఁడు).

**సందేశహారకుఁడు** సం. వి. అ. పుం. చూ. సందేశహరుఁడు.

**సందేశార్థము** సం. వి. అ. పుం. దూత ముఖమునఁ జెప్పి పంపిన సమాచార విషయము.

**సందేహము** సం. వి. అ. పుం. 1. సంశయము, నిశ్చయములేనిది. 2. అపాయము, [illegible]. 3. (అలం.) అర్థాలంకార విశేషము, సందేహాలంకారము (మమ్మటాదులు దీనిని ససందేహమని పేర్కొనిరి) 4. దేహమందలి పాంచభౌతికాంశముల సమూహము.

సీ. అల్పాక్షరం బయ్యు నధికార్థము నొసంగు, సారతరంబు మోక్షప్రదంబు, సందేహరహితమాజ్ఞా నిశ్చితము దృఢం, బక్షసిద్ధిదము శివాత్మకంబు ... శివధర్మోత్తరము 1. 144.

**సందేహడోల** సం. వి. ఆ. స్త్రీ. సంశయమను నుయ్యాల, సంశయపరిస్థితి.

**సందేహి** సం. విణ. (న్. ఈ. న్.) 1. సందేహము కలవాడు 2. నమ్మకము లేనివాఁడు,

**సందేహించు** సం. అ. క్రి. సంశయించు, సంకోచించు, వెనుదీయు.

శా. ధేనుగ్రాసము మాన్ప దోసమని సందేహించినన్ సస్యమెం, తే నష్టంబగు నైననేమి మఱియు న్విత్తంగ యామంబులోఁ, నౌనన్నన్ మునులెల్లఁ మిక్కిలియు నేఁ డాఁకొందురు వరాహ. 10. 89.

**సందోహము** సం. వి. అ. పుం. 1. పాలు పితుకుట. 2. సమూహము, మొత్తము.

మహాస్రగ్ధర. ఎకరాలన్ మందు వాసాహిణములఁ గలభద్రేభ సందోహవాహ ప్రకరంబున్ గొంచు... మనుచ. 1. 40.

**సంద్రము** వి. (సం. సముద్రః)=సముద్రము. జలనిధి (రూ. సందరము)

సీ. సాగరంబంబురాశి సంద్రము కడలి. ఆం. న. అచర. 37.

ఉ. సంద్రము దుగ్ధబిందువులు సల్లెడు నుత్తమ తీర భూస్థలిం జంద్రనగంబు. భా. రా. యుద్ధ. 1092.

ఉ. చందురుఁ గాంచి సంద్ర మతిసాంద్ర సమృద్ధి వహించెఁగాక. శీమం. 2. 20.

శా. ఓ వాచంయమిచంద్ర సంద్రములు నేఁ డొం డైనవేళన్ హాయ, గ్రీవుం డెక్కడ నుండె. దశా. 1. 227.

కం. గోనములిం[illegible]ద్రము యుత్తెఱఁ, గునఁ జాలుపు తేర్ల [illegible] మొుదవని పై, పున సడరొ సుము నొసనాఁ, డెసపెుఱిన వేడ్క నుల్లమిగుర్తంగన్. అ రా. అయోధ్యా [illegible].

తే. చంద్రగుప్తుఁడు పూర్ణిమా చంద్రుఁ గనిన, సంద్రమునుబోలె నానందసాంద్రుఁ డగుచు విక్ర. 1. 171.

**సంద్రావము** సం. వి. అ. పుం. పాఱిపోవుట, తిరోగమనము

**సంద్రుఁడు** వి. సముద్రుడు.

కం. మనవాండ్రై సంద్రుఁడు చె. ప్పిన మాటలు వింటిరింకఁ బిఱుతికమలన్, గొనివచ్చి కట్టకట్టుఁడు, చన వలయుం గడలిదాఁటి సరగున మనకున్. యయా. 3. 33.

**సంధ** సం. వి. ఆ. స్త్రీ. 1. కూడిక, సహస్థితి. 2 సన్నిహిత సంబంధము. 3. స్థితి, అవస్థ 4. వాగ్దానము, ప్రతిజ్ఞ, ఒడంబడిక,

కం. సంధారఘుపతికి వృషస్కంధున కైదండయుగిన కర్ణునకు సమిన్మాంధాతకు... పాండు.

5. హద్దు, మితి. 6. స్థైర్యము, చాంచల్యము లేమి. 7. మునిచీఁకటి, సంధ్యాకాలము. 8. (మద్యము) బట్టీనుండి దింపుట, సంధానము. 9. ఒక స్థితిలో స్థిరముగా నుండుట.

**సంధాత** సం. విణ. (ఋ. ఈ. ఋ) సంధానము చేయువాఁడు.

**సంధానకరణి** సం. వి. ఈ. స్త్రీ. విఱిగిన యవయవము లతికించు ఓషధి విశేషము.

**సంధానము** సం. వి. అ. న. 1. కూడుట, కూర్చుట.

సీ.....సూనవితాన సంధానవిధానతఁ చేటికవాసనల్ చేర్చురీతి. ధర్మ. 40. 1. 192.

2 అతుకుట 3. మందులు మున్నగు వానిని కలుపుట. 4. చెడినదానిని బాగుచేయుట. 5. బాణమును వింటి నారియందు కూర్చుట. 6. మైత్రి. 7. సంధిబంధము, కీలు, 8. శ్రద్ధ. 9. కార్య నిర్వహణము. 10. పోషించుట. 11. మద్యమును బట్టీపట్టుట. 12. ఒక విధమైన మద్యము. 13. దప్పిని హెచ్చు

చేయు ' చర్మ పదార్థము. 15. ఊరుగాయలు పెట్టుట. 16. మందుల యుపయోగము వలన చర్మము నతుకునట్లు చేయుట. 16. పుల్లగంజి. 17. కంచు. 18. సంధి, పొత్తు

కం. అది యట్టిద సంధానము, దుది నెమ్మెయిఁ గల్గ నెట్లు సుయోధనుఁ డున్మదుఁడు ధృతరాష్ట్ర భూవిభు, హృదయ బు తెఱంగు గొంత యెఱుఁ గుడు మె దా భా. ఉద్యో 1 389.

**సంధాని[1]** సం. విశ. (న్. సి. న్.) 1. కట్టువాఁడు, బంధించు వాఁడు. 2. సంధానమున (నారిలో బాణము కూర్చుటయందు) నేర్పుగలవాఁడు. 3. మద్యమును బట్టీ నుండి దించువాఁడు, మద్యము చేయువాఁడు.

**సంధాని[2]** సం. వి. ఈ. స్త్రీ. 1. మద్యములు బట్టీ నుండి దింపుట. 2. కుప్యశాల, కంచరివని చేయు స్థలము. 3. మద్యములు చేయుట.

**సంధానితము** సం. విశ. (అ. అ. అ.) 1. అతుకఁబడి నది, కూర్పఁబడినది. 2. కట్టఁబడినది, బంధింపఁ బడినది.

**సంధానిని** సం. వి. ఈ. స్త్రీ. గోష్ఠము, పసులసాల.

**సంధాయకుఁడు** సం. విశ. సంధానము చేయువాఁడు, కూర్పువాఁడు, కలిగించువాఁడు.

**సంధాయి** సం. విశ. (న్. సి. న్.) కూర్పువాఁడు (విల్లమ్ములనువలె).

**సంధారణ** సం. వి. అ. స్త్రీ. 1. అడ్డుపెట్టుట, ఆటంక పఱుచుట. 2. చక్కఁగ జ్ఞప్తి యందుంచుకొనుట. 3. ఓర్చుట, సహించుట. 4. చిత్తము నీశ్వరునం దే కాగ్రము చేయుట (విల్యమ్సు). 5. విన్యాసము, భంగిమ.

**సంధారణము** సం. వి. అ. న. చూ. సంధారణ

**సంధి** సం. వి. ఇ. పుం. 1. కలయిక. కూడిక. 2. ఒడంబడిక, సమ్మతి. 3. పొందు, రాజులు కొండొరు లతోడి పొత్తు, మైత్రి, రాజ్యతంత్రమున షడ్గుణము లలో నొకటి.

ఉ. సంధికి నేను కార్యము పొసంగక కృష్ణుఁడు రాకయునే. భార. ఉద్యో 4. 135.

4. అవయవసంధి, కీలు. 5. (బట్ట) మడత. 6. రంధ్రము. 7. సొరంగము, దొంగలు త్రవ్విన కన్నము. 8. విభజనము, విభాగము. 9. (వ్యాక.) అక్షర సంయోగము. 10. వ్యవధానము, విరామము.

సీ. ఉన్మత్తులనఁ బునుక్తులు కావించి సాలిలగతి పడి సంధు లతికి. శివధర్మ. 1. 12.

11. క్లిష్టసమయము. 12. ఉచిత సమయము. 13. యుగసంధి, కృతాది యుగములలో నొక దానికిని మఱియొక దానికిని నడిమికాలము.

కం పపారి తొల్లి త్రేతా, ద్వాపరముల సంధి నొకగ్రహబు ధరిత్రీతలాపంబుఁ జేసె జనముల, పాపంబున వత్సరములు పంద్రెం డధిపా. భార. శాంతి. 3. 276.

14 నాటక విభాగము, (ముఖాది) (ముఖము, ప్రతి ముఖము, గర్భము, అవమర్శము, నిర్వహణము అని యిది పంచవిధము.) 15. భగము, ఆఁడుగుఱి. 16. మద్యము చేయుట. 17. జ్వరతీవ్రత.

**సంధించు** సం. స. క్రి. 1. కూర్చు, చేర్చు.

మ. అతులంబై యనవద్యమై కువలయోదారప్ర మోదప్రదా,త్మత సంధించి కరంబు రాజిలుచుచంద్ర ప్రాజ్యతేజోవ్రజం, బతివేలం బగుచున్ వెలుంగఁగ. చంద్రికా. 4. 22.

వ. మనంబు సుస్థిరంబు గావించి గుణత్రయవికృతు లడంచి యాత్మను నాత్మయందు సంధించి తన్మ యుండై యోగి నిర్వాణంబుం బొందు. మార్క. 3. 357.

మ. సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగమున్ జేదోయి సంధింపఁడు... భాగ. 8. 96.

2. సంధిచేయు, పొందుపఱుచు.

మ. సుతువాఁడై వినయంబు సేకొనక యే చొప్పుం దగం జెప్ప కా, ధృతరాష్ట్రుం డవినీతిఁ జేసినను సంధింపంగరా దంచు వేఁగ తెగం బాఱకు. భార. ఉద్యో. 3. 25.

3. కలిగించు, ఆపాదించు.

మ. పతత్రప్రాకారకా ఘోరంచే, ష్టలు మానంగల వాఁడఁ బఱిగురుపై సంధించె సద్బోధమున్. భార.

శాం. 3. 225.

4. కలసికొను

మ. ఇది సంధించఁగ వేళ యంచు వసురాజేం ద్రుండు... వసు. 3. 45.

**సంధిక** సం. వి. ఆ స్త్రీ. మద్యము చేయుట, సంధానము.

**సంధికము** సం. వి. అ పుం ఒక విధమైన జ్వరము.

**సంధిచోరుఁడు** సం. వి. అ. పుం. కన్నగాఁడు, కన్నపు దొంగ.

**సంధిచ్ఛేదము** సం. వి. అ. పుం. కన్నము త్రవ్వుట.

**సంధిజము** సం. వి. అ న. మద్యము, సారాయము.

**సంధిజీవకుఁడు** సం. వి. అ. పుం 1. అధర్మజీవనము గడపువాఁడు. 2. కుంటెనకాఁడు.

**సంధితము** సం. విణ (అ ఆ అ) 1. కూర్చఁబడినది, ఏకము చేయఁబడినది, 2. నిలువచేయఁబడినది. (ఊరుఁగాయ మొ.) 3. బిగింపఁబడినది. 4. సమరస పఱుపఁబడినది. వి. అ. న. 1. ఊరుఁగాయ. 2. మద్యము,

**సంధిత్స** సం. వి అ స్త్రీ. సంధింపనిచ్ఛ.

**సంధిత్సువు** సం .విణ. ఉ సంధింప నిచ్ఛ గలవాఁడు,

**సంధి దూషణము** సం. వి. అ. న. సంధి నిబంధనముల నతిక్రమించుట

**సంధిని** సం. వి ఈ. స్త్రీ. 1, వెదయావు, కట్టినయావు 2. అకాలమునఁ గూడఁ బిదుకనిచ్చెడి యావు.

**సంధిబంధనము** సం. వి. అ న. స్నాయుబంధనము, స్నాయువును నెముకలను గలిపెడి త్రాడు వంటి నరము.

**సంధిబంధము** సం. వి. అ. పుం. 1. రాజులు సంధికై నియమము లేర్పఱుచుకొనుట 2. స్నాయువును నెముకలను గలిపెడి త్రాడువంటి నరము. 3 వృక్ష విశేషము. 4. సిమెంటు, సున్నము

**సంధిభంగము** సం. వి. అ. పుం. కీలుతప్పుట, బెణఁకు.

**సంధిముక్తి** సం. వి. ఇ. స్త్రీ. సంధిభంగము.

**సంధిమోక్షము** సం. వి. అ. పుం సంధిభంగము చేయుట.

**సంధిరంధ్రక** సం వి ఆ స్త్రీ. గోడయందలి కన్నము.

**సంధిల** సం. వి. ఆ. స్త్రీ 1. గోడ యందలి కన్నము. దొంగ త్రవ్విన కన్నము. 2. నది. 3. మద్యము. 4. గాయక బృందము యొక్క జంత్ర వాద్యముల ధ్వని.

**సంధిల్లు** అ. క్రి. 1. సమకూడు, కలుగు.

ఉ... విగతసుఖులఁ జేసితిగానఁ బెంపు ... మాకుఁ బ్రాణములు దేహములు న్గలిగె నుమ్మిక ... మార్క. 1. 62.

గీ. అఖిలభూమండల శ్లాఘ్య మైనసకల, భాగ్య మహిమ లవ్యాహతప్రౌఢి నడుఛ, విచి రాజసో ద్రిక్తుడై మించి పూర్వ, జన్మపై రానుబంధంబు సంధిలంగ, వి పు. 6. 270.

చం. హరిహయదేశికాఖుఁ డగు నమ్మహిదైవత మౌళియందు బంగరుపునకున్ మృగీమదసుగంధము సంధిలుభాతి నంబుజో, దరచరణారవింద సతత స్మృతిలోలుపమైన బుద్ధియున్ బ ... గాంచె... పాండు. 2. 7.

2. ముట్టుకొను, స్పృశించు.

ద్వి. చాటుఁజీరలమూట సంధిల్లి రేరి పోటుముందఱ ననుపోటులమూట. బస. పురా. 3 పు. 3 పం.

ద్వి. పరిగొని వచ్చుచోఁ బురవీథి భవులు, శరణుల వస్త్రముల్ సంధిలి రేరి, పోఁకఁజాఁబొడుతు..., జుండో యని. బస. పురా. 100 పు. 16, 17 పం.

ద్వి. వింతవాఁ డొకఁడు మున్ వినమిఁగాఁ జేసి, సంతకుఁ బోవుచో సంధిల్లినంతఁ, బొడిచి మీఁదికిఁ జిమ్మె. 101 పు. 35 పం.

ద్వి. ముట్టినఁ జీరలు ముఱుగునే చెపుమ. 101 పు. 42 పం.

**సంధివిగ్రహకుఁడు** సం. వి. అ. పుం. విదేశ వ్యవహార ముల మంత్రి.

**సంధివిగ్రహములు** సం వి. అ. పుం. శాంతి సమరములు.

**సంధివిగ్రహాధికారము** సం. వి. అ. పుం. ఇతర రాజులతో సంధి విగ్రహములు జరిపెడియుద్యోగము, సంధివిగ్రహముల జరుపు మంత్రి యధికారము,

విదేశ వ్యవహా ము త్రి...

**సంధివిగ్రహాధికారి** సం. వి. న్. పుం. ఇతర రాజులతో సంధివిగ్రహములు జరుపు మంత్రి విదేశ వ్యవహారముల కార్యాలయాధికారి.

**సంధివిగ్రహి** సం. వి న్. పుం యుద్ధమంత్రి. దక్షిణాయన సంక్రాంతి. త్రికలింగేశ్వరుని సంధి విగ్రహి రేచన అల్లంకివ త్తి దివియ. ద. శా. 4. 1c8l8.

**సంధివిచక్షణుఁడు** నం. విణ. అ ఆ అ. సంధిబంధములు కూర్చుట యందు నేర్పరి.

**సంధివిదుఁడు** నం వి. ద్ పుం సంధి సంప్రదింపులు చేయువాఁడు.

**సంధివిపర్యయములు** నం. వి అ పుం. ద్వివచనము, సంధివిగ్రహములు.

**సంధివేళ** నం. వి. ఆ. స్త్రీ 1. సంధ్యాకాలము. 2. సంధికాలము (రెండువేళల కలుపు సమయము).

**సంధికాలము** నం వి. అ. న. అజీర్ణరూం (ఆమవాతము).

**సంధిసంభవము** నం. వి. అ. పుం. సంయుక్తాచ్చు (వ్యా. ఓ.).

**సంధిహారకుఁడు** నం. వి. అ. పుం. కన్నగాఁడు, కన్నపుదొంగ.

**సంధుక్షణము** నం. వి. అ. న. 1. జ్వలింపఁజేయుట, మండించుట. 2. ఉద్రేకింపఁజేయుట, ఉద్దీపింపఁజేయుట.

**సంధుక్షితము** నం. విణ. (అ. అ. అ.) 1. ప్రజ్వలింపఁజేయఁబడినది, మండింపఁబడినది. 2. ఉద్రేకింపఁజేయఁబడినది.

**సంధేయము** నం విణ. (అ. ఆ అ.) 1. కలుపఁదగినది. ఏకము చేయఁబడినది. 2. పొందుకూర్పఁదగినది. అతుకఁదగినది. 3. సఖ్యము చేయఁదగినది. 4. గురి పెట్టఁదగినది. 5. సమాధానపఱుపవలసినది.

**సంధ్య** నం. వి. ఆ. స్త్రీ 1. కూడిక. 2 అవయవ సంధి. 3. సంధ్యారాగము, సంజె 4. ప్రభాతము, వేఁకువ. 5. సాయంకాలము. సందెచీఁకటి వేళ. 6. రెండు యుగములకు మధ్యకాలము. 7. సంధ్యాకాలమున బ్రాహ్మణాదులచే నుపాసింపఁబడు దేవత. 8. బ్రాహ్మణాదుల త్రికాల సంధ్యా వందనము తే. గీ. శౌరి సంధ్యాదిసత్క్రియల్ చక్కఁదీర్చి గయోపా. 1. 34.

9 వాగ్దానము, ఒప్పుదల 10 మేర, హద్దు. 11. తలఁపు, ధ్యానము 12. ఒకవిధమగు పువ్వు 13. ఒకానొకనది. 14. బ్రహ్మభార్య 15. పూర్వాహ్ణ మధ్యాహ్నాపరాహ్ణము లనెడి దివాభాగములలో నొకటి.

**సంధ్యాంశము** నం. వి అ. పుం కృతాదియుగముల చివరి కాలము

**సంధ్యాంశువు** నం వి. ఉ. పుం. సంధ్యారాగము, సంజెకెంజాయ.

**సంధ్యాకాలము** నం వి అ పుం. మునిచీఁకటి వేళ, సంజెవేళ.

**సంధ్యాత్రయము** నం. వి అ. న. మూఁడు సందె వేళలు, పూర్వాహ్ణ మధ్యాహ్నాపరాహ్ణములు.

**సంధ్యారాటి** నం వి న్. పుం. శివుఁడు.

**సంధ్యాపయోదము** నం. వి. అ. పుం. సంధ్యాకాల వార్షుకమేఘము.

**సంధ్యాపుష్పి** నం. వి. ఈ. స్త్రీ. సంజమల్లెపూవు, జాజిచెట్టు.

**సంధ్యాబలుఁడు** నం వి. అ పుం. రాక్షసుఁడు.

**సంధ్యాభ్రము** నం. వి. అ. పుం సంధ్యాకాలపు మేఘము

**సంధ్యామంగళము** నం. వి. అ. న. సంధ్యాకాలమున చేయఁదగిన మతవిధి.

**సంధ్యామంగళదీపిక** నం. వి. ఆ స్త్రీ. శుభప్రదమైన సాయంకాలపు దీపము.

**సంధ్యారాగము** నం. వి. అ. పుం. 1. సిందూరము. 2. సంజె కెంజాయ.

**సంధ్యారాముఁడు** నం. వి. అ. పుం బ్రహ్మదేవుఁడు.

**సంధ్యావందనము** నం వి అ న. సంధ్యా కాలమున నాచరింపఁబగిన వైదికకర్మము

**సంధ్యాసమయము** నం. వి. అ. పుం 1. సాయంకాలము. 2. ప్రతి యుగములలో నొకభాగము.

**సంధ్యోపాసన** సం. వి. అ. స్త్రీ. సంధ్యోపాసనః సంధ్యావందనము.

**సంప** సం. వి. ఆ. ఈ. మెఱపు.

**సంపంగి**—సంపఁగి, సంపంగె, సంపంగియ, సంపఁగియ, సంపెఁగ.

**సంపెంగ** వి. (సం. చమ్మకః. క. సంపంగె, సంపిగె; (త. చంపంకి) చంపకము.

సీ. ... సంపఁగి సంపెఁగ యనఁ జంపకాహ్వయ మగును బొగడ. ఆం. భా. 2. 47.

కం. ... బం,గరు సంపగి సంపంగన, ధరఁజాం పేయాహ్వయములు. ఆం. ప. అచర. 71.

ద్వి. పారిజాతములు సంపఁగులు తులసి, గోరింట లును గేఁకులు నశోకములు. ద్వి. పదమ. 425 పు.

సీ. సంపఁగి నౌషధసంప్రయోగము చూపి మొక రితుమ్మెద పిండు మూఁగ్ఁ్ఫువుత్తు. కవి. 6. 110.

సీ. సంపంగిముఖకాంతిసంపద నలరించి కరము మూతమ్ముపైఁ గరము చాఁచి. ఇందు 3. 51.

మ. అలమాకందము కుండ్ల దాపఁదను నియ్యం ట్లొక్కచో వేయఁగా, వలె సంపంగికిఁ ద్రవ్వటం బిడవలెన్. విప్ర. 2. 69.

తే. ... గగన, మండలశ్రీకి సంపంగిదండవోలె... ఆము. 2. 5.

2. ధాన్యవిశేషము యొక్క పేరు.

**సంపంగికావులు** వి. బ. ఒక దినుసు వస్త్రములు.

సీ. సంపంగి కావులుఁ జందురుకావులు వెలిపట్టు జీబులు వేటుచాళ్ళు. ప్రబం. 1. 272., హంస. 5. 355.

**సంపంగిదండ** వి. సంపంగి పూవులతో గ్రుచ్చిన దండ.

తే. కనకకర్ణికా ధారాళకాంతు లదిక, బాహులతి కలు బిరుదు సంపంగిదండ, లిరుఁగడల వ్రేలవైచిన కరణిఁ బరఁగఁ, గంబువిజయము పచరించుఁ గంబుగళము. ప్రభా. 2. 78.

**సంపంగిపూవడ్లు** బ. (√ సంపంగి) ధాన్య విశేషము, సంపంగిపూలవలె పచ్చగా నుండు వడ్లు.

సీ. సంపంగిపూవడ్లు జాజిరాజనములు గంబూర రాజనాల్కన్నె సరులు. హంస. 4. 128.

**సంపంగె(గియ)** — సంపంగి. వి. (సం. చంపకః).

1. చంపకము (వృ. వి.).

సీ. [illegible] ముకురాగ [illegible] వలరించ దరుగ [illegible] యదానీదు. విక్ర. 1. 183.

సీ. [illegible] పాటలి టి చేక్క గోరఁట గాంచి [illegible] నోరూడనవియు. పారి. 3. 51.

**సంపఁగి** వి — సంపఁగి 1. చంపకము.

సీ. సిగఁ జుట్టుకొన్న సంపఁగి మొగ్గతాయెతు చేరు చేరువ కేఁటిబారు దగను మ. దశా. 8. 14.

2. సంపఁగిపువ్వువలె సుందర మగుటచే కుక్కకియ్యఁబడిన బిరుదు.

చం. పులియఁడు బూచిగాఁ డసుర పోతులరా జను మంతిగాఁడు చెం,గలువ సివఁగిభైరవుఁడు గత్తెర సంపఁగి వెండిగుండు మ,ల్లెలగుది. మను. 4. 32.

**సంపఁగిదండ** వి. (సం. చంపక) సంపెంగ పూదండ.

సీ. తరుణిక్రొవ్వేద తుమ్మెదల దాఁటుదాఁట సం, పఁగిదండ చెరివెఁగోమలి యొకర్తు. వసు. 5. 116.

సంపఁగిబంతి.

సీ. .... సంపఁగిబంతి కొసల జోపావ లగుచు. ఉ. హరి. 1. 151.

**సంపఁగె** వి. సంపెఁగచెట్టు.

సీ. సన్నజాజులు సురపొన్నలు గలిగొట్లు మల్లెలు సంపఁగుల్ మొల్లవిరులు ఉ. రా. 3. 201.

**సంపగి** వి. (సం. చంపకః) — సంపగి; సంపంగి;

కం. ... బం,గరు సంపగి సంపంగవ, ధరఁ జాంపే యాహ్వయము. ఆం. ప. అచర. 71.

**సంపతిలు(ల్లు)** అ. క్రి. (సం. సంపత్) సమృద్ధమగు.

కం. సొంపున నిమ్మెయిఁ బెండిలి, సంపతిలన్ సత్య ధర్మ జనపతి చంద్రుం, డంపఁగ నా వంచక పురి, కింపలరఁ గుమారుఁ డరిగె నింతియుఁ దానున్. విక్ర. 7. 81.

**సంపత్తి** సం. వి. ఇ. స్త్రీ. 1. సంపద. 2. సమృద్ధి. 3. జయము. 4. సిద్ధి. 5. సమగ్రత. 6. అనుకూల స్థితి.

**సంపత్తు** సం. వి. ద్. స్త్రీ. 1. ఐశ్వర్యము. 2. గుణోత్కర్షము. 3. సమృద్ధి. 4. అదృష్టము. 5. సౌఖ్యము. 6. జయము. 7. అభీష్టసిద్ధి. 8. సమగ్రత.

9 కోశము. 10. లాభము. 11. అలంకరణము. 12. మంచి పద్ధతి. 13. ముత్యాలహారము. 14. ఒకము.

సంపద సం. వి. ఈ. స్త్రీ. సంపత్తు (రూపాం).

ఉ. ... సంపదన్. భార. విరా. 4 93.

ఉ. .... గలుగంగ సంపదల కేలవిచారము పద్మగ చి. ఉ. హరి. 1. 64.

తే. గీ. సంపద లబ్బెనేని. లేబరముకాదె బిడ్డలు లేని బ్రతుకు. ఉ. హరి. 1. 66.

సంపద్వరుఁడు సం. వి. అ. పుం. రాజు.

సంపద్వసువు సం. వి. ఉ. పుం. సూర్యుని ప్రధాన కిరణముల పేరు.

సంపద్వినిమయము సం. వి. అ. పుం. సంపదల నిచ్చి పుచ్చుకొనుట.

సంపన్నము సం. విశే. అ. సంపదతోఁ గూడినది. 2. సమృద్ధమైనది. 3. సాధింపఁబడినది. 4. పూర్తి చేయబడినది. 5. సమగ్రమైనది.

కం.... రథికుఁ డితఁడు శశ్వ, త్కోపోద్దీపుఁడు మాదెస,ఁజాప కళావేది దర్పసంపన్నుండున్. భార ద్రోణ. 3. 180.

6. పరిపక్వమైనది. 7. సరియైనది, ఒప్పయినది. 8. కూడినది. 9. అదృష్టము గలది. 10. సుఖవంతమైనది. 11. నిష్ణాతమైనది. వి. అ. న. 1. సంపద. 2. రుచ్యమైన భక్ష్యము.

సంపరాయము సం. వి. అ. పుం. 1. యుద్ధము, సంఘర్షణము. 2. ఆపద, దురదృష్టము. 3. భావి భవిష్యత్ స్థితి 4. మరణము, వ్యాధి.

సంపరాయ(యి)కము సం. వి. అ. న. యుద్ధము.

సంపరాయుఁడు సం. వి. అ. పుం. కుమారుఁడు.

సంపరిగ్రహము సం. వి. అ. పుం. 1. దయతో నాదరించుట 2. ఆస్తి.

సంపరేతుఁడు సం. విశే. అ. మృతుఁడు.

సంపర్కము సం. వి. అ. పుం. √సంపృచ్. 1. కలయిక, 2. స్పర్శ. 3. సంఘము. 4. సాహచర్యము. 5. రతి. 6. కూడిన మొత్తము.

సంపాకము సం. వి. అ. పుం. 1. పరిపక్వమగుట; 2. రేల (ఆరగ్వధము) (వ్య. వి.).

సంపాకుఁడు సం.. విశే. అ 1. చక్కఁగాఁ దర్కించువాఁడు; 2. జిత్తులమారి. 3. విషయ లంపటుఁడు. 4. అల్పుఁడు

సంపాటము[1] సం. వి. అ. పుం. 1. నడుమ ఖండించుట. 2. కదురు

సంపాటము[2] ఉభ. వి. చెక్కడపు పనియందు ఒమ్మచ్చును, అందుచెక్కడి రత్నములను లక్కయుఁ గూడఁ జేర్చి తూఁచెడి తూనిక (శ. ర.).

సంపాతము సం. వి. అ. పుం. 1. చక్కనిపాటు. 2. కలసిపడుట. 3. సమ్మర్దము 4. ఎదుర్కొనుట. 5. దిగుట. 6. వ్రాలుట. 7. చలనము. గమనము. 8. పక్షిగమన విశేషము.

ఉ. ...రంగత్పతసంపాత సం,వృతసంపాతి ఖగోక్త మార్గమున. దశావ. 7. 93.

9. నివేదన శేషము. 10. వంపుట. 11. రేయింబవళ్ళు సమపరిమాణములై యుండు కాలము; సూర్యుఁడు భూమధ్యరేఖను దాఁటు కాలము (వసంత శరత్కాలములందు వచ్చును). 12. రెండు రేఖ లొండొంటిని ఖండించుకొను చోటు.

సంపాతపాటవము సం. వి. అ.న. ఎగురుట యందలి కౌశలము.

సంపాతి (తుఁడు) సం. వి. ఇ. పుం. గరుఁడుని కుమారుఁడు; జటాయువు అన్న.

సంపాతి సం. విశే. (న్) 1. కలిసి ఎగురువాఁడు 2. కలిసి పడువాఁడు.

సంపాతుఁడు సం. వి. అ. పుం. (రూ. సంపాతి) గరుడుని కుమారుఁడు: జటాయువు అన్న.

సంపాదకుఁడు సం. విశే. అ. పుం. 1. నెరవేర్చువాఁడు. 2. గడించువాడు.

సంపాదనము సం. వి. అ. న. 1. గడించుట, సంపాదించుట. 2. పొందుట. 3. నెఱవేర్చుట. 4. కుదుర్పఱచుట. 5. సిద్ధము చేయుట. 6. కలిగించుట.

మహాస్రగ్ధర. కని రంతంత న్నభోమార్గమున ఘనత మస్కాండసందేహ సంపాదన లీలా జాగరూకాతను వికటతనూ ధామధూమాయితంబున్ శృం. నై. 7. 38.

**సంపాదము** వి. పూర్తి చేయుట. 2. నెఱవేర్చుట. 3. పొందుట.

**సంపాదించు** సం. స. క్రి. 1. సంపాదిల్లఁజేయు, కలిగించు

కం. నాకు నాత్మజుఁడై సంపాదించువాఁడ నధికాహ్లాదము. భార. శాం. 6. 522.

2. ఆర్జించు, గడించు

మ. పతి యాయాసనసహిష్ణుఁడై కడఁగి సంపాదించు పుణ్యంబులో, సతిశుశ్రూషలఁ గైకొను న్మఱియుఁ దా సాఁబాలు ధర్మస్థితిన్. మార్క. 2. 178.

3. సిద్ధముచేయు.

మ. అతిభక్తిన్ గృహిణీలలామము పదవ్యాసంగ చంగాత్మయై, ప్రతి వారంబును భక్ష్యభోజ్యములు సంపాదించి వడ్డింపఁగా, నతిథుల్ భోజన మాచరించి సుఖులై యాశీర్వదింపంగ నా,చతురాస్యాన్వయ వార్ధి చంద్రమునకున్ సంతోష మెంతో యగున్. నిరంకుశో. 1. 60.

**సంపాదించుకొను** స. క్రి. కలిగించుకొను, పూను, వహించు.

కం. ఆదివరాహము వెరిఁగిన యాదంష్ట్రిలు వెఱికి తననిజాస్యంబున సంపాదించుకొని నటించుమ, హాదర్పముతోడ నొక గణాధిపుఁడు శివా. శివతత్త్వ 387. ప.

**సంపాదితము** సం. విశే. (అ. ఆ. అ.) సంపాదింపఁబడినది.

**సంపాదిల్లు** సం. అ. క్రి. సంభవించు, కలుగు.

కం. ఆదిని సంయోగవియోగాదిద్వంద్వములు దేహియగు వానికి సం. పాదిల్లక తక్కవు పూర్వోదయకర్మమున నెట్టియోగికి నైనన్. భార. ఆది. 6. 249.

**సంపాసారి** వి. కోమటి, వైశ్యుఁడు.

ద్వి. కోటికిఁ బడగెత్తి కోరు వస్తువులు, పాటించి యొసఁగు సంపాసారులార. హరిశ్చ. ఉత్త. 382.

**సంపాళించుట** వి. కంసాలి కావించు క్రియ. (నెల్లూరు మండలము. వా.)

**సంపిండితము** సం. విశే. (అ. ఆ. అ.) 1. ముద్దగాఁ చేయఁబడినది. 2. సంగ్రహింపఁబడినది.

**సంపిడ** సం. వి. ఆ. స్త్రీ. బాధ.

**సంపీతి** సం. వి. ఇ. స్త్రీ. కలిపి త్రాగుట.

**సంపీడనము** సం. వి. అ. న. 1. గట్టిగా నొక్కుట, రెండువస్తువులను దగ్గఱగా నొత్తుట. 2. దండించుట 3. బాధించుట 4. ఉద్రేకింపఁజేయుట. 5. ముందుకు నడుపుట.

**సంపీడము** సం. వి. అ. పుం. — సంపీడనము.

**సంపు** స. క్రి. రూ. చంపు.

కం. సారంగా, హితమున్ సంపెఁగనహ్ష మేపున బొదలన్ (సంపెన్ సంపెఁగన్ అని భేదములు) హ. న. 2 ఆ.

2. సమృద్ధి.

కం. సొంపున నిమ్మెయిఁ బెండిలి, సం పఱిన సత్యధర్మ జనపతిచంద్రుం డంపఁగ నావంచకపురి, కింపలరఁ గుమారుఁ డరిగె నింతియుఁ దానున్. విక్ర. 7 ఆ. (శ. ర.).

**సంపుట (టి)క** సం. వి. ఆ. స్త్రీ. పెట్టె 2. ఒక విధమైన దుప్పటి. 3. కాగితపు సంచి (కవరు).

**సంపుటము** సం. వి. అ. పుం. 1. ఖరణి 2. తొఱ్ఱ, రంధ్రము, 3. అర్ధచంద్రాకారముగా నున్న భిక్షాపాత్ర. 4. అర్ధగోళము, 5. నిలువ. 6. మకుళనము, 7. కురవకపుష్పము. (ఎఱ్ఱగోరింట పూవు) 8. గ్రంథము. 9. పొక్కిటఁ జేయుసుంబనము.

సీ. చిత్తజుగృహమున నుత్తర స్ఫుటితంబు. పొక్కిట సంపుటంబును శిరోధనముపదం బూరుల నన్వితంబన నొప్పు దళచుంబనములు దత్తత్స్థలములఁ...హంస. 5. 148.

**సంపుటించు** సం. స. క్రి. 1. ముకుళించు.

సీ. జయజయధ్వని దేవసంయమీశ్వరకోటి సంపుటించెఁ గరాంబుజంబు నొసల. భీ. 4. ఆ. (శ. ర.).

**సంపుటీకరణము** సం. వి. అ. న. కప్పుట, మూఁతఁ బెట్టుట.

**సంపుష్టి** సం. వి. ఇ. స్త్రీ. 1. సమృద్ధి.

సీ. ఆశీవుండు ప్రసన్నుఁ డయిన నెల్లిరకును బుష్కలాభ్యుదయ సంపుష్టి బొడము. సూత సంహిత ఆ. 2. పు. 111.

2. ఎక్కువ ఒలుపు.

సంపూజనము సం. విశే. 1. స్తుతించునట్టిది, గౌరవించునట్టిది. వి.అ.న. 1. గౌరవించుట, బహూకరించుట.

సంపూర్ణకాముఁడు సం. వి. అ. పుం. 1. నిండినకోరికలు గలవాఁడు. 2. కోరికలతో నిండినవాఁడు.

సంపూర్ణకాలీనము సం. విశే. (అ. ఆ. అ). సకాలమున సంభవించునది.

సంపూర్ణము[1] సం. విశే. (అ. ఆ. అ.) నిండినది. సమగ్రము.

తే. గీ. బాల్య సంపూర్ణ భావంబు పాయఁ బాయఁ, దరుణయౌవనలక్ష్మి వర్తనము సూఁపె .... నిరం కుశో. 2. 9.

సంపూర్ణము[2] సం. వి. అ. పుం. స్వరగ్రామము లన్నియు నుపయోగింపఁబడు సంగీత విశేషము.

సంపూర్ణము[3] సం. వి. అ. న. ఆకాశము.

సంపూర్ణమూర్ఛ సం. వి. ఆ. స్త్రీ. యుద్ధక్రియా విశేషము.

సంపూర్తి సం. వి. ఇ. స్త్రీ. 1. సంసిద్ధి 2. ముగింపు.

సంపృక్తము సం. విశే. (అ. ఆ. అ.) 1. సంయుక్తము 2. మిశ్రితము. 3. సంబంధించినది. 4. స్పృశించినది. 5. సన్నిహితసంబంధము కలది.

సంపెంగ వి. చంపకము. రూ. సంపెఁగ.

వ. కరంబు సొంపారు సంపెంగలును. శృం. నై. 1. 95.

గీ. ఓరుగంటి పురంబులో నోరగ్రంత పెద్ద యెలుఁగున వమ్మె సంపెంగనూనె. క్రీడా. 101.

గీ. పెలుచఁ దమదాయయైన సంపెంగవిరిని ... యయా. 4. 38.

గీ. భోగబాహ్య మయ్యెఁ జూచిన సంపెంగ పొలుపు మధుకరాంగనలకుఁ బోలె. మను. 1.52.

సీ. కొండ గమ్మిడు రేఁగు గోరమి సంపగి కొండ సంపెంగ మాఁ రేడు సరళదేవ. హంస. 4. 11.

మ. సొరిదిం జేర్చిన తీఁగమల్లియలు ఖర్జూరంబులుం బుష్పమంజరులు న్మామిడి గుత్తులుం గుసుముమల్ సంపెఁగలుం బచ్చగన్నేరుల్ .... చేఁలరు దార న్నగుఁ బువ్వుఁదోఁటల ... ఆము. 1. 66.

2. ధాన్యవిశేషము యొక్క పేరు.

సంపెంగనూనె వి. సంపెఁగ పూలరసముతోఁ దయారయిననూనె.

గీ. ఓరుగంటిపురంబులో నోరగ్రంత, పెద్ద యెలుఁగున నమ్మె సంపెంగనూనె. క్రీడా. 101.

గీ. చొక్కటంపు, టగరు సంపెంగ నూనెలు ... హంస. 5. 352.

సంపెఁగ వి చంపకము.

ఉ. ... హిం,సారతి నేయుదర్పకుని సంపెఁగ ముల్కులఁబోలె మించఁగన్. మను. 5. 64.

సంపెఁగనూనె వి. - సంపెంగనూనె.

ఉ. సంపెఁగనూనె యంచు నొక చంద్రనిభానన కంసవైరికిన్. పారి, 2. 9.

సంపెఁగబంతి వి. √ (సంపెఁగ) సంపంగి పూలతోఁ గట్టినబంతి.

ఉ. చన్నులు కుంభి కుంభములు సంపెఁగ బంతులు చక్రవాకముల్. విక్ర. 8. 49.

సంపెట వి. సమ్మెట, 1. ఇనుము సాగఁగొట్టెడి సాధన విశేషము, అయోఘనము (క. చమ్మట్టిగె త. చమ్మట్టి).

సీ. చటులంబులైన సంపెట లశాఁకులఁ బోలి వజలు తలంబులఁ జఱచి చఱచి. భా. రా. యుద్ధ. 1177.

సీ. విటుల గుండెలలోన విదళించు చిగురాకు సంపెటవ్రే కొందు సమసె నేఁడు. వీర. 2. 116.

ఉ. దాఁకటి మీఁదఁ బెట్టి బెడిందంబుగ సంపెట వేయ .... రత్న. శర.

2. చబుకు; కశ.

చం. గొనకొని మొత్తె సంపెటలఁ గొంకక నిర్దయ వృత్తిఁజేసి ... హరిశ్చ. 2. 141.

శా. ఏమేమీ మిము భూవరాధముఁడు దానెంతే నహంకారియై, భీమస్ఫూర్తిఁ గశాభిఘాతములచే బిట్కల్క నొప్పించెనే. హరిశ్చ. 2. 142.

సంపేషణము సం. వి. అ. న. 1. విసరుట. 2. దంపుట. 3. రుబ్బుట.

సంప్రకాశించు సం. అ క్రి. 1. ప్రజ్వరిల్లు 2. ప్రకటమగు; బయల్పడు.

గీ. సంప్రకాశించు విరహాగ్ని సాక్షిగాఁగ, బాణకన్యానిరుద్ధుల పరిణయంబు, వర్థి గావించె మకర

మీనాధిపతుల, యదను దెలిసిన నవశ్రీ యాజ్ఞి కుందు, అనిరుద్ధ. 6. 6 ప్రచురితమగు. 4. వెల్లడియగు.

**సంప్రక్షాళనము** సం. వి. అ. న. స్నానము చేయుట.

**సంప్రజ్ఞాతము** సం. వి. అ పుం. సవికల్ప సమాధి (వ్యతి. అసంప్రజ్ఞాతము).

**సంప్రణీతము** సం. విణ. (అ. ఆ. అ) రచింపఁబడినది 2. ఒకచోఁ జేర్పఁబడినది.

**సంప్రణేత** సం. వి. ఋ పుం. 1. న్యాయాధికారి. 2. పాలకుఁడు. 3. నాయకుఁడు. 4. సేనాని. 5. పోషకుఁడు.

**సంప్రతాపనము[1]** సం. విణ. 1. దహించునది. వేఁడి చేయునది. 2. బాధించునది.

**సంప్రతాపనము[2]** సం. వి. అ. న. ఒక నరకము.

**సంప్రతి[1]** 1. లెక్కలు సరిచూచు పెద్దకరణము వాఁడు, లెక్కవ్రాయువాఁడు, గణకుఁడు.

తే. సంప్రతులఁ బిల్చి యెన్నిలక్షలకుఁ గలదు. రాజ్య మెన్నెన్నిగలవు దుర్గస్థలములు బొక్కసం బునఁ గల ధన భూషణాది, వస్తువులు నశ్వవేదండ వర్గ మెంత. కృష్ణ. 2. 67.

**సంప్రతి[2]** విణ. ఈడు, సమానము.

చం. మెలఁత మొగంబు చందురుని మెచ్చువళం బులు కుందనంపు బిం,బెలకగు సంప్రతుల్ తళుకుదే ఱెడు కన్నులు బిత్తరంపుఁగ, ల్వల పొరుగింద్ర నీలపు నళాకల వంగడ మారుతీవ ... చమత్కా. 2. 42.

**సంప్రతి** సం. అవ్య. 1. ఇప్పుడు 2. వెంటనే. 3. సరిగా.

**సంప్రదించే** స. క్రి. 1. సరిచూచు.

సీ. చరణద్వయీ భూరిసౌభాగ్య సంపదఁ బరిభ వింతురు హేమ పద్మవనము, ఘననితంబస్థలి గౌర వాభ్యున్నతి సంప్రతింతురు నదీసైకతముల, గంభీ తర నాభిగర్త విభ్రమముల ప్రక్కలింతురు జలా వర్తశోభ. భీమ. 1. 91.

2. లెక్కమొదలైనవి సరిచూచు. 3. సలహాఅడుగు.

**సంప్రతిపత్తి** సం వి.ఇ.స్త్రీ. 1. వచ్చుట, 2. సన్నిధి. 3. లాభము. 4. పొందుట. 5.ఒడంబడిక 6. అంగీకరించుట. 7. ఎదుర్కొనుట. 8. తైర్పడుట. 9. సంభవించుట. 10. సహకారము. 11. చేయుట. 12. సమయోచితబుద్ధి.

**సంప్రతిపన్నము** సం విణ. (అ. ఆ. అ. 1 సమీపించినది 2 అంగీకరింపఁబడినది. 3 చేయఁబడినది.

**సంప్రతిపాదకము** సం. విణ ఇచ్చుట.

**సంప్రతిభాసము** సం వి. అ. పుం. సమస్యాయజ్ఞానము.

**సంప్రతిరోధకము** సం. వి. అ. న. పుం ప్రతిబంధకము, నిర్బంధము, చెఱ.

**సంప్రతిష్ఠ** సం. వి. ఆ. స్త్రీ. ఉన్నతస్థితి; పట్టుదల.

**సంప్రతిష్ఠించు** సం. స. క్రి. చక్కగా నిలుపు.

గీ. చెప్పనేటికి సకలసంసిద్ధిఁ గోరి, దక్షిణాంభోనిధానంబుతటమునందు, సంప్రతిష్ఠింపుఁ డీశానుఁ జంద్రమౌళి, విశ్వలోకాధినాథు నోవిబుధులార. భీమ. 3. 49.

**సంప్రతీక్ష** సం వి. ఆ. స్త్రీ. ఎదురుచూచుట. ఆకాంక్ష.

**సంప్రతీతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. తిరిగి యియ్యఁబడినది. 2. విశ్వసించినది. 3. అంగీకరింపఁబడినది నిరూపింపఁబడినది. 4. సుప్రసిద్ధమైనది.

**సంప్రతీతి** సం వి. ఇ. స్త్రీ. 1. పరిజ్ఞానము 2. సమ్మతి 3. ప్రసిద్ధి.

**సంప్రత్యయము** సం. వి. అ. పుం 1. ఉద్దేశము, స్థిర విశ్వాసము.

**సంప్రత్తి** సం. వి. ఇ. స్త్రీ. పూర్తిగా నొప్పగించు.

**సంప్రదానము** సం వి. అ. న. 1. చక్కని యీవి, 2. ఒకానొక కారకము (చతుర్థి) 3. కన్యాదానము.

**సంప్రదానీనము** సం. వి. అ. న. 1. దానము. 2. కానుక.

**సంప్రదాయనిగమము** సం. వి. అ. పుం. ఆచార క్షయము,

**సంప్రదాయప్రద్యోతకుఁడు** సం. వి. అ. పుం. వేద సంప్రదాయ ప్రకాశకుఁడు.

**సంప్రదాయము** సం. వి. అ. పుం. 1. ఆచారము.

గీ. పరమ యోగివరేణ్యు నిర్భరసమాధి, సౌఖ్యసంపద నిరపాయ సంప్రదాయ, సిద్ధిఁ దిలకించు

చోట నశేషభవన వివిధ ధర్మంబు లావిర్భవించు చోట పాండు. 3. 159.

ద్వి. తరుణీ! మీ గురు సంప్రదాయంబు వారు ధరణి నేరావునఁ దపము సేయుదురు? బసవ. పు. 6. 187.

2. పరంపరాగత జ్ఞానము. 3. ప్రత్యేక మతబోధన విధానము. 4. గూఢమైన వ్యవహారము. 5. సంప్రదానము. గురుపారంపర్యము.

సంప్రధానము సం. వి. అ. న. 1. నిజము తెలిసికొనుట. 2. పరిశీలనము.

సంప్రధారణ సం. వి. ఆ. స్త్రీ. 1. ఔచిత్యా నౌచిత్య నిర్ణయము, 2. సమాలోచనము.

సంప్రధారణము సం. వి. అ. న. వ్యవహార నిశ్చయమునకుఁ దోడ్పడు లిఖిత సాక్ష్యాదులు.

సంప్రపదము సం. వి. అ. పుం. న. 1. మునివ్రేళ్ళపై నిలుచుట, త్రిమ్మరుట.

సంప్రపన్నము సం. విణ. (అ. ఆ. అ.) 1. నిశ్చయమునకు వచ్చినది, 2. కూడినది.

సంప్రభవము సం. వి. అ. పుం. 1. ఉదయించుట. 2. ప్రత్యక్షమగుట.

సంప్రభిన్నము సం. విణ. 1. బ్రద్దలైనది, 2. మదావస్థలోనున్నది.

సంప్రమాపణము సం. వి. అ. న. చంపుట.

సంప్రమార్గము సం. వి. అ. పుం. పరిశుభ్రముచేయుట.

సంప్రముగ్ధము సం. వి. అ. న. అధిక సంతోషము.

ఆ. సంప్రమోద మందు సాత్యవతేయుని, గనిప్రదక్షిణంబెగాగ వచ్చి వరుగ నుత్సహించె నారణేయుఁడు... భార. శాంతి. 6. 323,

సంప్రమోషము సం. వి. అ. పుం. 1. సంక్షోభము. 2. కలవరపాటు.

సంప్రయాణము సం. వి. అ. న. విడిచివెళ్ళుట.

సంప్రయుక్తము సం. విణ. (అ. ఆ. అ.) 1. పూన్పఁబడినది; కట్టబడినది. 2. కలుపఁబడినది. 3. సాంగత్యము కలిగినది.

సంప్రయుక్తకము సం. విణ. (అ. ఈ. అ.) సహకరించునది,

సంప్రయోగము సం. వి. అ. పుం. 1. కలయిక 2. నాటక ప్రదర్శనము. 3. సాంగత్యము. 4. కట్టుట 5. పరస్పర బంధము 6. పరిపాటి. 7. మైథునము. 8. ఇంద్రజాలము. 9. సహకారము 10. చిల్లంగి పెట్టుట.

సంప్రయోగి[1] సం విణ. (న్. ణీ. న్.) 1. కలుపునట్టిది 2. కామవ్యసనము కలది.

సంప్రయోగి[2] సం. వి. న్. పుం. 1. కలుపువాఁడు. 2. మాంత్రికుఁడు. 3. స్వేచ్ఛావర్తనుఁడు 3. పోకిరి.

సంప్రయోగించు సం. స. క్రి. 1. (బాణము) ప్రయోగించు. 2 ఏయు. 3. వఱపు.

వ. కాండప్రకాండములు సంప్రయోగించి రథరథ్యకేతు సూతవ్రాతంబుల మర్మఘాతంబుల నొప్పించుచు. అని. 4. 55.

4 చిల్లంగిపెట్టు.

సంప్రవదనము సం. వి. అ. న. 1. (పరస్పర) సంభాషణము. 2. సంవాదము.

సంప్రవర్తనము సం. వి. అ. న. చక్కని నడక, చక్కఁగా నుండుట, చక్కఁగాఁ జరుగుట.

సంప్రవర్తిల్లు సం. అ. క్రి. వర్తించు, చక్కఁగా నడచుకొను.

వ... అట్లజాతశత్రుండు సమ్యగంగీకృత సామ్రాజ్యుం డయి జనసంపూజ్యుం బగు చరితంబున సంప్రవర్తిల్లుచుండ. భార. అను 5. 449.

సంప్రవృష్టము సం. వి. అ. న. సంపూర్ణ వర్షపాతము.

సంప్రశ్నము సం. వి. అ. పుం. 1. కుశల మడుగుట. 2. అడుగుట. 3. ఆశ్రయము; శరణు (వేద).

సంప్రశ్రయము సం. వి. అ. పుం. వినయము. అడఁకువ.

సంప్రసాదము సం. వి. అ. పుం. 1. వేడుకోలు. 2. అనుగ్రహింపఁ జేసికొనుట. 3. అనుగ్రహము. 4. ప్రశాంతి. 5. విశ్వాసము.

సంప్రసాధనము సం. వి. అ. న. 1. భూషణము, అలంకరణము. 2. సుష్ఠుగా నిర్వహించుట లేక ఆచరించుట.

సంప్రసారణము సం. వి. అ. న. 1. యవరలలు,

ఇ ఉ ఋ ఌ లు య్ వ్ ర్ ల్ లుగాఁ బరిణమించు వ్యాకరణ సంప్రసారణము. 2. చక్కఁగా వ్యాపింపఁజేయుట.

సంప్రసారుఁడు సం. వి. అ. పుం. సర్వమును జక్కఁగా నిర్వహించువాఁడు.

సంప్రసిద్ధి సం. వి. ఇ. స్త్రీ. 1. విజయము. 2 అదృష్టము.

సంప్రస్థానము సం. వి. అ. న. 1. వీడిపోవుట. 2. పురోగమనము.

సంప్రహారము సం. వి. అ పుం. 1. పరస్పరతాడనము. 2. మార్కొనుట, యుద్ధము, సంఘర్షణ. 3. గమనము, చలనము.

సంప్రహాసము సం. వి. అ. పుం. పరిహాసము. హేళన.

సంప్రాణించు సం. అ. క్రి. ప్రాణముతోఁ గూడు, బ్రదికియుండు.

సీ... తరువులు దనిగాడ్పు తపనరుచులు, గాంచి సంప్రాణించి క్రమ్మఱఁ గొమ్మల గదలించి వర్తన క్రమ మొనర్చు. హరి. పూ. 7 186.

సంప్రాపించు సం. అ. క్రి. 1. చేరు. 2. పొందు. 3. సంపాదించు. 4. కలుగు.

కం. పాపాత్ముల దండింపని. క్ష్మాపతి కాపాపము నను షడ్భాగము సం, ప్రాపించుఁ గాన ధరలోఁ, బాపము లేకుండ నరసి ప్రజఁ బ్రోవఁదగున్. ఉ. రా. 7. 202.

5. కలసికొను. 6. తారసిల్లు, 7. కలహించు.

సంప్రాప్తము సం. విశే. (అ. ఆ. అ.) 1. చక్కఁగాఁ జేరఁబడినది. 2. చక్కఁగాఁ బొందఁబడినది.

కం. అనఘా తపోవనమునన, జననంబును మరణదశయు సంప్రాప్తము ల,య్యెనయేని వాఁడు ముక్తుఁడె, మనంబు బహుకామవికృతి మగ్నంబైనన్. భార. శాంతి. 6. 233.

గీ. బ్రహ్మ బ్రహ్మపదైకసంప్రాప్తుఁడగుట. సూత సంహిత. అ. 2. పు. 110.

3. సకాలమునకుఁ జేరినది. 4. ఉత్పన్నమైనది.

సంప్రాప్తి సం. వి. ఇ. స్త్రీ. 1. లబ్ధి. 2. ఆర్జన. 3. సంపాదన.

సంప్రాప్తించు అ. క్రి. లభించు, కలుగు.

మ ... ఎటు సంప్రాప్తించె వాభాగ్య మీనతి కంచున్... ఉ. రా. 2. 312.

సంప్రార్థన సం. వి. అ. స్త్రీ. = సంప్రార్థనము (అ. న.) వేడుకోలు

సంప్రార్థించు సం. స. క్రి వేఁడు, వేఁడుకొను.

కం. చని సంప్రార్థించి యతనిఁ, గొని పుత్రుని, గాంచి. భార. శాంతి. 3. 117.

శా. స్వారాజ్యప్రముఖామర ప్రవరులన్ వర్జించి లజ్జావరీ, హారంబున్ బొనరించె రాజులకు సంప్రార్థించి తా దేవన, త్యాగంబై యితని న్వరించిన వివేకప్రౌఢిఁ దద్దేవతా, ప్రీహోపాపయశః ప్రమార్జన మొనర్చెన్ భైమి మేలెంతయున్. నైష. 6. 79.

సంప్రార్థ్యము సం. విశే. (అ. ఆ. అ)

మ.... పదియేనింటఁ దెనుంగుబాస జనసంప్రార్థ్యంబుగా బెంపువన్ దుదిముట్టన్ రచియించు టొప్పు బుధసంతోషంబు నిండారఁగన్. భార. విరా. 1.

సంప్రియము సం. వి. అ. న. తృప్తి.

సంప్రీతి సం. వి. ఇ. స్త్రీ. 1. ప్రేమానుబంధము. 2. అనురాగము. 3. స్నేహపూర్వకమైన అంగీకారము. 4. ఆహ్లాదము, ఆనందము.

శా.... సం. ప్రీతిం బొందితి వేఁడు మిప్పుడు మనోభీష్టంబుల న్నాపుడున్. షోడశ. కు. 7. 55.

సంప్రేక్షణము సం. వి. అ. న 1. పరిశీలించుట. 2. చూచుట. 3. ఆలోచించుట. 4. పరిశోధించుట.

సంప్రేషణము సం. వి. అ. న. 1. ద్వాదశాహశ్రాద్ధము. 2. పంపుట. 3. వార్తను పంపుట.

సంప్రైషము సం. వి. అ. పుం. 1. పంపివేయుట. 2. ఆజ్ఞ, శాసనము, నిర్దేశము. 3. నియోగము.

సంప్రోక్షణము సం. స. క్రి. 1. నీరు చల్లుట. 2. అభిషేకించుట. 3. శుద్ధిచేయుట,

సంప్రోక్షించు సం స. క్రి. 1. చల్లు నీళ్ళు చిలుకు. 2. శుద్ధిచేయు.

వ... కూలస్రోతంబైన శవంబు నొక్కటిఁ దెచ్చి ఖడ్గంబున రెండువ్రయ్యలుగాఁ జీరి తారిముందట సమర్పించి సలిలంబున సంప్రోక్షించి ఖడ్గంబుఁ

దొలఁగఁబెట్టి చేతులు మొగిచ్చి. హరి• ఉ 5, 2. 37.

**సంప్లవము** సం. వి. అ. పుం. 1. మునుగుట. 2, వరద 3. శిథిలమగుట. 4. ధ్వంసము.

సీ. శివయోగి కెలమి నిచ్చినదానమాఃభూత సంప్లవ స్థాయి శశ్వత్ఫలంబు. శివధ. 3. 3.

5. క్రమరహితమైన కూర్పు. 6. గుంపు. 7, జడి వాన. 8. సంక్షోభము. 9. ముగింపు.

**సంప్లుతి** సం వి. ఇ. స్త్రీ 1. వెనుకనుండి యేనుఁగుపై నెగురుట• 2. చక్కఁగా నెగురుట.

**సంఫాలము** సం. వి. అ. పుం. పొట్టేలు.

**సంఫుల్లము** సం. విశే. చక్కఁగా వికసించినది.

**సంఫేటము** సం వి. అ. పుం. 1. కోపముతో కూడిన పోరాటము. 2. క్రుద్ధుల పరస్పర సంఘర్షణము వర్ణింపఁబడు సన్నివేశము

**సంబంధము**[1] సం. విశే. (అ. ఆ. అ.) 1. సమర్థమైనది. 2. తగినది. 3. సరియైనది.

గీ. వీరు వారును సంబంధ విషయ బంధు, లగుట సరిగాదె హరికి. భార. ఉద్యో. 4. 170.

**సంబంధము**[2] సం. వి. అ. పుం. 1, కలయిక. 2. చుట్టరికము.

3. వివాహ సంబంధము.

శా. సంబంధం బిటు గూడునే రమణికిన్ ఘ్మాభర్తకున్ నేత్రపర్వంబై యుండె స్వయంవరంబు. శృం. నై. 6. 77.

5. షష్ఠీవిభక్తి సూచించు సంబంధము. (1. పితాపుత్ర సంబంధము. 2. రక్ష్యరక్షక సంబంధము. 3. శేషిశేషసంబంధము. 4. భర్తృభార్యా సంబంధము. 5. జ్ఞాతృజ్ఞేయ సంబంధము. 6. స్వస్వామి సంబంధము. 7. శరీరిశరీర సంబంధము. 8 ఆధారాధేయ సంబంధము. 9. భోక్తృభోగ్య సంబంధము.) 6. స్నేహము. 7. ఔచిత్యము. 8. జయము. 9. వైభవము 10. సంకలనము. 11. సంపుటము.

**సంబంధకము**[1] సం. విశే. (అ. ఆ. అ.) 1. సంబంధించినది. 3. తగినది.

**సంబంధకము**[2] సం. వి. అ. న. 1. కలయిక. 2. ఒక విధమైన సంధి.

**సంబంధకుఁడు** సం. వి. అ. పుం. 1 మిత్రము 2 రక్తసంబంధి 3. వివాహము ద్వారా ఏర్పడిన చుట్టము

**సంబంధి**[1] సం. విశే. (న్. నీ. న్.) 1. సంబంధము కలది 2. అనుబంధించినది• 3. ఒకదానితో చేరియున్నది. 4. సహజమైనది. 5 సద్గుణములు కలది

**సంబంధి**[2] సం. వి. న్. పుం 1 వియ్యంకుడు

వ.... పాంచాలవిభుండు సంబంధితో వలయుమాటలాడం దగువారలఁ బనిచి రావించి భార ఉద్యో 4 391.

2 చుట్టము, బంధువు

మ శరతల్పంబున నున్నశాంతనవు నాజ్ఞాతత్పరుండై యుధిష్ఠిరుతో నర్జునుఁ డిట్లనున్ హరిఁ బ్రశంసింపంగ రారే మునీశ్వరులున్ ద్వారక కేనుబోయితిఁ గదా సంబంధులం జూడనాఁ, డరుదా దేవుని యందుఁ గంటి నొక కృత్యం బెవ్వరుం జేయరున్. ఉ. హరి. 2. 3.

**సంబంధించు** సం. అ. క్రి. 1• కూడు, కలియు

వ. విన్నాణంపు గొల్ల తెలుంగులును వేల్పుగాణలు పాడు లక్ష్మీనారాయణుల కల్యాణంపుఁ బాటలను దీటుకొను తిన్నని రవంబులు న్గలసి బలసికొను కోలాహలము లిమ్ముగ సందడుల నెడగలుఁగ నడియు వేత్రహస్తుల సాహోనినాదంబు సంబంధించి పెంపొలయ. మను. చ. 5. 71.

2. బంధించు; నిరోధించు.

ద్వి. ప్రాణునపాను సంబంధించి యాత్రికోణకుండలి మేలుకొల్పి యుందుండి, పశ్చిమనాడికాపథమును గోరి, నిశ్చలత్రివేణీసంగమందు. ప్రభులింగ. 2 ఆ. 40 పు 23 పం.

**సంబంధుఁడు** సం వి. అ. పుం. చుట్టము, దగ్గఱి చుట్టము.

**సంబడ(ళ)ము** వి. (సం. శంబలమ్, ప్రా. సంబలి. త. చంపళం. క. సంబళ. మ. చంబళమ్) 1. వేతనము, బత్తెము.

తే. భూవరుం డొక పయనంబు పొమ్మటన్న, మంచిదని వచ్చితిని సమ్మతించి నేను, సంబళము కంబ

ళము కత్తి చద్ది చల్లడంబు కేడెంబు ధట్టి తెమ్మంబు జాతి. హంస. 1. 226.

తే. అడుగడుగు కెంజిగురుటాకు కడుపు కూటి, బంటుగములకు రవళిసంబళము లొసఁగ, నిండు మురువున నొకతె కైదండ యూని, వలి కడకు వచ్చి నిలిచె నా రతివధూటి. చంద్రాంగ. 8. 58.

సీ. ... సంబళంబు లొసంగి సంతరింపఁగలేమి విడిచి పోవఁదొడంగె విబుధబలము. దశా. 2. 51.

ద్వి. కూర్మిఁ గూర్చుండక కొలుచు వారలకుఁ బేర్మి సంబళము లిప్పింపక జనుల మనవులు వినక. పల. 1. 1006.

తే. అడవిదుంపలె కాని సంబడము లొసఁగఁ, గాను వీసంబు చేత నెక్కడను లేక, మగువఁ గోల్పోయి కడునిడుమలఁ గలంగు, నలఁతి దొరఁ గొల్వఁగడఁగు వెంగలులు గలరె. అ. రా. సుందర. 154.

2. పాథేయము, దారిబత్తెము.

వ. అయస్థిపేటికయు లోహండియుఁ దండులంబులు గంబళంబులుం దగిన సంబడంబును వహించి యొక్కరుండును దెరువుతోడువం బెక్కు దేశంబులు గడచి. కాశీ. 5. 62.

కం. అనతిఁ శ్రీఖండా, రానన్ సంబడము తనదు ప్రాయందలమున్. అము. 7. 95.

సీ. తీర్థంబులకు నేఁగు దీనమానవులకు నేమైన సంబళం బిచ్చి నతఁడు వనజహితపుత్ర నీ పురంబునకు రాఁడు. రుక్మాం. 2. 88.

చం. తపమునకుం గుశాసనము దానవు విత్తు ఫలించు పాదు ని,క్కపు సుఖసిద్ధిఁ గోరి వెదకందగు నాకర మబ్జజాది విష్టపములకెల్ల సంబళ మొసంగెడు పాలెము మర్త్యము. కవి. 6. 77.

గీ. కాశికాక్షేత్రమున కేగుఘనుల కితఁడు, సంబళంబులుఁ బాదరక్షలు నొసంగు, ధర్మబుద్ధిని భద్రరుద్రాక్షమణులు, దానమిచ్చిన దీవమందారుఁ డతఁడు. సానందో. 1. ఆ.

కం. పడఁతుక లచ్చటఁ గలరని, తడవుచే రాకున్న విడుతుఁ దనువు నిజేశా! గీ. అనుచేఁ గందర్ప సంక్రీడ నాత్మనాథు నుల్ల మలరంగ నేర్పుల నోలలార్చి, చలిదియును సంబడంబును జాలనొసఁగి, ప్రొద్దుగ్రుంకెడు వంతన పుచ్చె వతని. పంచ. నా 8. 228.

కం. పతిన యీకేరళ నర,పాలుఁడు నా కావతిచ్చెఁ బయనము దాంన్, గాంవిలంబన మోమహికాలిఁ దెమ్ము సంబళముఁ గంబళమున్. వేం. పంచతం 8. 252.

తే. పోయి వచ్చెద నీపదాంబురుహచింత, నాకుఁ దగు సంబళముగాఁగ నళిననాభ. హై. భా. 1. 199.

8. ఆయుధ విశేషము.

వ. నేత్రకోణంబుల నగ్నికణంబులు రాల నీక్షించి యొండలు వెడలంగ నడిదంబులు పెఱికి జళిపించియు సంబళంబులు ద్రిప్పియు. మైరా. 8. 2.

సంబరము[1] వి. (సం. సంభ్రమః) 1. వేగిరపాటు.

ద్వి. హరుఁడు దాబడి వెట్టునది తథ్యమేని, పంచి నీసుతుఁడును బ్రతికెడుగాక, సంబరపడనేల చర్చింపనేల పండితా. మహిమ. 291.

తే. గొప్ప హురుమంజి సుప్పాణి కూర్పడంపు,డంబు పగడంబు జగడంబు సంబరంబు లెనఁగిన గుడార్లు గలుగు నవ్వసుమతీశు పాళెమీక్షించి గజరాజ భయము మించి. కృష్ణ. 8. 75.

8. సంతోషము.

వ. పాండుడిండీర ఖండమండలంబులు సంబరంబులు పొదలింప నమరియు నక్రొకులంకు మహిళాబ్జ కామినీ జాల పరిభ్రాజితంబు గావున నళిమిథున మీన కుళీరమకరాది సంయుతంబై.

4. వేడుక.

వ. పగుఁబెండ్లి శృంగారరసంబు సంబరాల దినునుప దిక్కులు బిక్కటిల్ల ... ప్రబం. 1. 788.

సంబరము[2] సం. వి. అ. పుం. 1. ఆనకట్ట. 2. వంతెన 8. ఒకజాతిలేఁడి.

సంబరము[2] సం. వి. అ. న. 1. నిగ్రహము. 2. నీరు. 8. బౌద్ధుల మతాచార విశేషము.

సంబరి[1] అవ్య. చూడు:— సంబళి.

సంబరి[2] సం. ఈ. స్త్రీ. ఎలుకజీడి (వృ. వి.).

సంబరేను వి. చర్మకము. చర్మకష (వృ. వి.).

చం. .... చర్మకః, బలదను సంబరే నవఁగ. ఆం. వ. అచః. 97.

**సంబలము**[1] సం. వి. అ. పుం. పాథేయము, దారి బత్తెము.

**సంబలము**[2] సం. వి. అ. న. జలము.

**సంబళకాఁడు** వి. (√ సంబళము) జీతకాఁడు.

**సంబళము** వి. కూలి.

కం. సంబళమ్మునన వేతనమై. ఆం. వ. నర. 117.

గీ. అంటుపడి వచ్చినావు మమ్మంట కేఁగి, శౌరి మానసాంబుజములు తత్సఖుల కొసఁగు, మంటు పడలే దటంచు మిమ్మంటి యిపుడు, కాసలెల్లను జేసెద భాసురాంగి. రాధికా. 4. 10,

**సంబళి** అవ్య. తొలఁగుము. రూ. సంబళీ.

తే. మొగముపైఁ జిమ్మచీఁకటి ముడివడంగ, మాటి మాటికి మీసాలు దీటుకొనుచుఁ, జనియె సంబళి సంబళి యనుచుఁ బంక, జాప్తకులపుంగవుఁడు వచ్చునంగడికిని. హరిశ్చం. 4. 215.

ఉ. ... కొమరు మాలెత గన్నుల నవ్వుదేరఁగా, సంబళి సంబళీ యటుకు పందళిం దలమంచుఁ బల్కు మన్. శివరాత్రి. 3. 40.

కం. ఇలఁ గోలఁదట్టుచున్ సంబళి సంబళి యనుచు గ్రందుపడు జనములకు, న్దొలఁగుచు నొదుగుచు నా భూపతుల పతికడ కరుగుదెంచి తా నిట్లనియెన్. మార్క. 1. 225.

**సంబళించు** అ. క్రి. (రూ. సంబడించు) (తు. సంబళియు) చాలు, సమర్థమగు.

వ. విష్ణుని మాయవలన నెందును గాల్కొని నిలువ సంబళింపక శతసహస్రసంఖ్యల యేండ్లు చరియించి యుం గుక్షిలోఁ గడపలఁ గానఁడయ్యె నతని నివ్వి ధంబున. హరి. ఉ. 9. 98.

కం. అకటా యని చింతింపుచు, వికచకుచల్ నిలువ సంబళింపక శుకముం, బికమున్ మలయానిలకా, బక మున్ మదిఁ దలఁచి వినయ పాటవ మమరన్. వేం పంచతం. 4. 177.

**సంబళించుకొను** అ. క్రి. తేలుకొను.

వ. పగతుండు గన్నుదిరిగి నెత్తురు గ్రక్కుచు గ్రక్కున నొటిగి యంతలోనన సంబళించుకొని యెగసి బొంకు బొంకని యార్చుచుండ గడంగిన నద్దెస యోధులతని కడ్డంబు వచ్చిరి. హరి. ఉ. 2. 62.

**సంబళిక** (సం. సంపుటకః. క. సంబళికె) వి. అడపము, వక్కలాకులతిత్తి, తాంబూలము.

ఉ. వాదుల గెల్చువాలు చెలువంబుగ దాల్చిన పూలు నొప్పఁగా, నాదొర యొద్ద సంబళిక లందుచు నుండు నతండు ధీరతన్. హంస. 1. 207.

**సంబళికె** వి. సంబళిక.

సీ. సైన్య నాయక మాన్యసచివ పురోహిత బంధు వర్గముల సంబళికెలకును. ఉ. హరిశ్చ 1. 68.

**సంబవులు** వి. బ. 1. పావకోళ్ళు.

వ. అనంతరంబ కుంభభవ పులిన సంభవులు సంబవులు దొడిగికొని కదలి. భార. భీష్మ. 3.

2. పాదరక్షలు.

సీ. శశిఁ దెత్తుమే నీకు సంబవు లిడియుండ, ధన నాథు దెత్తుమీ దాసుఁ జేసి. కుమా. 6. 17.

ఉ. కాయజవైరి భక్తులకుఁ గాయము చర్మము నొల్చి సంబవుల్ సేయఁగఁ జాలు. చెన్న. 4 ఆ.

**సంబవులు** వి. బ. ధాన్యవిశేషము.

సీ. సాలంక లలుగు రాజనములు సంబవు లవె సర దార్లు మోహనపుసరులు. హంస. 4. 127.

సంభావులు (ముద్రి.) సంభవులు (వ్రా.).

**సంబాకృతము** సం. విశే. (రూ. శంబాకృతము) రెండు చాళ్ళు దున్నినది.

**సంబాగవు** వి. ఏలుదాఁకెడు సాధనము.

**సంబాధకము** సం. విశే. 1. ఒండొంటి నొరయునది. 2. గుమిగూడునది.

**సంబాధన** సం.వి.ఆ.స్త్రీ. 1. ఒఱయుట 2. కోపించుట.

**సంబాధనము** సం. వి. అ. న. 1. అడ్డుపెట్టుట 2. అదుముట. 3. అడ్డు. 4. శూలాగ్రము.

**సంబాధము** సం. వి. అ. పుం. 1. ఇఱుకు. 2. ఒరపిడి 3. ఆటంకము. 4. అపాయము. 5. నరకమార్గము. 6. భయము, 7. అడుగుజి. విశే. 1. ఇఱుకైనది. 2. జనులచే నిండినది.

వ. వీథులు సంబాధంబులు గావున హేయంబులై యున్నయవి. శీ. యా. పు. 9.

**సంబారము** వి. (సం. సంభారః) ఉప్పు, కారము మొ. నవి, వేళవాము, ఉపస్కార ద్రవ్యము.

సీ. సంబారములతోడి శాకపాకములతోఁ క్వమైన పెసంపప్పుతోడ... భీమ. 1. 60.

సీ. వలయు సంబారాలు వడియాలు ఒలయుంచి, దళమైన క్రొవ్వుతోఁ దాలఁబోసి. హర. 3. 121

సీ...వడిఁ బెట్టిలోఁ తెలకడము సాఁబా లూవ్వఁ తెలఁగు సంబా రంపుఁ జింతపండు. ఆము. 2. 97.

గీ. సకల సంబారములతోఁడఁ జంద్రఖండ, పాండు రంబైన దధితోడ బ్రాహ్మణులకు, భోజనం బిడు ద్వాదశి పుణ్యవేళ, సద్గుణాలంబ వండుం శంక రాంబ. జాహ్నవి. 1. 98.

ఉ. కూరలు సన్నబియ్యమును గుడ్డుల కోళ్ళును జింతపండు సం, బారము లుప్పు నెయ్యిలువుఁ బప్పు మొదల్గానితెచ్చి. శుక. 2. 18,

**సంబారు** వి. ఉపస్కారము.

సంబారన వేళవాము... ఆం. వ. పరి. 82.

**సంబాళించు** స. క్రి. (త. సమాళి, క. సంబాళిసు, హిం. సంభాల్నా.) ఆదరించు.

శా. ఒయ్యారమ్ముల తోడి యిక్కలిక నేత్రోత్పల్లి విద్యుల్లతల్, వెయ్యారమ్ముల కమ్మవింటి దొర కున్ వెచ్చించు బొమ్మంచులం, బయ్యాడుందల మంచుబింబముల సంబాళించుఁ గెమ్మోవిడా, బియ్యాఁడుందలమిన్న చన్నుఁ గవతో నీడా గిరి డావశుల్. పాంచాలి. 2. 89.

**సంబుఁడు** వి. (సం. శమ్భుః) శివుఁడు.

ద్వి. వంబియు గింబియు సంబిక గూర్చు, సంబుండు గింబుండు సకల భక్తులకు, తెలియఱుండో యని వేయించ ఘంట. బస. పురా. 105 పు. 8 పం.

**సంబుద్ధి** సం. వి. ఇ స్త్రీ. 1. పరిపూర్ణజ్ఞానము. 2. పూర్ణచైతన్యము. 3. పిలుచుట. 4. సంబోధన ప్రథమావిభక్త్యేకవచనము. 5. గుణ వాచకము.

**సంబెట** వి 1. సమ్మెట.

సీ.... సంబెట సమ్మెట యనఁగను శంబళంబు. ఆం. వ. పరి. 79.

వ. లోకమాత చేసి [illegible] వసిఁడిచిప్పఁజో [illegible] తోడ [illegible] తోడ సోలుకీలాలపులుసంబె [illegible] గుఱుతోడి యినుపకట్టు [illegible] ఉ [illegible]. వరాహ. 11. 105.

2. చబుకు.

ద్వి. అవనీశతనయుండు వట్లు కాననుసు, ఒవనాశ్వ మువమీఁద సంబెట వైచి, అరయు గూలుసఁ ఒట్టిన ట్టుండ వరుని, అనరంబుఁ బోలెనయ్యెడ శమ్మి మీఁద. విరాటపర్వము 4 ఆ. 70 పు.

**సంబెరము** వి. 1. సానుభూతి.

చం... పేర్చునరతితోడ సంబెరము జూపు విధం బునఁ బొల్చె భూజముల్. కు. స. 5. 69

2. జలాంజలి.

గీ. సంబెరం బిచ్చె రతిదేవి శంబరారికి. హర. 3.92.

**సంబెరమిచ్చు** అ. క్రి. (√సంబెరము) 1. సానుభూతి చూపు. 2. జలాంజలి యిచ్చు.

తే. గీ. సంబెరం బిచ్చె రతిదేవి శంబరారి కమలిన.. హర. 3. 92.

**సంబెల** వి. వక్కలాకుల తిత్తి.

గీ. జాజుబొజ్జయు నునుదట్ట సంబెలయును, తెత్త గొడుగును జక్కఁదాల్చి కుతుకమున. హర. 7. 12.

ద్వి. మెడమీఁదికంతియు నీచఁబోయిన పిఱుఁదును బుస్తుదోవతియు దాయ చరనిడిన దర్భ సంబె లయు. నవనాథ. 3. 207 పుట. పం. 23.

**సంబెళ** వి. 1. సంపుటము.

సీ...సంబెళ యన సంపుటమగు ... ఆం. వ. పరి. 45.

ఉ. వీరలు గంగలోఁ బులినవేములమీఁద బ్రుసీని విష్ణులై, నోరు వృథా మెదల్పుచుఁ గనుంగవ మోడ్చుడ వక్షమాలికల్, సారెకుఁ ద్రిప్పుచుం గుళలు సంబెళలోపలి దేవపూజలున్, దారును కాంభికుల్ జనధనంబు హరించెద రద్భుతంబుగన్. ప్రబోధ చం. 2. 8.

2. వక్కలాకుల తిత్తి. అడపము.

సీ. ఒక్కై భాద్రీనాథుఁడు పదపు త్తెంచిన, బింబారు ణోష్ఠి సంబెళ వహించు. భీమ. 1. 67.

సీ... ఁగ బెళ విదళించిక్కై తాంబూలదళ పూగనివ హంబు చాలంగ నించు నుబ్బు ... ఆము. 3. 70.

3. దర్భలు మొ· వానితో నల్లిన సజ్జ. (చూ. దబ్బసంబెల)

**సంబోధనము** నం. వి. అ. న. 1. పిలుపు, ఆహ్వానము. 2. వివరణము. 3. సంబుద్ధి.

**సంబోధము** నం. వి. అ. పుం· 1. తెలియఁజెప్పుట, బోధించుట. 2. సమ్యగ్జ్ఞానము. 3. పంపుట· 4. నాశము.

**సంబోధించు** నం. స· క్రి. 1. చక్కఁగా బోధించు, తెలియఁజెప్పు.

వ. అని సముచితముగా సంబోధించిన గురుని సంభాషితంబుల నిర్దోషితుండయి. భార. ఉద్యో· 1. 191.

2. హెచ్చరించు, మేలుకొలుపు.

వ. అనుచు మంద మంద సంభాషణంబుల సంబోధించు పాంచాలి పాణిస్పర్శంబున. భార. విరా. 1. 167.

3. పిలుచు, ఆహ్వానించు.

**సంభ్రమము** వి. (రూ. సంబరము) తొట్రుపాటు, వేగిరపాటు.

మ. అనయంబున్ మది సంభ్రమున్ వగవు నాకంతంతకున్ గ్రమ్మఁగన్. యయా. 3.

**సంభక్తము** నం. విశే. 1. విభజింపఁబడినది, పంచుకొనఁబడినది. 1. తత్పరమైనది. 3. నమ్మకమైనది.

**సంభక్తి** నం. వి. ఇ. స్త్రీ. 1. పంచుకొనుట, 2. పొందియుండుట. 3. పంచుట. 4. గౌరవించుట.

**సంభగ్నము** నం. విశే. చెదరఁగొట్టఁబడినది.

**సంభగ్నుఁడు** నం. వి. అ. పుం. శివుఁడు.

**సంభజి(యి)ంచు** నం. స. క్రి. సేవించు, కొలుచు.

గీ. కూర్మి రంభోరువుం దాను గుంభభవుఁడు, కుంభినీధర దుహితృ వక్షోజశాత, కుంభికుంభద్వయీ పరిరంభణార్తు, శంభు శ్రీమల్లికార్జును సంభజించె. కాశీ. 3. 54,

గీ. ప్రతిదినంబును ప్రాతరారంభవేళ, భక్తి సంభజియింతు రిపద్మబంధు. కాశీ. 3. 174.

**సంభరము** నం. వి. అ. పుం. 1. అధికమైన బరువు. 2. ప్రేగు.

కం. హరుశరమును వరుశరమును, సరి నిరుపక్కియలు దాఁకి జవమఱి శరసంభరమునఁ దిరిగె వరాహము· భార. అరణ్య. 1. 306.

**సంభరించు** నం. స. క్రి. వహించు, పూను, మోచు.

గీ. బ్రహ్మచర్య ఫిశాశనపరత గలిగి,జటిత యొండె ముండిత యొండె సంభరించి. భార. అను. 5. 269.

గీ. ... వీరభద్ర నృపతి, సర్వసర్వంసహాచక్ర సర్వచక్రభరము, పృథుభుజాపీఠమున సంభరించుట. భీమ. 1. 36.

**సంభరితము** నం. విశే. నిండినది, నింపఁబడినది.

**సంభరువు** నం. వి. ఉ. స్త్రీ. పావకోళ్ళు.

**సంభలి** నం. వి. ఇ. స్త్రీ. (సం. శంబలి) కుంటెనకత్తె.

**సంభవము** నం. వి. అ. పుం. 1. పుట్టుక· 2. హేతువు 3. కూడిక. 4. ఆధేయ మాధారమును మించకుండుట. 5. మూలకారణము. 6. సాధ్యత. 7. సామరస్యము. 8. యోగ్యత. 9. అనుకూల్యము. 10. సామర్థ్యము. 11. సమూవతను దెలుపు నొక ప్రమాణము. 12. కావ్యగుణవిశేషము. 13. సంభోగము· 14. సంపద. 15. జ్ఞానము.

**సంభవించు** నం. అ. క్రి. కలుగు, పుట్టు, సంభవిల్లు.

ఆ. శాశ్వతకీర్తియు, సంభవించుఁ గలుగు సద్గతియును. భార. శాం. 2. 408.

వ. జాతిస్మరణ జ్ఞానంబు శిష్యులకుం బరమజ్ఞానదానంబుఁ జేసిన ఫలంబున నా కీభవంబున సంభవించె. మార్క. 2. 31.

**సంభవిల్లు(లు)** నం· అ. క్రి. సంభవించు, కలుగు, పుట్టు.

సీ. తనదుశక్తిత్రయంబున సమస్త ప్రపంచంబుల కభివృద్ధి సంభవిల్లెన్. కాశ. 1. 28.

తే. గీ. చలువమందుల శైత్యంబు సంభవిలక, యినుఁడు గుడిచిన నీరయ్యె నింతిమేను. ఫి. శకుం. 3, 44.

**సంభవ్యము** నం. వి. అ. పుం వెలగచెట్టు.

**సంభారము** నం. వి. అ. పుం. 1. చక్కఁగా భరించుట. 2. సేకరించుట. 3. చక్కఁగా ధరించుట. 4. సమూహము.

సీ. హరిణాక్షి సంభారవారికాన్యభియును. శృం. నై. 7. 24.

5. సామగ్రి. 6. సంపూర్ణత్వము. 7. సంపద. 8. సమృద్ధి. 9. అంశము, భాగము.

**సంభావన** నం. వి. అ. స్త్రీ. 1. భావించుట, ఊహించుట. 2. సమ్మానము. 3. తలఁపు. 4. ప్రసిద్ధి. 5. సాధ్యత. 6. అర్హత. 7. సామర్థ్యము. 8. సందేహము. 9. అనురాగము, ప్రేమ 10. అలంకార విశేషము 11. పొందుట. 12. పేరు.

**సంభావనము** నం. వి. అ న. సంభావన.

వ. ... మత్పుత్రుండునకుఁ దోడ్కొనిపోయి మదీయబంధుగు సకల సంపద్విభవంబులుఁ జూపి వివిధ సంభావనంబు లొనరించి. షోడశ. కు 7. 53.

**సంభావించు** నం. న. క్రి. 1. సమ్మానించు, 2. గౌరవించు.

కం. విను ధర్మమునకు బ్రాహ్మణజనము జనన దేశమగుట జనపతి, భక్తిం గొనియాడి యనూయావర్జనుఁడై తగు విప్రకోటి సంభావింపన్. భార. శాం. 2. 402.

వ. .... నన్ను రావించి యుచిత ప్రియసత్కారంబు లొనర్చి సంభావించి యిట్లనియె, మార్కం. పీఠి. 13.

కం. దేవత లచ్చెరువడి య, ద్దేవుని నయ్యుదుపుఁను నుతించి రజుఁడు సం, భావించె ధర్మమును నవనీవర ! యప్పరమవిభుఁడు నిరుపమలీలన్. భార. శాం 4. 170.

2. తలఁచు, ఊహించు.

శా. అంభోజానన భూమిపాలకునిచే నాశ్లిష్టయయ్యెన్ మదిన్. సంభావింప నతం డదృశ్యుఁ డగుటన్. నైష. 3. 114.

3. కొనియాడు, స్తుతించు.

వ. మహానుభావా భవదీయ భాషణ శ్రవణంబునఁ జిత్తంబు కలంకఁదేఱె నని సంభావించు. భార. ఉద్యో. 1. 214.

4. [illegible]

వ. పూజ్యుఁడు వసిష్ఠమహాముని నతిగౌరవ బున [illegible] భావి [illegible]. భా. ఆది. 7. 57.

క.. [illegible] భావి [illegible] నాఁడ [illegible], [illegible] భా. ఉద్యో. 2. 203.

క.. నాపుకు వల్లనఁడు న, ద్దైవుఁడు గరుణించి మునుల దేవతలను సం, భావి.. భా. శాం. 5. 443.

5. మన్నించు, క్షమించు.

కం. గోవింద సంభ్రమము సం, భావింపుము మాకు నిదియ పరమధనంబు. భా. ఉద్యో. 3. 231.

6. ఓదార్చు.

క. ఎల్లింటినేఁటిలోనన, తల్లి వెదకించి తెత్తు ధన గుప్తిని నీ, పుల్లమున వగవ వలదని, చల్లని మాటలఁ దనూజ సంభావించెన్ విక్రమా. 7. 123.

**సంభావితము** నం. విశ. (అ. ఆ అ.) 1. చక్కఁగాఁ దలఁపఁబడినది. 2. ఊహింపఁబడినది. 3. యోగ్యమైనది. 4. అర్హమైనది 5. ఉత్పాదింపఁబడినది. 6. తృప్తిపఱుపఁ బడినది. నం. వి. అ. న. ఊహ.

**సంభావ్యము** నం. విశ. (అ. ఆ అ.) సంభవింపఁ దగినది.

**సంభాష** నం. వి. ఆ. స్త్రీ. 1. సల్లాపము.

కం. భూతంబుల దర్శింపమి, భూతస్పర్శనము భూతములయొడ సంభా, షాతంబుల నొందమి నూ, రేతెరువు విమోహ సుఖ గరిష్ఠత వడయన్. భార. శాంతి. 6. 314.

2. అభివందనము. 3. పలుకరింపు. 4. ఒడంబడిక 5. సంకేతపదము. 6. యుద్ధనాదము.

**సంభాషణము** నం. వి. అ. న. సంభాష.

**సంభాషము** నం. వి. అ. పుం సల్లాపము

**సంభాషించు** నం అ. క్రి. మాటలాడు.

వ. తాపసోత్తంస యింతకాలంబునకు సుముఖుండవై నాతోడ సంభాషించుట కంటె వరంబులు గలవె. వరాహ. 7. 90.

**సంభాషితము** నం. విశ. 1. చెప్పఁబడినది. 2. పలుక

[illegible] సం. వి. అ. న. సంభాషణము.

**సంభిన్నప్రలాపము** సం. వి. అ. పుం. వ్యర్థాలాపము.

**సంభిన్నము** సం. విణ. (అ. ఆ. అ.) 1. పూర్తిగా భిన్నమైనది. 2. చెదరినది. 3. విరిగినది. 4. కలఁత చెట్టఁబడినది. 5. బాగుగా వికసించినది. 6. విగుణమైనది. 7. [illegible]. 8. ఎదురుతిరిగినది.

**సంభిన్నవృత్తుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. సత్ప్రవర్తనము విడిచినవాఁడు.

**సంభుక్తము** సం. విణ. (అ. ఆ. అ.) 1. తినఁబడినది. 2 బాగుగా అనుభవింపఁబడినది. 3. ఉపయోగింపఁబడినది.

**సంభూతము** సం. విణ. 1. పుట్టినది. 2. కలసినది. 3. కూడినది. 4. చాలినది.

**సంభూతి** సం. వి. ఇ. స్త్రీ. 1. పుట్టుక. 2. కలయిక. 3. అర్హత. 4. శక్తి. 5. జ్ఞానము. 6. అతిలోక ప్రభావము. 7. అంశము లేక అవతారము.

**సంభూషించు** సం. స. క్రి. 1. అలంకరించు. 2. పొగడు.

శా. జంభారిక్రియఁ జేరి యాత్మపురి నిచ్చల్ తల్లిదండ్రుల్ ప్రజల్, సంభూషింప సమస్త రాజ్య పదవీ సౌఖ్యంబుఁ జెందెం దగన్. రా వి. 5. 101.

**సంభృతము** సం. విణ. 1. చక్కఁగా భరింపఁబడినది. 2. చక్కఁగా ధరింపఁబడినది. 3. సిద్ధముచేయఁబడినది. 4. చేకూర్చఁబడినది. 5. ఉంచఁబడినది 6. సంపూర్ణమైనది. 7. పొందఁబడినది.

కం. అనన్యశీలచేత శ, తానందుం డధిక సంభృతానందుండై ... కళా. 6. 29.

మాలిని. సకృపకృతవిలాసా సంభృతానందభావా. భాగ. స్వర్గా. 97.

8. పోషింపఁబడినది. 9. గౌరవింపఁబడినది 10. నిగ్గుబడినది.

**సంభృతశ్రుతుఁడు** సం విణ. (అ. ఆ. అ.) 1. పండితుఁడు. 2. ప్రఖ్యాతుఁడు.

**సంభృతస్నేహితుఁడు** సం విణ. మైత్రీపరిపూర్ణుఁడు.

**సంభృతి** సం. వి. ఇ. స్త్రీ. 1. చక్కఁగా భరించుట. 2. చక్కఁగా ధరించుట. 3. సేకరించుట. 4. పోషణము. 5. నిండుతనము.

**సంభేదము** సం. వి. అ. పుం. 1. చక్కఁగా భేదించుట. 2. కలయిక. 3. నదీసంగమము. 4. వికసించుట. 5 కూడిక. 6. సమానత్వము 7. ఎదురుతిరుగుట.

**సంభోగము** సం. వి. అ. పుం. 1. అనుభవము. 2. సురతము. 3. మంచిసుఖము. 4. శృంగార భేదము.

**సంభోగవేశ్మము** సం. వి. న్. పుం. ఉంపుడుకత్తె గృహము.

**సంభోగి** సం. వి. న్. న. విషయలోలుఁడు.

**సంభోగించు** సం. అ. క్రి. 1. కలయు, రమించు.

శా. ... కోడలిని గానా నీకు నీపట్టితో, సంభోగించిన యప్పుడే తెలియు నీ చందంబు దైత్యేశ్వరా! ఉ. రా. 4. 707.

2. అనుభవించు.

**సంభోజకుఁడు** సం. వి. అ. పుం. భుజించువాఁడు.

**సంభోజనము** సం. వి. అ. న. విందు, కలసి భుజించుట.

**సంభోజని** సం. వి. ఇ. స్త్రీ. కలసి భుజించుట, సంభోజనము, విందులో నిచ్చు దక్షిణ.

**సంభోజము** సం. వి. అ. పుం. ఆహారము.

**సంభ్రమము** సం. వి అ. పుం. 1. గుండ్రముగాఁ దిరుగుట. 2. వేగిరపాటు.

చం. ఉదకముఁ గ్రోల ప్రవేశదుపయోదము పొరుపకేళి సంభ్రమాభ్యుదయ గళద్రమాకబరి పోలిక నొప్పు ... కళా. 4. 205.

3. కలఁత. 4. భయము. 5. భ్రాంతి. 6. గౌరవము.

మ. హిమశైలేంద్రుఁడు వల్కె మామక మనోభీష్టంబు జేకూర మీకు మదీయాత్మజ నిచ్చి సంభ్రమము దళ్కొత్తన్ వివాహం బొనర్తు ముదం బొప్పఁ బ్రతిగ్రహింపదగు...శివరహస్య. సంభవ. 3. 171.

7. అజ్ఞానము. 8. సంక్షోభము.

**సంభ్రమించు** సం. అ. క్రి. తత్తఱించు, వేగిరపడు.

మ. ఇనుతెల్లం గడు సంభ్రమింపగ సంభ్రాంతులై, భుజాన్వా...

ఆ చాన గదించి ... మఘాలుపు జాజు, నది గ్రహించి ఘటమునందు డించి, వసుఱు చెంత మెలగ వసుణుడు కామించి, కదియ నకియ ...

**సంభ్రాంతము** నం. విఱ. (అ. ఆ. అ.) సుడి తిరిగినది. ... కలిత కొంచినది.

**సంభ్రాంతి** నం. వి. ఇ. స్త్రీ. ... తము.

**సంమంత్రణము** నం. వి. ఆ. న. ఆలోచించుట.

**సంమృష్టము** నం. విఱ. బాగుగా శుద్ధించు చేయఁబడినది. 2. తుడుచఁబడినది. 3. వడగట్టఁబడినది.

**సంయంత** నం. విఱ. (ఋ. త్రీ. ఋ.) నిరోధించువాఁడు. అడ్డగించువాఁడు.

**సంయంత్రితము** నం. విఱ. ఆపఁబడినది.

**సంయతము** నం. విఱ. (అ. ఆ. అ.) 1. అడ్డగింపఁబడినది. 2. అణచఁబడినది. 3. బద్ధము, కట్టఁబడినది. 4. చెఱఁబెట్టఁబడినది. 5. సిద్ధమైనది. 6. పర్వుపఁబడినది,

**సంయతుఁడు** నం. వి. అ. పుం. 1. ఇంద్రియముల నిగ్రహించినవాఁడు; సన్న్యాసి. 2. శివుఁడు

**సంయతవాక్కు** నం. విఱ. చ్. 1. వాఙ్నిగ్రహము కలవాఁడు. 2. నిశ్శబ్దముగా నుండువాఁడు, మౌని.

**సంయతాంజలి** నం. విఱ (ఇ) కూర్పఁబడిన దోసిలి కలవాఁడు, అంజలి పట్టినవాఁడు.

**సంయతాక్షుఁడు** నం. విఱ. (అ. ఈ. అ.) మూసికొనఁబడిన కన్నులు గలవాఁడు.

**సంయతాత్ముఁడు** నం. విఱ. (న్) ఆత్మ నిగ్రహము కలవాఁడు.

**సంయతాహారుఁడు** నం. విఱ. (అ. ఆ. అ) నియమితమైన యాహారము గలవాఁడు, మితముగాఁ దినువాఁడు.

**సంయతి** నం. వి. ఇ. స్త్రీ. 1. తపస్సు. 2. ఆత్మనిగ్రహము.

**సంయతోపస్కరుఁడు** నం. విఱ. (అ. ఆ. అ.) 1. సిద్ధము చేసికొన బడిన గృహోపకరణములు గలవాఁడు. 2. ఇంటి సామగ్రి క్రమముగా నుంచుకొనినవాఁడు.

**సంయత్తము** నం. విఱ. (అ. ఆ. అ.) 1. సిద్ధమైనది. 2. కావలిలో నున్నది. 3. రక్షితమైనది. 4. జాగరూకమై యున్నది.

**సంయత్తు** నం. వి. త్. స్త్రీ. యుద్ధము, పోరు.

**సంయద్వచుఁడు** నం. విఱ. అ. ఆ. అ. మౌని, మాటలాడనివాఁడు,

**సంయద్వరుఁడు** నం. వి. అ. పుం. రాజు, నియంతృశ్రేష్ఠుఁడు.

**సంయమనము** నం. వి. అ. న. 1. నిరోధము, అడ్డగింపు. 2. లోపలికి గ్రహించుట. 3. బంధనము, కట్టుట. 4. చెఱలో నుంచుట. 5. ఇంద్రియ నిగ్రహము. 6. నియమ విశేషము. 7. చతుశ్శాలము, ముందువాలోఁగిలి,

**సంయమని** నం. వి. ఈ. స్త్రీ. యమునిపట్టణము.

**సంయమనుఁడు** నం. వి. అ. పుం. 1. నిరోధించువాఁడు. 2. శాసకుఁడు. 3. రాజు.

**సంయమము** నం. వి. అ. పుం. 1. (చిత్త) నిరోధము; నిగ్రహము; వశపఱుచుకొనుట. 2. ధ్యానధారణ సమాధులనెడి యోగ సంబంధమైన తుది మూఁడవస్థలు 3. నియమ విశేషము; హింసాదుల నుండి విరమించుట. 4. తపోఽభ్యాసము. 5. సుఖదుఃఖాద్యనుభవము. 6. వ్రతాంగముగాఁ బూర్వదినమునఁ జేయఁదగిన నియమము. 7. ప్రయత్నము.

**సంయమి** నం. వి. (న్. నీ. న్.) 1. (చిత్తము) నిగ్రహించిన వాఁడు. 2. నిరోధించినవాఁడు 3. వశపఱుచుకొనినవాఁడు, 4. కామాది వికారముల నణఁచినవాఁడు.

**సంయమి** నం. వి. న్. పుం. 1. యతి 2. సన్న్యాసి.

ఉ. భ్రాజితవృత్తిమైఁ బరగు భారతసంహిత సంయమీంద్రులా,రా! జయనామకం బగుచు రాజితభంగి జగత్త్రయంబువన్ బూజిత కీర్తియై నెగడు. భార. స్వర్గా. 89.

ద్వి. సంయమివరుఁడు వాచంయముం డగుచు.

పద్మ. 3. పుట. 135.

**సంయమితము**[1] సం. విశే. (అ. ఆ. అ.) 1. నిరోధింపఁబడినది: నిగ్రహింపఁబడినది. 2. కట్టఁబడినది. 3. ఆఁపఁబడినది, నిలుపఁబడినది 4. సంఘముగాఁ జేసినది

**సంయమితము**[2] సం. వి. అ. న. నిగ్రహించుట.

**సంయము** సం. వి. అ. పుం. అస్థిపంజరము

**సంయాత్ర** సం. వి. ఆ. స్త్రీ. 1 సముద్రయానము. 2. కలిసి పయనించుట.

**సంయానము**[1] సం. వి. అ. పుం. పోఁతపోసెడి యచ్చు.

**సంయానము**[2] సం. వి. అ. న. 1. అనుసరణము, వెంబడించుట. 2. ప్రయాణము, యాత్ర. 3. శవమును దీసికొనిపోవుట. 4. బండి; శకటము.

**సంయామము** సం. వి. అ. పుం. సంయమము.

**సంయావము** సం. వి. అ. పుం. 1. నేయి మొదలగు వానితోఁ బక్వము చేసిన గోధుమ భక్ష్య విశేషము: సారెసత్తులు (శ. ర.) (ఘృతక్షీరగుడ గోధూమ పాకజము అని వాచ.).

**సంయుక్తము** సం. విశే. (అ. ఆ. అ.) 1 చక్కఁగాఁ గూడినది, ఏకమైనది. 2. మిశ్రమైనది; కలసినది 3. అనుసరింపఁబడినది; వెంబడింపఁబడినది, 4. సంపన్నము, కలిగియున్నది.

సీ. శివభక్తి సంయుక్త చిత్తులకును ... శివధర్మ 2. 34.

**సంయుగము** సం. వి. అ. పుం. 1. కలయిక, ఐక్యము 2. యుద్ధము; పోరు 3. సన్నిహితత్వము.

**సంయుగగోష్పదము** సం. వి. అ. న. అల్పకలహము. (గోష్పదము నందలి యుద్ధము.)

**సంయుగమూర్ధము** సం. వి. న్. పుం. అనిమొన, రణాగ్రము.

**సంయుజ** సం. వి. అ. కలయిక, సంబంధము.

**సంయుజుఁడు** సం. విశే. జ్. 1. సంబంధము కలవాఁడు. 2. సద్గుణ సమేతుఁడు.

మత్తకోకిల :

స్నాతకుండును ఋత్విజుండును సద్గురుండును నిష్టుఁడున్ భూతలేశుఁడు సంయుజుండును బూజనీయులు ...సభా. 2. 4

**సంయుతము** సం. విశే. (అ. ఆ. అ.) 1. కూడినది; కలసినది.

ద్వి. సంయమివరుఁడు వాచంయముం డగుచు, సంయుత విద్యానుషక్తుఁడై యుండె. ప. మ. 3. పుట 135.

2. సంపన్నము, కూడియున్నది; కలిగియున్నది

వ. ప్రదీప్తాక్షత గంధ సంయుతంబును.... శివధర్మ. 2. 38.

**సంయుతి** సం. వి. ఇ. స్త్రీ. 1. గ్రహముల కూటము. 2. రెండు సంఖ్యల మొత్తము.

**సంయోగము** సం. వి. అ. పుం. 1. కూడిక, కలయిక. 2. సమాన ప్రయోజనము గల యిరువురు రాజుల మైత్రి. 3 (తర్క.) ఇరువదినాల్గు గుణములలో నొకటి. 4. (వ్యాక.) నడుమ నచ్చులేని హల్లులు, సంయుక్తాక్షరము. 5. రెండుగ్రహముల కూటమి. 6. మైథునము. 7. వైవాహిక సంబంధము, 8. మొత్తము.

**సంయోగ విరుద్ధము** సం. వి. అ. న. ఇతర వస్తు సంయోగమున విరుద్ధ గుణము గలిగెడు వస్తువు: వేఱు వస్తువు గలుపుటచే నపాయకరమగు నాహార పదార్థము.

**సంయోగి** సం. విశే. న్. 1. కలుపఁబడినది 2. ఏకము చేయఁబడినది, 3. కలియునది. వివాహితుఁడు.

**సంయోజనము** సం. వి. అ. న. 1. చక్కఁగాఁ గూర్చుట, కలుపుట.

శా. చేసెం గావలయున్ విరించి నిఖిల స్త్రీ పుంస సంయోజనా, భ్యాస ప్రౌఢి ప్రకాశమొందఁ గడు వియ్యం బైన సంసర్గము. శృం. నై. 6. 75.

2 రతిపొందు 3 కలయిక.

**సంయోజించు** సం. స. క్రి. చక్కఁగా కూర్చు.

వ. ఎయ్యది యకారాది వర్ణంబు లేకత్వంబు నొందునట్లుగా సంయోజింప నాద్గుణ యను సంధిఁ గూడి మంత్రతత్త్వంబు నొందు. కాశీ. 6. 250.

**సంయోజితము** సం. విశే. (అ. ఆ. అ.) మఱియొక దానితోఁ గూర్పఁబడినది.

ద్వి. సర సర గీత లందరు కవిలియలు, సరయుండు
శోధించు దవ్వవములు. పండితా. దీజా. 50 పు.

ద్వి. సరసర లింగపసాయిత శస్త్రు కరతలుం డై
చూడ కమదృష్టి మన్న. బస. పురా. 2. 482
పం.

సరసర క్రి. విశ. మిక్కిలి వేగముగా.

ద్వి. అరుగంగ సరసర లింగావసము సేయించి
బస. పురా. 2. 885.

సరసి సం. వి. ఈ. స్త్రీ. సరస్సు, కొలను.

వ. శుకు దు మృగపక్షికౌల సరిత్సరసీ తరు గుల్మ
లతలం గలయం గనుంగొని .... భార. శాంతి. 6.
430.

గుట.

సరసికము సం. వి. అ పుం. సారసము, బెగ్గురుపక్షి.

సరసిజనాభుండు సం. వి. అ. పుం. విష్ణువు.

సరసిజభవుండు సం. వి. అ. పుం. బ్రహ్మ.

సరసిజము సం. వి అ. న. పద్మము, తామర.

సరసీరుహము సం. వి. అ. న. సరసిజము.

సరసీరుహము సం. వి. అ. పుం. బెగ్గురుపక్షి.

సరసు విశ. (తు. సరసు.) రుచి గలది, స్వాదువు,
గాటు తక్కువ కలది, ఆకృతిలోం బెద్దది.

మ. వరసారస్వత పట్టభద్రులు కవుల్ వర్ణించి
వర్ణించియున్, సరసావంతయుం గానలేరు తుద
యోసావిభ్రమాంభోధికిన్. పాండు, 5. 215.

సరసు అ. క్రి. 1. సరదు, పంచు. (సమముగాం బంచు
అని శ. ర.)

సీ. స్తనభార మొక్కింత సరసుక వచ్చెద నని గబ్బి
చనుగుబ్బ లంటు నెవరు. దశా. 8. 31.

తే. జంత యిటు లగ్గి యుండ రాజంత వచట, సరసి
చెంత విసాగ్రంబు సరసికొంత, మగని కందిచ్చు
కోరి ప్రేమగని తనదు, దుండి యెదదగు తెంచి
యందుండి యపుడు. సారంగ. 2. 152.

2. క్రమ్ముకొను.

సరస్వంతము సం. విశ. త్. 1. నీరు కలది. 2. రసము
కలది. 3. అందమైనది. 4. రుచిగలది. 4. శృంగా
రాది రసములు గలది.

సరస్వంతము సం. వి. త్. పుం. 1. కొలను,
2. నదము. 3. మహిషము. 4. సముద్రము.
5. వాయువు.

సరస్వంతుండు సం. వి. త్. పుం. 1. కుబేరుండు.
2. రసికుండు. 3. తెలిసినవాండు.

సరస్వతి సం వి. ఈ. స్త్రీ. 1. పలుకుంజెలి, వాగ్దేవత.
2. పలుకు 3. నది. 4. ఒక నది పేరు.

సీ. అతండు సరస్వతి నవగాహనము సేయుచుండి.
భార. శల్య. 2. 150.

5. ఆవు. 6. స్త్రీలలో శ్రేష్ఠురాలు. 7. మనువు
భార్య. 8. దుర్గ. 9. సోమలత (వ్య. వి.).
10. జ్యోతిష్మతి (వ్య. వి.).

సరస్సు సం. వి. స్. న. 1. కొలను. 2. జలము

సరహస్యము సం. విశ. 1. మార్మికమైన, మాంత్రిక
మైన, అనిర్వచనీయమైన. 2. తాత్త్వికమైన,
మంత్రోపదేశపూర్వకమైన.

సరాగము సం విశ. (అ. అ. అ.) 1. రాగముతోం
గూడినది, ప్రేమ గలది, 2. రంగు గలది. 3. రక్త
వర్ణము గలది.

సరాగము సం విశ. (అ. అ. అ.) 1. రాగముతోం
గూడినది, ప్రేమగలది. 2. రంగు గలది. 3. రక్త
వర్ణము గలది.

సరాగము వి. 1. ఒద్దిక, అనుకూల్యము. (క. సరాగ
= అడ్డులేనిది; సూటియైనది. – బాట మొ. త.
చరాచం = సూటియగు బాట).

"అన్నదమ్ముల సరాగము వారలదే సుమీ." విజ.
వి. 1. 71.

కం. రాగము చిగురాకున కను, రాగము కొలుంగు
లకు ఘనపరాగము వనికిన్, రాగము మధుకర
ములకు స, రాగము గృహులకును గల్గె రహి నవ్వే
శన్. రసి. 2 ఆ.

2. ఒప్పిదము.

ఉ. ... ఆ ఛాయలకెంపు టోవరుల చందము నా
చలువల్లొలంకు రే, రాయల రాయ రంగుల సరా
గము నా మణికుడ్యభాగముల్. సారంగ. 2. 62.

**సరాతి** వి గోడవలె గుడారము చుట్టు నేర్పఱచిన తెర. (శ. ర.).

మ. అమరం జుట్టు సరాతిపోల్కి వలయాహార్యంబువేలోర్మిదట్టి మహాపీచుల చాలుగాలి తెరపై పెంపొంద దంష్ట్రాంకురా, గ్రమునన్ ధారుణియొంటి కంబము గుడారంబై తగన్ ద్వాదశారశ్మితేజోహతిఁ గందకుప్పెనఁగె మాయాదంష్ట్రి నిన్నెన్నెదన్. చంద్రాంగ. 1. 76.

చం. తడవుగ నెంతయేని వడి దవ్వుఁ జరించుటఁ జేసి మిత్రుఁ డబ్బడలిక దీర్పఁ జేరుటను బశ్చిమదిక్సతి నిల్పు వేడుకన్, విడిది ఘటించి చుట్టు నొదలించిన చొక్కపు టింద్రగోపపుం, బెడఁగు సరాతిరీతిఁ గనిపించెను దద్దిశ సాంధ్యరాగముల్. సమీర. 3. 67.

గీ. రంజిలఁగ నాతిగోడ సరాతి యనఁగ, వసన నిర్మితకుడ్యభావంబు గాను. అం. భా. 2. 157.

సీ. పాథోధిసుతవీడు పట్టుచొక్కపు గుడారంపు హొంబట్టు సరాతియనఁ ... ఉ. రా. 1, 316.

**సరాళము** సం. విణ. (రూ. సరళము).

సీ. కల్లోలడోలాసముల్లోల లీలాసరాళ మరాళవాచాలఝురము. రామా. 5 అ.

**సరావము** సం. విణ. ధ్వని చేయునది, మ్రోగునది.

**సరావము** సం. వి. అ. పుం. 1. మూఁత. 2. మూఁకుడు; ముంత. (చూ. శరావము)

**సరాసరి** వి. వి. (సరసివ+సరి) సరిచూడఁగా నైన సమత్వము.

ఉ. ఈ కెంపులన్ని సరాసరికి ఏమి వెల ? (శ. ర.)

**సరి** సం. వి. ఇ. స్త్రీ. నీటిబుగ్గ.

**సరి1** వి. 1. తగిన సమాధానము.

కం. వరవర యీ ప్రశ్నమునకు, సరి చెప్పఁగ రాదు వేమ సామర్థ్యముచేఁ, బరికించి నీకుఁ జెప్పెద. భాగ. 11. స్కం. 3.

2. సామ్యము; పోలిక.

ఆ. వె. ఆమృగాక్షిఘన కటీమండలంబుతో, సరికిఁ జెనఁగవచ్చు సైకతముల, గౌరవంబు గుట్టు గాంచం గవచ్చుఁ జో, తెలియ నేరుపాటు గలిగె నేని. వరాహ. 11. 46.

చం. .... ప్రోల్ .... అలవాకపున్ సరిత్రై పెనంగి ఆము. 2. 9.

ఉ. కాచన మంత్రిశేఖరుని గాదిలిపుత్రి హరిప్రియే కనా, రీచతురాస్య కాంతలసరిన్ గణుతింపఁగ వచ్చు ... ప్రబోధ చం. 1. 11.

3. సాటి.

చం. ... ... నీకు నెవ్వరు సరి సర్వశిల్పవిభవంబున యందు సమర్థ మెందు వ.చ్చెరువు భవత్ప్రభావము ప్రసిద్ధముగాదె సురేంద్రపూజితా. హరి. ఉ. 2. 156.

మ. బలధౌరేయతలందు నీకు సరిచెప్పన్ నీవకా కెవ్వరుం, గల రే యమ్మలు గంధవాహభువన ఖ్యాతంబు నీవిక్రమం, బలఘుస్ఫూర్తియుతుండవు. హరి. ఉ. 2. 172.

మ. సరి లే రీజలరాశివేష్టిత మహీచక్రంబు నవిక్రమా, సరి గాండివికి. కాశీ. 1. 53.

సీ. వెలదులు పదియారు వేవురతో నెన్న సరిలేదు సౌభాగ్యగరిమ నీకు. పారి. 1. 58.

**సరి2** (సం. సరః) వి. దండ; (పూవుల) దండ; సరము.

సీ. కురులు మన్నగ దువ్వి కొప్పు వెట్టునె గాని తోరంపువిరిసరుల్ తుఱుమఁబోదు. దశా. 4. 58.

కం. విరితేనె మే సరులకున్, హరినీలఁపుసరుల కురులకఱకురుల్, గురులై వెడవిలుతుని బెడ, గురులై తగు నెమ్మిపురుల కొకదాఁపరులై. చంపూ రా. 3. 75.

కం. తా రెట్టట్లుగఁ దమ్ముం, జేరిన ముత్తెంపు సరులఁ జేదిన చన్నుల్, లో రెంట లుడిపె.... ఆము. 5. 23.

వ. సన్నజాజివిరుల సరుల సిరులం గడలుకొని. ఉ. రా. 4. 163.

గీ. ఇరులసరులను బెన్నెలు లిరువుకొనఁగ. ఉ. రా 1, 254.

సీ. భుజగమధ్యమునఁ గ్రాలు భుజగహారంబులు, గుజ్జపూగుజ్జ్ ... నా. 7. 41.

"ముత్యాల సరులతో ముద్దుగురిసె". శృం. నై. 2. 118.

సీ. సీతాంబుజాతాక్షి చెఱువన్వుఛాయతో సవరైన విరిమల్లెసరులు కొన్ని. ఉ. రా. 6. 29.

సీ. తెలిముత్తియపు సరుల్ దిద్దునెపంబున, గుబ్బచన్నొగడలఁ గోరఁ జెనకి. నీలా. 3. 103.

ఉ. వియన్నదీ వవాంభోరుహనాళ మాత్రములఁ బొందుగ దీని లతాంతము ల్సరుల్గా రచియించి నింపుఁ గుతుకంబున వీఁగు మెఱుంగు క్రొవ్వెదన్. పారి. 1. 8.

తే. విరులసరు లిచ్చె నొక యరవిందగంధి. పారి. 2. 12.

2. సమయము. వ్యవ. ఆతఁ డీసరికి రావలసినదే.

సరి సం. విశ. (సం. సదృశమ్; ప్రా. సరి. త. చరి. క. సరి) సమము; పాటియైనది.

కం. సురసిద్ధ మునీంద్రతపశ్చరణలు నా తపము తోడ సరి గా వంటెన్. భార. 3. 216.

కం. మనవీటవ కా దయ్యర్జునునకు సరివింటివానిఁ జూడఁగ లోకంబున నెందు లేమిఁ దెల్లంబు. భార. ఉద్యో. 2. 167.

2. సమానము.

చం. దురమున బంధుమిత్రులకుఁ దోడ్పడు పెంపును ధాత్రియెల్ల భూసురులకు నర్థి నిచ్చుటయు మారి జనుల్ సుకృతంబు లెన్నుచో, సరియుగఁజేసి చెప్పుదురు. భార. ద్రోణ. 3. 231.

ఉ...ధారావలిలప్లవం బఖిలరంజకమై యెలయంగ జేయవే, నీసరి యెవ్వ డిప్డు విధి నిర్దయుఁడైన వకంబె యేలికిన్. హరి. పూ. 9. 156,

సీ. సరిసిద్ధసిద్ధులు సమలోష్ట కాంచనమై యుండు. భార. శాం. 5. 225.

చం...బ్రహ్మభావతా, జవత ఘటింప దీని సరినమ్మ గుపాయము లెందు లేవు. భార. శాం. 5. 632.

చం...చైత్యవసుధావరముఖ్యవృపుల్ ఘటేంద్రతో, గము లవ నొప్పు బాహువులు గల్గిన నిమ్న భజించు గోపికల్. క్రమమున నేమునున్ సరియకా మె భవత్కృప స బజోదరా ' భాగ. 0 స్కం. ఉ. 1. 110.

సీ. పరశురామునకు మేల్సరియైన తవయందుఁ గలిగె భంగంబు శిఖండిచేత. భార. భీష్మ. 1. 47.

కం. దానంబునఁ గర్ణుని సరి, మానంబున పేర్మి ననుపమానుఁడు. హరి. పూర్వ. 1. 131.

సీ. చిరమరలకుఁ జొరక నిందాస్తుతుల్ సరిగఁ గొనుచు. భార. శాం. 1. 58.

కం. హరి యిట్లు సతులనందఱి సరిగాఁ జూచియును. పారి. 1. 41.

గీ. ప్రాణనాథునిసరియె యే బంధువులును. కాశీ. 2. 82.

గీ. భూసురోత్తమ గార్హస్థ్యమునకు సరియె. మను. 1. 66.

ఉ. హేమధరాధరేంద్రమున కెక్కటి పెద్దతృతిన్ భుజంగమ, స్వామికి మేలుచేయు పటువాగ్విభవంబున బుద్ధిసంపదం, దామరచూలికిన్ సరి ప్రధానులు దక్కినవారు సాటియే. శృం. నై. 1. 28.

3. అనుకూలము, తగినది.

సీ. హరి తమ్ము వంచించె సరివేళగా దని దైత్యులు చేనిరి పాతాళమునకు. హర. 6. 129.

మ.... తదీయధ్వనిన్, సరిగాఁ గైకొనియె న్వసంతము మహాసంపూర్ణ భావోన్నతిన్. వసు. 1. 180.

4. యుక్తము, సమంజసము.

శా. కారుణ్యంబున వమ్మ హీనురుఁ డొగిన్ ధర్మార్థ కామక్రియా, చారంబుల్ సరిగాఁ జరించి తుద మోక్షశ్రీ నపేక్షించి. విక్ర. 1. 194.

5. సమర్థత గలవాఁడు.

కం. ఆ యబుని చక్కఁదన మిఁక, నా యఱఁడే యెఱుగుగాని యవనీస్థలిలో, నే యబనీయు లెఱుంగరు, కాయజుఁడైనను నుతింపఁగా సరి యగునే. ఇందు. 4. 3.

6. సమాప్తము.

సీ. చదివిన చదువులు సరి శరీరముతోనె తలఁపులు ముఱచినందనుక నుండు. నీతి. 48,

చం. సరియగునిట్టి వెట్టసివి సర్వము ... ఆము. 2. 47.

7. బుజువు.

కం. చనుదెంచె వయోధ్యనుండి సరి యిందులకున్. భార. అర. 2. 188. (శ. ర.).

8. సమాప్తము, చెడిపోయినది

(వ్య.) నీకు వాకు స్నేహము నేఁటితో సరి.

9. తగినట్లు.

(వ్య.) వానికి లెక్కలు సరిగా రావు = రాఁదగినట్లు రావు.

(వ్య.) అచ్చు సరిగానే పడినది = పడఁదగినట్లే.

సరి. క్రి. విశ. 1. సమానముగా.

కం. లలిఁ బుణ్యాంగన లొలికెడు, లలితాక్షతములు వియత్తలమున నమరకాం, తలు గురియు కుసుమ వర్షం,బులు నొక్కటఁ గృష్ణుమేను భూషించె సరిన్. హరి. ఉ. 3. 165.

కం. హరుశరమును నరుశరమును, సరి నిరుపక్కియలు దాఁకి జవమటి. భార. అర. 1. 306.

ఉ. అగ్గణముఖ్యులోడ నొకఁడై సరి నా చెలుకున్ భరించి కాఁ దిగ్గన వచ్చె శంకరుఁడు దెప్పరమైన వడిం చెమర్చుచున్. హర. 1. 21.

2. పూర్ణముగా

ద్వి. ఆ జాహ్నవీదేవి దిగి పాతాలమునఁ దిరిగి యందున్న, సగరుల భస్మముల్ సరినిండఁ దాకె రం. రా. బాలకాం. 45 పు. 10. పం.

క౯. వనమునఁ బంద్రెండేండ్లము, జనపదమున నెఱుఁగకుండ సరినొకవర్షం,బును జలుపఁ బూని సత్యము, దనరఁగఁ జేసితిఁ బ్రతిజ్ఞ దగ వృద్ధసభన్. భార. అర. 1. 258.

ద్వి. అగణితశక్తి రెండడుగులయందు, జగతీతలం బెల్ల సరి నాక్రమించి. రం రా. బాలకాం 41 పు. 25 పం.

కం. పరువడి రుధిరము దొరఁగఁగ, నరుడుగఁ దన కారె నినకులాధిపుఁ డంతన్, సురరిపు నాశము సెప్పుచు, సరినెత్తురు గురియుచున్న జలదము లోలెన్. భా. రా. యుద్ధ. 2077.

3 యుక్తముగా.

ద్వి. కరుణఁ దపోవృత్తిఁ గైకొని మీరు, సరిబ్రహ్మచర్యంబు చరియింపవలయు. రం. రా. బాలకాం. 86 పు. 22 పం.

4. అనుకూలముగా.

ద్వి తరుణులతోఁ గూడఁ దగిలి మా రాజు, సరి జలక్రీడలు సలుపుచున్నాడు. రం. రా. ఉ. కాం. 41. పు. 25 పం.

**సరి** అవ్య. అంగీకారార్థము (శ. ర.).

**సరించు** సం. అ. క్రి. 1. పోవు.

చం.... మిక్కుటముగఁ జంక వత్తిరిపెకూడ ధరించి సరించి వెంబడిన్. వై జ. 3. 64.

2. సంచరించు.

చం. ... నివ్వరియోగిరంబుతో, మసలు వెలుంగు రాచలుపమంటలఁగాల్ కలుకట్ల నంజాడున్, మెసవి సరింతుమేసరెం మేమయి పామిరొ వేఁట లాడుచున్. చంద్రాంగ. 2. 46.

**సరి(యి)ంచే** స. క్రి. సిద్ధము చేయు, అందించు.

శ్రీశ్రీ మేశ్వరు మహాదేవంకుం కెట్టిన అఖండవర్తిలిన్ లోహపుదివియ. 1. ది ... క్కకము వెయిసరింపం గలవారుం గా. దా. శా. 1006.

.... దీనికి నాచంద్రార్కకాకముం వెయిసరియింప్పం గ్గలవారు గా దా. శా. 1012.

**సరిక** సం. వి. అ. స్త్రీ. 1. పోవుట, సాగిపోవుట. 2. హింగుపత్రి యను ఓషధి (వ్య. వి.). నడచే చేన్న స్త్రీ. 4, నూటు పేటల హారము.

**సరికట్టు** అ క్రి. సరిదాఁకు, సరిపడు. (శ. ర.)

**సరికట్టు** వి సమానమైన మితి.

తే ఇవ్విధంబున నయ్యద్ధ జెవసినట్లు యుండియొక నాఁటి రేయిఁ బ్రచండ కుసుమ, కాండ ఖండవ మున సరికట్ల జెవఁగి, మస్తి బొందిరి తెమ్మెరల్ చూఱలాడ. శుక. 2. 69.

**సరిక (గ) దమే** అ. క్రి. 1. ముగియు, సమాప్తముగు.

వ. త్రిభువనానంద మాకంద వాటికా వసంతంబైన యవ్వృత్తాంతంబు సరికడచె శృం. నై. 7. 101.

కదచు, గతించు.

ఉగడ. బహుకల్పాంతంబులు నరిగడచిన, వంద్రెందే ఖుం చిన్ని ప్రాయమున. కాశీ. 6. 125.

వ. కల్పంబు లతిక్రమించి మన్వంతరంబులు జరిగి యుగంబులు సరికడచి వత్సరంబులు చని కాల చక్రంబు లతిక్రమించుచుండ. భీమ. 1. 81.

3. అతిక్రమించు, దాటు.

సీ. అతినిశ్చల ప్రసారిత పత్రంబులై, డిగుచు గాముని ముందటికిని గొంత, నరిగడవంగ దాటి మరలి పోరలుదెట్ట, గిలనొక్క కడ వంచి మలవు దిరిగి. ప్రభా. 2. 42.

4. మించు, అతిక్రమించు.

కం. మేలెట్ట దట్ట శోభన, కాలము సరిగడచెనేని గాదని కంతే కాలుడు కారుణ్యనము, న్మీలితమతి దనకుదావ నిలువంబడియెన్. భీమ. 4. 202.

నరిగ నరిగె, వి. 1. హారము. "ఇడల గ్రొవ్వెల మెడ పావ నరిగ" ఉ. హరి. 2 అ. 171.

2. జలతారు. "నరిగంచుకోక" (శ. ర.)

చం. నరిగ మెఱుంగుజంట కుఱునంబున జగ్గవ పిక్కటిల్ల మేల్, తరమగు కావిపింజియ పదంబుల జిందులు ద్రొక్క బచ్చకప్పురమున హెచ్చుకుంకుమ పుబ్బాత సుగంధము చోడుముట్ట, వాల్మి. 8. 180.

వ. తొడగినట్టి నరిగకంగుల కూరువుపని కప్పురు పరకాశియొంటి పొరలిగువు నిడుద కాసెల. ప్రబం. 1. 78.

సీ. గిలుకు మెట్టెలడాలు చలువకుచ్చెలలపై జాలు వాలంగారు నరిగగూర్చ. దశా. 2. 352.

లయగ్రాహి. బంగరపు చెక్కుల తెలంగు చవు కట్టువు మెఱుంగు బలుచక్కలపయిం గినిసి జంగల్, చంగువ గొవన్ నరిగరంగు గల కుట్టువసకంగుల గడల్కొనిన యాగి పయి. రాజవాహన. 2.89

చం. హరిహయు డిచ్చినన్ బిరుదు లందుట పాడి యె నీకు రంభనా, నరిగన దేశికుద్ధిబహు కారుల వాడగలావె యంచు వే, నరిగ మెఱుం గటంచు వగ చందురు కావి మెఱుంగు రంగుబంగరు నును గొంగు బట్టి సురకాంతల చెంతనె పంతమాడుచున్, వాల్మీకి. 3. 42.

నరిగంగలాడు అ. క్రి. అలుమగలు కొంగులు ముడి వైచికొని స్నానముచేయు.

తే. అరిది వ్రతముల నరిగంగలాడ. వసు. 6. 61.

నరిగంచు వి, √ నరిగ. (నరిగ + అంచు) జరి యంచు.

చం. హరువు కడానిమించు నరిగంచుల చీరచెఱంగు కుచ్చెలం, బెరయగ మంచి పొందళుకు మెట్టెల మట్టెలు ఘల్లుఘల్లనన్. ఇందు. 5.175.

సీ. నెఱిమించు నిరిగాంచు నరిగంచు నన్నంపు, చేల వాడు సుమాస్త్రశీలవాడు. ఇందు. 4. 22.

సీ. చల్వచేసిన పైడి నరిగంచు దోవతి చుంగు లొప్పుచు మేనిసొగసు చూప. వేంకటాచలమా. 1. 184.

సీ. జిగివెండి నరిగంచు చెంగావి వలువని కాంతింతు రెంతయు గట్టుకొనగ. రామ. 440,

వ. మేలి వలిపెనరిగంచువలువపై రాణి పేలువ మేలుమునుగిడి. ఉ. రా. 4. 174.

చం. తిలకపురంగుతో వలకదీప్తులు వెన్నుదురన్ నటింపగా, గలపపుదావి నల్లడల గమ్మవగన్ నరిగంచు చెల్వకుచ్చెల లపరంజి మెట్టియలు జీరగ నందెలు మ్రోయ పోయగం బొలుకగ వచ్చె నత్తటి రఘూత్తము చిత్తము తత్తఱింపగన్. ఉ. రా. 6. 161.

నరిగద్దియ వి. సమానపీఠము,

కం. పరిజనుల ననిపి నాథుని, పరిసరమున కేగి యతని వంపున మణిపింజరిత ధగద్ధగితం బగు, నరి గద్దియ నుండునట్టి సమయమునందున్. కాళ. 2.9.

నరిగస్తు (మహర్గస్తు) హిం. వి ఊరేగింపు. (శ.ర.).

నరిగె వి. (క. నరిగె. త. చరిగై.) 1. హారము. గొలుసు, కొప్పుగొలుసు.

ద్వి. ఇమపనేవళములు నిత్తడినరిగె. పండితా. పర్వ. 843.

పి. రతనాలకుప్పె సొరపుజడకుచ్చులు శశిపూల చందురుల్ నరిగెలు చెవులను బవిరెలు కమ్మలును. చెన్నబ. 2.207.

2. కాంతి, మెఱుఁగు.

కం. ఈసరి కౌనున కేసరి, కేసరి నెమ్మోము కలిమి కిం గల్వలసా, మేసరి, మే సరిగెకు మం,చే నరిచే నరసిజ ముఠుచేసరి సిరులన్. ముకుందవి. 2.188.

3. జలతారు, జరీ.

ద్వి. జిలుఁగులఁ దడియొత్తి చెంగావివన్నె, చలువ పావడలపై జాలువాసరిగె, కొంగుల నొప్పు దుకూలముల్ గట్టి. రం. రా. బాలకాం. 74 పు. 29 పం.

సీ పులితోలు సరిగ పూవులు హెచ్చుతిముఖాబు గొప్పతమానుగా నొప్పఁజేసి. పార్వ. 5.149.

సీ. సరిగెముత్యపు కుట్టు చంటిపై మెఱయ హరు వైన పైఠిణీయరచట్టదొడిగి. రఘు.

9. కలధౌత వస్త్రము, బంగారు బట్ట.

సీ. జోడువా సొమ్ములు సరిగెదువ్వలువలు హైమ మాణిక్య సింహాసనములు. ఉ. రా. 5. 267.

**పరిగొను** స. క్రి. సాటిగొను, లెక్కసేయు.

చం. వరుని నిజేశుమూలఁ బడవైచినయట్టి మరుత్తురంగముల్, సరిగొనకన్ జవంబు గొని సాఁగిన నాకుగమై సమీరు, డార్చి రహి నిరాదరాకృతి హరించెఁ బదోద్ధత ధూళిఁ గప్పి తత్పురి తురగోత్తంమంబులు విభూషిత సాదిబలోత్కరంబులై. విష్ణు. 1. 84.

2. చంపు, రూపుమాపు, ప్రతీకారము చేయు. లయవిభాతి ... సరిగొనఁగఁ గంటిన్ వరసుతున కిప్పుడను ... స్త్రీ. 1, 181.

**సరిగ్రుచ్చు** స. క్రి. వరుసగా కూర్చు, మాలికగాఁ గ్రుచ్చు.

ఉ. భూరివివేక చిత్తులకుఁ బోలు వసం దలఁపన్ దళంబులన్, సారభ మిచ్చు గంధవహుచందమునం బ్రకటంబుజేసి యిం,పారెడు పల్కులం బడయ వప్పలుకుల్ సరిగ్రుచ్చునట్లుగాఁ, జేరువ నేరఁగా వలయుఁ జేసెద నేఁ గృతియన్న వాకిఁకిన్. నిర్వ. 1. 5.

**సరిచూచు** స. క్రి. సంప్రతించు. పరిశీలించు.

**సరిచెప్పు** అ. క్రి. సమానమని చెప్పు.

గీ. నరకు నప్పట సరిచెప్పి యరగణాచు, చెడుగ రవుడొక్కయోరోరి పెట్టుకుక్క. వే. పంచతం. 1. 789.

**సరిచేయు** స. క్రి. నాశము చేయు, సమాప్తము చేయు.

ఉ చేరువచెట్టులెల్ల సరిసేసి నిశాటుఁడు భానుజా సరిత్తీరమహీరుహావకులు దెచ్చుఁ బయిన్ బడవైచు. ఉ. రా. 7. 185.

ద్వి. చెప్పు, కాచెద నేమి చేసె నాతండు, చెప్పు వేనియు సరిచేసెద మిట్లు, చెల్లునే. బస. పు. 164 పు. 12 పం.

2. చక్కఁబఱచు, బాగుచేయు.

3. సమానముగా నెంచు.

కం. .... దేవవిభుఁడు కృతఘ్నుం డని రోయక సరి చేసుక. చనునే మాటాడ రాత్రిచంఁ మూర్ధన్యా. దశా. 2. 421,

**సరిచేసికొను** స. క్రి. సమానునిగా నెంచు.

ద్వి. హంసకు లోనౌట కేమి కారణము, సంసారి నేటికి సరిచేసికొంటి. బస. పురా. 120 పు. 1 పం.

తే. ఒప్పునే యింకఁ గడపట నిప్పికాచి, నాకు సరి చేసికొని దేవలోక సభకుఁ నీవు, నూ నీవు నున్మని యేవిధమువ, గలహమాడెద నిది నీవె తలఁచిచూడు. కళా. 3. 229.

**సరిజోడు** వి. గజకవచము.

ద్వి. అరదముల్ వన్నుఁడు హరులఁ గట్టుండు, సరి జోళ్ళు వెట్టుఁడు సామజంబులకు .... రం. రా. ఉ. కాం 68. 1 పం,

**సరిపెంకణము** వి. నమస్కారవిశేషము.

రగడ. భానుమ్కస్థలిఁ దలకొను జగతీశ్వరునకు బెట్టెద సరిపెంకణ మని. హంస. 4. 213.

**సరితరము** వి. భూమిని సారమునుబట్టి తరగతులుగా నేర్పఱుచుట. (శ. ర.)

**సరికాళంపుమొన** వి. మల్లబంధ విశేషము.

వ. లోమొన వెలిమొన ... సరికాళంపు మొన యాదిగాఁ గల పదిరెండు మొనల నారితేరి. హంస. 1. 206.

వ. లోమొన వెలిమొన యుసిమొన చదురుమొన పుణ్యంపుమొన పావంపుమొన చాటడుగుమొన

దాఁటుడుగు మైన కేలుమైన యమీటుమైన వెంపీటుమైన సూత్రాంత్యమైన లావితాఁగల సరి రెండుమైనవు. ప్రబం. 1. 78.

**సరితూఁగు** అ. క్రి. సమానముగా తూఁగు. సమాన మగు.

ద్వి. ధరణీతలంబెల్ల దానితోఁ గూడ సరితూఁగ కునికి యాసరఁ జూపనుఁడు. ద్వి. 2. 49 పు.

"నాతో సరితూఁగ రమ్మ ..." రా. వి. 8 ఆ. (శ. ర.).

శా. పువ్వుం దీవెలఁ దూఁగు టుయ్యేలల నొంపుల్ నింపఁగాఁ దూఁగు న, వ్వువ్వుంబోఁడుల గబ్బి గుబ్బ వలిపెంబుల్ జాఱి వర్తింపఁగా, నవ్వేళన్ సరిదూఁగ రమ్మనుచు భూపారావభావాంచితం, గ్రొవ్వుల్ మీఱఁగ వేల్పుజవ్వనులకుం గొంగిచ్చిన ట్లొప్పెడిన్. రాజవాహన. ౬. 90.

**సరిత్తు** సం. వి. త్. స్త్రీ. 1. నది, ఏఱు, 2. దారము, సూత్రము.

**సరిత్పతి** సం. వి. ఇ. పుం. సముద్రుఁడు,

**సరిత్సుతుఁడు** సం. వి. అ. పుం. భీష్ముఁడు.

**సరిదాఁకు** అ. క్రి. (సరి + తాఁకు) 1. సరికట్టు, దృష్టాంతమగు.

"మును చెప్పినట్టి కతలున్ దలపోయ ... ర్థముల్ మనం, బున సరిదాఁకె వాకు ..." కళా. 2. ఆ. (శ. ర.).

కం. కలువలు కిలకిల నవ్వెన్, తొలిమల సెలయేటి యవలితుహినాంశుకరం, బులు గని యపుడేఁటావలి గిలిగింతలటుంట వానికిన్ సరిదాఁకెన్. సారంగ. 2. 162.

కం. ఆ మాటలు సరిదాఁకెఁ గ, దా మా కివి ... త్సవాతిశయంబునన్ శ్రేమమునఁ జూడఁ గల్గెను కళా. 8. 206.

తే కిన్నరవిహంగయుగళిచే మున్ను విన్న, పన్నగా పన్న శుభదప్రసన్న ఫణితి, మదికి సరిదాఁక ముద మునఁ బొదలి మేది. నీవతి హితాగ్రణిని ద్రోవఁ జూపు మనుడు. వసు. 2. 57.

వ. ఇందు నీ వొసంగిన యర్థం బెల్ల సరిదాఁకును గదా కళా. 2. 59.

2. దెబ్బతిను.

ద్వి. పులిచేత బడి వ్రేటువడిన, కరివైరి విధమున గరభంబు చేత, సరిదాఁకు వడి కుంజరము చంద మున. రం. రా. ఉ. కాం. 87 పు. 6 పం.

**సరిదీర్చు** స. క్రి. యుక్తముగాఁ బరిష్కరించు;

మ ... భుక్తిక్రియో, జ్జ్వలులై రే హరిణాల్పువన్ వివిధ లాస్య స్ఫర్ధి సుభ్రూభ్రుకుం, సులవాదుల్ సరిదీర్చి. ఆము. 4. 86.

**సరిద్వంతుఁడు** సం. వి త్. పుం. సముద్రుఁడు.

**సరిద్వర** సం. వి ఆ. స్త్రీ నదులలో శ్రేష్ఠమైనది, గంగానది.

**సరిపడు** అ. క్రి. 1. అనుకూలమగు. 2. యుక్తమగు. 3. సమానమగు.

కం పురకాంతల కొమలకున్, సరిపడదని బ్రహ్మ యాకసము వారని వే, సరి దానిఁ గుండలించిన, సర ణిన్ దివి ముట్టి యచటి సాలం బలరున్. చంద్రాంగ. 1. 30.

కం. కటుకునను మెండుతగరులు, చటులాటోపము న రెండు సరిపడఁ బోరెన్. క్రీడా. 1. 229.

ఉ. ... చేవడి వీణె మీటుటలు చిక్కొడలించుటలున్ సరింబడన్. శ. ర. ఆము. 1. 62. (ఇట సరిఁబడు అను రూపము కనవచ్చుచున్నది.)

**సరిపణి** ద్వ్య. వి. (సరి + పెన) 1. గొలుసు, (రూ. (సరివణి, సరిపెణ)

ఉ. సారెకుఁ గీరముల్ ఫలరసాలము శాఖలలోనఁ ద్రిమ్మరం, గా రహిఁ దన్మధూళికకుఁగా నళిపఙ్క్తులు వెంటఁ గ్రుమ్మరం, గా రొద మించె నందుఁ జిలుక ల్వివ లక్ష్మియుఁ దద్వచస్సుధాం, ధోరుచు లానఁగా సరిపణుల్ జను లట్లిడి పెంపఁగాఁ బలెన్ ఆము. 5. 140.

2. బంగారులోనగువాని గొలుసు.

చం. విరిసరి వేవలిన్ గళభువిన్ మణివల్లరి యంఘ్రి వజ్రపున్, సరిపణి నాద్రిలోకి యను చావకుఁ దా నొక నీటువెట్టునం, జగతటినీవతంస మిది పావన మూర్తిగతిం ద్రిధావరి, స్ఫురణముఁ బూనుకొన్న

విధమున్ వివరించెద నీకు రాఘవా! చంపూరా. 8. 9.

**సరిపుచ్చు** స. క్రి. (√సరిపోవు) 1. నాశము చేయు.

సీ. చీడపుర్వొకచెంతఁ జేనిపై సోఁకిన సరిపుచ్చి వైచును సస్యమంత. రామ. శ. 100.

2. సరిపోవునట్లు చేయు.

కం. అని మాటమాట సరిపుచ్చిన వంచకుఁ డెఱిఁగి యతని చేతికిఁ దులని చ్చె నతండును దాఁచిన తత్తనయుఁ గృతఘ్నునకు సమ్మదంబున నిచ్చెన్. వేం. పంచతం. 1. 790.

**సరిపుచ్చుకొను** స. క్రి. (సరిపోవు) ఋజువు పఱుచుకొను, శాస్త్రార్థనిర్ణయంచేకొను.

వ. తన్మాతలు పూర్వకాలంబునఁ దమ మామ పలికిన చతురాగమసంతాన శబ్దంబునకు నర్థంబు వీరయని తమలో దారు సరిపుచ్చుకొని. కళా. 6. 151.

వ. అవ్వనితయు నతండు పూర్వజన్మంబున మణికంధరుం డను గంధర్వ కుమారుండగుటఁ దాను నెఱింగినది గావున నతనికి వట్టివీణె గలుగుట సంభవించునది యని మనంబునకు సరిపుచ్చుకొని సంతసిల్లె. కళా. 7. 280.

**సరిపురుషుఁడు** వి. వి. అధికుఁడును హీనుఁడును గాని పురుషుఁడు.

కం. కులమున నధికుం డొండెను, గుణమున సరిపురుషుఁ డొండె గుణయుత లగు కన్యలఁ బెండ్లియాడు టుచితము, కులహీనుఁడు కులజఁ జేసికొనఁ జనఁ డెందున్. విజ్ఞా. ఆచా. కాం. 91.

**సరిపెట్టు** (√సరి²) స. క్రి. నాశము చేయు, చంపు.

ఉ. రాముని పేరి బాణముల రాక్షస నాయకు మీద నార్చియా, రామచెలంగి వైచిన నరాతి భయంకరమై కణంకతో, వేమఱుఁ బోయి దానవుని వీండ్లొగిఁ ద్రుంచి కిరీట పంక్తులన్, భీమము మీఁఱ దుల్చి సరిపెట్టెఁ దదీయశరీర తేజమున్. సీతా. 4. 89.

సీ. కరటితో సరిపెట్టెఁ గటికి కౌఁగిట ముగ్గనదిమి మహోదరు నగ్నిసుతుఁడు. రామా. 8. 165.

**సరిపెణ (ము)** వి. (రూ. సరిపెన) 1. సరిపణి, గొలుసు.

వ. అంకుశపుటలుగుల త్రికోణ కుంభములు కులుగ తకులు కొనిన యినుప సరిపెణల పెనకువ గలయిట్టి కొమ్ము సింగోటుల గుప్పుడులను, ప్రబం. 1. 78.

వ. పెనురొదలు పొదల మెదలుకొదమతుమ్మెదల పదువు లినుప సరిపెణల పెనుపునఁ బనుపఱచుచుఁ గనుపట్టె. కళా. 6. 224.

2. కుక్కల మెడలకు కట్టు గొలుసు, ఇనుప గొలుసు.

గీ. సరిపెణఁ బట్టితెచ్చిరి జాగిలముల. మను. 4. 81.

సీ. వడిగాలి వడి నిల్వ వనపోక బలితంపు సరిపెణల్ దునియ వేసరక నిగుడు. శుక. 1. 170.

సీ. జాగిలాల పసిండి సరిపెణల్పడలించి పట్టెడల్గు యు ముడిగట్టువారు. చంద్ర. 2. 55.

3 బంగారు లోనగువాని గొలుసు, లలంతిక,

సీ. అనిలన టోత్క నాట్య క్రీడఁ దగు లతాలింబోష్ఠులకు సరిపెణ లొసంగె. అని. 1. 41.

తే. చిలికి చౌకట్టు సరిపెణల్ టకమెసంగు, నుంగరంబులు. శుక. 2. 210.

సరిపెణ లాలక్తము పూఁత కాటుక తిలకంబు. దశకు. 8. 77.

చం...రఘుపుంగవు నేతువు చూడుమో మునీశ్వర కులచంద్ర యీ జలధి కై వలినీపతి యచ్చొగెంపురా, సరిపెణ మేననీటు గన బందెపువాటుగ వైచెనో యనన్. వాల్మీకి, 2. 8.

కం. వికసించు తమ్మిమందు మధుకరావళి వెడలె వెలుఁగుదొరఁ గనఁగా సారకలావంతుడు మును గొంచక ద్రిమ్మంగి వెడల్చు నిమువ సరిపెణ మనఁగన్. రాజవాహన 3. 80.

సీ. ఇవికాటుకొల్పిన వృద్ధకూర్మము వీఁపు చిప్పైన నెఱచిక్కె చింపఁ జాలు. తే. గీ. ననఁగ ఘర్ఘరగళగర్తజనిత భూరి, భూభృదురుబిలభరిత భా భా భయంకరారభటీ దీర్ఘ దిగ్భిత్తు లగుచుఁ, జెలఁగె సరిపెణలఁబట్టి తెచ్చిన జాగిలములు. మను. 4. 81.

4. ఆభరణ విశేషము.

ఉత్సాహాయుక్తిశతి. పరిపెణలు ముత్తియంపు ముంగరలు కాళ్ళ తకములు దాల్చి పన్నిట పదము మించు, చందన మలంది రంతట సంతసమున. ప్రబం. 1. 278.

సీ. ...నును వెడందయురంబునను జేరి పరిపెణల్ మిన్న జన్నిదముతో మేలగొనంగ...దశా. 7. 27.

సీ. బొగడలు వామున గ్రోవులు తీగె మెడనూలు కుతికంటు పరిపెణ గుండ్ల పేరు. హంస. 2. 190.

పరిపెణి — పరివణి వి. బంగారు తోవగువాని గొలుసు.

సీ. మగరాల మొగముట్టు నిగనిగల్ వెలయార్చు హురుమంజి ముత్తెంపు పరిపెణీలు, చంద్రాంగ. 2. 69.

పరిపెన — పరివణి వి. బంగారు గొలుసు.

గీ. అనుచుం బచ్చల కడియముల్ హారతతులు, తాళి చౌకట్లు జాళువా తగటుపాగ, బంగరు మెఱుంగు నేలువు లుంగరములు, పరిపెనల్ చాలనొసంగె సజ్జనవరుండు. ఇందు. 1. 85.

పరి(వో)పోలు (√ పరి[1]). అ. క్రి. సాటియగు. పోలు.

ఉ. నాకులభీకర దానవ గణంబులతో పరిపోలు వారె కకు. 5. 45.

తే. కాక పరిపోలంజాలునే కమలభైరి యవధి గత దోషమైన యాయతివమొగము. శృం. నై. 8. 181.

పరిపోల్చు వ. క్రి. (పరిపోలు) సాటిచేయు.

సీ. ఒర్పుమై నుప్పిండి నుపవాన ముండనీ, మగవాని పరిపోల్పంగదగదు విధవ. కాశీ. 288.

తే. ఇతర తీర్థంబు పరిపోల్ప నెట్లువచ్చు, దక్షవాటంబునకు మహాస్థానమునకు. భీమ. 8, 129.

పరిపోవు అ. క్రి. (√ పరి[1]) సమాపమగు.

వ. ... పెద్దలం జెనకి యోడియు పరియైతి ననియు పరిపోయి జయించితి ననియు పలర్థంబు లాడి అము. 6. 68.

2. సమ్మతమగు, అనుకూలమగు.

ఛం. ఘనమున కొండు రెండు మఱుమంత్రములన్ పరిపోవం జెప్పినన్. అము. 4. 265.

మ....ఇతండు దోర్లీలాసముల్లాసతం, జనుదేర న్మన మేగి విందులగతిన్ సంధించుచే కార్య మి,ప్పని నాకున్ పరిపోదు మీకు రుచియింపం బోలు నిప్పట్టునన్. శుక. 3. 364.

3. పరిపడు, కుదురు.

కం. ధరలోం గ్రియాన్వయంబుల పరిపోనిద పూర్ణమనంగ నమ్మతి కెక్కున్. వసచరి. 4. 72.

ఉ. ఓ! పరిపోయె నిశ్చెదలకుం దన యోవను రాజి వానిగాం, జేసితొ తొత్తులం బనులు సేయంగ నిచ్చినం బోలదంటనే, వానికి బోర నమ్మం గడవం బనిపాటులు సేయు వార లే,రి మరం ద్రావి మైమఱచి ప్రేలెదు కంటివా పట్టుకొంటివో ! (అ శేవణమున వ్యక్తిరేకార్థద్యోతకము) వేం. పంచతం. 1. 266.

4. పర్యాప్తమగు, చాలియుండు, సరిపడు.

ఉ....ఇ ఖాన్ముగ కొంటికాం,గా పరిపోవ దేకరణిం గాంతకు దంతపుంబావ లిత్తు నం, దాసను గ్రుమ్మరన్ ... దశా. 3. 199.

5. వశించే.

తే. ఇది యెఱుంగక యున్న నా కేమి కొదవ? నీకు దెలియక యుండుట నీతిగాదు, చేర వరు వేండు మిమ్మాటం జెప్పకున్నం, జత్తు పరిపోదు నసుము నిస్సంశయముగ. శుక. 3. 270.

ఉ. ఈతండు పద్మతీర్థమున కేగి యొకనొక నాండు తత్పయో,ధాత నిజాంగుండై చనుకతంబున విప్రవధాదిపాతక, ప్రాతము దొంటి పుట్టుపులం బ్రాప్తములైన యమంబులున్ మరు, ద్ధూతఘనాఘనావలులతో పరిమై పరిపోయె నన్నియున్. పాండురంగ. 5. 84.

ఆ. విగియంబట్టి యందు బెణంక నీకడిగెనే, యర్థమిందుం గలదొ యనుతలపున, జేడియ కదియుం జత్తు పరిపోదు మాట ప,ట్టీక చెప్పవనుచు వీంక మండె. ప్రభా. 4. 9.

పరిప్రొద్దు — అర్ధరాత్రము.

కం. పరిప్రొద్దున నరుదెంచితి, వరుణోదయ సమయమెట్టుల యెక్కు దురంత, స్మరమాయాంధుండు గావున

నరశే విప్రుండు త్ర్యయామం బనియెన్. వేం. పంచతం. 4. 288.

కం. అది కడుపు కొలఁదియును దిని సదనమునకు మగిడి వచ్చు పరిప్రొద్దున నిట్లద వఁసి యరుగఁ దిరుగం, బొదిచెడియెం బైరు కొన్ని పూఁటలు చనియెన్. వేం. పంచతం. 8. 46.

తే. గీ. దండు నులభంబె పురుషవేదండులకును, గూచిఁ గావింప గుండియల్ గుబ్బురవఁగ, దిగివదివ నంబు పరిప్రొద్దు దిరువేళ, కోదనాదరదూరులై యుండు టరుదె?" రాజవాహన. 2. 68.

వ. నృత్తగీతవాద్యంబులు ప్రవర్తిల్ల పరిప్రొద్దు పోవునంతాక జాగరంబు చేసి. కాశీ. 4. 120.

ఉ. .... అ,రానుతు దీప్తిరోదనవివారము వీనులఁ బడ్డఁ గానలో నీపరిప్రొద్దు పోవునెడ నెవ్వఁడొకో విలపించుచుండెడున్. సారంగ. 8. 179.

**పరిఫేషు** (హిం. సర్ పేచ్) వి. (చంద్రవంక వలె నుండు) శిరోభూషావిశేషము. (రూ. పర్పేశు. పరిపేసు.)

సీ. చెలువైనకళ లీనఁగల చిన్ని నెలకూన పృథుల వజ్రవు పరిఫేషుగాఁగ. మృత్యుంజయ. 8. 20.

**పరిభిత్తరము** వి. మల్లవిద్యావిశేషము.

వ. ఊరూడింపును పరిభిత్తరంబును లాగును,వింటాణంబును, తిడిఁగియు. మల్లుపురా. 8. 69.

వ. పక్కి ఝుడింపు పరిభిత్తరంబును లాగు వృసింహంబును నాదియగు ముప్పది రెండు విన్నాణంబుల నాణెంబు పరీక్షించి హంస. 1. 206.

వ. డొక్కర ముత్తం డొక్కర కుమ్మరింపు కోడింపు సందు సీసంబును కొతుమారును నమసీన మ్మును చేబయు కందవంబును కర్ణనంబును తొట్ట మకిల్లియు బలిబడుటయు రొండివేటును పణంబును కర్నాటును భారంబును బొంగణయు పెట్లాగును రూడింపును పరిభిత్తరంబును లాగును విటాలంబును ప్రబం. 1. 78.

**పరిబేసులు** వి. బాలక్రీడా విశేషము.

సీ. ఆమడ పరిబేసులాడి పోవిడిచిన ముదురు వెదుళ్ళలో ముత్తియములు. యయా. 1. 47.

తే. గుళ్ళుబాఁగిలి ప్రుచ్చులు గోడిపట్టె, తేలపాటలు పరిబేసు లీలకూత, లాడిగా త్రైశవక్రీడ లాడి రచట, రామకృష్ణులు గోపదారకులఁ గూడి. వి. పు. 7. 203.

సీ. పెంచుల జేరి దోపిళ్ళు గాలిపటంబు పరిచేసి పుట చెండు బాకిమూట. హంస. 8. 146.

సీ. ఆడాడ పరిబేసులాడి పో విడిచిన ముదురు వెదుళ్ళలో ముత్తియములు. యయా. 1. 47.

**పరి(రి)మ** సం. వి. న. పుం. 1. పదక, ప్రాకుట. 2 గాలి.

**పరిమాయు** అ. క్రి. విషమమగు, చెడు.

సీ. తవరు ప్రామినుకు ఔఁదలజాట పరిమాయ ఖాన్కారమధ్యంబు పాడువడఁగ. చంద్రాంగ. 1. 18.

**పరిమిన్ను** ఆకాశమధ్యము.

సీ. ఆటలేని వెఱిది ప్తి మెఱుఁగెక్కి పరిమింట జరియించు సంపూర్ణచంద్రుకంబు. భా. రా. అర. 185.

**పరియ** వి. 1. సందు. 2. రంధ్రము.

సీ. పరియ యనఁ గండి యనఁగను ... రంధ్రమదరు. ఆం. భా. 1. 145.

8. దంతముల సందు.

కం. హారివర పీతస్థితిఁ గల, పరియము జట్టైలుక బాఁగె పంవర్ధహాతిన్, దెరలి మృకండూశ్చవుడా, తురతం దజ్జఠరపేటిఁ దూటినభాతిన్. పాండురంగ. 2. 245.

వ. వీఁదు పెనుముండ్లఁ బండ్ల పరియలు నెఱియలు వాటి .. మను. 4. 60.

**పరియగు** (√పరి²) 1. నశించు.

(వ్యు) "ఈపవని పరి=ఈ పని సమాప్తము.

చం. పరియగు నిట్టివెట్టలను పర్వము పంచు. ఆము. 2. 47.

2. సమాపమగు.

సీ. పరియయ్యెఁ గాదు నిశ్చలమైన జిగి పొప్పు కాంత యూరులకోడఁ గరభయుగము.

**సరియించు** స. క్రి. = సరించు. అభ్యుదయదీక్షకు సూచె సిద్ధము చేయు.

**సరియు** సరుసు స. క్రి. సమముగాఁ బంచు.

కం. తలిదండ్రులు గడియించిన, ములుగుఁటలో వి త్తమెల్ల ముందటఁ గొఱకై, వలపునను సరిని పెట్టుచు, చెలిమి మెయి న్మఱఁగె నొక్క యాడిగరానిన్. భల్లా. 1. (శ. ర.).

(చూ మఱఁగు)

**సరిలము** సం. వి. అ. న. సలిలము.

**సరివచ్చు** ద్వి. అ. క్రి. పాటియగు.

తే. ఆద్యులై పేరుగలుగు పదార్థు ౘవనివరుల యాగంబులకు సరివచ్చు మిగులఁ గాని. భార. అశ్వ 4. 117.

సీ. నలినాక్షి యైరావణంబు కుంభముతో సరి వచ్చు నీ గుబ్బచన్నుదోయి. కాశీ. 5. 288.

ఉ. అక్కట మీ కుటీర నిలయంబులకున్ సరి రాక పోయెనే, యిక్కడి రత్నకందరములు. మను. 2. 60.

సీ. సరివచ్చు ననవచ్చు శతమన్యు వీటికి వివిధ దేవాగార విభ్రమమున. భీమ. 1. 106.

కం. సరివచ్చు నీతిభూతిని, తరణంబులఁ దిమ్మ ధరణీధవ నందనుఁ డీ, శ్వరుఁడు యుగంధర శిఖరి, ధరకంధరములకు నని జనంబు నుతింపన్. వరాహ. 1. 32.

**సరిపాటు** వి. (సరి+పాటు) సమభాగము. చెఱిసగము.

సీ. సరిపాటుగాఁగఁ గేసరములు గ్రుచ్చిన కురువింద విరిగుబ్బసరులతోడ. కళా. 3. 204.

**సరివాఁడు** వి. పు. సమానుఁడు, తుల్యుఁడు.

మ. .... కంసారితో బోరిలో, సరివాఁడై యరి మీకుఁ జెట్టుట జరాసంధుండు సైరించునే? ఉ. హరి. 4. 122.

2. తనవారు.

మహాస్రగ్ధర. సరివాండ్రం గూడి యాడెజ్జనవర సుతుఁ డాకై శవక్రీడయందున్. ఇందు. 2.18.

**సరిషపము** (సర్షపము) సం. వి. అ. పుం. ఆవాలు,

**సరిసరి** అవ్య. బాగుబాగు,

సీ. సరిసరి బలు పెల్లు సడలెనో యిపుడను భామినీ మణి నెట్టఁబాటి చూచి. రసి, 5.160.

**సరిసరి** వి. సర్వవిధముల సమత్వము.

సీ. పెక్కం డ్రవలుకుల నిక్కంబు గొనువది పొసఁగఁగ సరిసరిఁ బుట్టెనేని ధర్మమనిరి ధర్మజ్ఞులైన మహాత్ము లెల్ల. విజ్ఞా. వ్య. కాం 108.

కం. సరిగా నొండొరువులతోఁ బరుసపుఁ బెనఁకువలు పెనఁగి పాడికి ధరణీ, శ్వరుసభకు వచ్చి రేనియు, సరిసరి దండంబు గొనుట సద్ధర్మ మగున్. విజ్ఞా. ప్రా. కాం. 120.

**సరిసర్లు** వి. బ. శూద్రులలో నొకజాతివారు.

వ. అందుఁ (శూద్రవంశంబునందు) బద్మ నాయకులన వెలమ లన గమ్మ లన సరిసర్లన వంటర్లన బహుప్రకార శాఖోపశాఖాభిన్నంబులైన మార్గంబులను. భీమ. 1. 81.

**సరిసేయు** (√ సరి[1]). స. క్రి. 1. సమానము చేయు.

తే. .... మగుడ నేచి పొరఁబెరు, నెడల సరిసేయ నగు తఱపీక హత్తు. భార. విరా. 2. 15.

2. పోల్చు, ఉపమించు.

సీ. జల్లిమాటలు గాక సరిచేయవచ్చునే సవరంబులీ శిరోజాతములకు. హంస. 1. 210.

**సరిహద్దు** వి. పొలిమేఱ.

**సరీసృపము** సం. వి. అ. పుం. పాము.

**సరుగు** అ. క్రి. వర్ధిల్లు, పెరుఁగు,

రగడ. సరిగె నానా లతా జాలములు సాలములు జరదళులనొప్పె నాచాలములు నీలములు. రాఘ. 2. 6.

**సరుడు** వి. గఱి లేని సరము. బాణము.

ద్వి సరుడులు వంకిలు జముదాళ్లఁ జాల, సరుదుగా మెఱయ జంద్రాయుధంబులును. సారంగ. 1. 9 వు. 4 వం.

తే. పురుడు వాఁడుప్పఁగా రానిసరుడు వాని, నలుగువారల బరిమార్చు నలుగు వానిఁ, బలుగు వార్వపు పెక్కుడు గలుగువాని, మేలు వాటిల మిము నెంతు మేలువాని. చంద్రాంగ. 1. 84.

**సరుడు** వి. 1. ఎల్ల, మేర. సరిహద్దు. 2. వెల్లువ, వఱద.

సరుదు స. క్రి. సమముగా విభజించు.

తే. చలిది యతఁ డంద అకుమరా సరిదిపెట్టు నది తలా యొక ముద్దేఁడు నాఁగించి. పర. 4. ౨౫౮.

సరుదుకొను స. క్రి. సవరించుకొను.

సీ. సొగసుగాఁ బూదండ జోఁపిన కీల్గొప్పు జాఱఁగా నొకచేత సరుదుకొనుచు. వీథి నాటకము. 26 పం.

సరుపు హిం. వి. (రూ. సరుగు) ఒక విదేశపు చెట్టు (వృ. వి.) (శ. ర.).

సరువు సం. విశే. పలుచని, సున్నితమైన, చిన్నదైన.

సరువు సం. వి. ఉ. పుం. కత్తిపీట.

సరూపత సం. వి. ఆ. స్త్రీ. 1. పోలిక, సాదృశ్యము. 2. సారూప్యము అనెడు మోక్ష దశావిశేషము.

సరూపము సం. విశే. 1. సమాన రూపము గలది. 2. పోలినది, సదృశమైనది.

సరె సరియ వి. సందు.

చం...నివ్వరియోగిఁంబుతో, మసలు వెలుంగురా చలువమంటలఁ గాల్ కఱకుట్లనంజుడుల్, మెసవి సరిఁతుమే సరెల మేమయి సామిరో వేఁటలాడుచున్. చంద్రాంగ. 2. 46.

సరేసు వి. ఒక దినుసు బంక (దీనిని వజ్రమందురు) (శ. ర.)

సరోజము సం. వి. అ. న. తామర, కమలము.

సరోజిని సం. వి. ఈ. స్త్రీ. 1. పద్మము 2. తామర కొలను. 3. పద్మలత. 4. పద్మ సమూహము.

సరోత్సవము సం. వి. అ. పుం. కొంగ.

సరోరుహము సం. వి. అ. న తామర, పద్మము.

సరోవరము సం. వి. అ. న. సరస్సు, కొలను.

సరోషము సం. విశే. 1. రోషముతోఁ గూడినది. 2. క్రుద్ధము.

సర్కము సం. వి. అ. పుం. 1. వాయువు. 2, మనస్సు

సర్కారు హిం. వి. ప్రభుత్వము.

సర్కాఋటు ... వి ... ము, ... ట.

సర్గక్రమము సం. వి. అ. పుం. సృష్టి యొక్క విధానము.

సర్గబంధము సం. వి. అ. పుం. పెక్కు సర్గములు గల కావ్యము, మహాకావ్యము. "సర్గబంధో మహాకావ్యమ్" సా. ద.

సర్గము సం. వి. అ. పుం. 1. త్యజించుట, విడుచుట. 2. సృష్టి. 3. ప్రపంచోత్పత్తి. 4. ప్రకృతి, విశ్వము. 5. సహజగుణము, స్వభావము. 6. నిశ్చయము, నిర్ణయము, 7. అంగీకారము, ఒప్పుదల. 8. అధ్యాయము, గ్రంథ మందలి భాగము 9. ఉద్యమము, ఉత్సాహము, పురోగమనము, 10. విసర్జనము (మలాదుల యొక్క). 11. మోహము మూర్ఛ. 12. (వైదికము) అశ్వము.

సర్గుఁడు సం. వి. అ. పుం. శివుఁడు.

సర్జకము సం. వి. అ. పుం. 1. జీవకము అను గంధ ద్రవ్యము. 2. వేఁగిస, సాలము (వృ. వి.).

సర్జనము సం. వి. అ. పుం. 1. విసర్జించుట 2. విడుదల చేయుట, 3. సృష్టించుట. 4. మలాదులను విడుచుట. 5. సేనాపృష్ఠభాగము.

సర్జము సం. వి. అ. పుం. 1. సాలము, మద్ది (వృ. వి.). 2. సాలవృక్ష నిర్యాసము. 3. కలపకు పనికి వచ్చు ఒక విధమైన చెట్టు (వృ. వి.).

సర్జరసము సం. వి. అ. పుం. 1. యక్షధూపము. 2. వాద్యభాండ విశేషము (శ. ర.).

సర్జి(కా) సం. వి. ఇ. ఈ. ఆ. స్త్రీ. సరోవర తీరము లందు లభించు నొకవిధమైన లవణము (Natron).

సర్జికాక్షారము సం. వి. అ. పుం. సజ్జాకారము. (శ. ర.).

సర్జువు సం వి. ఉ పుం. వర్తకుడు, వ్యాపారి,

సర్జువు సం. వి ఉ. స్త్రీ 1. మెఱుపు. విద్యుల్లత. 2. కంఠహారము. 3. పోవుట, వెడలించుట,

సర్జ్యము సం. వి. అ. పుం. సాల వృక్ష నిర్యాసము.

సర్దు వి. సరుదు.

సర్పచ్ఛత్రము సం. వి. అ. న. కుక్కగొడుగు.

సర్పణము సం. వి. అ. న. 1. ప్రాకుట, జారుట. 2. వక్రగమనము, మెలికలుగా నడచుట. 3. భూమికి సమాంతరమైన బాణప్రసరణము.

సర్పతృణము సం. వి. అ. పుం. ముంగిస.

సర్పధారకుఁడు సం. వి. అ. పుం. పాములవాఁడు.

సర్పభుక్కు సం. వి. క్. పుం. 1. నెమలి. 2. కొంగ 3. పెద్దపాము.

సర్పమణి సం. వి. ఇ. పుం. పాము పడగపై నుండు మణి.

సర్పము సం. వి. అ. పుం. పాము. 2. వక్రగమనము. 3. జాఱుట ప్రాకుట, 4. ప్రవహించుట. ఆశ్లేషా నక్షత్ర కూటము. 6. ఒక మ్లేచ్ఛజాతి.

సర్పవిత్తు సం. వి. ద్. పుం. పాములవాఁడు, పాముల మంత్రగాఁడు,

సర్పశిరము సం. వి. స్. పుం. అభినయ హస్త విశేషము.

సర్పసత్రము సం. వి. అ. న. సర్పయాగము.

సర్పహము సం. వి. న్. పుం. ముంగిస.

సర్పహుఁడు సం. వి. న్. పుం. గరుడుఁడు.

సర్పాంకుశము వి. మల్లబంధ విశేషము.

వ. తోలి త్తరి వెలిబి త్తరి సర్పాంకుశంబును అల్లి మత్తును మల్లు పురా. 3.69.

సర్పారాతి సం. వి. ఇ. పుం. 1. గరుడుఁడు. 2. నెమలి. 3. ముంగిస.

సర్పారి సం. వి. ఇ. పుం. — సర్పారాతి.

సర్పావాసము సం. వి. అ. న. గంధపుచెట్టు.

సర్పాశనము సం. వి. అ. పుం. నెమలి,

సర్పి సం. విశే. న్. 1. ప్రాకునది. 2. జాఱునది. 2. మెలికలుగాఁ బోవునది, వంకరగా నడచునది. 3. కదలునది, నడచునది.

సర్పి సం. వి. స్. న. నేయి.

సర్పి (దేశ్య.) ఒక విధమైన చర్మవ్యాధి.

సర్పిణి సం. వి. ఈ. స్త్రీ. 1. ఆడుపాము. 2. ఒక ఔషధి (వృ. వి.).

సర్పిష్మంతము సం. విశే. త్. నేతితోఁ దయారు చేయఁబడినది, నేయి కలది.

సర్పెన — సరిపణి వి. బంగారు లోనగువాని గొలుసు,

సీ. .... ఓటిలు గంధముతోడి జీని సర్పెన చిక్కు మిసిమిదువ్వటి దోఁచు పసపుకొక్కు. భోజసుతా. 1. 89.

సర్పేశ్వరుఁడు సం. వి. అ పుం. వాసుకి, నాగరాజు.

సర్పేష్టము సం. వి. అ. న. గంధపు చెట్టు.

సర్మము సం. అ. పుం. 1. వెళ్ళుట. చలనము. 2. ఆకాశము. 3. స్వర్గము. న. న్. సౌఖ్యము.

సర్త్రశి సం. వి. అ. స్త్రీ బాలెంత కిచ్చెడు మందు, కాయము (శ. ర).

సర్వంకషము సం. విశే. (అ. ఆ. అ.). 1. సర్వమును నాశనము చేయునది. 2. సర్వశక్తి మంతము.

సర్వంకషుఁడు సం. వి. అ. పుం. 1. దుష్టుఁడు. 2. కుటిలుఁడు. 3. దుర్జనుఁడు.

సర్వంసహ సం. వి. ఆ. స్త్రీ. అన్నింటిని మోయునది, భూమి.

సర్వకము సం. విశే. 1. అంతయు, అన్నియు. 2. మొత్తము, పూర్తి.

సర్వకరు(ర్మ)ఁడు సం. వి అ. (న్). పుం. శివుఁడు,

సర్వకర్మీణము సం. విశే. అన్ని పనులను చేయునది.

సర్వకాలీనము సం. విశే. 1. అన్ని కాలములందు ఉండునది. 2. శాశ్వతమైనది.

సర్వకేశి సం. వి. న్. పుం. 1. నటుఁడు. 2. అభినేత.

సర్వగ సం. వి ఆ. స్త్రీ. ప్రియంగు వృక్షము (వృ. వి.)

సర్వగము అంతట నిండి యున్నది, అంతట వ్యాపించినది. వి. అ. న. 1. బ్రహ్మము 2. పరమాత్మ, 3. ఆత్మ,

సర్వజనీనము సం. విశే. 1. ఎల్లరకుఁ దెలిసినది. 2. ప్రఖ్యాతము, ప్రసిద్ధము. 3, ఎల్లరకు హితమైనది.

**సర్వజిత్తు** సం. విశే. ల్. 1. సర్వమును జయించువది. 2. అప్రతిమానము

**సర్వజిత్తు** సం వి. ల్. పుం. ఒక సంవత్సరము పేరు

**సర్వజ్ఞుఁడు** సం వి. అ. పుం. 1. అన్నియుఁ దెలిసినవాఁడు. 2. శివుఁడు 3. బుద్ధుఁడు, 4. పరమాత్ముఁడు.

**సర్వతః** సం. అవ్య. 1. అన్ని దిక్కుల నుండి. 2. అంతట, అన్ని దిక్కులందు. 3. పూర్తిగా అంతయు,

**సర్వతశ్శుభ** సం. వి. అ. స్త్రీ. ప్రియంగు వృక్షము (వృ. వి.).

**సర్వతోగామి** సం. విశే. 1. అంతటను సంచరించువది. 2. ఎచ్చటికైనను పోఁగలది,

**సర్వతోభద్ర** సం వి. అ. స్త్రీ. వర్తకి, నటి.

**సర్వతోభద్రము** సం. వి. అ. పుం. 1. విష్ణుదేవుని రథము. 2. వెదురు, కీచకము. 3. పద్య బంధ విశేషము. 4. నాల్గు దిక్కులందు ద్వారములు గల భవనము. 5. నింబవృక్షము. 6. సేనావ్యూహ విశేషము

**సర్వతోముఖము** సం. విశే. 1. అన్ని విధములయినది. 2. అపరిమితమైనది. 3. సంపూర్ణమైనది.

**సర్వతోముఖము** సం. వి అ. పుం. 1. ఆత్మ చైతన్యము. 2. స్వర్గము, వి. అ. న. 1. జలము 2. ఆకాశము.

**సర్వతోముఖుఁడు** సం. వి. అ. పుం. 1. బ్రహ్మ. 2. శివుఁడు. 3. పరమాత్ముఁడు. 4 బ్రాహ్మణుఁడు 5. అగ్ని.

**సర్వత్ర** సం. అవ్య. 1. అంతట. అన్ని చోటులందు: 2. అన్ని వేళలందు.

కం. ధాత్రీశుల కర్జున, సర్వత్ర జయముఁ బుత్రుచేఁ బరాభవముఁ గనం, శాత్రము ... ... జైమి 7 ఆ.

**సర్వత్రగామి** సం. వి. న్. పుం. వాయువు.

**సర్వత్రగుఁడు** సం. వి అ. పుం =సర్వత్రగామి.

**సర్వథా** సం. అవ్య. 1. అన్ని విధముల 2. పూర్తిగా, లో త్తిగా. 3. కేవలముగా, నిశ్చయముగా. 4 ఎల్ల వేళలయందు. 5. అతిశయముగా, అత్యంతముగా.

**సర్వదమనుఁడు** సం వి అ. పుం. 1. అన్నిటిని వశపఱుచుకొనువాఁడు. అజేయుఁడు. 2. శకుంతలా దుష్యంతుల పుత్త్రుఁడు. భరతుఁడు.

**సర్వదర్శన సంగ్రహము** సం. వి. అ. పుం. సాంఖ్యాది షడ్దర్శనముల సిద్ధాంతములను క్రోడీకరించి మాధవాచార్యులు వ్రాసిన గ్రంథము.

**సర్వదా** సం. అవ్య. అన్నివేళలందు, ఎల్లప్పుడు, శాశ్వతముగా.

కం. ఒక వర్ష శతంబున నొంరొక క్షేత్రమువందుఁ గల ప్రయోజనలాభం,బొక దివసంబున నానంద కాననమునందు సర్వదా సిద్ధించున్. కాశీ 7 ఆ.

**సర్వదుంబలా** హిం వి పన్ను లేని మాన్యము,

**సర్వధనము** సం. వి అ న. గణితమున, క్రమవర్ధమానములైన యంకెలు గల యొక సంఖ్య యందలి అంకెల మొత్తము.

**సర్వవేదముఖుఁడు** సం. వి అ. పుం. అగ్ని.

**సర్వధారి** సం. విశే. న్. సర్వమును ధరించినది.

**సర్వధారి** సం వి. న్. పుం. ఒక సంవత్సరము పేరు.

**సర్వధురీణము** సం. వి అ. పుం. అన్ని బరువులు మోసెడి యెద్దు.

**సర్వనామము** సం వి. న్. న (వ్యాక.) నామము నకు మాఱుగా నుపయోగింపఁదగిన పదము. (సర్వాది పదములు సర్వనామములు.)

**సర్వభక్ష** సం. వి. అ. స్త్రీ. ఆడుమేక, మేకపెంటి.

**సర్వభక్షకుఁడు** సం. వి. అ. పుం. అన్నింటిని భక్షించువాఁడు, అగ్ని.

**సర్వమంగళ** సం. వి. అ. స్త్రీ. పార్వతి.

**సర్వమంగళము** విశే. శూన్యము.

ఉ. వండిన చొప్పునుం బొగపువాసనయుం బొగపాఱు చందమున్. ఖాండ సమృద్ధిసంపదయుఁ గాన విభూతియు సర్వమంగళం బండజయానరిత్త ప్రియమాడెదు నేఁడును భోజనంబు లే, కుండుట గానవయ్యె ననితోత్పలగంధియు నేమి మాయయో, భీమ. 2. 183.

**సర్వమాన్యము** సం. వి. అ. న. పన్నిమగు పన్ను లేక గౌరవార్థము ఇచ్చిన గ్రామము లేక భూమి.
సీ. మాకెందవని సర్వమాన్యంబు చేసెదఁ బ్రకటింపుడీ నన్నుఁ బిరములార! కమలాక్షుండుఁ బాశెము పట్టు కొనఁగెద నెంచుఁడీ వాదెన వంచలార! చంద్రాంగ 4 92.

**సర్వము** సం. సర్వ. 1. ఎల్ల, అన్ని.

**సర్వము** సం. విశ. 1 పూర్ణమైనది 2. నిశ్శేషమైనది వి. న. జలము.

**సర్వమూషకము** సం. వి. అ. పుం. అన్నింటిని దొంగిలించునది. కాలము.

**సర్వరసము** సం. వి. అ. పుం. 1. సాలవృక్షపు నిర్యాసము. 2 బంక, ఉప్పు, ఉప్పురసము. 3. ఒక విధమైన జంత్రము.

**సర్వరసుఁడు** సం. వి. అ. పుం. విద్వాంసుడు.

**సర్వరి** సం. వి. ఈ. స్త్రీ. — శర్వరి.

**సర్వల(లి)** సం. వి. అ. ఈ. స్త్రీ. చిల్లకోల, తోమరము.

**సర్వలగ్గ** మి వి. శత్రుసేనలు నలువంకల నుండి కోట నెగఁబ్రాకుట.
వ. రాజవాహనుండు కంటంబులు వౌడుగఁబచి కోపాటోపం బంకురింప శంకా రహితమ్ముం కార పూర్వకంబుగా రేవు సర్వలగ్గయని చాటి పంపించి. రాజవాహన 5. 34.

**సర్వలింగి** సం. వి. న్. పుం. 1. మోసగాఁడు, కపటవేషధారి. 2. వేదబాహ్యుఁడు, పాషండుఁడు.

**సర్వలోహము** సం. వి. అ. పుం. ఇనుపబాణము

**సర్వవల్లభ** సం. వి. అ. స్త్రీ కులట, వేశ్య.

**సర్వవేదుఁడు** సం. వి. న్. పుం. సర్వసంపదలను దక్షిణగా నిచ్చి యజ్ఞము చేయువాఁడు.

**సర్వవ్యాపి** సం. విశ. న్. అంతటను అలము కొన్నది, అంతట నిండినది.

**సర్వశః** సం. అవ్య. 1 పూర్తిగా, నిశ్శేషముగా. 2. అంతటను, సర్వత్ర. 3 అన్ని దిక్కులందును

**సర్వసంగతము** సం. వి. అ. పుం. త్వరగాఁ బంటకు వచ్చు నొక విధమైన వరి.

**సర్వసహా** సం. వి. అ. స్త్రీ. = సర్వంసహా.

**సర్వసాక్షి** సం. వి. న్. పుం. 1. పరమాత్మ 2. వాయుదేవుఁడు. 3. అగ్నిదేవుడు.

**సర్వసిద్ధాంతము** సం. వి. అ. పుం. అన్ని మతముల వారి చేతను అంగీకరింపఁబడిన సిద్ధాంతము.

**సర్వసిద్ధి** సం. వి. ఇ. స్త్రీ సర్వతోముఖమైన విజయము.

**సర్వసిద్ధి** సం. వి. ఇ. పుం. బిల్వవృక్షము (వృ. వి.).

**సర్వస్వము** సం. వి. అ. న. 1 అంతయు, మొత్తము 2. ఒకని సమస్తమైన సొత్తు 3. సారము. తత్త్వము.

**సర్వహరము** సం. వి. అ. పుం. మృత్యువు, మరణము.

**సర్వహితము** సం. వి. అ. న. మిరియము (Black Pepper).

**సర్వాంగము** సం. వి. అ. న. 1. శరీరమంతయు. 2. వేదాంగము లన్నియు.

**సర్వాంగీణము** సం. విశ. 1. అన్ని యంగములకు సంబంధించినది 2. అన్ని యంగము లందును వ్యాపించినది.

**సర్వాంగుఁడు** సం. వి. అ. పుం. శివుఁడు.

**సర్వాకారము** సం. అవ్య. పూర్తిగా, సమగ్రముగా. (సమాసమునందు వాడఁబడును.)

**సర్వాణి** సం. వి. ఈ. స్త్రీ (చూ. శర్వాణి)

**సర్వాత్ముఁడు** సం. వి. న్. పుం. శివుఁడు.

**సర్వాధ్యక్షుఁడు** సం. వి. అ. పుం. సర్వ విషయము లను బర్యవేక్షించువాఁడు.

**సర్వానుక్రమణి (క)** సం. వి. అ. ఈ. స్త్రీ. సర్వ విషయముల పట్టిక (సూచిక)

**సర్వానుభూతి** సం. వి. ఇ. స్త్రీ. తెల్లతెగడ (వృ.వి.). (శ. ర.)

**సర్వాన్నీనము** సం. విశ. అన్ని విధములైన యాహార పదార్థములను భక్షించునది.

**సర్వాభిసంధి** సం. వి. న్. పుం. 1. అపనిందా ప్రచారకుఁడు. 2. కపట ధార్మికుఁడు.

**సర్వాభిసారము** సం. వి. అ. పుం. చతురంగ సమేతమైన సైన్యము.

**సర్వార్థసాధిక** సం. వి. అ. స్త్రీ. దుర్గాదేవి.

సర్వార్థసిద్ధుడు సం. వి. అ. పుం. బుద్ధభగవానుఁడు.

సర్వావసరము సం. వి. అ. పుం. అర్ధరాత్రము.

సర్వే ఆం. వి. పొలములను కొలుచుట మొదలగు పనులు.

సర్వేశుఁడు సం. వి. అ. పుం. 1. పరమాత్ముఁడు. 2. సర్వమునకు ప్రభువు, రాజాధిరాజు.

సర్వేశ్వరుఁడు సం. వి. అ. పుం. చూ. సర్వేశుఁడు.

సర్వౌఘము సం. వి. అ. పుం. సర్వ్యాకసారము.

సర్షపము సం. వి. అ. పుం. ఆవాలు (రూ. సరిషపము) 2. ఒక అల్పమైన తూకపు కొల. 3. ఒక విధమైన విషము.

సళ్లు వి. క్రుక్కుట యందగు ధ్వన్యనుకరణము.

"వెలుఁగులఱేని వేవెలుఁగు వేఁడిమి సళ్లున క్రుక్కు" చంద్రా. 2ఆ. (శ. ర.)

సల వి. (క. స. ల.) 1. ప్రవేశము.

సీ. వేళరిసామి నీ వీ పట్టు నూడుము బోయనీవాసల చాయ కావుము. ప్రబం. 1. 193.

2. వత్తి, వత్తిక.

చం. పొలికలనెల్ల గోసికొనిపోయెడు వారును బోయి పోటులన్ సలలిడువారు .... కుమా. సం. 11. 774.

సీ. గఱిగాన.. ఎసకంబుతోఁ దాఁకునీటెలు గుమిసిన బలుపోటులకుఁ జల్వ సలలు గాఁగ ...కుమా. సం. 11. 692.

3. ఏటి కాలువ లోనగువాని నీళ్ళు అవలికిఁ బోవుటకు నడుమ నడ్డముగా నిలపెడు జల్లి తడక. (శ. ర.)

సలక వి. 1. చిన్నగోనె (చూ. అడిగము) 2. రెండు స్వర తూము. (శ. ర.)

సలక్షణము సం. విశే. (అ. ఆ. అ.) సమాన లక్షణములు కలది.

సలగ వి. సలగపాఱ.

సలగపాఱ వి. పాఱచిప్ప.

గీ. మఱియు దొరికిన గొడ్డలి మచ్చుకత్తి, సలక పాఱయు మొదలుగాఁ గలిగినట్టి, సాధనంబులు, విప్ర. 4, 8.

సలగము వి. దేశ్య. మలము.

సలగ్నకము సం. విశే. హామీ యిచ్చి సంపాదింపఁబడినది అప్పు.

సలజ్జము సం. విశే. (అ. ఆ. అ.) 1. సిగ్గు గలది. 2. వినయము గలది.

సలము సం. వి. అ. న. జలము.

సలరేవు చెలరేఁగు. అ. క్రి. విజృంభించు.

కం. తలలు తెగిపడిన నట్టలు ... సలరేవంబొడిచె నుగ్రసమరాగ్రమునన్. కుమా. సం. 11. 690.

సలలితము సం. విశే. మనోహరము.

కం. అలిఁ బదములతో నర్థము సలలితమగు నెచట నది ప్రసారము కృతులన్, శలిపవుఁ బయ్యెదలో నన్, దొలకాడెదు వలుదచన్నుదోయిని లోలెన్. కావ్యా. 4. ఉల్లా. 88 వ.

సలవ వి. సలగ.

సలసల వి. క్రాగుట యందును, తెర్లుట యందును నగు ధ్వన్యనుకరణము.

సీ. వన్నెరనుచు నన్ను భ్రమయించి యక్కటా! సలసలఁ గ్రాఁగు క్రొంజమురు చల్లి. చంద్రాంగ. 4. 17.

"సరసిపై నీరు సలసల దెరలె" పాండు. 1. ఆ.

కం. ఆలో నేకాదశనరు, లాలోల ప్రళయ దహన హాళహాళిహేలా, శీలాత్మ దేహాక్రణ, జ్వాలలచేఁ దజ్జలంబు సలసల గ్రాఁగన్. వరాహ. 10. 80.

కం. సలసల గ్రాఁగెడు తైలము, గొలఁదిమొఱుఁగ దలఁచుభంగి గుణరత్నసము, జ్జ్వలుఁడు గుభిల్లున మలికెను, జలనిధిలో నస్తమించు జలజాప్తుక్రియన్. ద్వా. 6. 126.

సలహా హిం. వి. 1. ఆలోచన. 2. సమ్మతి.

సలాక (సం. శలాకా) 1. బంగారు లోనగువాని కమ్మి.

ఆ. వె. కెంపుజాల నడుమ సొంపారునసిఁడి స, లాకపోలె సీత లలిఁదనర్చె. అ. రా. యుద్ధ. 579.

సీ. ... కదలి వంచాగ్నుల వడు చక్కి నిలుచుచో
లలితమౌ పసిడి సలాక తోక ... దశా. 5. 81.

2. వెదురు మొదలగువాని బద్ద.

కం. కోసిన వెదురు సలాకలు, చేసిన యరుదల కిటంచి నిడుమంటములన్, దోసాలి కటకుటీర వి,లాసిని రమియించె మిందల సహస్రములన్. క్రీడా. 1. 70.

ఉ. సారథ మొందుకాంచనపు జంత్రపు పుత్రికవాగ్విలాసము, ల్వారక చేర్పు రత్నపుసలాక తిరంబగు రూపుఁజెందు తొ,ల్కారు మెఱుంగు జీవకళఁ గాంచిన చిత్తరు బొమ్మ యాన కృం,గారిడి యామధాసరసిఁగా నుతిసేయఁగ వచ్చు నెచ్చెలిన్. హంస. 1. 64.

ఉ. ప్రస్నని మేను పుష్పలత పైఁడిసలాక ప్రసూన సాయకం,బు విక్ర. 3.47.

**సలాపము** వి. సముద్రములో ముత్యాలచిప్ప తీయుట.

**సలాము** వి. (హి. సలామ్) నమస్కారము, వందనము రగడ. శ్రమరస్థలమునఁ బరఁగు బలాఢ్యస్వామి సలా మని సత్కర మెత్తుచే. హంస. 4. 218.

**సలాముచేయు** క్రి. నమస్కరించు.

సీ వేటారుతునియలు వేయుమేలైన వ,జీర్లు వచ్చి సలాము చేసి నిలువ. సారంగ. 1. 62.

సీ. చలువదువ్వలువ కుచ్చెలయ. చే ముత్తెముల్ పదవఖ్రవశకు సలాము సేయు. శుక. 1. 200.

చం. అని తలపోసి యేనిటు రయంబునఁ దెచ్చితి నిత్తురంగముం, గనుఁగొను మిత్తురంగము వికల్పిత నిష్ఠుంహేషచేఁ బరా, కని మువాంరుమ్మరుమ్మదు ముఖంబున పారెకు పారెకున్ సలా, మొనరుచు దీనిఁ గైకొని జయోన్నతిఁ జెందుము రాజనందనా! కువల. 2. 48.

చం. సరిగ సలాము చేసి ముడిసన్నపు శ్రాల్పు ధరించి మల్లుకై, బిరబిర తావకంబు బిడి పేర్కొని మీసలు దువ్వి. ప్రబం. 1. 8 .

**సలి** వి. సందడి, అలికిడి.

కం. సలి చప్పుడు లేకమ్మోయిఁ, దొలఁగిన సైన్యంబు తెల్లఁ దొడిమూరంగా, గలఁయఁబడి. ఉ. హరి, 3.81.

**సలించె** అ. క్రి. చలించె.

వ. చఱచి పోక చాలింపక సలింపక. ఉ. హరి. 4. 248. (శ. ర.).

మ. అసిరోముండు రథాంగమాత్రనయనుం డాభీల నీలాంగుఁ డుర్వి సలింపంగ బదాతియై నడిచె. హరి. ఉ. 0. 31.

**సలికము** విశే. అల్పము, శ. ర.

**సలిగ** వి (త. చలిగై. క. తు. సలిగె) 1. ఆశ్రయము ప్రాపు.

సీ. సలిగయం చవఁగ నాశ్రయబలంబు చెలంగు.... ఆం. భా. 2. 221.

కం. ఆకుకక మాయింటికిరా, వల దనుచుట్టంబు నాగ(క)వాసములోవన్, గలదోచూతమయాచెలి, సలిగభయం జేల రమ్ము సద్గుణశీలా ! ఉత్తర హరి వ్రం. 4. 126.

2. కూడని స్వాతంత్ర్యము.

సీ. ఔర బాగాయె నీకేమి యంత సలిగ, యీమె శివభక్తురా లని యెఱుకలేక, యతని గర్హించె బొవ్వునే యనుచేఁ గనలి, సుదతి యొక్కతె గట్టిగా జుట్టువట్టె. పార్వ. 4. 121.

**సలితము** వి కొలువుడుకానిని కొలువునుండి త్రోయుట (కొలువునందు చేర్చుకొనుట లావణము) శ. ర.

**సలిలకుంతలము** సం. వి. అ. పుం. నాచు, శైవలము.

**సలిలక్రియ** సం. వి. ఆ. స్త్రీ అంత్య క్రియలందు శవమునకు స్నానము చేయించుట.

**సలిలము** సం. వి. అ. న. 1. నీరు, జలము, ఉత్తరాషాఢానక్షత్ర కూటము.

**సలిలరయము** సం. వి. అ. పుం. జలప్రవాహము, ఏఱు.

**సలిలాశయము** సం. వి. అ. పుం. 1.కొలను. 2 నీటిని నిలువచేయు తొట్టె.

**సలిలేంధనము** సం. వి. అ. పుం. బడబాగ్ని.

**సలిలోపప్లవము** సం. వి. అ. పుం. వఱద 2. జల ప్రళయము.

**సలీలము** సం. విశే. 1. విలాసముగలది. 2. ఒయ్యార

మైనది. 3. భావవ్యంజక మైనది. 4. శృంగార మైనది.

నలినము హిం. విజ సులభమైనది.

నలుగ వి. ధాన్యము కొలుచునపుడు నిర్ణీత సంఖ్య ముగిసినతోడనే గుఱుతుకై దోసిటతో నెత్తి పోసెడు ధాన్యపుకుప్ప. 2. కొలుచు వానికి వుట్టికింతయని యిచ్చెడు పెచ్చు ధాన్యము. 3. పెచ్చే. 4. రూపాయలు లోనగునవి యెంచునపుడు నిర్ణీత సంఖ్య ముగిసిన తోడనే గుఱుతుకై యెత్తి యుంచెడు రూపాయల లోనగునవి. (చూ. నలువ) (దీనినే నలగ యని వాడెదరు.)

నలుగు వి. వరాహము, పంది.

సీ. ఒకచేత నలుగొంట నొక దుప్పికొదమగా నొక్క దూఁచిన యూఁపు లుప్పతిల్లె. కళా. 4. 93.

కం. ఎలుగుల మలుగుల నలుగుల, గులుగులలుగఁ జేసి పట్టుకొలి విట్టలుతం బలుగుల నలుగుల ములు గులఁ గలఁగంగాఁ జేసి కట్టిగట్టి కిరాతున్. రాజ వాహన. 3. 60.

నలుప వి. కుమ్మరివాని యొకానొక పనిముట్టు.

ఆ. నలుపకడవ రాయి సారె కలాసంబు కట్టె యినుము, జల్లికడవముల్లు, మంటిముంత గుబ్బ ద్రమాను నావంబును, మన్ను మోయఁబోఁతు మల యుచుండు. హంస. 5 5.

నలుపు (ల్పు) (రూ. చేలుపు) స త్రి. 1. కావించు, చేయు.

గీ. ఆశరచ్ఛేదనము తృణప్రాయముగను నలుపుచే వింత యదియ కావలెనటన్న. దశా. 1. 287.

సీ హరిని వినుతియించు నంచు నానావేద శాస్త్ర ముల్ ఫలముగా నల్పువారు దశా. 3. 76.

2. కడపు.

ద్వి. ఎలమి శుక్రుఁడు పురోహితుఁడు గా కడిమి, వెలయు రాజ్యము పెక్కువేలేడు, లందు నలుపుచు ...రం. రా. ఉ. 160. పు. 20 పం.

నలుపు అ. త్రి. (కుఱుపు మొదలగునవి) బాధ కలి గించు (నళువు అని శ. ర. చి. ని., బ్రౌ) వ్యవ.) పుండు నలుపుచున్నది. కుఱుపు నలుపుచున్నది. పండ్లు నలుపుచున్నవి.

నలుపు వి. 1. పుండు, కుఱుపు. మొ. వానివలనఁ గలి గెడి బాధా విశేషము. శి. సాంగ. 2. 88.

సీ. వంతగాని వెతానము కాసియువెత, ... కొండ లంబు, నలుపు నోలి యనంగఁ బరువన్నథ అం భా. 1. 150.

(వ్యవ.) మంట, పోటు, నలుపు అధికముగా నున్నవి.

2. బాధ.

ద్వి. ఇంటిబొమ్మదిలఁ బడి యేడ్చుచు నొడలి నలు పున వడలుచు జడిఁగొని దొరుగు, కన్నీరు పోవల'' ద్వి. శి. సా. 2. 88. పు. 19 పం.

నలువ వి. అధికము, పెచ్చు. (నలుగు యొక్క రూపాంతరము).

నలోకత సం. వి. అ. స్త్రీ. 1. ఒకే లోకము నందుం డుట. 2. ఆరాధింపబడిన దేవత యుండు లోకము నందుండుట (చతుర్విధ ముక్తులలో నొకటి. చూ. సాలోక్యము)

నల్లకి సం. వి. ఈ. స్త్రీ. (రూ. సల్లక్. అ. స్త్రీ.) అందుకుచెట్టు (వృ. వి.).

నల్లపనము సం. వి. అ. న. నల్లాపము.

చం... వాక్య వి, స్తరచతురత్వ మేర్పడఁగ నల్లపనం బొనరించు. భార. విరా. 109.

నల్లాపము సం. వి అ. పుం పరస్పరము సంభాషించు.

నవ వి. జాడ. (దీని యామ్రేడిత రూపము నవనవ)

వ. అప్పరిమళంబు నవ పట్టుకొనిపోయి. కాశీ. 4. 128.

కం. అనవ యెయ్యవ నెఱిఁగి మృగము వెను వెంటఁ బోవ వదలించి గత, శ్రామఁ డయి చేతికఁ గాని వ్రేసె వ్వను నిట్లు రోషవివశుం డగుచున్. రాజశే. 2 32.

2. క్రమము.

కం. రవిశశికుజబుధసురగురు, కవి భానుజ రాహు కేతుగణములు వాకున్. దవిలి ఘటంబున నుండును, పవనిత్తురుగాత సకలసంపద లెపుడున్. అన్వక. .35

3. ఛాయ.

కం. నవరాలఁ దెగడి నీలపు, నవ రాలుచు కురులు

దవరుజవరాలి కొలంబు విరాలి దెలుప వచ్చెను, తావరావియ్యంపు మోము దులకింపంగన్. ప్రబం. 1. 450.

**సవతాణము** దే. వి. వీణకుఁ గట్టఁబడి స్వరభేదమును దెలుపుతీఁగెలలో నొకటి. 2. స్వరస్థానవిశేషము.

ద్వి. తవరుచు మొగబాళమును సవతాణమును ... పారణయుఁ దలిర్చ సంప్రీతి నిపుడంగ. బస. పు. 70 పు. 28 పం.

**సవడి** వి. 1. ఆయుధ విశేషము.

చం సవళులు భిండివాలములు శక్తులు శంఖులు తోమరంబులున్ .... కుమా. సం. 11. 678.

సీ కనుమూడ్కఁ దునియలుగా చేయు విలుకానిఁ గని దలఁబడవైచు సవడికాని. కుమా. సం. 1 .610.

2. (సవ్వడి యొక్క రూపాం.) జోడ.

సీ. ... రమణఁ జెంచిన మయూరమ్ములు వేలుపు కన్నెల కరతాళగతులఁ వాడు, వసివ వందుల వని చెప్పు వమరులైన, సవడి గ్రహరాజు మేడల సవరణ లను, మేటితొడవులు నిట్టట్టి పాటి వమచు, జగము లోపల మఱివేఱె పొగడనేల? శై. శ్రీరంగ. 4. 998.

మ. కవిరాజార్చిత వాక్యకోశ గృహరంగ ద్వాక్య మాణిక్యముల్, సవడిన్ ప్రముచ్చిలి పోఁక వక్రకయివన్ జట్టియఁగాఁ జూచుమా, నవదేహంబుల నందిగంతలనె మందవ్యాప్తి వర్తించు దుష్కవి చోరావళి నిల్వనేర్చునె సుధీ చంద్రాతపస్ఫూర్తికిన్, హ. వరాహ. పు. 1.1.

**సవతాలు** వి. (సవతి+ఆలు) సవతి.

చం. ... ఇవ్వనితకు నేనుగూర్తుఁ దెలువా సవతాలన వోర్తుఁ గల్గునీ,మను విదియేల లక్ష్మణ కుమారు వినిర్జితమారుఁ డొందు ... భా. రా. అర. 148.

కం. సవతాలికిఁ బతివలచిన, నవుఁగా కని యతని యిచ్చకమరూపముగాఁ దివిరి వడచుసతి. భార. అను. 5. 272.

వ. యయుయుత్సుండు ... ధర్మనందను బలంబులం గలసె నది యట్టిదకాక సవతాలి ప్రజలు పొందనేర్తురె. భార. భీష్మ. 1.168.

తే. దాసి యైన సవతాలికిఁ దల్లిపనులు, నేసి నలఁగంగ, భార. అను. 1. 205.

**సవతి** (స. సపత్ని. త. సవత్తి. క. తు. సవతి). సపత్ని, సమానభర్త గల స్త్రీలలో నొకతె.

కం. కాఁచికొని కొడుకు నడిగెన,ఱే చవవున నాలు మగడశే వంమిచ్చెం, జూచెద మనుసవతులచే, నీచులుకదనంబు చేరనీకుము కృష్ణా! ఉ.హరి. 2.78.

సీ. సవతులఁ గొనియాడు సఖులఁబోలె. ఆం. భా. 2. 115.

ద్వి. సరసంపు మాతల్లి సవతి మేల్బంతి, మఱి యొప్పఁజిత్రాంగి మాపినతల్లి. సారంగ. 1. 94. పు. 20 పం.

వ. వసుమతికి సవతియనందగు వసుమతీదేవి యగ్రమహిషిగా. దశకు. 2.4.

**సవతితల్లి** వి. మాఱుతల్లి, విమాత.

**సవతిపోరు** సవతుల కయ్యము.

చం. హృదయమువ్రేఁ గొకింత శమియించెను. తెల్వుపుఁ గ్రొవ్వు పెంపువం, బొదలెడు రంభకున్ సవతి పోరు ఘటించుట కంకురార్పణం బిది ... కళా. 2.8.

**సవతీవ** వి. (క. సవతి+తీవ) లతావిశేషము.

సీ. సంది దండఁగబెట్టు సవతీవబలుచుట్ట, సికజుట్టు తలముళ్ళ వెకలిచుట్టు, విప్పుగల పాలుటాకుబల్ కప్పడంబు (ఇది కిరాత వర్ణనము) చంద్రాంగ. 2. 39.

**సవతు** (సం. సమతా) వి. 1. సామ్యము, ఔపమ్యము ఈడు. సమానము.

ఆ. ఎట్టి పుణ్యవతులో యీ చేడియలు సెప్ప, సవతు లేని యట్టి సవతుఁ ఱయ్యుఁ, గడుపు వడసిరి. భాగ. 6 స్కం. 553.

గీ. పెంపు వహియింప నెపుడు నిలింప సతుల, సవతువ జెలంగుదురు వారయువతులచేట, ఉ. రా. 1. 71.

కం. ఔనా నెచ్చెలి నామదిఁ, బెవఁగొనెడు దురాశ కతనఁ బేరొకటైనా, వీనులఁ సోఁకె వమంగళ, దీనికి మాతల్లి సవతుదిటచెడి పడితిన్. ప్రబోధ. చం. 8. 18.

తే. గీ. ఉవిదనిద్దంపు జఘనసవతుఁ గోరి, కలమ గర్భంబు లడఁచు లోఁగంటకములు... ఆము 5.83.

గీ. చక్కఁదనమున నీ రేడు జగములందు, సవతుఁ గాంచనిసుతు గాంచె ధవుని కరుణ నిరం. 1.6.

సీ. ఉవిద నీకనుదోయి సవతెందు లేదని, ధాత్రిఁ దమ్ములవైచి దాఁటవచ్చు సారంగ. 2. 204.

తే పూని వర్ణింప దానికేపాని సవతు? చంద్రరేఖా విలా. 3. 60.

కం. భువనంబులు మెచ్చఁగ నై, శవయావన సంది సప్త సంతానములున్, సవరించె వాని కెవ్వరు ? సవతు సుధాంధసులు దక్క సర్వంసహామై. వరాహ. 1. 48.

సీ. ...అందంపు మెఱుఁగు వాలారుగన్గవ చూడ్కి శ్రవణకుండల కాంతి సవతుగాఁగ... ఆము. 5 67.

సీ దక్షిణాంబుధి వధూతామ్రపర్ణినది సవతు నైఘ ఘు నెన్నఁ జాలుమనిరి. కాశ. 3.131.

మ. గజఘోట స్యందనాళికలిత ధరణిం గాద్ర వేయాదిరాణ్మా, ర్గజరత్న శ్రేణులంతర్మణుల సవతునై .... ఆము. 4. 135.

కం. గణనాతీత సముజ్జ్వల, గుణమణి మునిలోక సింహకుంభజకుభకాఁ ణపుణ్య దేహభువ నాం,గణ ముల నీసవతు సేయఁగలరే తపసుల్. రామా. 5. 118.

2. విధము, పద్ధతి.

వ. వెలియైన తావులు ముడిగి నరసుక కలిచిన తాటులు విడక కాళ్లు పట్ట కపటయొగరోజు సవతు నను, పిచ్చుకలు పట్టుపట్టెడి జోడున. ప్రబం. 1.788.

ద్వి. అల సౌమదామములు, తనకొప్పునం బూని తనకొప్పుతోడ, మించుట జలదంబు మీఁద వేడించు, నంచున నొసవరి సవతుగాఁ జుట్టి, యొడసావిగాఁ జూచి యింటిలోనున్న, నడబావిలోన గ్రన్నన నీడఁజూచి. ద్వి, పరమ. 5. 381.

3. ఖ్యాతి.

తే. కొండలంతేసి పనులు చేకూర్చు కొనఁగ, భువన మాలిన్యముడిపిన సవతు జగతిఁ, గను నగస్త్యునకుమ శరతాక్కల మొసఁగు, బిరుదుకుఁచియ లనఁగఁ గప్పురము లెగసె. చంద్రా. 4 67.

సవతువచ్చు అ. క్రి. సమమగు, సాటియగు

ఉ ...నీ, వచ్చుటఁ జేసి ప్రాణములు వచ్చెఁ జూమీ యిట నేఁడు మాకు వి,వ్వచ్చుఁడు పోరులన్ సవతువచ్చునె నీకసమానమానుషా. రాజశే. 3. 222.

చం. వలపుల జేనికిన్ సవతువచ్చు విలాసము గల్గి. శుక. 1. 46

సవతుసేయు స. క్రి. పోల్చు, సాటిచేయు.

ఎ. గీ. మించేఁ జెమ్మోవిజాలుగ అంచు బసిఁడి, సౌర యారగమహిళలసారు సౌర, సారసాతుగ చెలు వంబు సవతుసేయ, నీలవ యంఘ్రి నఖములఁ బోలఁగలవె. రసి. 3. 63.

ద్వి. శివుని కెంజెడలలోఁ జెంఁగు జాహ్నవిక, సవతు సేయఁగఁ దగు సరయువు చెంత .... బరుల కసా ధ్యమై పరఁగు నయోధ్య. ద్వి. హరిశ్చం. 1. 2. వం.

సవదండవల వి జాలభేదము, ఒకావొక వల.

వ. తెరచీర కట్టలు ద్రోఁగు చుట్టలు దొడ్డివల లేటివల, కుందేటివల, పందివల, సవదండవల, కరివల, యొలికవల మొదలుగా వలయు వలలును. కాశ. 3. 46.

తే. గీ. లేటి వలలును మఱియుఁ గుందేటి వలలు జెలుక వలలును సవదండ వలలు దొడ్డి, వలలు బందిటి వలలును బలువుమకరి, వలలు మొదలుగఁ గలిగిన వలలు మఱియు. యయా. 1. 83.

సవదరించు స. క్రి. (త. చవతరి త్తల్) 1. సంఘ టించు, ఒనగూర్చు.

సీ. వెడవిల్తు చిగురాకు గొడుగులు గొనివచ్చి చరణద్వయంబుగా సవదరించు. పి. శకుం. 2. 17.

గీ. ఘోరమామక తూణీరగుప్తకాత, శరమునకు నొక్క చెరలాట సవదరింపు. కువల. 2. 15.

2. ధరించు, తాల్చు.

గీ. ఆదికాలంబు పతిఁ బెండ్లియాడఁబోవు, నవసరం బున వెబ్బంగి సవదరించె, దివ్య శృంగార ముబ్బఁగి

దేవదేవుఁ డాదరించెను సమ్మోద మానహిల్లి. పార. 4. 57.

సీ. తవతమ్ముప్రభలతో నెనవచ్చు పటికంపు జపమాల యొక కేల సవదరించి. విక్ర. 2. 27.

గీ. మేనఁ గలపంబుఁ గడువింతగా వలంది, గొవలు మీఱంగఁ దావిక్రొవ్విరులు దుఱిమి, సన్నవలిపంపు వలెవాటు సవదరించి, కప్పురము నించి వచ్చి దాగా లొనంగి విప్ర. 4. 94.

తే. గీ. జన్నిదంబుగఁ దెమపాము సవదరించి, యంఘ్రికటకంబు ఘల్లు ఘల్లుమచు మెరయ, నాహితుండిక గరళ విద్యాధిరాజు, వచ్చెఁ దాముల మెంగఁడు వదరులాఁడు. క్రీడా. 1. 228.

సీ. కడవన్నె తళుకు బంగరుకోట కెంజాయ సంజకెం జిగిరంగు సవదరింప. దశా. 1. 262.

గీ. జంగమం బై నరూపంబు సవదరించి, యెదురుగా వచ్చె వింధ్య మహీధరంబు. కాశీ. 1. 97.

3. మోచు, వహించు.

సీ. సవదరించుట యెట్లు జఠరగోళంబున నవమ మాసావసానంబు దాఁక. కాశీ 4. 18.

4. సిద్ధము చేయు.

తే. అలక తిమిరంబు తనుఁగప్పు నను భయమున, ముఖసుధామూర్తి మనువెల్గు ముట్టిఁ గూర్చి, సవదరించిన సింగాణి దాయ నొసలి, వంక చూపునఁ దగె గటివంక బొమలు. పాండురంగ. 3. 45.

సీ. పచ్చల సింగాణిఁ బన్నీరు గులికిన, చందన పంకంబు సవదరించి, పదియారు వన్నియ బంగారు భృంగారుకంబున హంసోదకంబు నించి ..

తే. కారుక్రొమ్మెఱుఁగుల వంటి కాంత లాయి, తంబు చేసితి. వరాహ. 4. 156.

5. తీర్చు, దిద్దు.

సీ. మహిమ నెవ్వని యనుగ్రహము కించిద్‌జ్ఞుల సర్వజ్ఞులుగఁ జేసి సవదరించు. ఉ. రా. 7. 346.

6. చక్కఁజేయు, సవరించు.

సీ. చెదరిన యలకల చిక్కు చిక్కఁగఁ దీర్చి జాఱిన గవయంబు సవదరించి. విశ్వ. 1. 158.

7. ఆశ్రయించు, వహించు.

సీ. దుగ్ధవారాశి కూఁతురు నాలుఁగూడి నీ శరణంబుఁ జరణంబు సవదరింప. ఉ. హరి. 1. 117.

8. అనుగ్రహించు

తే. గీ. నీదు సామర్థ్య మెవ్వఁడు నేర్చుఁ బొగడ, సవదరింపుము నామాట లవధరించి, మమ్ము నందఱఁ గృపఁజూడు నెమ్మితోడ, నెల్ల కాలంబు రక్షింపు సిద్ధచరిత. పద్మపు. 4. 179.

ఆ. వేఁటకాడ నగుట వీనిఁ దెచ్చితి రాజ! సవదరింపు చూడ నవధరింపు. చంద్రాంగ. 2. 42.

**సవనము** సం. వి. అ. న. 1. యజ్ఞము. 2. స్నానము. 3. సోమపానము. 4. సోమరసము పిండుట. 5. బిడ్డలను కనుట. 6. యాగమం దిచ్చెడు బలి.

**సవము** సగము. వి. అర్ధభాగము. (చూ. సవరేయి) వృత్తి యందు దీని యంత్య వర్ణమునకు లోపము.

**సవము** సం. వి. అ. పుం. 1. యజ్ఞము. 2. సోమరసము పిండుట. 3. బలి. 4. సంతానము. 5. ఉత్పాదకము. 6. కల్లు తేట. (శ. ర.). 7. అర్కవృక్షము.

**సవము** సం. వి. అ. న. 1. జలము. 2. పూఁదేనె. 3 సోమరసము పిండుట, 4. యాగమునఁ జేయు బలిదానము. 5. ఆజ్ఞ, శాసనము. 6. ప్రేరణము.

**సవయస్క** సం. వి. ఆ. స్త్రీ. చెలికత్తె, సమాన వయస్సు గలది.

**సవయస్కము** సం. విశ. (అ. ఆ. అ.) సమానవయస్సు గలది.

**సవయస్కుఁడు** సం. వి. అ. పుం. స్నేహితుఁడు, చెలికాఁడు, సమానవయస్సు గలవాఁడు.

**సవర** విశ. చక్కనిది, అందమైనది. (దీనికి కర్మధారయమున నిగాగమము వికల్పముగ వచ్చును.)

వ. సవరని పాపలం దడవి తడవి తమ యేలికకుం గానికగా నీ వలయునని. ఉ హరి. 1. 43.

కం. సవదంతకుంద కాంతులు, సవరని చెక్కిళ్ళ సాంద్ర చంద్రిక లీనన్. ఘటికాచల. 2. 2.

చం. సవరనిదంచు నిబ్బరపుఁ జన్నుల దంచు సుధాంశుమండలీ సువదన యంచు. ప్రబోధ చం. 4. 7.

2. ఒత్తిడి లేనిది.

సీ. నవరగాఁ గొంచు దండువులు దర్పనములు కోలాన గొనకూళ్ళు గుత్తికి. వి. శకుం. 4. 175.

నవర (సం. శబర) ఒక యాటవిక జాతి పేరు.

నవరంగా చక్కఁగా. (రూ. నవరనగా)

మ. కవితల్ సెప్పినఁ బాడనేర్చిన వృథా కష్టంబె యీ భోగవుం, జవరాండ్రేకద భాగ్యశాలినులు పుంస్త్వం బేల పోపోఁచకా, నవరంగా సొగసిచ్చి మేల్ యువతి వేషం బిచ్చి పుట్టింతువే? వీథి నాటకము. 56.

నవరచేయు న. క్రి. (నవర+చేయు) చక్కఁజేయు పరిచేయు.

సీ. చేదోయి మొత్తునఁ జేసి నెత్తురులైన యవయవంబులబోర నవరచేయు. శ్రీం. నై. 2. 5.

గీ. విషమ కఠిన నిమ్నవీథీ విటంకంబు, వంతరాంతరముల నరని యరని, యతఁకర్దమమువ యతేశ్వరాదులు, నవరచేసి రథిక సంభ్రమమున. భీమ. 5. 27.

నవరణ (రూ. నవరణము) వి. (త. నవరణై. క. నవరణె) యుద్ధ పరికరము.

కం. అవి గనియు వినియు మలుకక, నవరణ లొప్పార నపుడ సంభ్రములై యాదవులు. భార. మౌస. 1. 28.

కం. నవరణల నొప్పి యనిఁ బాంచవబలముల మార్కొనం గడంగుచు వత్తు, తత్సమమునఁ జేర్చిన సేనల, కవకాశము లేదు విజయ హాస్తిపురమునన్. భార. ఉద్యో. 1 226.

కం. అరదములు నవరణలతోఁ బరపై యొక్కొక్కయూరివరపున నరిగెన్. భార. భీష్మ. 1. 84.

2. సామగ్రి.

కం. అవు జేపారముఁ గృషియున్, నవరణలును బనులసొంపు సనయట్లగుటన్, భువిఁ బనులు గలుగువాఁడుల, నవనీశుఁడు గన్న ప్రజలయట్లరయదగున్. భార. పాం. 2. 288.

....పులిజున్ను మొదలుగాఁ బురుషాయుషావధి కందుండ నవరణల్ పొందుపఱిచి ... ఆము. 4. 261.

3. సన్నాహము.

కం. మన ప్రజలోఁ గలుగుటకు, జనులేఁగ వలయు వారి నవరణలో నుండని యేర్పడ నియమింపు, భార. ఉద్యో. 3. 181.

తే. వఱయు నవరణలోన భూవల్లభుడు, వెడలె వేఁటకు మృగయాప్రవీణులైన శబర నాయకు లుభయ పార్శ్వములఁ గొలువ. విక్ర 2. 181.

4. వాహనాద్యలంకారము.

కం. తెల్లని నవరణ మెఱయ సముల్లసితములగు తురంగముల మొత్తము చం, చల్లలిత పథముల కోళ్ళిల్లు గతుల నొప్పు వంచవింఁడుంబోలెన్. భార. శల్య. 1. 128.

వ. ఈశ్వరాది దేవతలు నమకట్టిన నవరణ గల యర్జును చేత నిర్జింపఁబడిన యుత్కృష్ట జాతులనే కులు కలుగుట యెఱుఁగుదురుగాదె. భార. ఉద్యో. 2. 244.

సీ. ఉత్తమ హయదంతి సత్తమరథరత్నములునూచి నవరణ లలవరించు. నిర్వ. 7. 148.

ద్వి. వాండును చమదెంచి వరుసఁ గాండవులఁ బోండిగాఁ బురమునకును దోడితెచ్చి నవరణ లన్నియు జాల నిప్పించి వివిధాంబరంబులు నెలయఁ గైచేసి. అరూఢనియతితో వరదంబు లెక్కపారథ్యములు వారు చక్కఁబెట్టుచును. విరాటపర్వ 1 12.

5. సేన.

కం. అవు జేపారము కృషియున్, నవరణయును బనులసొంపు నరి .... భార. శాంతి. 2 అ.

6. సౌమ్యము. శ, ర.

నవరణచే(సే)యు న. క్రి. (నవరణము+చేయు) అలంకరించు. చలువదుస్తులు మేన నవరణ చేసి. రఘు.

కం...ఇభములాదిగ వాహనముల నవరణ సేయన్. భార. మౌ. 1.

నవరణము వి.పరికరము.

వ. సుశర్మయు నేలివవానిపనిఁ బూని జోడు వక్కెర కైదువు విరుదురవణంబు మొదలయిన నవ

రణంబులం జూడ వక్రుజంబుగాఁ గూడి ఖార. విరా. 3. 181.

**సవరణించు** స. క్రి. (సవరణ+ఇంచు) సవరణ చేయు.

సీ. విఖ్యాతి కెక్కిన వెలిమావుపాటిగా సైంధవంబుల నెల్ల సవరణించి. వసుచరి. 4. 85.

**సవరఁదనము** వి. చక్కఁదనము.

ద్వి. అవతారమహత్త్వము దనవచ్చు వీని, సవర దనంబు లతివరాలు సేయు. పాంగ. 1. 22 పు. 18 పం.

**సవరన** విశే. 1. చేదును, సమము.

వ. నిమ్నోన్నత భాగంబుల వలన వసమంబుగా నున్న నా యాకారంబు చక్కనగునట్లుగాఁ జూడు మనిన నట్ల కాక యని వైన్యుండు కార్ముక కోటిం గొని శిలలు ప్రోవుచేసి శిలోచ్చయంబులు గావించి యెల్లచోట్ల సవరనై యుండ నొనర్చి నగర గ్రామాదులు రచియింపం బనిచె. హరి. పూర్వ. 1. 180.

సీ. సవరనై లక్ష యోజనముల వెడలుపై కడుఁ గఠోరము నైన కర్పరమును. భాగ. 8 స్కం. 202.

2. సౌందర్యము.

కం. ఆననములు చవిగ్రోలెడి, యానవనవ లేఁజిగి తేఁటు లలరులగమిపై, యాన వదలి పాదకదలి యానవనవ గాంచి చెంత వాదరయమునన్. ప్రబం. 1. 250.

**సవరపుకుప్పె**=సవరమునకు మొదట నుండు గ్రంథి.

తే. గీ. కత్తెరల నొడ్డియాణము లత్తిరించి కుంపటి ముముల సవరంపుకుప్పె లూడ్చి. ప్రబం. 1. 76.

**సవరపుమెకము** వి. బల్లి మెకము, చమరమృగము.

**సవరపెట్టు** స. క్రి. అడ్డగించు.

ఆ. వె. అటమటించి పోవ నిటు చెప్పితిరి మిమ్ము, బరగనీయ నిపుడె సవరపెట్టి, యెడసికొండునొడ మెనోగి వాలుబిడ్డలు, బందుగులను మనిచి బ్రతుకుఁ గలరు (ఇది చోరవాక్యము). ధర్మఖండము. 1. 90.

**సవరము** (సం. చమరమ్, త. చవరి. క. చవరి) 1. చమరమృగము యొక్క తోఁక.

సీ బలువుచేనిక కొమ్ముటలవలపైఁ ద్రోవఁ దవిలించి కట్టిన సవరములును యయా. 1. 119.

మ. పులికూనల్ సవరాలు కస్తురిమెకంబుల్ లేళ్ళు కుందేళ్లు పందులు కార్పోతు లెలుంగు లేదులును మన్నుంబిళ్లు సివ్వంగిపిల్లలు ముత్తంబు జవాదిపిల్లలు మొదల్గాఁ గానలో వాని గుంపులఁగై కానుక చేసి యాదలల మోడ్పుం జేతులం గూర్చుచున్. యయా. 1. 32.

2. స్త్రీలు కొప్పు ముణుచుటలో నుపయోగించు చమరవాలము.

సీ ... క్రొత్త, రంగు అవికలు బంగారుఁబూఁ గొప్పు సవంముల్ వగవగసన్నచీర అద్దముల్ పరిమళములు నాదిగాఁగ. దశా 6. 84.

**సవరించు** (క. సవలు, సమలు) స. క్రి. 1. సిద్ధము చేయు.

కం. చివికిన యజినము దండముఁ, జివికిన జన్నిదముఁ దీసి శిక్షమ క్రొత్తల్, సవరించి పెట్టుకొని యా, చివికినయవి జలము పాల చేయఁగవలయున్. విజ్ఞా ఆచా. కాం. 26.

సీ. గుద్దండ్లను బెద్ద గునపంబులను గోటయొండొండ త్రవ్వుట యుక్కుటులుల, రాకట్టనపు చెకల్ గైకొని వఱకుట యొనరు దంచనముల నొడిసెలలను, జాలంగ నెందును సవరించు టమ్ముల దోమరంబులను శక్తులను గదల. హరి. ఉ. 2 16.

2. కూర్చు, ఘటించు.

సీ. సవరించి రింద్రరత్నవితానములు పెక్కు వజ్రకూట ప్రభావలులతోడ. వసు. 5, 64.

చం. తన శరమైన చంపకము తావులఁ గూడిన గాడ్పు రేణుమే, దినిదళ ధాళధళ్యరుచి తేనియనీరు పుటాంతరాంబరం, బును సవరించి యీ చిగురు బోఁడివనంగ విధాత చేసెఁబో, తనులతగందుఁ దక్కిన విధాత కరంబున నంటి చేసినన్. వరాహ. 8. 114.

3. చేయు.

కం. అనినింద్యమతి వసుమతి, దనగుర్వాదేశము నను రా నెద్దానిన్, సవరించిన నది యిష్టము, నని యంతట నొసఁగు నుదియము వలదెందున్. రాఘ. 1. 51.

సీ. నానాధ్వనులఁ బ్రణామంబు సవరించి విశ్వనాథునకును వినతి సలిపి. వాల్మీకి. 2. 40.

4. సంగ్రహించు.

సీ. పాపాత్ముఁ డొకఁడోయి పశుల వధియించి తినియును దెక్కమ్మి కొనియు నదియ, బ్రదుకుగా దానికి బహు సాధనంబులు సవరించుకొని మహాటవిఁ జరింప. భార. శాం. 3. 307.

5. అనుభవించు, పొందు.

కం. శ్రవణమున ననువదించుచు, ననహితభక్తులను గృష్ణు నలినాభునిఁ గే,శవుఁ బూజించిన మనుజులు, సవరింపుదు రిహపరైకసౌఖ్యము లెల్లన్. శేష. 5. 238.

కం. భవదంఘ్రిదూరునకుఁ బు,ణ్యవసతి సులభంబె వెలుతునయ్య భవంబుల్, సవరింప యుష్మదర్చా, ప్రవణమతిం జేయు నన్నుఁ బరధామపతీ. పాండురంగ. 4. 90.

6. చక్కఁబఱచు, సరిచేయు.

చం. ప్రిదిలిననీవిఁ గేల సవరించు తలోదరి నోర్తుఁ గాంచి లోఁగదరిన పావకీలిఁ బడి. వైష. 3. 86.

ఉ. ...చ, స్నిగ్ధవల జోటికొప్పు సవరించుచు వీడిన కొప్పుఁ బల్మఱుం, జెవెటఁ బోవుచుం బలికెఁ జెందొవ చూపులు ద్రెళ్లుదాఁటఁగన్. పారి. 4. 57.

7. కలిగించు.

సీ. ఏ ధన్యకామాధరాధరాభోగంబు భోగంబు సవరించు భూమినతికి. వసు. 1. 30.

సీ. నాలుగు వాకిళ్ల నలువంద వేడుకల్ సవరించు ముత్యాల చవికెయైన. రామా. 6. 129.

8. ధరియించు, తాల్చు.

చం. కలన మలంది క్రొమ్ముడిని గమ్మవిరు ల్సవరించి. పారి. 5. 56.

సీ. కమిలి పాముఁ తోడి పొగతం బొల్లక సవరించు బంగారుకన్నిదములు హం. 5. 5.

9. వహించు, చేకొను.

సీ. కచ్ఛపి యనుపేరఁ గరము శోభిలు వీణె సవరించి జగదంబ శారదయును. కళా. 2. 61.

10. పూను, (కోపము) వహించు.

2. నవతి వట్లను నీవు సవరింప కేవట్ల గారాబమునఁ జెంచువారు లేరె. పారంగ. 3. 47.

సీ. తమ తండ్రి కంజపాదమునిఁ జంపిన యీర్ష్య సవరించి తత్సూతి శంఖకబకుఁ, దమవాఁడు మత్తభమై తాలుమీఱ. సమీర. 2. 77.

11. సమకూర్చు.

కం. నవనవ విషయముఁ బల్కుచు, నవనవగతిఁ దోడితెచ్చి యాతిథ్యంబుల్, సవరించిన నమ్ముని పతి యది గైకొన కనియె. చంద్రభా. 3. 22.

12. రచించు, నిర్మించు.

కం. భువనంబులు మెచ్చఁగ శైశవ, యానవ సంధి సప్త సంతానములున్, సవరించె తానికెవ్వరు నసకు సుధాంధసులు దక్క సర్వంసహాపైన్. వరాహ. 1. 38.

13. చక్కఁజేయు, సరిపెట్టు.

సీ. ధనమున నెన్నినా ళ్ళెదగనియెడు సప్పు మంతలో సవరింపకుండిన పాపమిత్తు. మార్క. 1. 170.

సవరించుకొను స. క్రి. 1. సిద్ధము చేసికొను.

కం. మును సహదేవుం డెగసం, జనినప్పుడ యొండు తేరు సవరించుకొనంగమట పదివేర్చి యతనిం, గొనిపోయెను సంగరమునకుం దొలఁగంగన్. భార. కర్ణ. 2. 387.

2. చక్కఁబఱచుకొని.

వ. అంత వసంతుఁడు ... మూర్ఛిల్లిపడి క్రమ్మఱ సచేతనుండై తన్నుం దాను సవరించుకొని. కుమా. సం 5. 570.

3. చేసికొను.

ద్వి. ధనతాడుపీరంగధవుని నల్లునిగ సవరించుకొన్న యాజగదేకవీరుండు. ద్వి. పరమ. 5. 441వ

సవరింత వి. సవరించుట.

సవరింతసేయు స. క్రి. (సవరింత+చేయు) సవరించు, సక్కఁజేయు (శ. ర.).

చం. హారువుగఁ గాంచికాగుణ మొయారముగా సవరింతసేయు నా, వెరపునఁగేలఁబోకముడి వీడిచె. రస. 2. గుచ్ఛము.

సవరిల్లు అ. క్రి. ఒప్పు.

సీ. సవరిల్లు నెచ్చోట జగదగ్గరగనీక, సంతత యౌవన సౌష్ఠవంబు. కాశీ. 228.

ద్వి. నవపుష్పగంధముల్ నలుఁవొప్పఁ దెచ్చి, సవరిల్లఁ బుప్పొడిఁ జల్లుచునుండ. రం. రా. ఉ. కా. 67. 11 పం.

సవరు విశే. చక్కని, అందమైన.

సీ సన్నపునడు మొప్ప సవరైన పిఱుఁదొప్ప లలిత కనక కుండలములు వొప్ప. వీర. 1. 177.

సీ. లవలీదళములట్ల సవరైన చెక్కులు వాడు వాఱఁగ ముద్దులాడి యాడి. ఉ. రా. 4. 217.

చం. సవరగు నొక్కయద్దమునఁ జయ్యన జూచి కపోలబింబితుం,డవు వ్యపుఁ గాంచి సిగ్గు మెయి వంతట నివ్వెఱవోయె నెంతయున్. తపతి. 5.35.

సీ. సవరైన రతనాల బవిరెకమ్మల నిత్తు వని నీకు మనసు రానంటవేని, యాణిముత్యమ్ముల హారమ్ము లొసఁగుదు. హంస. 2. 37.

ద్వి. సవరైన వల్లపూసలపేరు. ద్వి పరమ. 3, 14 పు.

సవరుచు(రుచ్చు) స. క్రి. 1. కూర్చు. 2. చిత్రించు.

కం. జనకుఁడు భువిఁగల ప్రాయపు, జనపతులం బటములందు సవరిచి యనుఁగుం, దనయ కడ కనుప నితరము, గనవొల్లదు నీపటంబె కాని మురారీ. ముకుందవి. 2. 123.

సీ. సముదోయి పస వంటుకొని ఘుమ్మురన జాంబ వతి సవర్చిన వల్లెవాటు మెఱయ. ముకుందవి. 1. 50 పు. 4. పం.

సవరేయి వి. (సవము+రేయి) అర్ధరాత్రము.

సీ. సంధ్యప్రొద్దున నుండి సవరేయి గడన సఖ్యు లమ్మునఁ గొల్పి సంతసించు. పాండు రంగ. 5.28.

ద్వి. సవరేయిమైఁ దొక్కి చల్లి సంధించి శివుటమై దొంగిల తెచ్చుచు మఱిగి. ద్వి. పరమ. 6. 488.

ద్వి. దొంగను నాతోడి దొంగలు మీరు, దొంగిలుం దని గడిదొంగనై కారి, సదనముల్ సొరఁబాఱి సవరేయి యాలఁ బిదికి వెండియు నదరు బెమరింత శేశ. అ. మ. క. 1. 32. పుం. 25. పం.

సవర్ణనము సం. వి. అ. న. భిన్నాంకములను తుల్య లవములు గల వానినిగా మార్చుట.

సవర్ణము సం. విశే. 1. తుల్యవర్ణము గలది. ఒకే రంగు గలది. 2. పోలినది, సరూపము. 3. ఒకే కులమునకుఁ జెందినది. 4. ఒకే జాతికిఁ జెందినది, సధర్మమైనది. 5. తుల్యాస్య ప్రయత్నమైన వర్ణము.

సవసవ చూచాయ, మెల మెల్ల.

వ. నా దౌష్ట్యంబు సవసవగాఁ దెలిసి. మను. 5. 27.

వ. జానకీభూవ్యం బైన రథంబునన్. గనుంగొని పురజనములు గుంపులు గూడుకొని సవసవగా విన్న మనము విన్నది నిజంబై తోఁచుచున్నది. ఉ. రా. 6. 343.

2. క్రమక్రమము.

చం. సవసవగా వెఱింగి తమజాతుఁడు నేనను మండఁ గొల్వులో, దివిజవిభుండు లేనగవుఁ దెచ్చి కొనన్ శిబి యల్కఁ జూడ గైతవమునఁ బిల్వనంపి నమఁ దప్పక చూచుచు సొమ్ములెల్ల, మ,ఱుక్కన నొసఁగున్ జరుక్కరని కోడలి జం కెనచే నదల్చు చున్. కువల. 4 173.

చం. సవసవ దీపపంక్తులు వెసన్ దెలుపెక్కఁ దలంప మిత్రులన్, దవిలిన యార్తి దెందములఁ దాల్చి తె స్నేహదశానువర్తనల్, ప్రబంధ. 1. 118

3. కొంచెము, అత్యల్పము.

కం. అని విన్నవించి యతఁ డో.జనార్దన ? యిప్పు డేను సవసవగా నేర్చిన పాటి యొక్క గీతము, వినిపించెద. చంద్ర. 1. 124.

4. సంభ్రమము, తొట్రుపాటు.

క॰. నవనవ వినయము లొలుకుచు, నవనవగతిఁ దోడి
దెచ్చి యాతిథ్యంబుల్, నవని చిన చ ప్రభా. ?.
22.

కం. ఆసనములు నవిగ్రోలెడి, యా నవనవ కెళుంగి
తేఁటు లలరుఁగమిసై, యాః నవలి పొదలి కదలి॰
యానవల న గాంచి వెంత వాడ దయమునన్.
ప్రబం. 1. 250.

5. భేదము.

కం॰ నవతులు దిత్యదితివిలా, నవతులు మటి వారి
కాత్మసంభవు లగు మీ,నవతు లమర్త్యులు వారికి,
నవతుల నున్ మీరు మీకు నవనవ తేలా' లక్ష్మి. వి.
2. 56.

**నవాయి** వి. (హిం. నవాయి) 1. పడవ పెద్ద మోకు,
2. మేహరోగవిశేషము॰ 3. మహావ్యక్తియైన
ప్రభువుల బిరుదనామము.

చం. వదలక యుత్కలేంద్రుని నవాయి బిరుదు
వడంచు దుర్జయున్. కళా పీఠి. 18

సీ. వడమటను నవాయిబనువనిగాఁ జేసి యచటఁ
గొయ్యలకొండ యతకరించె. తపతి 1. 24.

**నవారి** హి. వి. పల్లకి, గుఱ్ఱము నెక్కి పోవుట. శ. ర.

**నవాలు** హిం. వి. ప్రశ్న. విచారణ.

**నవి – సావి** (అవ్య.) అని (ఇత్యర్థకము)

సీ. .... ఇములు కార్థంబుగా దనరను నవి సావి యని
యన నిత్యమై తనరు ... ఆం. భా. 2. 67.
(ప్రాతిపదికార్థము)

తరువోజ. జలనిధి సంవర్తకాది జలదముల్ ప్రీతి
వజ్రజాకరంబు జలము లక్షయములు నవిసుధార
సము నవి యని మెచ్చి ... కుమా. నం. 10.387.
(హేత్వర్థకము)

చం. కనఁబడు వార లెల్లఁ దనుఁ గన్నిడిరే నవి
విన్నపల్కులెల్లనుఁ దనుఁగూర్చియే నవి తలంకున
గొంకుచు నైన సాహసం,బునఁ దగ వచ్చి యట్టె
వెలివోవఁగఁ గొఁగిటఁ జేర్చు బిగ్గలన్, వనిత
ముహూర్త మాత్రమున వల్లభునిం దొలుక్రొత్త
ఉండుటవన్. కవి. 4. 105.

చ॰. జలజము పాదకోశములు వ్రేదముల్ వల
తె ని తనయున్, నలినముఖాంగమ దలము నాసిక
యున్, శశికిరణ చంపకం,బులు నవి దాయ నొల్లక
.. కుమా. నం. 8. 9.

(భ్రాంత్యర్థకము).

చ॰. నిమువు లోకర్తుచేతఁ గమనీయలతాంతము
లున్న నొక్కెడన్, గముఁగొని మర్గ మొక్కతె
నికాసిని యై నవక్షణ దీవఁబూ. చిన యొలగొమ్మ
గుత్తి నవి చేరి వయఁబునఁ బట్టి కోయఁబూ,చిన నవి
యల్ల నవ్వ నదికి గుప సం గని యాక్రందఱున్.
నిర్వ 8. 61.

కం. చూపులఁ గని తల్లుల నవి,చాపలమునఁ జేరి
హరిణశాబము లట్టుల్, చాపఁగ దుర్వాంకుర
ములు, మేపుమరు కరి ములు నిమిరిమునివనితల్.
వరాహ. 4. 64.

మ. దిశ లాకాశము ముంచుమంచుల మృగీదృష్టి ప్ర
నాళ్లిష్టులన్ దశమావస్థలఁ బెట్టువట్టితటి సీతా
సేవ్యుఁ డా నేతకున్, దశకంఠాసురు చెల్లెలా
నవలెఁ బన్నాదేవి కేల్దమ్మికిన్, బినితఁ పున్ నవి
నేఁగుదేఁగ చెలి తబ్బిబ్బైన చందంబునన్. చఁపూ
రా 5. 31.

మ. తలఁబడచ్చుటఁ గ్రక్కు కాతువులు కేదారం
పుఁగుల్యాంతరస్థలి నిద్రింపఁగఁ జూచి యారెకు
లుపస్నాత ప్రయాతద్విజా,వలి పిండీకృతకాట
కల్పవి తదాహానంబుఁ జే వ్రంగ రే,వులు డిగ్గన్
వెనఁటాటు ... అము. 1. 65.

**నవికల్ప(క)ము** నం. విశే 1. వైకల్పికము.
2. సందిగ్ధము, 3. జ్ఞాతృజ్ఞేయాది భేదము గలది.

**నవికాశము** నం. విశే. 1. పూర్తిగా వికసించినది.
2. విస్తరించినది, విపులమైనది.

**నవిగ్రహము** నం. విశే. (అ. ఆ. అ). 1. మూర్తి
మంతము, శరీరము గలది. 2. అర్థము గలది.
3. కలహించునది.

**నవిత** నం. వి. ఋ. పుం. (రూ; నవితృఁడు)
2. సూర్యుఁడు. 2. తండ్రి. 3. సృష్టికర్త.
4. ఇంద్రుఁడు. 5. ఆర్కవృక్షము (వృ. వి.).

**సవితర్కము** సం. విశే. (అ. అ. అ.). ఆలోచనము గలది.

**సవితృఁడు** సం. వి. ఋ. పుం. సవిత.

చ. ... జ్యోత్స్నల మసుఁగూర వృత్తికిఁ గడంగుదురే సవితృఁడు ... ... భార. అను. 3. 261.

కం. భువనైక దీపకుండగు, సవితృనకుఁ దమాజ మెఱియు. భార. ఆది. 7. 80.

**సవితృజము** సం. విశే. సూర్య సంబంధమైనది.

**సవిత్రము** సం. వి. అ. న. ఉత్పత్తి కారణము.

**సవిత్రి** సం. వి. ఈ. స్త్రీ. 1. తల్లి, 2. ఆవు.

**సవిత్రియము** సం. విశే. సూర్య సంబంధియైనది.

**సవిధము** సం. విశే. 1. సమీపమైనది. 2. ఒకే విధమైనది.

**సవిధము** సం. వి. అ. న. చేరువ, సమీపము.

**సవినయము** సం. విశే. వినయముగలది, విలాసము గలది.

**సవిభ్రమము** సం. విశే. ఒయ్యారము గలది, విలాసము గలది.

**సవిమర్శము** సం. విశే. సవితర్కము.

**సవిలాసము** సం. విశే. (అ. అ. అ.). సవిభ్రమము.

**సవిశేషకము** సం. విశే. 1. భేదకలక్షణములు గలది. 2. వేఱుచేయఁబడినది.

**సవిశేషకము** సం. వి. అ. న. 1. భేదకలక్షణము. 2. ప్రత్యేకధర్మము.

**సవిశేషము** సం. విశే. 1. ప్రత్యేక గుణములు గలది. 2. వింతయైనది. అసాధారణమైనది. 3. విలక్షణమైనది. విశిష్టమైనది. 4. ఉత్కృష్టమైనది. శ్రేష్ఠమైనది. 5. భిన్నమైనది. వేఱైనది.

**సవిస్తరము** సం. విశే. వివరములతోఁ గూడినది, సూక్ష్మాంశములతోఁ గూడినది, సమగ్రమైనది.

**సవిస్మయము** సం. విశే. 1. ఆశ్చర్యపడినది. 2. సందేహము గలది.

**సవుఁడు** సం. వి. అ. పుం. 1. సూర్యుఁడు, చంద్రుఁడు.

**సవురు** — సౌరు వి. 1. అందము, ఒప్పిదము, వైభవము.

ఆ. నవ్వుఁబువ్వునవ్వు జవ్వని నాసిక, చివురు సవురు జవురు నవిడమోవి, మబ్బుమబ్బు గెబ్బు బిబ్బోక వతివేణి, మెఱుపు నొఱపుఁ బఱపుఁ దెఱవ మేను. విజ. 1. 84.

చం. చలువలఱేఁడ నీసవురు సన్నము గాని ... నిందురాకుమీ. నీలా. 3. 20.

సీ. అవికఁ బూన్చిన లీల సవురొందు గందములందిన చందంబు నందమయ్యె. ఉ. రా. 6. 118.

ఎ. గీ. ... అవయవంబుల సవురు రాజాధిరాజ, చంద్రులను బోల ... దశా. 2. 273.

2. కాంతి,

కం. చివురావాతెఱ నల్లని. కవురా మనసోఁగ వెంద్రుకలు పుత్తడిమేల్, సవురా దేహము ముద్దుల, దవురా యని జనులు పొగడ వాలిడ యమరున్. హంస. 3. 193.

3. నిగ్గు, సారము.

తే. గీ. అవుర శృంగార రసములో సవురు దీసి, నేర్పున నొనర్పఁ బోలునీ నేత ధాత, లేక నేతాదృశ విలాసలీల గనునె, దానవారాతి మానినీ మానహేతి. ముకుందవి. 3. 236.

4. విధము.

కం. నవపల్లవానురక్తిం, దవిలెడు కొమ్మల రమించుఁ దమ కీఁక నుచితం, బవునె యని కడఁక వరిగెడు, సవురునఁ గాంతాకులురివె సకి కనుఁగొంచే. సమీర. 1. 124.

వ. కురువేరు సవురున గుబాళించు మరువంపు వలపులతో. ఉ. రా. 6. 24.

**సవృద్ధికము** సం. విశే. వడ్డీకలది

**సవేశము** సం. విశే. 1. సమీపమైనది. 2. అలంకృతము, పరిష్కృతము.

**సవైలక్ష్యము** సం. విశే. 1. అసహజము, కృత్రిమము, బలాత్కృతము. 2. భీతము, లజ్జితము.

**సవ్యపేక్షము** సం. విశే. (అ. ఆ. అ.). ఒకదానికి సంబంధించినది, ఒకదానిపై నాధారపడినది.

**సవ్యభిచారము** సం. వి. అ. పుం. (తర్కమున)

వైశ్యావకాశము నందలి మైన ప్రధాన విభాగము లలో నొకటి. అనైకాంతిక మను దోషము.

**సవ్యము** సం. విశే. (అ. ఆ. అ.). 1. ఎడమ. 2. కుడి, దక్షిణము, 3. ప్రతికూలము.

**సవ్యసాచి** సం. వి. న్. పుం. అర్జునుఁడు.

**సవ్యాజము** సం. విశే. (అ. ఆ. అ ). 1. కృత్రిమము, కపటము. 2. మిషతోఁ గూడినది, ప్రయోజనాపేక్ష గలది.

**సవ్యాపారము** సం. విశే. (అ. ఆ. అ). 1. క్రియాత్మకము. 2. నియుక్తము, ఉద్యోగవంతము.

**సవ్యుఁడు** సం. వి. అ. పుం విష్ణువు

**సవ్యేతరము** సం. విశే. (అ. ఆ. అ.). కుడి. దక్షిణము.

**సవ్యేష్ఠ** సం వి. ఋ. పుం. సారథి.

**సవ్యేష్ఠుఁడు** సం. వి. అ. పుం. సారథి.

**సవ్రీడము** సం. విశే. అ. ఆ. అ. 1. లజ్జగలది. సిగ్గుపడినది.

**సవ్వడి** (సవ+వడి) వి. జాడ (స్వార్థమునవడి) శ. ర

**సశబ్దము** సం. విశే అ. ఆ. అ. 1, ధ్వనిచేయునది. 2. ప్రకటింపబడినది.

**సశల్యము** సం విశే. (అ ఆ. అ.) 1. ముండ్లుగలది. 2. శరములులేక ముండ్లుగ్రుచ్చుకొనునది. 3. కష్టమైనది, బాధలతోఁగూడినది.

**సశస్య** సం. విశే. ధాన్యము నుత్పత్తి చేయునది, ధాన్యముకలది.

**సశస్య** సం. వి. ఆ. స్త్రీ. ఒక విధమైన ప్రొద్దు తిరుగుడుపూవు.

**సశ్మశ్రువు** సం. విశే. ఉ. ఉ. ఉ. గడ్డము, మీసము గలది.

**సశ్మశ్రువు** సం. వి. ఉ. స్త్రీ గడ్డము, మీసములుగల స్త్రీ.

**సశ్రీకము** సం. విశే. (అ ఆ. అ.) 1. సంపదగలది, శుభముగలది, అదృష్టముగలది. 2. ముచ్చటైనది, అందమైనది.

**ససందేహము** సం. విశే. (అ. ఆ. అ.) సందేహము గలది.

**ససందేహము** సం. వి. అ. పుం. ఒక యర్థాలంకారము చూ. సందేహము.

**ససంధ్యము** సం. విశే. అ. ఆ. అ. సాయం కాలము, సంధ్యను సంధించినది, సంధ్యలందు సంధించు నది.

**ససంభ్రమము** సం. విశే. అ. ఆ. అ. తొట్రుపాటు, తొందరకలది, కలవరపడినది.

**ససత్త్వ** సం. వి. ఆ. స్త్రీ. గర్భవతి.

**ససత్త్వము** సం. విశే. (అ. ఆ. అ. 1. బలముగలది, వీర్యముగలది. 2. గర్భము ధరించునది. 3. జంతువులతో నిండినది, ప్రాణులతో నిండినది.

**ససనము** సం. వి. అ. న. బలిదానము. అర్పణము, త్యాగము.

**ససాధ్వసము** సం. విశే. (అ ఆ. అ. బెదరినది, భయపడినది, భీరువైనది పిరికిది.

**సని**[1] విశే. నిగ్గుగలది.

వ. సనిమెఱుంగు ముత్తెంబులు. మను. 3. 28.

**సని**[2] క్రి. విశే. బాగుగ.

ఉ. నీటను దేమయొక్క సనినిల్పి యొకించుక వాటి ధృతి,పాటవ మొప్ప నతం డొనర్చు నప్పాటునఁ జెన్నుమీఱి వరిపాటిగఁ గెంజిగు రక్కడక్కడన్, మోటికలెత్తి క్రొవ్విరులు మొగ్గలు పెగ్గలమయ్యె నయ్యెడన్. విక్ర. 2. 23.

మ. విను వాక్యాంతయులేక తావ్రనలయున్ వీని న్పదాకాలమున్, సనిఁజక్కంగఁ బ్రియుండు వర్ధిలుటకై నాళీకపత్రాక్షికిన్. కాశీ. 1. 73.

**సని**[3] వి. 1. బాగు.

చ. దొసగులు వచ్చువేళ గుణఘుస్యలధైర్య గుణంబు సర్వముం, బసచెడు నంచేఁ జూపెదవు పాపపుదైవమ యీదురాగ్రహా, వ్యసనము మాను మాను ప్రళయంబున వీతనిజక్రమంబులై సనిచెడ వించుకంతయును సాగరముల్ గులపర్వతంబులున్. భర్తృ. 1. 90.

2. విధము.

తే. అర్ధచంద్రత సమయంబువలన మించి, పూర్ణతను జెందు సనిని యప్పుడమిఱేఁడు, యావరాజ్యోత్తరమునందు నాధి రాజ్య, మంది పాపియించి మిక్కిలి యంద మందె. రఘువం. 7. 65.

3. నిగ్గు.

చ. ... అ, త్రిలోకి యొప్పుచుండె పసిడికిన మారుని వాలుదో లికన్. కృ. శకు. 2. 172.

4. ఆరోగ్యము.

**ససి**4 వి. (వైకృతము) (సం. సస్యం. క౦. ససి) పైరు, సస్యము.

క౦. ఖండించి వేఱ యొకశత, కాండంబున వారి తలయు ఖండించె మణీ, మండల కాంతుల వసుధా, ఖండంబున రత్నకోరకపు ససులెత్తన్. ముద. 5.13.

సీ. ఏమఁగంప తొడుగు లిడ్చిన మొల్క ససి యయ్యె, గగనంబుతో రాయు కావనములు ...

తే. కమల సంభవవరదాన గర్వితాను, రవర పట్టణ నిర్భరాక్రమణ వికృతి .... పాండురంగ. 5. 128.

క౦. ఒనఁగి రగస్త్యాక్షిములం, గొసరి జమల్ వార్ధి నీరు గ్రోలితి వినివ్, ససికై మాకిమ్మని క,న్కి నరుఁడు గంగాన నప్పగించెడు మాడ్కిన్. ఆము. 5. 127.

సీ. అసమాయుధుని కీర్తి ససులకైవడి మల్లికా కుంజవితతి మొగ్గలు దనర్చె వైజ. 292. (ప్రా. పా.).

ఎల్లకడల మెలఁగుచు ససినెల్ల మేయుచు. నీలా. 2. 43.

చం. చక్కనిమింట వేగునెలచందురు జింక వవేందు కాంతపుం, జక్కటిఁ దోఁచు రత్నమయ సౌధము లందుఁ గిరీటి పచ్చలా, మొక్కల డాలు పేరి ససి మొత్తము నిచ్చలుఁ జొచ్చి మేతకై, ద్రొక్కు వటంచు బందిచొరఁ దోలెఁ బురేందిర నాఁగరా కలన్. చంద్ర. చ. 63.

**ససియాడు** (క, ససి) దే. అ. క్రి. చెల్లచెదరుగా విసరి వేయు.

సీ. గజయూథముల......భీషణాకారములు దాల్చి పెచ్చు పెరిగి చంపి ససియాడి రొక నిమిషమున సమయ. కుమా. వం, 12. 83,6.

**ససులెత్తు** అ. క్రి. మొలకెత్తు, అంకురించు.

ద్వి. సిరులఁ జూపట్టు కానికములు గట్టి, పరస రత్నముల మూనకము లమర్చి, ససులెత్తునగువుల నయ్యాటయాడు నొసపరి నెమ్మోము వొళకొంత వం?. అ, మ క. 5. 253 పు. 5 వం.

**ససువు** విశ. సాధువు.

సీ. మంచివాఁడు ససువు మంచి సాదువన సజ్జనుం డొప్పు. ఆం. భా. 2. 170.

క౦. అసురుల మాయోపాయలు, గసిమసఁగఁగనఁట మఖంబు గావఁగ నఁట! కా. పసుఁ దొకఁడఁట ససువులఁ గ్రొన్నిసువుల నడిగె నట మునులు నిర్మోహులకా. రామా, 4. 8.

**ససువు** స. క్రి. విజృంభించు, ఖండించు.

**ససేమిరా** అవ్య. మొండి పట్టుదలను సూచించు పలుకు.

వ్యవ. ఎంత చెప్పినా వాడు ససేమిరా నేను రా నన్నాడు.

**ససైన్యము** సం. విశ. (అ. ఆ. అ) చతురంగ బలముతోఁ గూడినది.

**సస్కాని** వి. రెండు డబ్బుల నాణెము. (శ. ర.)

**సస్పృహము** సం. విశ. (అ. ఆ. అ.) 1. కోర్కి గలది. 2. ఆశ గలది. 3. అభిలాష కలది.

**సస్మితము** సం. విశ. (అ ఆ. అ.) చిఱునవ్వు గలది. మందహాసముతోఁ గూడినది.

**సస్యకము** సం. విశ. (అ ఆ. అ) మంచి లక్షణ ములు కలది. గుణవంతము, శుభము.

**సస్యకము** సం. వి. అ. పుం. 1, ఖడ్గము. 2. ఆయు ధము. 3. ఒక విధమైన రత్నము.

**సస్యప్రదము** సం. విశ. (అ. ఆ. అ.) సారవంత మైనది. 2, చక్కని ఫలము నొసఁగునది.

**సస్యమారి** సం. విశ. (న్. ఈ. న్.) పైరును నాశము చేయునది.

**సస్యమారి** సం. వి. న్. పుం. ఒక విధమైన ఎలుక.

**సస్యము** సం. వి. అ. న, (రూ. సశ్యము) 1. పైరు. 2. వృక్షాది ఫలము. 3. ఆయుధము. 4. సుగుణము, శుభలక్షణము. పుణ్యము.

**సస్యసంవరము** సం. వి అ. పుం. సాలవృక్షము.

**సస్యేష్టి** సం. వి. ఇ. స్త్రీ. క్రొత్తపైరు పంటకు వచ్చు సమయమున చేయు యజ్ఞము.

సస్వేద నం. వి. ఆ. స్త్రీ. అప్పుడే చెఱచఁబడిన కన్య.

సస్వేదము నం. విశే. చెమటచేఁ దడిసినది, చెమర్చినది.

సస్సెము వి. (సం. సస్యం) పైరు, సస్యము

సహ నం. అవ్య. సాహిత్య బోధకము.

కం. మీరును గుంతియు సహ పరివార మహా మాత్య భృత్యవర్గులరై. భా. ఆది. 6. 188.

సహ నం. వి. ఆ. స్త్రీ. 1. భూమి. 2. చేమంతి (వృ. వి.) 3. చిన్న గోరంట. (వృ. వి.) 4. పిల్లిపెసర (వృ. వి.).

సహ నం. వి. స్ పుం. 1. మార్గశీర్ష మాసము. 2. హేమంత ఋతువు.

సహ నం. వి. స్. న. 1. వెలుఁగు, తేజస్సు. 2. బలము, శక్తి, 3. జయము. 4. ఔద్ధత్యము. 5. జలము.

సహకరించు నం. అ. క్రి. తోడుపడు, కలసి పని చేయు.

సహకారభంజిక నం. వి. ఆ. స్త్రీ. ఒక క్రీడా విశేషము.

సహకారము నం విశే. "హ" కారముతోఁ గూడినది.

సహకారము నం. వి. అ. పుం. 1. తియ్య మామిడి చెట్టు 2 కలిసి పని చేయుట. 3. తోడ్పాటు, 4. ఐకమత్యము.

సహకారి నం. విశే (న్. ఈ. న్.) తోడు పడునది, కలిసి పనిచేయునది.

సహకృతము నం విశే. (అ. ఆ. అ.) సహకరింపబడినది, కలిసి చేయఁబడినది.

సహకృత్తు నం. విశే. త్. సహకరించునది.

సహకృత్తు నం. వి. త్. పుం. సహాయుఁడు, తోడివాఁడు, కలసి మెలసి యుండువాఁడు.

సహగమనము నం. వి. అ. న. 1. కూడఁబోవుట 2 భర్తతోఁగూడ చితిఁజొచ్చుట. (దీని సాగుమానము అందురు).

సహచరము నం. విశే. (అ. ఈ. అ.) 1. వెంటఁబోవునది 2. కలసియుండునది.

సహచరము నం. వి. అ. పుం. 1. పామి. కురువ. 3. పచ్చపువ్వుల ములుగోరింట.

సహచరి నం. విశే. వెంట నడచునది.

సహచరి నం. విశే. ఈ. స్త్రీ. 1. స్నేహితురాలు, చెలికత్తె 2. భార్య. 3. పచ్చపువ్వుల ములుగోరింట

సహచరితము నం. విశే. (అ. ఆ. అ). 1. వెంటనుండునది. 2. కూడియుండునది. 3. కలిసియుండునది.

సహచరుఁడు నం. వి. అ. పుం 1. వెంటనుండువాఁడు. 2. మిత్రుఁడు. సహాయుఁడు. 3. సేవకుఁడు, అనుచరుఁడు. 4. భర్త.

సహచారము నం వి. అ. పుం. 1. అనుసరించుట. వెంటఁబోవుట 2. అంగీకారము. సమ్మతి. ఐకమత్యము. 3. (తర్కమున) హేతుసాధ్యముల యొక్క యవినాభావసంబంధము. 4. సామ్యము. 5. కలసియుండుట, విడిపోకుండుట.

సహచారి నం. విశే. న్. 1 స్వతస్సిద్ధమై పుట్టుకతో వచ్చినది. సహజమైనది. 2 వంశక్రమాగతమైనది, పైతృకమైనది.

సహజ నం. వి. ఆ. స్త్రీ. తోడఁబుట్టినది, సోదరి.

సహజమిత్రులు నం. విశే. ఆజన్మమిత్రుడు.

సహజము నం. విశే. (అ. ఆ. అ.) 1. కూడఁబుట్టినది. 2. స్వాభావికము. 3. జన్మసిద్ధమైనది.

సహజము నం వి. అ. పుం. స్వభావము.

సహజాతము నం. విశే. (అ. ఆ. అ.) తోడబుట్టినది, కలిసి పుట్టినది.

సహజారి నం. వి. ఇ. పుం. అజన్మ శత్రువు.

సహజీవనము నం. వి. అ. న. 1. సంఘ జీవనము. 2. కలసి మెలసి జీవించుట. 3. మైత్రి, సాహచర్యము.

సహజుఁడు నం వి. అ. పుం. సోదరుఁడు, తోడఁబుట్టినవాఁడు

సహత నం. వి. ఆ. స్త్రీ. కలయిక, కూడిక, ఐకమత్యము, కలసికట్టుతనము.

సహదారుఁడు నం. వి. అ. పుం. భార్యతోఁ గూడినవాఁడు, వివాహితుఁడు.

సహదేవుఁడు నం వి. అ. పుం. పంచ పాండవులలో

చేసినవాఁడు.

**సహధర్మచరి** సం. వి. ఈ. స్త్రీ. భార్య.

**సహధర్మచారి** సం. వి. న్. పుం. 1. భర్త. 2. కలసి పని చేయువాఁడు, సాటి కార్మికుడు.

**సహధర్మచారిణి** సం. వి. ఈ. స్త్రీ. అగ్నిసాక్షిగాఁ బెండ్లాడబడిన భార్య.

**సహధర్మము** సం. వి. అ. పుం. సమాన ధర్మము, తుల్యగుణ కర్మాదికము.

**సహధర్మి** సం. విశ. న్. పుం. సమాన ధర్మము గలవాఁడు, సాటివాఁడు.

**సహధర్మిణి** సం. వి. ఈ. స్త్రీ. సహధర్మ చారిణి.

**సహనము** సం. విశ. ఓర్చునది.

**సహనము** సం. వి. అ. న. ఓర్పు, క్షమ.

**సహపథి** సం. వి. న్. పుం. తోటిబాటసారి, సహయాత్రికుఁడు.

**సహపాంశుకిలుఁడు** సం. వి. అ. పుం. పసితనము నుండియు గలసి మెలసి యున్న మిత్రుఁడు.

**సహపాఠి** సం. వి. న్. పుం. తోటి విద్యార్థి.

**సహభావి** సం. వి. న్. పుం. 1. మిత్రుఁడు. 2. భాగస్వామి. 3. అనుచరుఁడు.

**సహభువు** సం. విశ. (ఉ. ఉ. ఉ.) సహజమైనది, స్వాభావికమైనది.

**సహభోజనము** సం. వి. అ. న. బంధు మిత్రులతోఁ గలసి భుజించుట.

**సహమరణము** సం. వి. అ. న. సహగమనము.

**సహమృత** సం. వి. ఆ. స్త్రీ. భర్తతో సహగమనము గావించినస్త్రీ.

**సహయుధ్వ** సం. వి. న్. పుం. సాటియోధుఁడు, కలసియుద్ధము చేయువాఁడు.

**సహరక్ష (స)ము** సం. వి. స్. పుం. మూఁడు విధములైన యాగాగ్నులలో నొకటి.

**సహరి** సం. వి. ఇ. పుం. సూర్యుడు.

**సహర్షము** సం. విశ. (అ. ఆ. అ.) సంతోషముతోఁ గూడినది.

**సహవసతి** సం. వి. ఇ. స్త్రీ. సహవాసము.

**సహవాసము** సం. వి. అ. పుం. కలసి యుండుట, మైత్రి.

**సహవాసి** సం. వి. న్. పుం. కలసియుండువాఁడు, ఒకయింట నివసించు వాఁడు, మిత్రుఁడు.

**సహసా** అవ్య. 1. బలాత్కారముగా 2. తొందరపాటుతో. అనాలోచితముగా. 3. ఆకస్మికముగా, ఏక కాలమున, 4. చిఱునవ్వుతో, స్మితముగా.

**సహసానము** సం. విశ. (అ. ఆ. అ.) 1. ఓర్పుగలది. 2. జయించునది.

**సహసానము** సం. వి. అ. పుం. 1. నెమిలి. 2. బలి. త్యాగము. 3. యాగము.

**సహస్యము** సం. వి. అ. పుం. పుష్యమాసము.

**సహస్రకరుఁడు** సం. వి. అ. పుం. సూర్యుఁడు.

**సహస్రకాండ** సం. వి. ఆ. స్త్రీ. తెల్లగఱిక.

**సహస్రకిరణుఁడు** సం. వి. అ. పుం. సూర్యుఁడు

**సహస్రతయము** సం. విశ. (అ. ఆ. అ.) వేయి రెట్లు.

**సహస్రతయము** సం. వి. అ. న. వేయి.

**సహస్రదంష్ట్రము** సం. వి. అ. పుం. వేయి కోఱలు గల చేప, పాఠీనము.

**సహస్రదీధితి** సం. వి. ఇ. పుం. సహస్ర కిరణుఁడు

**సహస్రదుఁడు** సం. వి. అ. పుం. శివుఁడు.

**సహస్రదృక్కు** సం. వి. శ్. పుం. 1. ఇంద్రుఁడు. 2. విష్ణువు.

**సహస్రధా** సం. అవ్య. 1. వేయిశకలములుగా. 2 వేయి రెట్లుగా.

**సహస్రధార** సం. వి. ఆ. స్త్రీ. దేవతా విగ్రహములను కడుగుటకై పెక్కు రంధ్రముల పాత్రనుండి విడువఁబడు జలధార.

**సహస్రధారము** సం. వి. అ. పుం. విష్ణు చక్రము.

**సహస్రనయనుఁడు** సం. వి. అ. పుం. సహస్రదృక్కు

**సహస్రనేత్రుఁడు** సం. వి. అ. పుం. సహస్రనయనుఁడు.

**సహస్రపత్రము** సం. వి. అ. న. కమలము 2. బెగ్గురుపక్షి.

**సహస్రపాత్తు** సం. వి. ద్. పుం. 1. విరాట్పురుషుఁడు. 2. విష్ణువు. 3. శివుఁడు. 4. బ్రహ్మ.

సహస్రబాహు సం. వి. ఉ. పుం. 1. కార్తవీర్యార్జునుఁడు, 2. బాణాసురుఁడు. 3. శివుఁడు. 4 విష్ణువు (అని కొందఱు).

సహస్రభుజ సం. వి ఆ స్త్రీ. దుర్గ

సహస్రభుజుఁడు సం వి అ. పుం. విష్ణువు.

సహస్రము సం. వి. అ. న. 1. వేయి, పది నూఱులు 2. పెక్కు, పెద్ద మొత్తము.

సహస్రమూర్ధుఁడు సం. వి. న్. పుం. విష్ణువు. సహస్రమౌళి.

సహస్రమౌళి సం వి. ఇ. పుం. విష్ణువు.

సహస్రరశ్మి సం. వి. ఇ. పుం. సూర్యుఁడు.

సహస్రరోమము సం. వి న్. న. కంబళము.

సహస్రలోచనుఁడు సం. వి. అ. పుం. సహస్రనేత్రుఁడు.

సహస్రవదనుఁడు సం. వి. అ. పుం. విష్ణువు.

సహస్రవీర్య సం. వి. అ. పుం. గఱిక. (వృ. వి.).

సహస్రవేధము సం. వి. అ. పుం. 1. పుల్లప్రబ్బి (వృ. వి.). 2. పుల్లగంటి.

సహస్రవేధి సం. వి. న్. పుం. కస్తూరి.

సహస్రవేధి సం. విశే. వేయింటిని వేధించునది.

సహస్రవేధి సం. వి. న్. న. ఇంగువ.

సహస్రశః సం. అవ్య. వేలకొలఁదిగా, వేయి విధములుగా.

సహస్రశిఖరము సం. వి. అ. పుం. వింధ్య పర్వతము.

సహస్రశీర్షుఁడు సం. వి. అ. పుం. విరాట్పురుషుఁడు.

సహస్రశ్రవణుఁడు సం వి అ. పుం విష్ణువు.

సహస్రహర్యశ్వము సం. వి. అ పుం. ఇంద్రుని రథము.

సహస్రహస్తుఁడు సం. వి. అ. పుం. శివుఁడు

సహస్రాంశువు సం వి. ఉ. పుం సూర్యుఁడు, వేవెలుఁగు.

సహస్రాక్షుఁడు సం విశే. 1. వేయికన్నులు కలవాఁడు 2. జాగ్రత్త గలవాఁడు.

సహస్రాక్షుఁడు సం. వి. అ. పుం. 1. ఇంద్రుఁడు 2. విరాట్ పురుషుఁడు. 3. శివుఁడు. 4. విష్ణువు.

సహస్రాధిపతి సం. వి ఇ పుం. వేయిగ్రామములకు [illegible]కుఁడు.

సహస్రాననుఁడు సం. వి. అ. పుం. విష్ణువు.

సహస్రార్చి సం. వి. స్. పుం. సహస్రాంశువు.

సహస్రావరము సం. వి అ పుం [illegible] వేయింటికిలోఁబడిన ధనములజరిమానా.

సహస్రి సం. విశే. న్. 1. వేయికలది 2. వేలతోఁ కూడినది. 3. వేయి మొత్తమైనది. (జరిమానా మొ)

సహస్రి సం. వి. న్. పుం. 1. వేయిమంది యొక్క లేక వేయింటి సమూహము. 2. వేయిమందిగల సేనకు నాయకుఁడు.

సహస్వత్తు సం. విశే. బలిష్ఠము, శక్తిమంతము.

సహాధ్యయనము సం. వి. అ. న. 1. కలసి చదువుకొనుట. 2. సహాధ్యాయిత్వము.

సహాధ్యాయి సం. వి. న్. పుం. సహపాఠి.

సహాయత సం. వి. ఆ. స్త్రీ. 1. సహాయుల సమూహము. 2. కలయిక, మైత్రి. 3. సాయము, తోడ్పాటు.

ఉ. అమ్మెయి బంధుమిత్త్రుల సహాయత కల్మి ప్రయోజనంబు లేదు. భార. అశ్వ. 1. 118.

సహాయము సం. వి. అ. పుం. తోడ్పాటు, పోషణ. 2. ఎఱ్ఱబాతు 3. ఒక విధమైన పరిమళము. 1. తోడ్పాటు.

కం. అనుటయు వాఁడు హరి కిట్లను నేను రణంబునకు సహాయం బొల్లన్. భార. ఉద్యో. 1. 86.

కం. అలఘు బలవిక్రమోదాత్తులకైనను బలము లేక దౌర్గత్యముమై, గెలువఁగ వశమె సహాయము భాగ. 1. 15.

కం. తగిన సహాయము గలిగిన, పగతుని యెడ మొక్కలంపుఁబనిగా దనిపన్. ప్రబోధచం. 1. 52.

సహాయుఁడు సం వి. అ. పుం. 1. మిత్రుఁడు, సహచరుఁడు. 2. అనుచరుఁడు, అనుసారి. 3. తోడ్పడువాఁడు, పోషకుఁడు. 4. శివుఁడు. 5. తోడైనవాఁడు.

క నిశాచను బ్రాహ్మణ విద, ఘను గన్న సహా య. గని కొడుకు, భా. ఆది. 6. 6..

సహారము సం. వి అ. పుం. 1. మామిడిచెట్టు వృ. వి. 2. సర్వనాశనము, మహాప్రళయము.

సహారిపు వి. ఖాదము సంబంధి పరిభాష.

ఉ. ఇంతయు నేల మీకు వెదురెక్కటిలో మునికిం ఒదాఱు నెల్లితుం గడళ్ల కాంకున వెలిందడ పారెరెక్కపు దిత్తు నెల్లంతవ సంగ్రహించిన సహా రవుతోం గనుమాడిపోయినం, బంతముతో దొహార మునం ఒట్టిరం కాసిః బొమ్మ గట్టదన్. ఉ. హరి. 2. 117.

సహార్థము సం. విశ. (అ. అ. అ.). 1. సమాన లక్ష్య ముగలది. 2. సమానమైన యర్థము గలది.

సహార్థము సం. వి. అ. పుం. సమానలక్ష్యము లేక ప్రయోజనము.

సహాసనము సం. వి. అ. న. ఒకే ఆసనమునం గూర్చుండుట.

సహి(యి)ంచు సం. న. క్రి. 1. క్షమించు.

వ. వాఁడును గడు భీతుండయి యగ్నిదేవునకు నమస్కరించి మహాపురుషా! నా యజ్ఞానంబు సహింపవలయునని. భార. సభా. 1. 255.

ఉ. అక్క మలాక్షి పొందు దగనాడి తుదిన్ నిజమేది నేఁటిరే యిక్కకు రాక తక్కిన సహించునె వన్ మరుఁడు. భార. విరా. 2 196.

2. ఓర్చు.

చం. ... విను మాతుల! మానధనాఢ్యుఁ డైన భూపతి సహింపనోపునె! సపత్నుల వృద్ధియు నాత్మహానియున్. భార. సభా. 2. 78.

దశగ్రీవదో, గ్బలమైనన్ సహియింపవచ్చు. ఉ. రా. 1. 157.

సహిత సం. విశ. ఋ. సహించునది, ఓర్పుకొనునది.

సహితము సం విశ. (అ అ అ). 1. కూడి యున్నది. కలిసియున్నది. 2. సహింపఁబడినది. ఓర్వఁబడినది.

సహిష్ణుఁవు సం. విశ (ఉ. ఉ. ఉ.). ఓర్పుకొనువది, సహించుశీలము గలది.

సహురి సం. వి. ఉ. పుం. సూర్యుఁడు.

సహురి సం వి. ఈ. స్త్రీ. భూమి

సహృదయము సం. విశ. (అ. అ. అ.). 1. మంచి హృదయముగలది, దయగలది 2. చిత్తశుద్ధిగలది.

సహృదయుఁడు సం. వి అ. పుం. 1. విద్వాంసుఁడు. 2. సజ్జనుఁడు. 3. విమర్శవంతుఁడు, వివేకి.

సహేలము సం. విశ. విలాసముతోఁ గూడినది, వినోద ముతోఁ గూడినది.

సహోక్తి సం. వి. ఇ. స్త్రీ. ఒక యర్థాలంకారము.

సహోఢుఁడు సం. వి. అ. పుం. 1. వివాహ కాలమున గర్భవతియై యున్న భార్యకుఁ బుట్టిన వాఁడు. (ద్వాదశ పుత్రులలో నొకఁడు). 2 దొంగిలింపఁ బడిన సొత్తుతోఁ బట్టుపడిన దొంగ.

సహోదరి సం. వి. ఈ. స్త్రీ. తోడఁబుట్టువు, సోదరి.

సహోదరుఁడు సం. వి.అ. పుం. సోదరుఁడు.

సహోపమ సం. వి. అ. స్త్రీ. ఒక విధమైన ఉపమా లంకార భేదము.

సహోరము సం. విశ. మేలయినది. శ్రేష్ఠమైనది.

సహోరుఁడు సం. వి. అ. పుం ముని, ఋషి.

సహ్యజ సం. వి. ఆ. స్త్రీ. కావేరినది.

సహ్యము సం. విశ. 1. భరింపఁదగినది, ఓర్వఁదగినది, సమర్థింపఁదగినది. 2. ఓర్వవలసినది. 3 ఓర్పుగలది. 4. సరిపడినది. సరియైనది. 5. తీయనిది, పథ్యమై నది. 6. బలమైనది. శక్తిమంతమైనది

సహ్యము సం. వి. అ పుం సప్త కులపర్వతములలో నొకటియైన సహ్యము అను పశ్చిమ సముద్రతీర పర్వతము.

సహ్యము సం వి. అ. న. 1. ఆరోగ్యము, రోగోప శాంతి. 2. సహాయము, తోడ్పాటు. 3. యోగ్యత, పర్యాప్తి.

సహ్యాత్మజ సం వి. ఆ స్త్రీ. సహ్యజ.

సళాది పెద్దయధికారి నౌకరు, మడియగాని కింకరుఁడు

ఎ. గీ. ముద్రగరిటియ భుజముపై మొనయఁబెట్టి, ఘంట ఖంగని మ్రోయవంగళ్ల బడిని, మరిగితిరుగు సళాదికి మడియకాండ్ర, కవని బడికాఁపునా వింత నలరు సంత. హంస. 2. 49.

**సళించు** అ. క్రి. దుఃఖించు.

కం. శేమా ! నీ వెత మానుష, శేమా ? మోమోట మున సళింపఁగ నిపుడే, శే ? మాఱుమాట యొసఁగుము. నీలా. 2 ఆ. [illegible]

**సళిగె** (సం. సలాక. క. సలిగె) బద్ద.

ద్వి. ... ఆల, వట్టముల్ నిలువుల వల్లిక వెదురు సళిగెలున్ సంబెనల్ సానలు ముగ్గు (వెదురుసలగెల సంబెలల్ (కావ్రు). పండితా. పర్వత. 248.

**సళియము** వి. కలయంపి.

ద్వి. ఎల్లెడ సళియంబు లిప్పించి రంగ, వల్లులు బెట్టించి వాడవాడలను. పండితా. మహిమా 259.

ద్వి. ... సిద్ధేశ్వ, రము నాదియవనీశ్వర స్థానములును, సల్లలితములుగా సళియమిప్పించి, పెల్లుగా ముగ్గులు పెట్టంగ బంచి. పండితా. పర్వత. 268.

**సళుపరించు** అ. క్రి. వ్రణములోనగునది పోటెత్తు.

**సళుపరింత** వి. సళుపరించుట, సళుపు.

**సళుపు** అ. క్రి. వ్రణము లోనగునది పోటెత్తు.

**సళుపు** వి. వ్రణములోనగు దానిపోటు.

**సళువు** విశ. ఖారమైనది.

**సళ్లబెట్టు** (సళ్లన్ + పెట్టు) స. క్రి. సడలఁజేయు.

సీ. సనక సనందనాది నిఖిలాంతర్వాణి హృల్లీన భావంబు సళ్లఁబెట్టి. పాండురంగ. 2. 10.

ఉ. చంచలనేత్ర దాల్చు జలజాతమృణాల సరంబు వేగ సళ్లించిన బాఱు తెంచి కబళించి ... ఆము. 5. 150.

**సళ్లు** అ. క్రి (సడలు యొక్క రూపాంతరము) 1. వెనుకకు తగ్గు.

కం. అనివదము విని యాదవ, సేనలు పొంగారె నెదిరి సేనలు సళ్లెన్.

చం. చొరఁబడి కాంచి ప్రాంతలును చుట్టియు గుత్తులు వేసి సందిటం, బెనయగఁ బట్టి చెక్కు గఱపించి గిరేర్పడగిచి నిల్చి కొంకక యగఁ జూచి పందియవు చెంకువ దిద్దుచేఁ జిక్కు వేసి సళ్ళిరిమఱి వోయట సము ఱికెళ్ళ జాలు దమ్ము లాడగన్. హ. [illegible] 218.

2. సళి చు, జాఱు.

తే. గీ. కిటిలో మిడిమేలు విఱుచి విఁము, సాఁగఁ గొన్నాళ్ళు నిజ పిత్ర సంచితంబు, బొల్లుగాఁ జల్లియవియొల్ల [illegible] యును, దల్లడిల్లుచు దుర్మార్గతల్లజుండు. ప్రబం. 1. 870.

**సళ్ళు** స. క్రి. విడుచు, వదలు.

చం. కఱచిన కాటుపిఁ కొడిగంబుగఁ బట్టిన వట్టు సళ్ళక, త్త ఱగిలకొట్టి పల్కు చెకిసపుఁ బెన కువ గొళ్ళ నొక్కుచున్. చంద్రా గ. 5 152.

చం. కఱచియుఁ [illegible] దాచియును గట్టులు చెట్టులు చిట్టువై చియున్, ... బిగవు సళ్ళక తోఁక లఁ జుట్టి కొట్టియున్, పఱి పఱి యాము చేమఁ గుల మావుల లొట్టియల గడిదిగా, మఱుమొన రించి హెచ్చరిక మూల్కొనఁదేసలు పిండి సేయుచున్. అ. రా. యుద్ధ. 181.

## సా

**సా అను ఒక అక్షరము**

**సా** సం. వి. ఆ. స్త్రీ. 1. లక్ష్మి 2. పార్వతి. 3. దేహకాంతి.

**సా** వై. విశ వృత్తియందు సాము శబ్దమునకు అంత్యవర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. (సాఁబాలు. సామేను మొ)

**సాంకర్యము** సం. వి. అ. న. మిశ్రణము, కలయిక, భిన్న ద్రవ్యాముల కలయిక, కలగలుపు.

**సాంకలము** సం. వి. అ. న. సంకలనము వలన నేర్పడినది.

**సాంకలి** సం. వి. ఈ. స్త్రీ. సాంకలము.

**సాంకవము** సం. వి. అ. పుం. సంకుమదము, జవాది.

**సాంకాలిక** సం వి. ఆ. స్త్రీ. ప్రతి దినము నిచ్చెడి వడ్డి.

**సాంకాశ్య (ము)** సం. వి. ఆ. స్త్రీ. అ. న. జనకమహారాజు తమ్ముఁడగు కుశధ్వజుని రాజధాని.

సాంకేతికము. సం. విశే. (అ. ఈ. అ.) 1. సంకేతము లేక చిహ్నములకు సంబంధించినది. 2. సాంప్రదాయికము. 3. ప్రయోగ నైపుణ్యమునకు సంబంధించినది. 4. సంకేతము వలన తేల్పినది.

సాంక్షేపికము సం. విశే. (అ. ఈ. అ.) సంక్షిప్తము, క్లుప్తము, సంగ్రహము.

సాంఖ్యము సం. విశే. (అ. అ. అ.) 1. సంఖ్యకు సంబంధించినది. 2. లెక్కించునది, గణించునది. 3. వివేచించునది. 4. పరిశీలించునది, చర్చించునది. తర్కించునది

సాంఖ్యము సం. వి. అ. పుం. న. షడ్దర్శనములలో నొకటి (చూ. దర్శనములు.).

సాంఖ్యుఁడు సం. వి. అ. పుం. 1. సాంఖ్య దర్శనానుయాయి. 2. శివుఁడు.

సాంఖ్యముఖ్యుఁడు సం. వి. అ. పుం. శివుఁడు.

సాంగకము సం. వి. అ. న. ఒక చేయి మాత్రమే ప్రయుక్తమగు పసంయుత హస్తాభినయము నందలి యొక ముద్ర.

సాంగతికము సం. విశే. (అ. ఈ. అ.) 1. సంఘమునకు సంబంధించినది. 2. జత కూర్పునది. కలుపునది.

సాంగతికుఁడు సం. వి. అ. పుం. 1. అతిథి, ఆగంతుకుఁడు. 2. కార్యార్థమై వచ్చినవాఁడు.

సాంగత్యము సం. వి. అ. న. 1. కూడిక, కలయిక, చేరిక. 2. మైత్రి, స్నేహము. 3. ఒక సారస్వత ప్రక్రియ.

సాంగమము సం. వి. అ. పుం. కలయిక, సంఘము, సమావేశము.

సాంగము సం, వి.శే (అ. అ. అ.) 1. అవయవములు లేక భాగములు గలది. 5. శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము, అను వేదాంగము లారింటితోఁ గూడినది.

సీ. ... ఆపస్తంబసూత్ర పవిత్రశీలుఁడు సాంగవేదవేది. భార. విరాట, 1. 10.

సీ. సాంగంబు లగుచుండ సకల వేదంబులుఁ జదివె వసిష్ఠుతో ... భార. ఆది. 4. 169.

4. సంపూర్ణమైనది.

తే సాంగముగఁ దండ్రి కగ్నికార్యములు దీర్చి, వివిధభంగి యథావిధి విప్రవరుల, నిష్టనిఖిలార్థ దానసంతుష్టిఁ దేల్చి, యడలు రఘువీర వనయాత్ర నాత్మ దలచి. రామా. 5. 9.

సాంగుబలా వి. 1. వేత్రధరులు హెచ్చరిక చేయునపు డుపయోగించు పదము. (రూ. సా(ం)గుబళా.)

కం. కుఱచలియు వేత్రధరు లొత్తిలి సాంగుబళాయనంగఁ దేరు డిగి. వసు. 1. 150.

ద్వి. కోటికట్టికలు సాఁగుబలా యనఁగ. రం. రా. కిష్కిం. చి. ని. పా.

2. పతి విశేషము, ఎరఁగుడు.

వ. ప్రయాగ యందలి మాధవునకు సాంగుబలా గయయందలి గదాధరునకు మొ్రొక్కు. ప్రబం. 1. 880.

రగడ. విక్రమస్థలి త్రివిక్రమ హరికిని సారెకు సారెకు సాంగుబళా యని. హంస. 4. 218.

సాంగోపాంగము సం విశే. (అ. అ. అ.) అంగములతోడను, ఉపాంగములతోడను గూడినది. సవిస్తరమైనది, సంపూర్ణమైనది.

సాంగ్రామికము సం విశే. (అ. ఈ. అ.) 1. యుద్ధసంబంధి. 2. కలహశీలి. 3. ఉగ్రము, ఉద్ధతము.

సాంగ్రామికుఁడు సం. వి అ. పుం. సేనాపతి.

సాంఘాతికము సం. విశే. (అ. ఈ అ) వినాశకరము, మృత్యుకరము.

సాంఘికము సం. విశే. (అ. ఈ. అ.) సంఘమునకు సంబంధించినది.

సాంజనము సం. వి అ పుం. బల్లి.

సాంతపనము సం. వి. అ న. మూఁడు దినములు పగళ్లును మూఁడు దినములు రాత్రులును భోజనము చేసి మూఁడు దినములు అయాచిత లబ్ధపదార్థంబులను భుజించి పిమ్మట మూఁడు దినములు నిట్టుపాసనముండెడు వ్రతము. (పంచగవ్యమును కుశోదకమును పుచ్చుకొని ఒక రాత్రి యుపవాసముండుట అని కొందఱు) శ. ర.

సాంతము సం. విశే. (అ. ఈ. అ.) అంతము గలది. 2. పూర్ణము, పూర్తియైనది, 3. మొత్తము. 4. సకారము అంతముగాఁ గలది.

సాంతరము సం. విశే. (అ. ఈ. అ.) 1. ఎడము గలది, విరళమైనది, విరామములు గలది. 2. జల్లినేఁత గలది. జల్లి కూర్పు గలది.

సాంతానికము సం. విశే. (అ. ఈ. అ.) 1. వ్యాపించినది, విస్తరించినది. కొనలు సాఁగునది. 2. సంతానమునకు (వంశమునకు) సంబంధించినది. 3. సంతాన వృక్షమునకు సంబంధించినది.

సాంతానికుఁడు సం. వి. అ. పుం. సంతానము కొఱకు పెండ్లాడఁగోరువాఁడు (బ్రాహ్మణుఁడు).

సాంత్వన (ము) సం. వి. అ. స్త్రీ అ. న. 1. శాంతపఱుచుట, ఓదార్చుట. 2. సంధి చేయుట, సామోపాయము, 3. సాదర వచనము. సామవచనము. 4. శాంతము, మార్దవము. 5. ఆదరము తోడి పలుకరింపు, పరామర్శ.

సాంత్వము సం. వి. అ. పుం. సాంత్వనము. విశే. అ. ఆ. అ మృదువైనది, మధురమైనది, స్నిగ్ధమైనది (వాక్కు).

సాందీపని సం. వి. అ. పుం. ఒక ఋషి (శ్రీకృష్ణ బలరాముల యుపాధ్యాయుఁడు).

సాందృష్టికము సం. విశే. (అ. ఆ. అ) తత్కాల ప్రత్యక్షమునకు సంబంధించినది. అప్పటికప్పుడు కనిపించునది.

సాందృష్టికము సం వి. అ. న. సద్యఃఫలము, తత్క్షణ ప్రయోజనము.

సాంద్రము సం. విశే. (అ. ఆ. అ.) 1. చిక్కనిది. దట్టమైనది, ఎడము లేనిది.

సీ. తే. సాంద్రతర చంద్రికా కేళిచంద్రమములు. పారిజా. 1. 65.

2. మోహమైనది, ముదుకయైనది. 3. క్రిక్కిరిసినది. ప్రోగైనది. 4. బలిసినది, దృఢమైనది. 5. అతిశయమైనది, సమృద్ధమైనది. 6. గాఢమైనది, తీవ్రమైనది. 7. ద్రవమైనది, స్నిగ్ధమైనది, జిడ్డు గలది. 8. నున్ననిది, మెత్తనిది. మనోహరము, సుందరము.

సాంద్రము సం. వి. అ. పుం. 1. ప్రోగు, రాశి, గుంపు. 2. పొద, అడవి, గుబురు.

సాంధికుఁడు సం. వి. అ. పుం. సారాయము బట్టి పట్టువాఁడు.

సాంధివిగ్రహికుఁడు సం. వి. అ. పుం. విదేశ వ్యవహారములు నిర్వహించు మంత్రి.

సాంధ్యము సం. విశే. (అ. ఈ. అ.) 1. సాయం సంధ్యా సంబంధి. 2. ఉదయ సంధ్యా సంబంధి.

సాంధ్యరాగము సం. వి. అ. పుం. ఉదయ సాయం సంధ్యలకు సంబంధించిన యెఱుపు.

సీ. స్నాతకవల్కల జాతనోద్ధత కాంతి సాంధ్యరాగద్యుతి సంహరింప. ఉ. హ. 2. 111.

సాంపరాయము సం విశే. (అ. ఈ. అ.) 1. యుద్ధ సంబంధి, ఉద్ధతము 2. ఆముష్మికము, భవిష్యము. వి అ. పుం. న. 1. విరోధము. కలహము. 2. భవిష్యత్తు, ఉత్తరజన్మము. 3. పరలోక ప్రాప్తి సాధనము. 4. భావిని గూర్చిన చింత. 5. విచారము, పరిశోధన. 6 సందిగ్ధావస్థ, అనిశ్చయము.

సాంపరాయకము సం. విశే. (అ. ఈ అ.) చూ. సాంపరాయము.

సాంపరాయికము సం. వి అ. న. యుద్ధము, కలహము.

సాంపరాయికము సం వి. అ పుం. యుద్ధ యోగ్యమైన రథము.

సాంప్రతము సం విశే. (అ. ఆ. అ.) 1. ఉచితము, తగినది 2. అనుకూలము, సంబద్ధము.

సాంప్రతికము సం. విశే. (అ. ఈ. అ ) 1. తగినది, ఉచితమైనది, ఒప్పయినది. 2 వర్తమాన కాలమునకు సంబంధించినది.

సాంప్రదాయికము సం. విశే (అ. ఈ అ.) 1. ఆచారమునకు సంబంధించినది 2 వంశ పరంపరాగతమైనది

సాంబంధికము సం. విశే (అ. ఈ. అ ) చుట్టఱికము వలనఁ గలిగినది.

సాంబంధికము సం వి అ, న. చుట్టఱికము, సంబంధము.

**సాంబరము** సం. వి. అ. న. సాంబరమున ఉత్పన్నమైన ఉప్పు.

**సాంబరి** సం. వి. ఈ. స్త్రీ. రూ. శాంబరి 1. ఇంద్రజాలము, మాయ, 2. మాంత్రికురాలు.

**సాంబారు** వి. (తమిళం) ఒక విధమైన పప్పుచారు.

**సాంబుఁడు** సం. వి. అ. పుం. 1. అంబ (పార్వతి)తోఁ గూడినవాఁడు. 2. శివుఁడు. విశే. అ. ఆ. అ. తల్లితోఁ గూడినవాఁడు.

**సాంబ్రాణి[1]** వి 1. సాంబరేను చెట్టు వలనఁ గలిగెడు ధూపద్రవ్య విశేషము 2. ఉత్తమాశ్వము,
తె. "పసిడి పక్కెరతేజి సాంబ్రాణి నెక్కి" రామా. 4 ఆ. (శ. ...)

**సాంబ్రాణి[2]** సామ్రాణి (క సాంబ్రాణి) 1. ఒకానొక దేశము. 2. ఆదేశపు గుఱ్ఱము. విశే. సామ్రాణి దేశమందు బుట్టినది. ఆదేశపు గుఱ్ఱము.
సీ. తోరంపు సాంబ్రాణి ధూపధూమము గట్టు పగదారి బాబాలబాయఁ దీర్చి. దశావ. 1. 265.
వ. తుమ్మెదల యెమ్మెల కిమ్ముఁ జూపు సాంబ్రాణి ధూపధూమములతో. ఉ. రా. 1. 188.
తే. గీ. లలిత కలకంఠ కోలాహలంబు లెసఁగు, దశముకొని రెండుగెడలఁ గాదంబకోటి, గొల్వ రాచిల్క సాంబ్రాణి గుఱ్ఱ మెక్కి, దర్పకుఁడు పాంథజనులపై దండు వెడలె. ఉ. రా. 4. 156.
తే. గీ చిలుక సాంబ్రాణి తేజి వజీరుఁ గేరు, కమ్మ నెమ్మెన ... దశా. 9. 214.

**సాంబ్రాణివత్తి** వి. ఊఁదువత్తి.

**సాంభవి** సం. వి. ఈ. స్త్రీ. 1. ఎఱ్ఱలొద్దుగ (వృ. వి.). 2. సంభవత, కాఁగలది.

**సాంయాత్రికుఁడు** సం వి. అ. పుం. సముద్రము మీఁద వాణిజ్యము చేయువాఁడు, నౌకా వాణిజ్యము చేయువాఁడు, పోతవణిజుఁడు

**సాంయుగీనము** సం విశే. (అ. ఆ. అ.) యుద్ధసంబంధి, కలహశీలి, సమరకుశలి.

**సాంయుగీనుఁడు** సం. వి. అ. పుం. యుద్ధ వీరుఁడు, సమరకుశలుఁడు.

**సాంరావిణము** సం. వి. అ. న, పెద్ద కేక, ఉచ్చైర్నాదము, అఱుపు, బొబ్బ.

**సాంవత్సరము** సం. విశే. (అ. ఈ, అ.) వార్షికము, ఏడాదికొకతూరి జరుగునది.

**సాంవత్సరికము** సం. విశే. (అ. ఈ. అ.) వార్షికము, ఏటికొకతూరి జరుగునది.
సం. వి. అ. న. ఆబ్దికము. ఏడాదికొక తూరి పితృదేవతలనుద్దేశించి చేయు శ్రాద్ధకర్మ. దీనికి సంవత్సరికము అని వ్యవహారము కలదు.

**సాంవత్సరికుడు** సం. వి. అ. పుం. (రూ. సాంవత్సరుఁడు) 1. జ్యోతిష్కుఁడు. 2. పంచాంగకర్త ముహూర్తములు పెట్టువాడు. 4. జ్ఞాని 5. గణకుఁడు

**సాంవాదికము** (సం. విశే. అ. ఈ. అ.) 1. వ్యావహారికము, వాడుకలో నున్నది, ప్రజలు మాటాడునది. 2 వివాదాస్పదమైనది.

**సాంవాదికుఁడు** సం. వి. అ. పుం. వాది, తగవు తెచ్చినవాఁడు.

**సాంవృత్తికము** సం విశే. (అ. ఈ. అ.) క్షణభంగురము, ప్రాతిభాసికము.

**సాంశయికము** సం విశే. (అ. ఈ. అ.) 1. సందిగ్ధము. 2. అనిశ్చితము, అనిర్ణీతము. సం. వి. అ. న. సంశయాస్పదము, ఉపద్రవకారియైన పని.

**సాంశసంఖ్య** సం. వి. అ. అంశము అనగా ఒకటియందలి భాగము దానితో కూడిన సంఖ్య సాంశసంఖ్య. ఉదా: 1 1/4, 2 1/2, 3 3/4. (చూ. వాచ.)

**సాంసారికము** సం. విశే. (అ. ఈ. అ) 1. సంసారిక సంబంధి. 2. ఐహికము, ప్రాపంచికము.

**సాంసిద్ధికము** సం.విశే. (అ. ఆ. అ.) ప్రకృతి సిద్ధము, స్వాభావికము, సహజము 2 స్వతస్సిద్ధము, అయత్నసిద్ధము. 3. కేవలము, అకారణము. 4. దైవికము.

**సాంస్థానికుడు** సం. వి. అ పుం సజాతీయుఁడు, తన దేశపువాడు.

**సాంస్రావిణము** సం. వి. అ. న. ప్రవాహము, నది.

**సాంహననికము** సం. విశే. (అ. ఈ. అ.) శరీర సంబంధి, దైహికము.

**సాఁకించు** (సాఁకు + ఇంచు-స్వార్థమునం దించుగాగమము) స. క్రి. రక్షించు, కాపాడు.

ద్వి. అఁకొనకుండంగ నరసి పాలిచ్చి, సాఁకించి పెనుపదే జనని గల్గినను. బస. పురా. 52 పు. 46 పం.

సాఁకు స. క్రి. 1. రక్షించు. కాపాడు. 2. పెంచు (క. సాకు) క. ర., చి. ని., ధాతుమాల.

క. అడవులఁ బదునాల్గేడులు, గొడికెలకొడిగట్టి సాఁకుకొంటివి నుమ్మా, బడలిక నిపు డిఱ్ఱగడవు, పుడమిం బవళించి నిదుర వోయితొ తండ్రీ! అ రా యుద్ధ. 698.

ఉ. అక్కట దోసకోఁట యిదియైనఁదదీయ ఫలంబు లమ్మి యీ,డొక్కను సాఁకఁ గోరితి. శుక. 3.379.

గీ. జాగరూకుఁడవై నన్ను సాఁకుమయ్య, రామ లింగేశ! రామచంద్రపురవాస! రామ. శ. 105.

సాఁకుడుపులుగు వి. కోయిల.

సాఁగడీయు స. క్రి. (సాఁగన్ + ఈయు) 1. ప్రార్థించు. బతిమాలు 2. పొడిగించు.

సాఁగఁబడు అ. క్రి. (√సాఁగు) శరీరమంతయు భూమిమీఁద తాకునట్లుపడు, సాష్టాంగముచేయు.

ఉ. ముందఱ వచ్చి సాఁగఁబడి మ్రొక్కిన శౌరి కృపార్ద్రచిత్తుఁడై. పారి. 5-35.

సాఁగిలి వి. (√ సాగు) నతివిశేషము. సాష్టాంగ నమస్కారము.

వ. మధుర నున్న బాలకృష్ణునకు సాఁగిలి మాయా స్థలమందున్న మధుసూదనునకుఁ గోరిక. ప్రబం. 1. 890.

పాఁగిలు(ల్లు) = చాఁగిలు. 1. నేలకువ్రాలు.

చం....సుమోదభక్తిత,త్పరత దలిర్ప లేచి వరపాలుఁడు సాఁగిలిమ్రొక్కి వారికిన్. కళా. 4. 163.

2. సాష్టాంగ నమస్కారముచేయు, మ్రొక్కు.

శా....జగద్గురునకున్ సాఁగిల్లి యాభూవరున్ దీనున్ బ్రోవు కృపాసముద్ర యని యెతేఁ ప్రార్థనల్ చేసినన్. శ్రీరంగ. 6.66

పాఁగు[1] = చాఁగు[1] అ. క్రి. 1. సాష్టాంగ నమస్కారము చేయు.

గీ. ఇట్లు నేత్రోత్సవముగ లక్ష్మీశుఁ జూచి, భయము విడిచి సువర్వులు ప్రమదమొంది, సాఁగి పడిలమిల్లి లేచి హస్తములు మొగిచి, వినతు లొనరించి తగ విన్నవించి రిట్లు. జాహ్నవి. 1. 75.

2. దీర్ఘము గు.

అ. దివముకాని యుక భువనంబున, దిశ, వట్టి రాత్రిశేనియట్టు సాఁగఁ, జేసె నాకొ... వి... మించి కాక కా, నేఁడ దివముసాఁగి నిలిచె నౌకొ.. భార. విరా. 2 318.

వ. ఇంతులతో వింతులుసాఁగి. ఉ. రా. 4 183

3. పోవు, నడచు.

ద్వి. పుణ్యజను లాద్యులై పూర్వపుఁ బో..., పురము వెల్వడి సాఁగిపోవుచు నుండె హరిశ్చ.పూ. 1190.

4. అడుగున బ్రాడుగట్టిన కటారియలుగువంటి ఆయుధము (వాచ.).

సాఁగుడుమానిసి వి. పొడగరి.

సాఁచు స. క్రి చూ. చాచు.

సాఁచు వి. రేతస్సు (స్త్రీసంబంధి).

సాఁతు వి. గోనెలు నేయువారిజాతి.

వ....అవ్వీటి యేటిసాలె యగసాలె పటుసాలె వాని వైజాతి సాఁతు పెత్తుల కొమిరెలు...ఆము భార. 4. 85.

తే. కోటిసంఖ్యల మాదలఁగూడఁ బోయు, వన సరంబున నొక్కసాఁ తరుగుచెంచి. దశకు. 3 52.

సాఁబంతి విశే. సహపంక్తి (భోజనాది) : ఒకే వరుస యందలిది.

సాఁబాలు వి. సగముపాలు, అర్ధభాగము.

సీ. ఖర్జూరఫలములు గణకుండు కొనితెచ్చి సాఁబాలు మోహంపునతికి నిచ్చె. పావులూరి మల్లన.

సాక వి. (సం. చషకమ్, త. చరక) 1. కల్లు త్రాగెడి పాత్రము.

సీ. గ్రుక్కెడు చవిజూడు మక్క యీ మధువని తీపులు దమలోనఁ జూపికొనుచు. గీ. నెట్టి వస్తువు గడియించె నీతఁ డనుచు, బ్రహ్మ గొనియాడి యిది సాకఁబట్టు మనుచుఁ, బొట్ట కొలఁదిగ బోఁట్లకు బోసి పోసి, పరిణమించిరి యొఁడొండ తరుణులెల్ల. ద్వా 4. 259.

కం. చెలులకుఁ బన్నిదమాడిన, తెలఁగున మీ రూపు లొక్క తేవనె యనిచే, వలుకుచు బేకాళున కే, దైల

చెత్తుకు సాకసాకి సిగ్గున సేతుక్. ప్రబ. 1. 779.
2. జాడ హి. సాకా.

ద్వి. పలికె నిచ్చట మునిక పలికేదు మనకు, వలయు
చెచ్చటికైన పడి జనని యు, గాకున్న సాకసాకల
నిత్తెఱంగు, లోకు లెల్ల గిన లోకములలోన నవసిరి
వచ్చు. అవిసి ముప్పతి. నవనాథ 4. 143 పు.
9 పం.

ద్వి నా నాము డి కొక్కనాఁడు వాకల్ల సాకసాకల
బట్టి చంపెచుదావు, మెయికొంటి యొక్కటి
మీఁదటి తగవు నెయ్యంబుగలదిని నీకును వాకు.
నవనాథ. 1. 73 పు. 8 పం.

సాకతము వి. 1. అనుగ్రహము.

ఆ. వీను గట్టివాలుదాన నా కెవ్వరు, గడుపు
కూడు పెట్టి కట్టఁజీర, యిచ్చి సాకతమున నేలుదు
రట్టి వా, రలకుఁ బనులు సేసి మెలఁగు బుద్ధి.
భార. విరా. 1. 26.

చం. ... నేఁ గిచటికిం దవదివ్య రథంబుతోడ సా,
కతమునఁ బంపె చెంత పనిగల్గెనొ గాక శచీవిభుండు
విక్ర. 2. 75.

2. దయ.

కం. ఈ కృత్రిమసతి యిప్పుడు, మీ కులమున వెల్ల
దాన మృత్యు వన.గా, దూఁకొని మునలముఁ గను
వని, సాకతమటి వారి కతఁడు శాపం బిచ్చెన్. పద్మ
10. 270.

3. పోషణము.

కం. పేరు వలలు డు గూడుఁ, జీఁ యు నిడి సాక
తంబు సేసినఁ జాలుం భార. విరా. 1. 29.

4. ఊఁడింపు,

కం. కైకొను మర్చన మనవుడు, నా కోమలి దెలిసి
యర్ఘ్యమందుకొనియె ను,ల్లోకుఁ డగు నమ్మునీ
శ్వరు, సాకతమున శోకరహిన్ కాంతత బొందన్.
నిర్వ. 9. 46.

5. చేపట్టు (వాచ.).

సాకము వి. 1. వ్యాజము. నెపము, కపటము,
2. ఉత్సవము.

గీ. సాక మనఁగను వ్యాజ ముత్సవము దోఁచు ...
ఆం. భా. 3. 59. గ్రా.

సాకము నం. వి. అ. న. (చూ. శాకము)
పై దానితోఁ గూడ అనుటకు పేరు. (ధనం.)

సాకరము నం. విశ. (అ. ఆ. అ.) ఆధారము గలది,
ప్రమాణము గలది, సప్రమాణము.

సాకల్యము నం. వి. అ. న. సకలత్వము,
పూర్ణత్వము.

సాకాంక్షము నం. విశ. (అ. ఆ. అ.) 1. కోర్కె
గలది. 2. ప్రయోజనము గలది. 3. ప్రమాణమును
కోరునది.

సాకారము నం. విశ. (అ. ఆ. అ.) రూపము గలది,
శరీరము గలది.

సాకి (రి) వి. (నం. సాక్షి, త. చాక్కి. క. సాక్కి)
సాక్షి.

సీ పేఁడి సెగల్ గల్గువేల్పు సాకిరియైన యప్పుడు
గాని కే లంటరాదు. (కువల. 4. 49.)

సీ. సాక్షి యొప్పగు సాకె సాకిరి కరి యన ...
ఆం. భా. 2. 304 గ్రా.

తే. గీ. మీరు సాకిరు లని పల్కి భూరి ముదముఁ
దాను వ్రాసిన యట్టి పత్రంబు నజునిఁ, జదువుమన
నబ్జభవుఁ డంత నరవి దానిఁ, జదివె నీరీతి ధవదుఁ
డీశ్వరుఁడు వినఁగ. వేంకటాచలమా. 5. 159.

చం. ... దుర్గణా, సమితికి నీ నిమిత్తములె సాకిరి
గాచె నృపాలవందనా. ఉ. రా. 6 239.

సాకు వి. మిష, వ్యాజము, నెపము.

ఉ. ఎన్నకబంటవీవు నిను నేలికపిల్చి ప్రియంబు చెప్పి
నన్, నన్నకనన్నఁబోక పెఱనన్నల సాకులు పన్ను
టొప్పునే. పంచ. నా. 3. 220,

సాకురుండము నం. వి. అ. పుం. కర్కుంఫలము
(వాచ.).

సాకూతము నం.విశ. (అ.ఆ అ) 1. సాభిప్రాయము,
అర్థవంతము. 2. ఉద్దేశపూర్వకము. 3. నకామము,
ప్రీతితోఁ గూడినది, విలాసముతో గూడినది.

**సాకె** = సాకిరి. వి. సాక్షి.

సీ. సాటి యొప్పగు సాకె సాకిరికరియన .... అం. భా. 2. 308.

**సాకేతకుఁడు** సం. వి. అ. పుం. అయోధ్యా నగర వాసి.

**సాకేతము** సం. వి. అ. న. అయోధ్యా పట్టణము (వాచ.).

**సాకేతులు** సం. వి. అ. పుం. (నిత్య బహు.) అయోధ్యా నగర వాసులు.

**సాక్తుకము** సం. వి.అ. న. పుం. అ. న. (Barley) పేలాలరాశి, అ. పుం. యవధాన్యము,

**సాక్షాత్కరణము** సం. వి. అ. న. 1. కన్నుల కగ పడునట్లు చేయుట. 2. మానస ప్రత్యక్షము.

**సాక్షాత్కరించు** సం. అ. క్రి. ప్రత్యక్షమగు, కనఁబడు.

గీ. తన పదాంభోరుహములు తత్పరతఁ గొలువఁ, గడఁగు వారికి నేవేల్పు కల్పవృక్ష, మట్టి వేల్పు గదాధరు నాశ్రయింతు, నవిన సాక్షాత్కరించి నారాయణుండు. వరాహ. 2. 15.

**సాక్షాత్కరించు** సం. స. క్రి. ప్రత్యక్షము చేయు, కనిపింపఁజేయు.

సీ. పవమాన సూనుండు పగలు దీవటిఁబూని స్వప్రతాపంబు సాక్షాత్కరింప. దశా. 7. 186.

**సాక్షాత్కారము** సం. వి. అ. పుం. 1. ప్రత్యక్షమగుట. 2. ఇంద్రియ గోచరమగుట. 3. జ్ఞానము.

**సాక్షాత్కృతము** సం విశే. (అ. ఆ. అ) 1. ప్రత్యక్షము చేయఁబడినది, ఇంద్రియ గోచరము చేసి కొనఁబడినది. 2. భావనాదృష్టమైనది.

**సాక్షాత్కృతి** సం. వి. ఇ. స్త్రీ. = సాక్షాత్కారము.

**సాక్షాత్తు** సం. అవ్య. 1. ఎదుట, కండ్ల ముందు, బహిరంగముగా. 2. సాకారముగా, యథార్థముగా. 3. మాటిగా, తిన్నగా, స్వయముగా.

**సాక్షి** సం. విశే (న్. సి. న్.) 1. చూచునది, గమనించునది. 2. ఋజువు చేయునది, నిరూపించునది, నిర్ధారించునది.

**సాక్షి** సం. వి. న్. పుం. 1 [illegible] దేవమాత్మ్యుఁడు. 2. ప్రత్యక్ష జ్ఞానము [illegible]. 3. ఏ [illegible] కార్యమును [illegible] తెలిసినవాఁడు.

సీ. [illegible] వి విప్ర వంశ [illegible] జ్ఞా. వ్యవ. 108.

తే గీ. సత్యము [illegible] సాక్షిఁ గోరి. దశకు. 5. 6[illegible],

సాక్షులు పద [illegible] ద్రు, అ [illegible] కృత సాక్షు లేవురు, అకృత సాక్షు [illegible], కృతసాక్షులు:- లిఖితుఁడు, స్మారితుఁడు, యదృచ్ఛాభిజ్ఞుఁడు, గూఢుఁడు, ఉత్తరుఁడు అకృతసాక్షులు :- గ్రామస్థులు, ప్రాడ్వివాక లేఖక [illegible], రాజ కార్యాధికారి, వాదిచేఁ బంపఁబడినవాఁడు, కుల వివాదము లందు) కులము వారు. కృతసాక్షులు అనఁగా నిర్ణయించుకొనఁబడిన సాక్షులు అకృతసాక్షు లనఁగా నిర్ణయించుకొనఁబడని సాక్షులు. శ. ర.

**సాక్షిపలుకు** స. క్రి. సాక్ష్యమిచ్చు.

సీ. పైపైచెట్టమి యొకాని పైకొనుతమికల్మి, పత్తని పులకలు సాక్షి పలుక. కవి. 3. 213.

**సాక్షేపము** సం. విశే. (అ. ఆ. అ.) తిరస్కారముతోఁ గూడినది. నిందాత్మకమైనది, ఎత్తి పొడుచునది.

**సాక్ష్యము** సం. వి. అ. న. 1 సాక్షి కని విని చెప్పిన మాట. 2. ఋజువు. 3. ఏకాదశాహ శ్రాద్ధము, షోడశము. చనిపోయిన వారికి పదునొకండవ దినమున జరుగు శ్రాద్ధకర్మ.

**సాఖేయము** సం. విశే. (అ. ఈ. అ.) 1. మిత్రసంబంధి 2. స్నేహపూర్ణమైనది.

**సాఖ్యము** సం. వి. అ. న. స్నేహము, మైత్రి. చెలిమి.

**సాగగడ్డ** వి. పొడవైనగట్టు. తే. గీ. గగనమిరవైన నిదు సాగగడ్డ తోడ, కట్టెమట దోచె నఘడొక్క కమ్మకొలను. కకు. 2. 8 గు.

**సాగతము** వి- (సం. సాంగత్యమ్) 1. సంబంధము.

సీ. జమిలి పాములతోడి సాగతంబొల్లక సవరించు బంగారు జన్నిదమ్ము. హర. 5. 6.

2. మైత్రి.

ఉ. పట్టికరంబు తిన్నపటుపావకకీలలఁద్రోఁచి

ఉ. ...యు, గట్టిఁడి తండ్రి నిమ్ము నిటుగాల్పఁగ వద్దము పొమ్ము వానితోఁ, గెట్టిదమూద నిన్వేడలఁ గెట్టిన చుట్టఁతోడి సాగతఁ, బిట్టిరియయ్యె వౌర ఇలఁ జేమి తెలుఁగు మహోపకారముల్. వృసి.పాపు. 4. 107.

సాగనంపు స. క్రి. (సాగన్ + అంపు) ప్రయాణమై పోవు వానిని కొంత దూరము తీసికొనిపోయి విడుచు. శ. ర.

సాగనంపు అ. క్రి. అనుగమించు, వెంటవెళ్ళు.

ఆ. వె. కాలయాపనంబు గావించి భూపతి, సాగ నంపి తండ్రి నడిరవ్వ, నింక నిల్చుకావ వేనంచు మది నిశ్చయించి యతనితోడ నిట్టు లనియె. చెన్నబ. 5 178

సాగరగ నం. వి. అ. స్త్రీ. సాగర గామిని. నం. వి. ఈ స్త్రీ. 1. నది. 2. గంగానది.

సాగరము వి. నెయ్యి, మానె మొదలగువవి నింపిన పిద్దెలజోడు.

సాగరము నం. వి. అ. పుం. 1. సముద్రము.

స్రగ్విణి. సాగరాంతక్షమా సంపదేశాస్పదా. పారిజా. 2. 106.

2. నాలుగు లేక ఏడు సంఖ్యకుగుర్తు 3. ఒక విధమైన వేడి. 4 ఏనుఁగు చెవియందలి మదము. 5. అనం తము పిమ్మటి సంఖ్యామానము (వాచ).

సాగరమేఖల నం. వి. ఆ స్త్రీ. భూమి, సాగరము (ల) చేత ఒడ్డాణము వలె చుట్టుకొనబడినది.

సాగరాంతము నం. విశ. (అ. ఆ అ) సముద్రములే అంతముగాఁగలది. సముద్రముల వఱకు వ్యాపించి నది.

సాగరాంబర నం. వి ఆ. స్త్రీ భూమి

సాగరానుకూలము నం విశ. (అ. ఆ అ.) సముద్ర తీరము వెంటనున్నది.

సాగరాలయుఁడు నం. వి. అ పుం. వరుణదేవుఁడు.

సాగరిక నం వి. ఆ. స్త్రీ. ఒకవీణ పేరు. పండితా. 2. 444.

సాగరోత్థము నం. వి. అ. న. సముద్రలవణము.

సాగవచ్చు అ. క్రి. కూడవచ్చు, వెంటవచ్చు.

తే. గీ. సాగరమ్మును పలుకు మించఁగఁగరము, పిచిరైటికిఁ జెత్తలద్రోచిచైచి, వాహినీ నాథుఁ డొకఁడొకఁ డాహవమున, గలయఁ ఒడుటయుఁగను వచ్చె ఖచరతతి. రాజవాహన. 5. 8,

సాగవేయు స. క్రి. పంపు, పుచ్చు, తరలించు. వ్యవ. ఆసొమ్మంతయు నింటికి సాగవేసినాఁడు.

సాగా అవ్య. సైతము.

కం. వారిసాగా నీరూపము, శిరమున ధరియించి కాదె శిక్షించెనరు, త్పరిపంథిం గనకకశిపుం, గరి వైరి నిన్నుఁ బొగడగా మా వశమే. వేం. పంచతం. 1. 849.

సీ. కతినతశాత్రవుని సాగా విత్తవంతుని వేల్పుగాఁ జూచి సేవింతు రెవుడు. వేం. పంచతం 3. 37.

సాగించు స. క్రి. √ సాగు. 1. జరుపు, కావించు.

గీ. అతివవగలైన మాపైన నతనితోడ, నిచ్చనొక సారి సాగించు నిధువనంబు. శివరాత్రి 3. 114.

గీ. శివుడు దాతభోక్త (శ్రీ) మహాదేవుండు, సర్వ మును హరుండు శాశ్వతుండు, శంభు వేలు నేసి సాగింపవచ్చునే, క్రియలు వెట్టివేల యయితి చెప్పమ. కాశీ. 7. 72.

2. నిర్వర్తించు.

మ.... ప్రియునిం గూర్పన్ మరుం డెంతయున్, గెలవిన్ దానికిఁ బెండ్లి పీఁటయము సాగింపన్ మదిం జూచెనో. చంద్రాంగ. 4. 154

3. నెరవేర్చు.

సీ. కృత్యపంచకము సాగింపలేఁడీయింతి ప్రాపు లేక కృతాంత భంజనుండు కాశీ. 4.150

కం. అధనము నీకు వచ్చిన, సాధనముగ నధ్వరంబు సాగించి బుధా, రాధనముచేయు నిరతా, యోధన చణులైన తమ్ము లాఅట గాఁగన్ జై.భా. '.68.

4. నడిపించు.

సీ. పొలదిండితేరి మావుల దేరుగైదువులరదంబు సాగించు వతఁడు సిడము అ. రా. యుద్ధ. 222.

5. నిర్వహించు.

గీ. పేరటాంధ్ర వర్ణింపఁగ నేరనైతి, సలిల సత్రంబు సాగింపఁజాలనైతి. కాశీ. 3.81.

6. ప్రవర్తించు 7. యత్నించు.

సాగింత. వి. నమస్కారవిశేషము (వాచ.).

సాగిపోవు. అ. క్రి. చెల్లు, సమర్థుఁడు.

ఆ. వె. ఉచితవంతుఁడైన, నుద్యోగపరుఁడైన సాగి పోరియున్న సమయమునను, పరుల నుపకరించి పరుల రక్షించును విశ్వ. వేమ. 8. 183.

సాగివచ్చు. అ. క్రి. జరిగివచ్చు.

ఉ.... రిపుగర్వహరుఁడు మురాంతకుండనీ, గర్వము నెల్ల నిచ్చటన కాకి నల్లెడు సాగివచ్చునే. హరి ఉ. 6 ఆ. 112.

చం. అలవరొ యొందు నీవిఁక గులాముపకుం జనవద్దు మాకునిచ్చులు పెరుమాళ్ళ కోవెలఁ బ్రసాదము కట్టడి సాగివచ్చునా తళియ ప్రసాదమీవు సతతంబుఁ బసా పడుము. వైజ. 2 ఆ. 28 పు.

సాగు. వి. కృషి, వ్యవసాయము.

సాగు.1 (క. సాగు) అ. క్రి. గమనించు, వెడలు, పోవు, బయలుదేఱు.

ఉ. పైనములై రి పాండువరపాలతనూజులు యజ్ఞ సేనభూ, జానియమజ్ఞ వశ్యములు సాగె రథప్రక రంబు వెళ్లె పాంచాలీ. 5. 47.

చం. అమరపతి పతివ్రతల కాదిమదైవతమైన పార్వతిం, బ్రమథవిభుండు గైకొనెఁ గృపాపరతన్ బరిచర్యసేయ నీ, సమయమునందు మన్మథుఁడు సాగి శరాసనకౌశలంబునన్, హిమగిరిరాజకన్య పయి నీశుని చిత్తముఁ జేర్ప నోపినన్. ఉ. హరి. 2. 170.

తే. గీ. పుష్పకవిమాన మటుసాగిపోక నిలిచె. ఉ. రా. 3. 66.

2. ఎగిరిపోవు.

ఉ. .... శ్రవణకుంతముల్, చట్టువలెత్తి ముందటికి సాఁగదలంప. పాండు. 5. 249.

3. కదలు, చలించు (రథము).

సీ. తమతమ శక్తి యొంతయుఁ బురికొల్పఁగా జనులు ప్రార్థించిన సాగదయ్యె. శుక. 2. 10.

కం. అంతట నేడు నగరంబులు, నంతర్ధానంబు చేసి యటచనఁగాన, త్యంతభయంకర కర్దమ, సంతమ సంబున రథంబు సాగక నిలిచెన్ ఉ. హరి. 2. 49.

4. తిరుగు, సంచరించు. (చూ. సోగు)

5. ప్రవహించు, పాఱు.

6. జరుగు, ప్రవర్తిల్లు.

కం. ఈ గర్భము రక్షించిన, నా గొంగమేమిఁ జెడక నారాయణనా. నా గుణసంపన్నులలో, సాగుడు నటుగాక యున్న సమయుదు నగలన్. ఉ. హరి. 2. 17

గీ. సాగుఁ గర్భార్థమంచు రాముమంగిక మయి, యాధి కారికమందు బ్రహ్మోన్నగరిమ. కాశీ. 1. 75.

తే... తొడఁగినట్టి, పిపినవాసకార్య మనవిఘ్నమై సాఁగఁ, బ్రథమ హితమును ఒలివకుపుఁబోలె. రాఘ. 3. 31.

శా. సర్గస్థిత్యపహారదిక్క్రమవదీక్షావేళ బ్రహ్మాస్వభూ, ర్భర్గుల్ విఘ్నము లేక సాగుటకునై ప్రార్థింపఁగా, దక్రియా, దౌర్గత్యంబు వదల్చి సంస్మరణ మాత్రం బ్రాప్తి గావించు దృ, క్సర్గచ్ఛత్కరుణా కదంబుఁ గొలుతు న్నిత్యంబు హేరంబునిన్. కాశీ. 1. 5.

ఎ. గీ. దూరదేశసమాగత ధూర్తపాంథ, జనసమూహంబు పయనంబు సాగలేక, తెక్క లలరించి కుత్తుక న్నిక్క మించి, కొక్కురోకో యటంచును గోళ్ళు గూసె. హంస. 1. 187.

సీ. తత్ప్రతిమ యంతయు మనకిప్పుడఁ బను లన్నియుఁ గొదవపడక సాగు. పర. 5.14

వ. యాజకస్వాహాస్వధాకారకల కలాటోపంబులు బధిరిత దిక్కులాపంబులై కొనసాగ యాగంబు సాగుచుండ. వరాహ. 5. 108.

చం. సతతము నగ్నిహోత్రములు సాగునె భూరుహముల్ ఫలించునే? హరి. వరాహపు. 1. 8 పు.

7. కూడవచ్చు, వెంటవచ్చు. 8. చెల్లు.

చం. సవదు వినోదకోప మిఁక సాగవు బింకము లాలకింపుఁడీ, మనసిజుఁ డానతిచ్చిన క్రమం బిదియంచు విటీవిటాళికిం, బనుప వసంతు డక్షర సమాజము వ్రాసిన కాగితంబులో, యనఁ దనరెన్ నభంతర

వనాంతర శాంత కాంత బృందముల్. చంపూరా. 6. 5.

చం. కలితలితాంబరాభి మీ చలము సాగినఁ జాలును మీఁదటన్న సద్గతియ కదన్ నిరర్గళ ధాత్రిఁ బవత్రిలని దు. కళా. 8. 65.

9. నెఱవేఱు, సఫలమగు.

తే. మనకు నది దక్కవేని నమ్మకము సాగు. హై. భా. 1. 54.

తే. వనజనాభుఁ డలు నీమ మొక, వనిఁబూనిన వేళ మొదట ప్రార్థన గణనాథుని కని విని మన ... కుందనాన కనకాఫల్యా! కనిచా. 4. 5.

10. ముందునకు బోవు, ఉద్గమించు, పైకివచ్చు.

వ. అంతంతసాగి ప్రజలు చౌకుకుమదంగియుం దుఁ దా నయ్యవసరంబున. కాశీ. 4. 120.

చం. మఱియ నమీఁద నాకవాహి ప్రమాఁకల నాకులు దుల్లిక్రొమ్మొలకలు సాగి. కుమా. నం. 4. 448.

11. ప్రసరించు, వ్యాపించు.

ఉ. పారసజాంధవుం దదరసాగెను నయ్యెడ సాంధ్య రాగముల్. ఇందు. 6 88.

12. ఒప్పు.

కం. పటు నీలకాంతులఁ బరి, స్ఫుటమై నూగారు సాగె మదలికి రళనా, కటకాదిభూషణము లు,త్కట భారములయ్యె హిమనగ ప్రేయసికిన్. జాహ్నవి. 89.

13. ప్రారంభించు, మొదలుపెట్టు. (ఈ యర్థమున నిది తుమున్నంతమున కనుప్రయుక్తమగును) ఎంచ సాగు = ఎంచుటకు మొదలుపెట్టు.

ఉ....పదంతులార కొలగాములు వేములు వెంచ సాగినా, రమ్మకచెల్ల. నీలా. 2. 110.
పిలువసాగు = పిలుచుట మొదలుపెట్టు.

చం. మనమున కొందు రెందు మరుమంత్రములన్ పరిపోవఁ జెప్పినం, జనపతు లాతనిం బిలువ సాగుదు రాగతి.... అము. 4. 265.
ఒనర్పసాగు = చేయుటకు మొదలుపెట్టు.

ఉ. చింతయొనర్ప సాగకము చిన్నబిడాయని పారఁద్రోసి యత్యంత దయంబున న్నిక్కలతగ్గని కొల్వఁగ దీరచి తద్దై. పాండ్వ. 4. 10.
పొంగసాగు = పొంగుటకు మొదలుపెట్టు.

తే. గీ. క్రాఁగుపై క్రొమ్ముగ్గు తెలినిగ్గు గ్రాగిపొంగ సాగు పాలని పైనీరు చల్లి చల్లి, యట్లకొనునట్టి వెన్నెల నల్లుకొన్న, యన్నుమిన్నలు విహరించి రన్నెపగల. రాజవాహన. వి. 3. 18.
పిల్వసాగు = పిల్చుటకు మొదలుపెట్టు.

తే. కమిచి నామేని క్రొత్తమాంసములుఁ జీల్చసాఁగె నతి గాఢతరఁ బలక్షితరాగ్ని. శుక. 2. [illegible]2.
చెప్పసాగు = చెప్పుటకు మొదలుపెట్టు.

తే. గీ. జనపతిని జేరఁబోనీక దినము దినము, కతలు చెప్పఁగ సాగితో కతలకారి, చిన్నిరాయంచ యుఁక నైన నేఁ వానంగు, పోయిపచ్చెద వన హంసపాలఁతి కనియె. హంస. 5. 337.
తినసాగు = తినుటకు మొదలుపెట్టు.

ఉ. ... ఈ, చక్కెరవంటి పండ్లు తినసాగెటంచుఁ గృశించు నెంతయున్. శుక. 3. 379.

**సాగుపాటు** వి. జరుగుబాటు.

**సాగుబడి** వి. 1. సాగు, చెల్లుబడి. 1. పైరుపెట్టుట, కృషి. 2. సాగుపాటు. చెలామణి.

తే. గీ. కమకనే మాటలు నెఱుఁగ నెవరునిలుపు సాగుబడి హత్తగుణవిత్తనాగదత్త. ప్రబం. 1 ఆ. 744.

**సాగు**[2] వి. (క. సాగు[2]) సేద్యము, కృషి.
వా. ఆ భూమినిసాగుచేయుచున్నారు.

**సాగుబళా** వి. మా. సాంగుబళా. నటివిశేషము.

**సాగుమానము** వి. సహగమనము (వాచ.).

**సాగ్ని** సం. విణ. ఇ. ఈ. ఇ 1. అగ్నికలది. 2. పవిత్రాగ్నిని వెంటఁగొనిపోవునది.

**సాగ్నికము** సం. విణ. అ. ఆ. అ. 1. అగ్నికలది. 2. అగ్నిపూర్వకమైనది.

**సాగ్నికుఁడు** సం. వి. అ. పుం. అగ్నిహోత్రియైన గృహస్థుఁడు. అగ్నిహోత్రములను వెంట గొనిపోవు సోమయాజి.

సాగ్రము సం. విశ. అ. ఆ. అ. 1. మొత్తము, సర్వము. 2. అధికము, మిగులుకలది.

సాచి సం. అవ్య. వక్రముగా, కుటిలముగా, అడ్డముగా, ఓరగా.

సాచివాటిక సం.వి.ఆ.(స్త్రీ. తెల్లపూలు.(Hog-weed)

సాచివిలోకితము సం. వి. అ. న. ఓరచూపు, కటాక్షము.

సాచివ్యము సం. వి. అ. న. 1. మంత్రిత్వము, మంత్రి పదవి. 2. మంత్రిమండలి, పాలకవర్గము, పాలనము. 3. మైత్రి, స్నేహము.

సాచీకృతము సం. విశ. అ. ఆ. అ. 1. వంకరగాఁ త్రిప్పఁబడినది. 2. అడ్డముగాఁ ద్రిప్పఁబడినది.

సాజము (సం. సహజం. క. సాజ.) విశ. స్వభావముచేఁ గలిగినది.

చం...ఒక వన్నెలాఁడి మొగమంటి కమంగొనుచు న్విరాశిచే, సతమని వమ్మియందు రిది సాజమెకా మగవారి కారయన్. శుక. 3. 147.

శా. (శ్రీ) లీలావతి నవ్వనేఁటి కని ఘూర్ణింపంగ నే నవ్వనో, బాలా సాజము సింహవక్త్రిముని కీ పారీంద్రచిత్రంబు. దశా. 4. 3.

మ. హరికిన్ సాగరకన్య శంకరున కయ్యార్యామహాదేవి తోయరుహాసీనునకున్ సరస్వతియునైన ట్లందమై యున్నదీ, ధరణీనాథ కుమార రత్నమునకీ తన్వంగి సాజంబు లీ, వరలావణ్య వయోవిలాసగరిమల్ వర్ణింపఁగా నెంతయున్. ఇందు. 6. 10.

సాజము = సహజము, వి. స్వభావము.

ద్వి. వజ్జంబో వారంబో వారిసాజంబో, వెజ్జుఁ జూపింపరు వేల్పుల కిదరు. ద్వి. పరమ. 3. 154.

సాజాత్యము సం. వి. అ. న. 1. ఒకే జాతికి కులమునకుఁ జెందియుండుట. 2. జాతిసామ్యము, తుల్యజాతిత్వము. 3. సామ్యము, ఐక్యము.

సాట వి. 1. పరివర్తకము. 2. వినియమము. 3. వర్తకులు ఒక వస్తువునిచ్చి మరియొక వస్తువును పుచ్చుకొనుట.

సాటా వి. సాట.

సాటాకోటి వి. సాటాబేరము వస్తుపరివర్తనపు బేరము.

సాటి[1] విశ. సమానము.

తే. గీ. లేవు లింగము లనియు క్షితి గమునకు సాటి సేయంగ భూగృహస్వరూపమున. కాశీ. 3. 187.

గీ. సాటి సాటున తెలిసి సిరుల తమముదిటు సరిసాటి పోటియుద్ది యనఁబాడి .... ఆం. భా. 2. 802.

ఉ ... బుద్ధిగానపదా, కామమూలికిస్ సత్ప్రధానులు దక్కనవారు సాటియే, మూవిడి వీరభద్రునకమాత్యశిఖామణి కిన్వసుంధరన్. శృం. నై. 1. 28.

చం.... తప్పుము సాటిగ నవ్యపుంబు లెవ్వఁగా నమరు నటన్న హస్తిమశకాంతరం మింతియు వాని చూసినన్. కాశీ. 1. 22.

ఉ. తిమ్మనమంత్రి సాటి జగతిస్థలిలోపల మంత్రి గల్గునే ? దశా. 1. 86.

సాటి[2] (క. సాటి) వి. ఉపమానము, పోలిక.

వ. నీకు నితర పర్వతంబులకును సాటియే ? హర. 4. 62.

ఉ. ...సంగ్రామములోన నొక్కనకు గాసికి వాని దొలంగఁ డీశ్వర, హమ్మహీశా మనోహరుని సాటియె యీశ్వరుఁ డెన్నిత గుణన్. పారి. పీఠ. 9.

సీ. సాటికిఁ బోటికి సరస సంగీత సాహిత్యాది విద్యలు నృత్యమాడ. సాంగ. 1. 62.

ఉ. విండ్లకు మేలిరంబు ఘనవేణి కమంబొమదోయి బంగరుం,గిండ్లకు మేటిసాటి తులకించే చనుంగవ లేఁతతమ్మిపూఁ, దూండ్లకు మిన్న యన్నటిగి దొల్కెడుచేతులు లోకమందుఁ బూబోండ్లకుఁ గానమో వినమొ పోలరు తత్సతి కాలిగోరునన్. హంస. 1. 61.

ఉ. అర్యురుచక్రవర్తులు పదార్వురు రాజులు విశ్వధారిణీ, నిర్వహణ ప్రభావమున వేర్పరులైనను వీనిసాటియే. విక్ర. 2. 34.

సాటి వి. (సం. శాటీ క. సాటి త. చాటి.) కాసెకోక

సీ. గడిదంబు మట్టిచల్లడముపై బంగారుసాటి చెంగులొకింత జాఱఁగట్టి. ఉత్తర హరిశ్చం. 2. 52.

పాటిక (సం. ఘటికా.) వి. కాటి.

పాటికిపేటికి అవ్య. మాటిమాటికి.

కం. కేటికి పేడుక యగునని, దేవంయును వఁము లొనఁగ దేవఁ గనుచున్, దేవియు పాటికి పేటికి దీవింపఁగ దైత్యకులపు తేజము నొందెన్. ఉ. రా. 1. 265.

సీ. గీ. ప్రియునిచే పేగిరము పోకి తయును మించ, వీక పాటికిపేటికి నిందువరన (పాటికిమాటికి, పాటికి పేటికి వని ముద్రిత ప్రతులుపా.) కళా. 7. 76.

చం. నలిపిరి డోలికావిన్యాసి పాటికి పేటికినింతు లిద్దఱున్. రామా. 1. 181.

పాటివచ్చు అ. క్రి. (√పాటు) ఈడగు, సమానమగు.

తే.గీ. తోయజామోదలాఘలు దోయిలించి, ప్రమద ముప పేల్వ నొకకొన్ని చెమట వంట, ప్రేళ్ళు గమ పట్టఁ గెంజాయ వీకివాఁత్రు, వాలుకలు సాటి రాకున్న నవ్వేవనఁగ. మను. 5. 81.

పాటిచే(సే)యు స. క్రి. (√సాటి) ఉపమించు.

సీ. అతనుండు మొదట హ్రస్వాకారుఁ డాటచే తెలువంబునకు సాటిసేయరాదు. దశా. 1. 52.

తే. గీ. విదుషి యాయింతి తలదాల్పు వెంట్రుక లకు నహహా! యెబ్బంగి సాటిసేయంగవచ్చు, బసువు చేతఁ బురస్కృతిఁ బడయలేక చాపలంబున వర్తించు చామరములు. శృం. నై. 2. 18.

పాటియగు అ. క్రి. సమానమగు.

చం. ఇతని కితండె సాటియగు, నీతని కితఁడె సాటి. పారి. 5. 29.

పాటువ విశే. ఉచితము.

ఉ. సాటువ యైనత్రోవ మనసా విను మున్ను శవాంబురాశిలోఁ, గోటుల సంఖ్యలైన జనముల్ బహుఘాతమానవుల్. గాటపుఁబుట్టు వొందరో పొకాలరో వీరల సంగమంబు మిథ్యాటపోరిం బోరిం దలఁపుమాకృతకృత్యుఁడ వయ్యె దిత్తఱిన్. ప్రబోధచంద్రో. 5. 28.

పాటువ వి. 1. సామ్యము.

గీ. సాటిపాటువ తరబడి సవతుతరము దీటుసరి పాటిపోటి యుద్ది యనఁబాడి, యీడనఁగ సదృశాఖ్యలై యొసఁగుచుండు .... ఆం. భా. 3.302.

2. ప్రసిద్ధి.

ఉ. ఘోటకముల్ రథావలులు కుంజరముల్ బహువాహినీ పతుల్, సాటువకెక్కు వీరభట సంకుల ముందగు నప్పురంబునన్. రుక్మాం. 1. 73.

సాటెనగొట్టు విశే. దుష్టుఁడు, దుష్టురాలు.

సీ. సందెటింగినదొంగ సాటెనగొట్టు పిసాసి దిమ్మరి బేరజముబటాని. చెన్న బ. 2. 24.

సాటోపము సం. విశే. అ. ఆ. అ. 1. గర్వించినది, విజృంభించినది, ఉప్పొంగినది. 2. గంభీరమైనది, ధీరమైనది. 3. పొంగినది, ఉబ్బినది, నిండినది. 4. ఆటోపముతోఁ గూడినది.

సాడంబరము సం. విశే. అ. ఆ. అ. 1. దర్పముగలది, వటాటోపముగలది. 2. ఆడంబరముతోఁ గూడినది.

సాత్ సం. తద్ధితప్రత్యయము, కృత్స్న (అంతయు) మను నర్థమిచ్చును. (విభాషా సాతి కార్త్స్న్యే. 5. 4. 52. పాణి. సూ.) తదధీనము. 2. తద్రూపము.

చం. అతిరుచిరక్రియాభిరతుఁడైన పురోచనుతోట భస్మసాత్కృతమయి చెడ్డతద్విపుల గేహము (భస్మసాత్కృతం గేహం కృత్స్నం గేహం భస్మకృతం భస్మసాత్కృతం, ఇల్లంతయు భస్మముచేయఁబడినది). భార. ఆది. 6. 164.

సాతత్యము సం వి. అ. న. నైరంతర్యము, అఖండవ్యాప్తి. శాశ్వతత్వము, నిత్యత్వము.

సాతని వి. (త.చత్తాదవన్) జందెములేని వైష్ణవుఁడు.

వ..... పరస్థలంబులనుండి చూడవచ్చిన బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్రులను — వడసాలె సాలెన సాతని కటికభట్టుజెట్టి జాంగ్ర తొగటగాండ్ల వారును. హంస. 3. 29.

సాతము సం. విశే. అ. ఆ. అ. 1. ఈయఁబడినది. 2. నాశము చేయఁబడినది.

సాతము సం. వి. అ. న. ఆహ్లాదము, ఆనందము.

సాతల సం. వి. ఆ. స్త్రీ. సంబరేను (వృ. వి.).

సాతాని = సాతని. వి. శూద్రజాతివిశేషము.

గీ. వీథి నేతెంచె సాతాని వేడ్కలాడి. వీథి. 17.

వ. మగలఁ గికురించ కంకణంబులు గట్టవకిలి వత్తిల్లు పుత్తడి కంకణంబులుగల సాతాని జాతి నీటు కత్తెలు. ప్రబం. 1. 70.

సాతాను అవ్య. వి. సైతానుకు రూపాంతరము.

సాతాళించు స. క్రి. నానిన విత్తులు మొదలగు వానిని జమురు కొంచెముగా వేసి పక్వముచేయుట (చి. ని. ధాతుమాల)

వ్యవ. ఆసెనగలు సాతాళించినారు. నానిన పెసర వప్పు సాతాళించుము.

సాతి సం. వి. ఇ. స్త్రీ. 1. దానము, ఈవి. 2. లాభము, ప్రాప్తి. 3. సాయము. 4. నాశము. 5. అవసానము, ముగింపు. 6. తీవ్రమైనబాధ, పోటు. 7. సమాప్తి, నిలుపుదల. 8. ధనము, సంపద.

సాతిన వి. (త. చాత్తినవర్) జంధెము వేసికొనిన వైష్ణవుఁడు.

వ. కమ్మరి వడ్రంగి కాశె కంచెర యగసాలె వడ సాలె సాతిన సాతని కటికభట్టు జెట్టిజాంగ్రడకోగట గాండ్ల వారును. హంస. 3. 29.

సాతిన(క)ము సం. వి. అ. పుం. బటానీచెట్టు (వృ వి.).

సాతిలకము సం. వి. అ. పుం. సాతిల(క)ము, సాతిన(క)ము.

సాతు వి. (సం. సార్థ) వర్తకజనసమూహము.

ఆ. సాతులోన కుటిలి జనముల నున్నద,లీల నేలఁ బెట్టి కాలఁజమర (వనగజంబు) భార. శాం. 3. 474.

గీ. తాను నిల్లాలుఁ గొమ్మయు దనయయుగము, మొలల దీనారముల జాళెములు ధరించి, సాతుఁ గూడి చనంగఁ దస్కరులు దాటి, వలుగురం బట్టి ధనమెల్ల నొలిచికొనిరి. కాశీ. 7. 250.

క... విఱువిఱ్ఱున జాలువడెం, దెటిపియుఁగవలేమి సాతు విరుగుడు వడియెన్. ఆము. 6. 74.

ర్వి చలువవట్టున విర్వెసా తెల్లవనుచు ప డితా సర్వత. 329.

సాత్కరణము సం. వి. అ. న. 1. స్వాధీనముచేయుట. 2. తాద్రూప్యము పొందించుట.

సాత్కరించు సం. స. క్రి. అధీనపఱచు. (తదధీనవచనే 5. 4. 43. పాణిని సూత్రమున బ్రాహ్మణసాత్కరోతి ఇత్యాదికముగా నామ వాచకముపై నిద్ధితమౌ సాతిప్రత్యయము వచ్చును. ఇటనామవాచకము లేకయే కేవలమును ప్రత్యయమునకుఁ గృక్ ధాతువుతోఁ బ్రయోగము వింత యని యెఱుఁగునది. మఱియు దూ. శృం. నై. సర్వంకషాఖ్యవ్యాఖ్య).

తే. పృథుఁడు నేసె నానాధ్వరము లవి, సెప్పనేల, సకలధాత్రి బ్రాహ్మణులకు సాత్కరించె. భార. శాం. 1. 243.

ఉ. దివ్యసారభవిభూతి యొలర్పఁగ సాత్కరించెఁ బెం,పగ్గలమైనభక్తి మహిపాలక రజత్రుపరేణు సమ్మిళద్గుగులు ధూపధూమములు గోమలకారక రాజమౌళికిన్. నైష. 8. 103.

సాత్కాలు వి. జాతకమున కపభ్రంశరూపమా ?

మ. కలలో దేవరచెప్పె రేయియొకటం గన్పించి నెయ్యంబువా,టిల నీపాలికి దేవుఁడింక బవరీఁడే యంచుఁదా నాడఁగా, వలెనే జావనమొప్పనైన నరియే వారెల్ల సాత్కాలు నీ,వలె గోరంచిరె నిన్నె కొల్తువనుచు న్వర్ణించుచో నంతటన్. శుక. 2.415.

సాత్కృతము సం. వి. (అ. ఆ. అ.). స్వాధీనము చేయఁబడినది, తాద్రూప్యము పొందింపఁబడినది. అసుర భస్మసాత్కృతుఁ డయ్యెన్. భార. ఆది. 1. 132.

సాత్కృతి సం. వి. ఇ. స్త్రీ. సాత్కరణము.

సాత్తని – సాతాని. వి. (క. చాతాణి, చాతాళి, సాతాని. త. చాత్తాని.) సాతాని జాతివాఁడు.

సీ. కెలన సాత్తని వైష్ణవులు ద్రోపుద్రోపాడ వలన సంకీర్తనపరులు చనఁగ. విప్ర. 5. 10.

సాత్మించు వై. స. క్రి. సహించు, సైఁచు (సం. సాత్మ్య.)

కం. ఆయాసము సాత్కింపని, మీ యొదలు తవః క్రియలకు మెయిగొనియెనె. భా. అర. 2. 58. తద్రూపార్థమువనే నన్నయ ప్రయోగించినట్లు సంస్కృత వివరణము.

**సాత్యకి** సం. వి. ఇ. పుం. శ్రీకృష్ణుని తమ్ముఁడు. సత్యకుని పుత్రుఁడు. సాత్యకి శ్రీకృష్ణునకు తమ్ముని వరుసయైనవాఁడు.

**సాత్వతి** సం. వి. ఇ. స్త్రీ. 1. నాట్యవృత్తులలో నొకటి (భారతి, ఆరభటి. సాత్వతి, కైశికి అని వృత్తులు నాలుఁగు) 2. శిశుపాలుని తల్లి పేరు (శ్రీకృష్ణుని మేనత్త).

**సాత్వతుఁడు** సం. వి. అ. పుం. 1 విష్ణువు, కృష్ణుఁడు. 2. బలరాముఁడు. 3 కులభ్రష్టుడైన వైశ్యుని పుత్రుడు. 4. (బహు. వ.). యాదవ వంశము నందలి యొక తెగవారు. 5. పురుహోత్రుని పుత్రుఁడైన అంశువు కుమారుఁడు.

**సాత్వత్తు** సం. విశే. పుం. శ్రీకృష్ణుని యనుచరుఁడు. 1. భక్తుడు. 2. యాదవ వంశమునకు చెందిన వాఁడు.

**సాత్త్వికము** సం. విశే. అ. క్లీ. అ. 1. యథార్థము. సారభూతము. 2. నిజమైనది, శుద్ధమైనది, సహజమైనది. 3. నిష్కపటము, మంచిది. 4. గుణవంతము, సాధువు. 5. శక్తిమంతము, 6. తత్త్వగుణము కలది. 7. సత్త్వగుణమునకు సంబంధించినది. 8. మనస్సున బుట్టినది. అంతంము మానసికము.

**సాత్త్వికము** సం. వి. అ. పుం. సత్త్వగుణము వలనఁ బుట్టిన భావ విశేషము (స్తంభము, ప్రలయము, రోమాంచము, కంపము, స్వేదము, వైస్వర్యము, వైవర్ణ్యము, అశ్రుపాతము, ఈ ఎనిమిదియు సాత్త్విక భావములు)

**సాత్త్వికి** సం వి. ఈ. స్త్రీ. దుర్గ.

**సాత్త్వికుఁడు** సం. వి. అ పుం. 1. బ్రహ్మ. 2. బ్రాహ్మణుఁడు. 3. సత్వగుణముకలవాఁడు.

**సాదన** (సం సాధనమ్) 1. మల్లవిద్య.

సీ.... శస్త్రధరుఁ గీ. డలరఁ దద్విద్యసాదన యనఁగ నెగడు అ. భా. 2. 205.

2. నైపుణ్యము.

ఉ. వేదన మించు నీవిరహవేదన తాళఁగఁజాల గంతునిన్, సాదనరాదుగా తనదుసాదన చూపఁ దొడంగె గాడ్పుదా, నీఁదనవచ్చునే మెదల నీదన లాకృతి వేఁడిసూపుచున్, బోదనఁ జెల్లునాకడకుఁ బోదనయంబుతుకంబు ప్రేలుచున్. సారంగ. 1-5.

3. అభ్యాసము. (సం. సాధనము)

ఉ. సాదనమేలు చెంపపయి జగ్గుగ ప్రేలు రుమాలు. హంస. 1. 207.

తే. గీ.... ఒక, గరిడిలో వింతసాదన క్రమము కాదు. దశా. 7. 144.

ఆ. వె. కదలిగట్టు పనికి గరిడిసాదన వీరి, కిది యటంచుఁ దజ్జులెంచు కొనఁగ, జనకరాజకన్య యును రామభద్రుండు, గట్టిరధిక మైత్రిఁ గంకణములు. చంపూరా. 3. 129.

సీ. మినుకు బజ్జెట్టి సాదనకుమ నెవ్వాని, లాలితరసవ విలాసఖురళి. విప్ర. 1. 40.

4. సాము.

రగడ. మొనల ముందట సబళముల సాదనలు సేయ. పి. శకుం. 3. 225.

కం. కలవే యిహపరసుఖముల్, దలఁపఁగ మర్త్యశక్తి విరహితములగు యజ్ఞాదుల యందు నెందునైనను, జలజానన నేలవిడిచి సాదనగలదే? విప్ర. 4. 61.

తే మరుఁడు మఱచినసాము వేమఱునుజేయఁ, దలఁచి సాదనగరిడిలో దట్టి గట్ట. శుక. 3. 482.

5. మల్లవిద్యాప్రదర్శనము.

తే. గీ గడలు బాగాల్పటాలు నగ్గలికఁబూని, పరువడుల్ ద్రొక్కుకొనుచే నిబ్బరపుభీం, ములగనం బడ పామరుల్ మోలఁజెలఁగి, సాదనలొనర్పఁ జెల్లు పెచ్చరికఁ జెనఁగ. రసి. 1. 81.

**సాదనకాఁడు** విశే. (సాదన + కాఁడు) శస్త్రధరుఁడు, ఆయుధవిద్యయం దారితేఱినవాఁడు.

సీ. సాదనకాఁడన శస్త్రధరుఁడు... ఆం. భా. 2. 205. బ్రౌ. పా.

కటారి సాదనకాఁడు=కత్తిసాము సేయువాఁడు, మల్లుఁడు.

వ. ఒక్క యత్యంత చాతురీధురంధరుఁడైన కటారి సాదనకాని వలన నేకకాలం బభ్యసించి, కళా. 8. 106.

**సాదనకోడు** వి. మల్లుడు. ఆం. భా. ద్వి. 108.

**సాదనదీవె** వి. గస్తితిరుగు యోధులు, రాత్రివస్తిడి దీపము.

మ. పురిచుట్టు న్నికరుఁడు సారణుఁడు నిర్దోషాంధకులాది క, త్తెరగాయంబులు గండముంగికులు సందింగొమ్ము కొమ్మన్నిరం,తరమున్ సాదన దీవె లెత్తి చనుఁడు... . ఉ. హరి. 2. 74.

**సాదనపెనఁకువ** వి. గదాయుద్ధము.

వ.... చెట్టిదంపు సాదన పెనఁకువలన్ బేర్చుచు. ఉ. రా. 3. 246.

**సాదనము** సం. అ. న. 1. శ్రమించుట, అలయుట. 2. అలపు. 3. ఇల్లు, నివాసము. "మృత్యుసాదనముసకున్" భార. అర. 1. అ. (శ. ర)

**సాదని** సం. వి. ఈ. స్త్రీ. అలపు, క్లాంతి, సత్త్వసంక్షయము, బలహీనత.

**సాదము** వి. అన్నము.

సీ. వినుమేము ప్రాలుమాలిన దీవెనుడిగాక తినిసిన రెండు గుగ్గిళ్ళుగాక, తక్కినవింత గంధప్రసాదము గాక మనసైవనొక వడతునకగాక, యటమటించినఁ గుంచెడంత సాదముగాక కాదేని యొక గుల్లకాసు గాక. విప్ర. 5. 10.

**సాదము** సం. వి. అ. పుం. 1. క్రుంకుట, దిగబడుట, కూలబడుట. 2. అలపు, విసుపు. 3. కృశించుట, బక్కచిక్కుట. 4. నశించుట, క్షీణించుట. 5. బాధ, యాతన. 6. స్వచ్ఛత, నిర్మలత. 7. గమనము, చలనము, నాశము.

ఆ. అల్పమైనయగ్ని యడఁగునింధనములు, మీఁద నైనబలము మిగులలేని, యోగముల్లతవకు మరునట్టి దానన, సాదమొందు సకలజనములోజ్ఞ. భార. శాం. 5. 579.

**సాదరము** సం. విశే. అ. ఆ. అ. 1 ఆదరముతో గూడినది. 2. దయగలది.

ఉ. సాదరవృత్తి సాష్టాంగప్రణామములు సేయఁబూని సం,హారము సేసె దేవముని సద్భుద్ధుఁ డజుం డని. భార. శాం. 5. 570.

**సాదరు** వావి. వాడకపు సొమ్ము. 2. కలిమి.

**సాదా**[1] హిం. విశే. సాధారణము, నగిషీలేనిది.

సీ. సాదావని తెలుఁగు గాంచు బానారి, కుందనంబున మణల్ గూర్చఁగలఁడె? రామలిం. 86. 2. కలుపులేనిది.

**సాదా**[2] వి. మల్లవిద్యావిశేషము.

వ. సాదా, బొంబా మొదలగు కొడిశావరుసలను మల్లుపురా. 2-69.

వ. అష్టాదశజాతి ప్రభూత బులై శుద్ధభిన్న గౌళ వేసరిసాధారణోపరాగసంకీర్ణ ప్రసిద్ధంబులైన శుద్ధ రాగంబులును. శ్రీరంగ. 2. 780.

**సాది** సం. విశే. ఇ. ఈ. ఇ. 1. మొదలుగలది. 2. పుట్టుకగలది.

**సాది** సం. వి. ఇ. పుం. 1. సారథి, 2. రథికుడు, యోధుఁడు. 3. నిర్విర్యుఁడు, అనుత్సాహి. 4, వాయువు.

**సాది** సం. విశే. న్. వి. న్. 1. కూర్చుండినది. 2. అలసినది. 3. నీరసమైనది, ఖిన్నమైనది.

**సాది** సం. వి. న్. పుం. 1. గుఱ్ఱపురౌతు. 2. మావటివాఁడు, గజాధిరోహి 3. సారథి.

**సాదితము** సం. విశే. అ. ఆ. అ. 1. కూర్చుండబెట్టఁబడినది. 2. నీరసము, అలసము. 3. శ్రాంతము, అలసినది. 4. నాశముచేయఁబడినది, అంతమొందింపఁబడినది. 5. క్షీణించినది, శిథిలమైనది.

**సాదించు** అ. క్రి. మాటలతోబాధించు. బాధించు

ద్వి. మానమేరితిని సమానంబుగాన, మానంబుగాచి మామణులుబుట్టములు, సాదింపకింకఁ బ్రసాదింపుమయ్య, కాదన్న నిను మీఱఁగలమె యేమనిన, అ. మ. క. 2-76 పు. 5 పం.

ద్వి. మగడి వద్ద నెగ్గు మాయి: తునుముచు, జగజ్జాంగ ముదరి సాదించుచుండె. ద్వి. పరమ. 4.402.

**సాదు.** విశే. (సం. సాధుః క. సాదు. చ. సాదు) యోగ్యుఁడు, మంచివాఁడు.

ఉ. ఎక్కడి కేగుదెంచితి వహీనవిహారచికిత్స నీకునేఁ, జక్కనివాడనైనం దెలుచఁ జంపితి దొంగిలి మున్నదీ యులన్, దక్కనులన్ వినుఁడొదివి ప్రాణముగొందుఁ గడఁగిసాదునై, త్రుక్కడియున్నఁబోవిడువఁదొల్లిటి త్రుళ్ళిక చెల్లదిచ్చటన్. పాండురంగ. 5. 107.

2. సాధువు.

ఉ. వేదనమించు నీ విరహవేదన తాళఁగఁజాలఁ గంతునిన్, సాదనరాదగా తనదుసాదన చూపఁ దొడంగె. సారం గ. 2. 125.

**సాదు[1]** వి. సాధువైన పశువు.

ఉ.... కాదఁల పాలంబున నిల్చునె సాదురేగినన్. విప్ర. 8. 41.

తే. మన్మథావేశ విలసన మహిమనెఱవు తపసి, గని సాదురేఁగినఁదల పాలావ, నిలువదమ మాట నిజమయ్యో నేఁడటంచు, మగువ నవ్వుచు శేఁత కుమారుచేసె. కళా. 3. 37.

కం. అనుజులకు నడ్డపడియే, మిని తేయఁగ నీమిఁ జూచి మెచ్చితిగాకీ, వున సాదురేఁగెనేనిన్నిను తల పాలమువనగాని నిలువదునుమీ. భార. ఉద్యో. 2. 13.

ద్వి ఉరెనిన పుండ్లపై నుప్పునుజల్లి, కెరలఁ జేసెదవు నేఁగినిటితినేని, చక్కఁబెట్టఁగతేరు సాదురేగినను, లొక్కనిల్వను తలపాలమువఁగాని. హరిశ్చ. ఉత్త. 1. 253.

2. సాధువు. (సన్యాసి)

ఉ. ఆఱని తేజుగల్గి యలరారెడు వయ్యోకిమీదు వేయుమా, జాలుల రొక్కముల్ తొడవు లంద ములన్ వలివంపుఁ జీరలుం, జాలులుగాఁగ నింట గల సొమ్ములు నెమ్మినొసంగి యత్తటిన్, కాఱుల బీదసాదులను బందుగులన్ దనియించె నెంతయున్. అ. రా. బాల. 196.

దుద్ఘమలఁగూడి పేదసాదులను గొట్టు. భల్లాణ. 3. అ. త్రై.

**సాదు[2]** అవ్య. బాగు, మేలు.

కం. వేదాదివిద్య లెఱిఁగెన్ వేదండవిరోధి చండ విక్రముఁడు బుధుల్, సాదన శాస్త్రవులెల్లహా, సాదన జెవజెట్ల దొడరిసాదన సేయున్. రామా. 3. 149.

తే. సంతసంబయ్యె సుర రాజు సాదుసాదు. శృం. నై. 3. 16.

**సాదు[3]** స. క్రి. 1. సంరక్షించు, పెంచు. 2. సరిదిద్దు, అదుపులోనుంచు.

**సాదుతనము** వి. సాధుత్వము.

కం. సాదుతనంబునఁ దనరెడి, గాదిలిసుతుఁజూచి మున్నుగైకొనిన మనః ఖేదంబు వాసి. సమీర. 2. 201.

**సాదృశ్యము** సం. వి అ. న. 1. పోలిక, సామ్యము. 2. ప్రతిరూపము, ప్రతిమ, ప్రతిబింబము.

**సాద్యంతము** సం. విశే. అ. ఆ. అ. మొత్తము, సర్వము, సకలము.

**సాద్యస్కము** సం. విశే. అ. ఈ. అ. తద్‌క్షణము. శీఘ్రము.

**సాధంతుఁడు** సం. వి. అ. పుం. సన్న్యాసి, భిక్షువు.

**సాధకము** సం. విశే. అ. ఆ. అ. సాధించునది.

**సాధన** సం. వి. ఆ. స్త్రీ. 1. సిద్ధి - సమాప్తి, పూర్తి. 2. పూజనము, ధ్యానము, అర్చనము. 3. ప్రసాదనము, సమాధానము.

**సాధనక్రియ** సం. వి ఆ. స్త్రీ 1. సమాపకక్రియ. (A Finite Verb) 2. కారకయుక్తమైనపని.

**సాధనత** సం. వి. ఆ. స్త్రీ. 1. సాధనము కలిగి యుండుట, సాధించు సామర్థ్యము. 2. సంపూర్ణత.

**సాధనపత్రము** సం. వి. అ. న. సాక్ష్యముగా నుప యోగపడు పత్రము.

**సాధనము** సం. వి. అ. న. 1. సాధించుట. 2. ఉపకరణము. 3. ఉపాయము. 4. ధనము. 5. వధము

6. మృతసంస్కారము. 7. గమనము. 8. అనుగమనము. 9. ఋణదానము. 10. నివర్తనము. 11. సైన్యము. 12. మగగుఱి. 13. తృతీయా విభక్తి. 14. ద్రవ్యము, పదార్థము. 15. నవాయము. 16. ఋజువు, సాక్ష్యము. 17. హేతువు (తర్కము). 18. జయము. 19. వశీకరణము. 20. తపస్సు. 21. ముక్తి. 22. ఔషధము. 23. అంగము, అవయవము. 24. మైత్రి. 25. లాభము.

సాధర్మ్యము సం. వి. అ. న. 1. సామ్యము, ఔపమ్యము. 2. సమానధర్మము కలిగియుండుట. 3. సమానగుణ శీలలక్షణములు కలిగియుండుట. 4. ఒకే మతము నకుఁ జెందియుండుట.

సాధారణత సం. వి. ఈ. స్త్రీ. సమానత.

సాధారణత సం. వి. అ. న. సాధారణత్వము.

సాధారణధనము సం. వి. అ. న. సమిష్టిస్వత్వము.

సాధారణము సం. విణ. అ. ఆ. ఈ. అ. 1. సామాన్యము. 2. విశ్వజనీనము. 3. తుల్యము, సదృశము. 4. అనైకాంతికము (తర్క). 5. సమానము.

సాధారణ సం. వి. అ. పుం. ఒక సంవత్సరము పేరు.

సాధారణము సం. వి. అ. న. 1. ఎల్లఱకు వర్తించు విధి. 2. సామాన్య నియమము. 3. జాతిలక్షణము.

సాధారణస్త్రీ సం. వి. ఈ. స్త్రీ. 1. సామాన్యస్త్రీ. 2. కులట.

సాధారణి సం. వి. ఈ. స్త్రీ. 1. వెదురురెమ్మ. 2. తాళపుచెవి.

సాధారణీకరణము సం. వి. అ. న. 1. సామాన్యము చేయుట. 2. విశ్వజనీనముచేయుట. 3. స్వగతత్వ పరగతత్వాదిభేదము లేనిదిగాఁజేయుట (అలంకా). 4. నిర్విశేషము చేయుట. 5. పరిశుద్ధము చేయుట.

సాధారణీకృతి సం. వి. ఇ. స్త్రీ. సాధారణీకరణము.

సాధారణ్యము సం. వి. అ. న. సాధారణత.

సాధి సం. వి. ఈ. స్త్రీ. అత్త, శ్వశ్రువు.

సాధించు సం. స. క్రి. 1. పూర్తిచేయు, నిర్వర్తించు. 2. జయించు. 3. సంపాదించు, సమకూర్చు. 4. వశపఱచుకొను. 5. నేర్చు, గ్రహించు. 6. మానుచు, శమింపచేయు. 7. పోవు, తన శ్రోవను తానుపోవు. 8. వసూలుచేయు (అప్పు మొ.). 9. పరిపూర్ణము చేయు. 10. సంహరించు, నాశనముచేయు 11. జయించు.

సీ. పెనుగొండ సాధించె. వరాహ. 1. 30.
తమశసాధ్యుల సాధింపఁదలఁపఁదగునె. కుమా. సం. 4. 78.

12. సంపాదించు.

వా. సంసారస్థితినుండి యోగగరిమన్ సాధించెనేనిన్. బుధో, త్తంసం బాతఁడెయంత దైర్ఘ్యమహిమన్ కాల్పంగఁ దానోపునే, సంసారంబును బాసినైన సమనుష్యంబై నచో నుండి వి,ద్యాంమం దభ్యాసంబు సేయఁగగుని ర్వ్యాంభా స్వభావంబునన్. శివ యోగ. ఉ. 1 ఆ. 18 పుట.

13. వశపఱచుకొను.

వ. ఇట్లు మాహిష్మతీపురంబు సాధించి నీలుచేత పరిఁగొని సహదేవుండు. భార. సభా. 1. 260.

14. నేర్చు, గ్రహించు.

మ....విశ్వామిత్రుఁడి ట్లయ్యెడన్, పతకాఖ్యాన కుతూహలాగ్ర్యనియతిన్ సాధింపఁగా విద్యలా తతిభ్రాంతి భయంబునన్ దలఁకి యత్యంతంబు వాపోయెడిన్. మార్క. 1. 149.

15. సంహరించు.

మ.... లతఋన్ రోధించి సాధింపుమా. ఉ.రా.7.72.

సాధిక సం. వి. అ. స్త్రీ. 1. నిపుణురాలైన స్త్రీ. 2. గాఢ నిద్ర.

సాధికారము సం. విణ. అ. ఆ. అ. 1. ప్రభుత్వము గలది, అధికారముగలది. 2. రాజనియోగ బలము గలది.

సాధిక్షేపము సం. విణ. అ. ఆ. అ. 1. తిరస్కారము. 2. అధిక్షేపముతో గూడినది.

సాధితము సం.విణ. అ. ఆ. అ. 1. వెలవేర్పఁబడినది. 2. పూర్తి చేయఁబడినది. 3. నిరూపింపఁబడినది. 4. పొందఁబడినది. 5. నిర్వర్తింపఁబడినది. 6. శిక్ష విధింపఁబడినది.

ఉ. సాధితసర్వధర్మ! యవసాదిత దుర్జనకర్మ. హరి. ఉ. భా. 9. 284.

6. వశ్యుఁడుగా చేయఁబడినది. 7. తీర్చి పొందఁబడినది. 8. దండగ్రహము విధింపఁబడినది. 9. శిక్ష విధింప బడినది.

సాధిమ నం. వి. న్. పుం. 1 సౌజన్యము. 2. ఉత్కృష్టత. 3. శ్రేష్ఠత. 4. పరిపూర్ణత.

సాధిష్ఠము నం. విశే. (సాధు, సాధియాన్, సాధిష్ఠ) అ. ఆ. అ. సాధుతమము, మిక్కిలి సాధువైనది, మిక్కిలి పదిలమైనది

సాధిష్ఠానము నం. విశే. అ. ఆ. అ. ఆశ్రయముగలది. ఆధారముగలది.

సాధీయము నం. విశే. న్. ఈ. న్. సాధుతరము

సాధీయముఁడు నం. వి. న. పుం. 1. చాలగట్టివాఁడు. 2. చాల మంచివాఁడు.

సాధు నం. అవ్య. మేలు, బాగు, బళా, చాలు, సరి.

సాధుజము నం. విశే. అ. ఆ. అ. సత్కులమున బుట్టినది. ఉన్నతసంభవము.

సాధుఁజేయు వ. క్రి. చక్కఁజేయు.

సీ. వకులుని సైదుసాయకముల గ్రుక్కించి, సహదేవు నేడింట సాధుఁజేసి నవవిశిఖముల మాత్స్యవరేణ్యు నదఁగించి, యేడింట సాత్యకి యేపుమాపి. భార. ద్రోణ. 1. 205.

సాధుత నం. వి. ఆ. స్త్రీ. (రూ. సాధుత్వము. అ. న.) మంచితనము, సౌజన్యము, సౌశీల్యము, యోగ్యత, పరిపూర్ణత.

సాధుదర్శనము నం. విశే. అ. ఆ. అ. 1. అందమైనది. 2. ఆలోచనగలది, జాగ్రత్తగలది, దర్శనయోగ్యమైనది.

సాధువాదము నం. వి. అ. పుం. 1. మేలుమేలనుమాట. 2. పొగడ్త.

చం. ...దివంబునన్, వెలయఁగ సాధువాదములు వించె. భార. సభా. 2. 31.

సాధువాహము నం. వి. అ. పుం. (రూ. సాధువాహి. న్. పుం.) సుశిక్షితమైన యశ్వము.

సాధువు నం. విశే. ఉ. త్రి. ఉ. 1. మంచిది, శ్రేష్ఠమైనది. 2. తగినది, ఒప్పయినది. 3. గుణవంతమైనది, పవిత్రమైనది, శుద్ధమైనది. 4. దయగలది. శాంతమైనది. 5. ఆహ్లాదకరమైనది, సుందరమైనది. 6. ఉదారమైనది. 7. ఉదాత్తమైనది, ఉత్తమవంశమున బుట్టినది. 8. సమర్థమైనది.

సాధువు నం. వి. ఉ. పుం. 1. సత్పురుషుఁడు, సుజనుఁడు. 2. ముని, యతి.

కం. ఆధునిక సాధునికరస, మాధిదురారాధితామహత్తర వార్తా,రోధార్థ విహితమచ్ఛి,త్త్వాధిగమా! పెద్ద వేంకటాధిప సుగమా! రాఘవపాం. 3. 143.

3. వణిజుఁడు. 4. జైనముని. 5. వడ్డీ వ్యాపారస్థుఁడు. 6. చక్కని (వాఁడు).

సాధువృక్షము నం. వి అ. పుం. కదంబము, కడిమిచెట్టు (వృ వి.).

సాధువృత్తము నం విశే. అ. ఆ. అ. 1. మంచి నడవడికగలది. 2. మంచి వృత్తాంతము గలది. 3. మంచి వర్తులాకారము గలది. 4. మంచి పద్యములు గలది.

సాధువృత్తము నం వి అ.న. సత్ప్రవర్తన, ఆర్జవము, సౌజన్యము.

సాధ్వృతము నం. వి. అ. న. 1. అంగడి, దుకాణము. 2. ఛత్రము. 3. నెమిళ్ళగుంపు.

సాధ్యఋషి నం. వి. ఇ. పుం శివుఁడు.

సాధ్యత నం. వి. ఆ. స్త్రీ. 1. సాధింపఁదగియుండుట. 2. సాఫల్యావకాశము. 3. నివర్తనయోగ్యత.

సాధ్యపక్షము నం. వి. అ. పుం. అభియోగమున వాది విన్నపము.

సాధ్యము నం. విశే. అ. ఆ. అ. 1. సాధింపవలసినది. 2. సాధింపఁదగినది. (చూ. సాధించు.) 3. శాస్త్రము వలన రూపొందినది.

సాధ్యము నం. వి. అ న. 1. సిద్ధత, పూర్ణత. 2. నిరూపింపవలసిన యంశము. 3. (తర్కము) అనుమేయము.

సాధ్యము నం. వి. అ. పుం. 1. దేవత. 2. ఒక మంత్రముపేరు.

సాధ్యసిద్ధి సం. వి. ఇ. స్త్రీ. 1. లక్ష్యప్రాప్తి ఉద్దిష్టార్థలాభము 2. సిద్ధాంతము, సమాప్తి.

సాధ్యుఁడు సం. వి. అ. పుం. 1. ఒకజాతి దివ్యపురుషుఁడు. 2. గణదేవతావిశేషము, పన్నిద్దరు గణదేవతలలో నొకఁడు (వాచ.).

కం. సాధ్యుఁడు మూర్ఛ మునిగి రథ, మధ్యంబున ప్రాలి వేగమ ప్రబుద్ధుఁడై. హరి ఉ.భా. 10. 93.

శా. సాధ్యాది త్రిదశాపగీష్ణ గుణ కృష్ణాతుంగభద్రాపగ మధ్యద్వీప.... రాఘవాభ్యుదయము. 6. 363.

సాధ్వసపడు అ. క్రి. భయపడు.

కం. ఉసురుకొనం గసరినవెస, దెసచెడి యిక్కొండ నెక్కెతి వతండిటు దారుణమై వచ్చుటకున్ సాధ్వసపడఁగాఁ బాము తేటపడ వినుమింకన్. చంపూరా. 6. 226.

సాధ్వసము సం. వి. అ న. 1. భయము. 2. ఉద్వేగము, ఉత్తలపాటు.

సాధ్వి సం. వి. ఇ. స్త్రీ. 1. పతివ్రత, ప్రోత్తది, శీలవతి 2. ఒక దినుసుదుంప, గి. భ. న. జ. న. స. న. న. భ. గురువుగల వృత్తము; 8. 12. 22. యతులు.

సాన వి. (సం. శాణః. ప్రా. సాణ) 1. ఒఱపురాయి, అస్త్రము మొ॥ పదునుపెట్టు రాయి. 2. గంధముతీయుటకు గంధపుచెక్కతో రాచెడి రాయి. 3. మణులమొక్కలు పోఁబాచెడు రాయి 4. గంధము తీసుకొనురాయి.

ద్వి. ముదమున వలపలి మోఁచేయిసాన, గదియించి తిగిచి శ్రీగంధంబు వడసి బస. పు. 4. 87వ పం.

సానందము సం. విణ. అ. ఆ. అ. ఆనందముతోఁ గూడినది, సంతోషపడినది.

సానకత్తి వి. సాదనకత్తి.

వ. పులులెక్కిన యంగములు దుఱంగలింపఁజూపట్టుకరమ్ముల కంబుల నిలుపు సానకత్తుల నెగుభుజంబుల నిక్కనొరిగి. ప్రబం. 1. 78.

సాన(ల)దీఁరు అ. క్రి. సాన యొఱపిడిచే మెఱుగెక్కు.

ఉ. సత్కవికల్పనా విశేషావహ పూర్వవృత్తములు సానలఁ దీరిన జాతిరత్నముల్ .... వసు. 1. 19.

సీ. అంగనాంగ శాంతి సంగోపమానంబు నవవిల్తు సానదీరిన చకోర జాతి క్రొవ్విరివన్నెనము రాజవాహన. 3. 75.

చం. అకుకొఁ యింత లేఁకుచుమాన్పుఁడు క్రొన్నెల సానదీరు చెంగలువఁకోలలన్. దశా. 3. 43.

సీ.... ముద్దియకమ్మ కెమ్మోవి మాణిక్యంబు సానదీరినకతి చాయలూనె. దశా. 6. 10.

సానఁదేఱు అ. క్రి. మెఱుఁగారు, పదునెక్కు.

సీ.... తెలివాలుగను కెలంకుల సానఁదేఱిన చిలిచూపు లొకింత సిగ్గుగులుక .... దశా. 6. 15.

సానఁబట్టు స. క్రి. పదునుబెట్టు, మెఱుఁగుపెట్టు.

చం. ...అమ్మానిపాలికివచ్చె వేల్పుఁదొ, య్యలి మనసానఁబట్టిన యనంగుని మోహనబాణమో యనన్. మను. 6. 21.

గీ. సానఁ బట్టిన రాపాడి చేల్లి మెరిపి. మను. 2. 36.

తే. సానఁబట్టిన మకరాంకు శస్త్రమనఁగ. పారి. 1. 78.

సానఁబెట్టు స. క్రి. (సానన్ + పెట్టు) సానపై నూఱి పదునుపెట్టు.

తే పెడమరలి యేనె వాని నప్పుడమరుండు, సానఁబెట్టిన మోహనాస్త్రంబు దొడిగి. శృం. నై. 6. 116.

సానలము సం. వి. అ. పుం. సాలవృక్షపుబంక.

సానలవాఁడు వి. మణికారుఁడు, మణులను సాగు చేయువాఁడు.

సీ. సానలవాఁడు పూసలవాఁ డనంగను, మణికార సంజ్ఞయై మనుచునుండు .... ఆం. భా. 2. 286.

సానసి సం. వి. ఇ. పుం. బంగారము.

సానాకత్తి వి. సానకత్తి.

సీ. వనవింటి వాని సానాకత్తి పరుజుపెక్కుల చొక్కటపు సాముకొందెలలర. కువల. 1. 86.

సానాగడ వి. సాదనకఱ్ఱ.

కం. కాంచిన వనసానాగడ, కెంచపు మాష్టీఁడు బెట్టుగెంబుచు. ఉ. హరిశ్చ. 4. 114.

సాని వై. వి. (సం. స్వామినీ, ప్రా. సామిణీ. త. సాని. క. సాని)
1. స్త్రీ.

సీ అయ్యెడ్డఋను గృష్ణ నట్లొప్పఁ దోడ్కొని చని
యొక్క ముదుసలిసాని కపుడు. భార. ఆది. 7. 221.

2. అధిపురాలు, రాణి.

కం. మానిని వినుమ నావట్టవు. సావిగ నేవరించి
సకలసామ్రాజ్యంబున్, మానుగ నీకిడి కొలిచెద. ధనిక. 6. 114.

సీ ఏమన్నవనియోఁగాకేమి మీ యేలికసాని వచ్చితి
వీవ చాలు మాకు. కాశీ. 6. 221.

3. భార్య. చూ. బజ్జసాని.

తె. పెట్టుపోతల నాగసాని పెట్టిసాని, యింటికడ
మండి యజ్ఞాదులంటువాఁడు. కుర. 2. 203.

4. వేశ్య, వారస్త్రీ.

ఉ.... సామలకూటముల్ గలుగు జాణలు నీటులు
వెట్టకుందురే? దశా. 2. 155.

ఉ.... దేవుని సానివారికి మద్దెలకానికి పుల్లాయ
యముల వారికి తే.కృతమగు. 2000. 1161. వె. శా. 3. 1058.

సీ. తే.... శ్రీమేశ్వరునిగొల్తు రవ్పురమున, సాను
లను పేరి యప్సరశ్చంద్రముఖులు. భీమ. 1. 89.

5. స్త్రీల పేళ్ళచివఱ అమ్మయను వర్థమున వచ్చు
ప్రత్యయము.

ఉ. ...మంత్రి శ్రీధరుఁడు వానికి సూరవసానికిని
బృహస్పతి నిభుఁ డుద్భవించె బుధబంధు నిధానుండు
గంటడమ్మహిన్. వా. శా. ద. శా. 4. 695.

పెంటిసెట్టికిం పేకసానికి సుపుత్రుండైన కానిసెట్టి. దా. శా. 1147.

పశ్ని గుణవతి తన్య యెఱియాసానీతి విశ్రుతా. దా. శా. 1164.

తమతల్లి మల్లాసానికిం బెట్టిన అఖండవర్తి. దా. శా. 1068.

దండనాయక చోడవనాయకునితల్లి కొమ్మసాని
పెట్టిన. దా. శా. 1079.

వృత్తిగల స్త్రీ (మంత్రసాని), దేవదాసి. శ్రీమేశుండు
సాని వాడకరుగున్. భీమ. 1. 112

(పెమ్మసాని, అల్లసాని ఇత్యాదిగా గృహనామ
ముల యందును కనిపించుచున్నది) (దేశప్రాంతీయ
నామముగాగూడ కలదు. కురాసానియోమము (వాచ.).

సానిక సం. వి. అ స్త్రీ. 1. గొట్టము, వెదురు
గొట్టము. 2. మురళి, పిల్లనగ్రోవి.

సానిక వి. వెలుపాటి తట్ట. ఆం. భా. 2. 245.
2. మట్టికంచము. 3. మల్ల. (శ. ర.)

సానికరణము లెక్కలు పరిచూచు(ట)వాడు.

సానిప (రూ) సాన్పు, సానుపు, సానిపి. వి. వాకిలి
తుడిచి కళ్ళాపు నీళ్ళుచల్లుట. (వాచ).

సానివాడ వి. 1. వేశ్యవాటి. 2. దేవదాసీలు నివ
సించు పేట.

"శ్రీమేశుండు సానివాడ కరుగున్. భీమ. 1. 112.

సానివాఁడు వి. భోగము కులమువాఁడు.

సానుకంపము సం. విణ. అ. ఆ. అ. దయగలది, సాను
భూతిగలది, జాలిగలది, అనుకంపగలది.

సానుక్రోశము సం. విణ. అ. ఆ. అ. సుకుమారము,
దయగలది, జాలిగలది.

సానుతాపము సం. విణ. అ. ఆ. అ. పశ్చాత్తాపము
గలది, సంతాపముగలది.

సానునయము సం. విణ. అ. ఆ. అ. 1. వినయము
గలది. 2. మర్యాదగలది. 3. ఆదరముగలది.
4. నాగరికమైనది.

సానుబంధము సం. విణ. అ. ఆ. అ. ఎడతెగనిది.
నిరంతరమైనది.

సానుమంతము సం. వి. న్. పుం. న్. తీ. న్.
పర్వతము.

సానుమంతము సం. వి. ఈ. స్త్రీ. సానుమతి, ఒక
యప్సరస.

సానురాగము సం. విణ. అ. ఆ. అ. ప్రేమగలది,
చనవుగలది, ఆసక్తమైనది.

సానువు సం. వి. ఉ. పుం. 1. శిఖరము, శృంగము.

2. కొండనెత్తము, ఉపరితలము. 3. మొలక. 4. అడవి. 5. బాట, పథము. 6. పైభాగము, అగ్రము. 7. పర్వతప్రాంతము. 8. సుడిగాలి. 9. విద్వాంసుఁడు. 10. సూర్యుఁడు.

సానేయి సం. వి. ఈ. స్త్రీ. సానిక.

సానేయిక సం. వి. ఆ. స్త్రీ. సానిక.

సాన్నాహనికము సం. విణ. అ. ఈ. అ. 1. కవచము ధరించునది. 2. యుద్ధమునకుఁ బురికొల్పునది.

సాన్నహనికుఁడు సం. వి. అ. పుం. కవచధారి, కవచవాహి.

సాన్నాయ్యము సం. వి. అ. పుం. హవిస్సు, దధిపయోరూపమైన హవిస్సు (అని కొందఱు). క. ర.

సీ. ప్రాగ్వంశబంధుర బహుగంధ సాన్నాయ్య మార్గీధ్ర ముఖ్యార్త్విగాశ్రయంబు. ఉ.హ. 2.108.

సాన్నిధ్యము సం. వి. అ. న. 1. సామీప్యము. 2. ప్రత్యక్షము, సాక్షాత్కారము. 3. హాజరు.

సాన్నిపాతికము సం. వి. అ. ఈ. అ. 1. మిశ్రము, సంకరము, కలగాపులగము. 2. క్లిష్టము, సంకీర్ణము. 3. వాతపిత్త శ్లేష్మదోషముల సాంకర్యము.

సాన్యాసికుఁడు సం. వి. అ. పుం. 1. తురీయాశ్రమస్థుఁడగు బ్రాహ్మణుఁడు. 2. సన్యాసి.

సాన్వయము సం. విణ. అ అ. అ. 1. సంబంధము గలది. 2. వంశపరంపరాగతమైనది. 3. పైతృకము.

సాపడు = సాదము + పడు (త. చాప్పిడు) స. క్రి. తిను, భుజించు.

చం. మరలి వసుంధరామరకుమారుఁడు వైష్ణవ రాజమందిరాం, తరములకేగి యందు నియతంబగు మాధు కరంబుఁదెచ్చి శ్రీ,హరికి సమర్పణం బని కదన్నము సాపడి రేవగళ్ళు దా,వరముగనుండె నయ్యటజవాటికఁ దోఁటకుఁ బ్రోది సేయుచున్. విక్ర. 2. 33.

ఉ. శీతలవారిఁ ద్రావువడఁ జెందినవాఁడు క్షుధార్తుడిష్టమృష్టా, తదతత్యమాంసకలితాన్నము సాపడు. శర్మి. 3. 19.

సాపత్నము సం. విణ. అ. అ. అ. సవతివల్ల కలిగినది, సవతికి సంబంధించినది.

సాపత్నులు బహు. సం. వి. అ. పుం. సవతి బిడ్డలు.

సాపత్న్యము సం. వి. అ. న. 1. సవతితనము. 2. వైరము, స్పర్ధ, పోటి.

సాపత్న్యుఁడు సం. వి. అ. పుం. 1. సవతి కొడుకు. 2. శత్రువు.

సాపరాధము సం. విణ. అ. అ. అ. నేరముగలది, అపరాధముతోఁ గూడినది.

సాపవాదము సం. విణ. అ. అ. అ. 1. అపనిందను ప్రచారముచేయునది. 2. అపవాదముపాలైనది.

సాపాటు √సాదము. వి. ఆరగించుట.

తే. గీ. ధాన్యముష్టి గులామెత్తి దావరిత్య, మేక తంబువఁ దా స్వయంపాక మాచరించి సాపాటుఁ జేయుదువంచు పతని, మొఱఁగి తన యింటికేగి ముమ్మఱు భుజించు. వైజ 2. 122.

సాపించు స. క్రి. (సం. శాపించు) శపించు, తిట్టు.

ద్వి. కటకటా! సాపించెఁగాక యత్తపసి. బస. పు. 149 పే. 12 పం.

సాపిండ్యము సం. వి. అ. న. 1. ఒకేపితృదేవతా వర్గమునకు పిండము లర్పించు సంబంధము. 2. బంధుత్వము, రక్తబంధము. 3 జ్ఞాతిత్వము.

సాపెనలమారి వి. శాపనశీలుఁడు, తిట్టుబోతు.

తే. గీ. చేటపెయ్యకల్మచ్చు చెడుగుసాపెనమారి. హంస. 6. 113.

సాపేక్షము సం. విణ. అ. అ. అ. 1. సంబంధించినది, అన్యముపై నాధారపడినది. 2. కేవలముకానిది. (వ్యతి. నిరపేక్షము)

సాప్తపదము సం. విణ. అ. ఈ. అ. కలిసి ఏడు అడుగులు నడచుటవలనఁ గాని ఏడు మాటలు పలికికొనుట వలనఁగాని ఏర్పడినది.

సాప్తపదము సం. వి. అ. న. 1. వధూవరులు అగ్నికి ప్రదక్షిణముగా ఏడు అడుగులు వైచుట. 2. మైత్రి, స్నేహము.

సాప్తపది సం. వి. ఈ. స్త్రీ. చూ. సాప్తపదము.

సాప్తపదీనము సం. విశే. సం. వి. అ. న. చూ. సాప్తపదము.

సాప్తపౌరుషము సం. విశే. అ. ఈ. అ. ఏడు పురుషాంతరములకు సంబంధించినది.

సాఫల్యము సం. వి. అ. న. 1. ఫలప్రాప్తి, ప్రయోజనము. 2. లాభము. 3. జయము.

సాఫీ హిం. వి. శుభ్రత, తిన్ననైనము.

సాపు హిం. విశే. తేట, శుభ్రమైన, వంకరలేని, సూటియైన.

సాపు వి. తుడుపులు, తప్పులులేనివ్రాత.

సాబాధము సం. విశే. అ. ఆ. అ. 1. క్రమరహితమైనది. 2. చెల్లాచెదరైనది.

సాఁబాలు వి. (సాము + పాలు) సగము, అర్ధభాగము, సగముభాగము, సంగోలు.

సీ. గోరఁబోఁజిమ్మినమాడ్కి గొన్నింటి జక్కసాఁబాలుగాఁబ్రయ్యలు వాపి పాపి. భార. విరా. 5. 35. (వృత్తియందు సాముశబ్దమున కంత్యవర్ణలోపము) (సగమునకు సాయాదేశము)

మ. నతి శుశ్రూషలఁ గైకొనున్ మఱియుఁదా సాబాలు ధర్మస్థితిన్. మార్కం. 2. 179.

సీ. వీగంధగజయాన హృదయ మువ్విళ్ళూర్చి భవుని మైఁ జక్కసాఁబాలుఁగొనియె. కాశీ. 4. 150.

సీ. .... వడిబెట్టులోఁజెఱకడవము సాఁబాలూనతెంగునంబారంపుఁజింతపండు. ఆము. 2. 97.

సీ. పచ్చకప్పురము సాఁబాలు కూర్చికురంగ మదమున గీఱువామంబు దిద్ది. కువల. 2. 4.

సాఁబాలు వి. సమాంశము, అర్ధాంశము.

ఉ. కేలనుబోటువాలు దులకింపఁదలందొగ మేలుమేలిసాఁ,బాలున వాలుకెం జడల పట్టున దొన్కిన లాడుచుండు పెన్,జాలు విరుందగల్పి పాదచారల వన్నె మెకంబుతోలు డా,కాలునగండ పెండెపు చౌకారపుడాలును గల్గు సామికిన్. చెన్న. 3 ఆ. 33 ప.

సాబ్లి సం. వి. ఈ. స్త్రీ. ఒక విధమైన ద్రాక్ష.

సాబాసు[1] (సేబాసు) అవ్య. ప్రశంసార్థకము.

శా....మ, ఝ్ఝారే శివము బాఁగురే స్ఫురితముల్ సాబాసు ధాలంచు. చంద్ర. 1. 129.

సాబాసు[2] వి. హెచ్చరికపదము.

కం. జాబోమ్మకు గిలిగింతలు, నీబోటునిబేలు వఱచి నెకిదెచుట్టం,బై బమయించెను నన్నున్, సాబాసేబాల వాని సరసకుఁ దియకే. ప్రపం. 1. ఆ. 680.

సాభిప్రాయము సం. విశే. అ. ఆ. అ. 1. ఉద్దేశపూర్వకము. 2. సార్థకము. 3. రత్యాదిభావసహితము. 4. వ్యంజకము.

సాభిమానము సం. విశే. అ. ఆ. అ. 1. అహంకారముగలది. 2. గర్వముతోఁ గూడినది. 3. అభిమానముతో కూడినది.

సాభోగము సం. విశే. అ. ఆ. అ. విస్తృతిగలది, విశాలమైనది.

మ. అవితోర్వీ నవఖండ! ఖండపరశుజ్యాభోగి సాభోగ భా,గవిభాస్వద్భుజదండ .... వసు. 1. 164.

సాభ్యసూయము సం. విశే. అ. ఆ. అ. 1. ఈర్ష్యగలది 2. అసూయతోఁగూడినది. 3. ఓర్వలేనిది.

సామంజస్యము సం. వి. అ. న. 1. ఔచిత్యము, యోగ్యత. 2. అన్యూనానాధిక్యము. సరిపడియుండుట, ఒప్పు.

సామంత సం. వి. అ. పుం. ముప్పదిరెండు నపుంసకరాగాలలో నొకటి.

సీ. మధ్యమావతియును ముఖారి మలహరి సామంత పంతువరాళియు బాళిరాగ, హంస. 5. 124.

గీ. చెంచు మలహరి దేశాక్షి శ్రీవరాళి మాళవియుఁ బాండిసింధురామక్రియయు వసంత సామంత శుద్ధ వసంత గుజ్జరియును హెజ్జిజి నీలాంబరియు వనంగ

తే. గీ. పొసఁగు ముప్పదిరెండు నపుంసకములు హంస. 5. 125.

వి. ఒకానొకరాగము.

సీ. శర్ద్వసంత మధ్యమానతులు సామంతమనువారు అను చెంచు మతంగాయ ముఖా మాళవియును. ప్రబం. ఆ. 1, 68.

సామంతము సం. విశ. అ ఆ. అ. 1. పొరుగున నున్నది, పొలిమేరనున్నది. 2. సార్వజనీనము, సామాన్యము.

సామంతము సం. వి. అ. న. ఇరుగుపొరుగు, చుట్టపక్కములు, ప్రౌఢిమ, దిట్టతనము. (క. సామన్త్ర) కం. అంతట నాగసరంబుల, నింతులు శాసనములు మిగుల హెచ్చించుచు, సామంతము పరపన్ బరియు వసంతములోనైన దనుచు జనుదే మతి యన్. యయా. 4. ఆ. 147.

సామంతరాగోల వి. ఆయుధవిశేషము.

ద్వి. సామంతరాగోల చంకవబెట్టి. పల్నా. వీర. పుట. 11. 119.

సామంతుడు సం. వి అ. పుం. 1. ఒకదేశము నెల్లకు చేరికనున్న రాజు. 2. పొరుగున నున్నవాడు. 3. అరిగాపు 4. నాయకుడు.

సామంతవళు(దు)లు మి. వి. వస్త్రవిశేషము.

సీ. నిండువన్నెలు మంచినిగమ గోచరులు సామంతవళులు ప్రతిమలును బొగడవచ్చులును. ప్రబం. 1. ఆ. 272.

సామకము సం. విశ. అ. ఆ. అ. సామవేదసంబంధి.

సామకము సం వి. అ. న 1. అసలుసొమ్ము. 2. ఋణమిచ్చిన ధనము.

సామకము సం న. అ. పుం. 1. సాన. 2. ఒఱపిడిరాయి

సామగర్భుడు సం. వి. అ. పుం. విష్ణువు.

సామగాయనుడు సం. వి. అ. పుం. సామగానము చేయు బ్రాహ్మణుడు.

సామగ్రి సం. వి. ఈ. స్త్రీ. 1. వస్తుసముదాయము, సాధనసంపద. 2. నిలువసరుకు, పదార్థసంచయము. 3. ద్రవ్యసంభారము.

సీ.... సారెకనుష్ఠాన సాధనసామగ్రి, నతడు తెమ్మనక యాయితముచేసి. రాఘవాభ్యుదయము. 3. 53.

సామగ్ర్యము సం వి అ. న. 1 ? పూర్ణత.

శా. ... [illegible] మాంగల్యోత్సవశ్రీగ్రాల నె.తయమ సామగ్ర్య బ[illegible] ఱదలు, పొంగగన్. పా. పూర్ణ. 8, 28.

మొత్తము, సమ్మము ... [illegible] అమచర వర్గము. 3. సాధనసంచయము. 4. సంభారము, నిలువ.

సామజ(జాత)ము సం. విశ. అ. ఆ. అ. 1. సామవేదమునుండి పుట్టినది 1. సామోపాయమువలన కలిగినది.

సం వి. అ. పుం. ఏనుగు.

మ. కరడిపంబులతోడ సామజ తురంగస్యందనౌఘంబుతో.... ఉ హ. 3. 26.

సామనము సం. విశ. అ. ఆ. అ. (వైదికము) శాంతమైనది, సౌమ్యమైనది.

సామని(మ్ని) సం. వి. ఈ. స్త్రీ. పశువులను గట్టవేయుత్రాడు.

సామన్యుడు సం. వి. అ. పుం. న. 1. సామవేదనిష్ఠాతుడు. 2. ఋగ్గానవిపుణుడు.

సామము సం. వి. న్. న. 1. శాంతపఱచుట, ఓదార్చుట, అనునయించుట. 2 సంప్రదింపు, వచ్చ తెప్పుట, హితము (చతుర్విధోపాయములలో మొదటిది. చూ. క. ర.) 3. మృదువచనము. 4. సౌజన్యము, సౌమ్యము. 5. స్తుతిరూపమైన పద్యము లేక పాట. 6. సామవేదమందలి మంత్రము, చతుర్వేదములలో నొకటి.

సీ. తే .... సామగానారవంబు, వంతకంతకు తెలంగ .... ఉ. హ. 2. 111.

సామయాచారికము సం విశ. అ. ఈ. అ. 1. సమయములకు, ఆచారములకు సంబంధించినది. 2. సాంప్రదాయికము.

సామయికము సం. విశ. అ. ఈ, అ. 1. ఆచారమునకు సంబంధించినది, సాంప్రదాయికము. 2. సమ్మతము, అంగీకృతము. 3. నిర్ణయానుసారి. 4. వేళతప్పనిది, సకాలము. 5. న్యాయము, సముచితము. 6. అప్పుడప్పుడు జరుగునది. తాత్కాలికము.

సామయికాభావము సం. వి. అ. పుం. 1. నిలకడలేమి, క్షణికత్వము. 2. మిథ్య, అసత్తు.

సామయోని సం. వి. ఇ. పుం. 1. బ్రాహ్మణుఁడు. 2. ఏనుఁగు.

సామరస్యము సం. వి. అ. న. సమరసభావము, మైత్రి, ఐకమత్యము, చెలిమి.

సామరి (సాము+అరి) విశే. సామునేర్చినవాఁడు, సాముచేయువాఁడు.

ఉ. సంపెంగ మొగ్గముక్కు గడసామరి .... విజ. 1. అ.

తే. గీ. గడలు కాలా ల్పటాలు వగ్గలికఁబూని, పరు వడల్ ద్రొక్కకొనచు సిబ్బెఁపుబిఁ.ములు గవం బడ సామరుల్ మ్రోల తెలఁగ, సాదన లొనర్చి తెల్లు పెచ్చురిక లెనఁగ. రసిక. 1. 81.

సామర్థ్యము సం. వి. అ. న. 1. శక్తి, బలము, వీర్యము, దక్షత. 2. ఏకలక్ష్యత, ఏకాశయత్వము, ఏకార్థకత్వము, ఏకప్రయోజకత్వము. 3. యోగ్యత, ఔచిత్యము. 4. అర్థసమర్పణశక్తి, సంకేతశక్తి, అభిధాశక్తి. 5. లాభము, వడ్డి. 6. ధనము, సంపద. 7. ఉత్పాదకత్వము. 8. కారణత్వము. 9. సాధకత్వము.

సామవాయికము సం. విశే. అ. ఈ. అ. 1. సాముదాయికము. 2. అవినాభావ సంబంధముగలది.

సామవాయికుఁడు సం. వి. అ. పుం. 1. సచివుఁడు, మంత్రి. 2. సంఘాధ్యక్షుఁడు, నాయకుఁడు.

సామవేదము సం. వి. అ. పుం. నాల్గువేదములలో నొకటి. (ఋక్, యజుర్, సామ, అధర్వణము అని వేదములు నాలుగు.)

ద్వి. అనుపమ సామవేదాన్విత మహిమఁ జనిన రుద్రప్రశంసాపరోక్తులను. పండితా. పుట. 1.504.

సామవేది సం. వి. న్. పుం. సామవేదాధ్యాయియైన బ్రాహ్మణుఁడు.

ద్వి. శ్రవచయ్య నాఁగ నాసామవేదులకు పండితా. 1. 151.

సామవేదీయుఁడు సం. వి. అ. పుం. ఛాందోగ్యుఁడైన యాజకుఁడు.

సామాజికుఁడు సం. విశే. అ. ఈ. అ. 1. సమాజమునకు సంబంధించినది. 2. సభాసంబంధి. 3. సంఘసంబంధి.

సామాజికుఁడు సం. వి. అ. పుం. 1. సమాజమందలివాఁడు. 2. ప్రేక్షకుఁడు, శ్రోత. 3. సహృదయుఁడు, రసికుఁడు.

సామానాధికరణ్యము సం. వి. అ. న. 1. సమానావస్థయందుండుట, తుల్యస్థితికత్వము. 2. ఏకాధికారమునకు లోఁబడియుండుట. 3. ఏకాశ్రయత్వము, ఏకాధారత్వము.

సామాను హిం. వి. సామగ్రి, వస్తువులు.

సామాన్య సం. వి. ఆ. స్త్రీ. 1. ఒక నాయికాభేదము. (స్వీయ, పరకీయ, సామాన్య అని నాయికలు మువ్విధము) 2. వేశ్య, కులట.

సామాన్యజ్ఞానము సం. వి. అ. న. 1. జాతిలక్షణములను మాత్రమే తెలియుట. 2. ఎల్లరకుఁగల జ్ఞానము.

సామాన్యపక్షము సం. వి. అ. పుం. 1. ఉభయమునకు సంబంధించిన విషయము. 2. మధ్యస్థము.

సామాన్యము సం. విశే. అ. ఆ. అ. సాధారణము. 2. సదృశము, తుల్యము. 3. మధ్యమము. 4. గ్రామ్యము, అవిశేషము. 5. మొత్తము, సర్వము.

సామాన్యము సం. వి. అ. న. 1. సమాజము, జాతి, సమూహము. 2. సమానధర్మము, జాతిధర్మము. 3. మొత్తము, సర్వస్వము. 4. జాతి, తెగ. 5. ఐక్యము, అభిన్నత్వము. 6. సమానత్వము, తుల్యత్వము. 7. ప్రజావ్యవహారము. 8. సార్వవిషయికమైన యర్థమును ప్రతిపాదించు వాక్యము.

సామాన్యలక్షణము సం. వి. అ. న. 1. జాతి గుణ ధర్మములను మాత్రము వివరించు నిర్వచనము (తర్క.). 2. సముదాయమైన గుణక్రియాదికము.

సామాన్యశాస్త్రము సం. వి. అ. న. 1. నిత్యముగా సర్వమునకు వర్తించు నియమము, సాధారణవిధి. 2. సాధారణమైన ఆధునిక విజ్ఞానశాస్త్రము.

సామాసికము సం. విశే. అ. ఈ. అ. 1. సామూహికము, సాంగోపాంగము, సమగ్రము. 2. సంక్షిప్తము,

సంక్షిప్తము, క్లుప్తము, లఘువు. 3 సమస్త పదము నకు సంబంధించినది. 4. సమసించినది, సమస్తము.

**సామాసికము** సం. వి. అ. న. ద్వంద్వసమాసములకు సంబంధించినది, సమాస సమూహము.

**సామి** వి. 1. రాజు. 2. దేవుడు. "ఓ సామి యిపుడేమి సేయుదు". ఉ. రా. 1. ఆ.

వి. (సం. స్వామి) ప్రభువు.

కం. మాయాతు మలానినయది

సాయక సంతోసమున్న పలమిఁ సామీ! క. 6. 161.

వై. వి.

సీ. వెలిదమ్మి రేకు పొత్తుల చిన్నిపావఁడు.

వలుమోముదమ్ముల వెలయుస్వామి. దశా. 2. 62.

3. పెనిమిటి.

గీ. ఒక యలాబు కలాటుకండోదరమున, బాన్చి యటుడించి తామను బొత్తుగలసి, సామి దష్టాన్న కబళముల్ సామికొనగు, వనుచు జమ లెచ్చరిల్లుచు నిగుడబోడి. పాండు. 3. 87.

సీ ఏ సామి సామేన నేఁబ్రొద్దు. సిలా. 1. ఆ. 128.

గీ. ఏ దెమా సామి వేఁటాడిమాడరాదె. ఉ. రా. 1. ఆ.

గీ. సామి నముఁగూర్చి నీతోడ నేమిపలికె". (అచ్చు. సుం. కాం.- ౫. ర)

[illegible]. కుమారస్వామి.

[illegible]మి సం. అవ్య. 1. సగము, అసంపూర్ణము. 2. నింద్యము, నీచము.

"దంతమరీచులసామి నిర్గమంబు" విరాట. 1. ఆ.

"హరి యిచ్చుటనె సామి హరియై హిరణ్యాక్షిపుజీరె ఖంసఖశిఖరములను". వాల్మీకి 2. ఆ. 56.

**సామిగట్టు** స్వామిమలు, కుమారస్వామి యున్న కొండ వలి మెట్టువాడు; గాంకిగట్టు దేవుఁ సామిగట్టుకు నేను సామివోఁ డయు. చంద్రా. ౨. ఆ. 45.

**సామిధేని** సం. వి. ఈ. స్త్రీ. 1. సమిధ. 2. ఋగ్ఋయ (యాగమునందు అగ్నిని జ్వలింపఁ జేయునప్పుడు పఠించెడు ఋక్కు.)

**సామిమల** వి కుమారస్వామి వసించియుండు నొకా నొక పర్వతము.

వ. "సామిమలకుఁజని మహాముని ఘటోద్భవుఁడు" కాశీ. 4. ఆ. 50.

**సామిదోగి** వి స్వామిద్రోహి.

వ. సామి గుత్తె సాహోయెడివారు తిరుగ రానే త్తురా. ప్రబ. 1. ఆ. 155.

**సామీచి** సం. వి. ఈ. స్త్రీ. స్తుతి, శ్లాఘ, నమస్కారము.

**సామీప్యము** సం. వి. అ. న. చేరిక, సాన్నిధ్యము, సమీపత్వము.

**సామీపుత్త్రఁడు** సం. వి. అ. పుం. 1. పొరుగువాఁడు.

**సామీరి** సం. వి. ఇ. పుం. 1. హనుమంతుడు. 2. భీముడు.

**సాము** వి. 1. సగము, సగభాగము, అర్ధము.

గీ. ఆఱుసాము సగము సవము నాఁగ వర్ధావ్యయంబులౌ నాగభూష. ఆం. సం. 78.

చం. కన్నులు సాముమూయుచుం, బొరిబొరి దేలి చూచుచును. భా. రా. కిష్కిం. 875.

చం. కవిసి భరంబులైన మునికాళ్ళను వేయఁగ సామునీరిలోనను వెడలకుండి కూర్మము. భార. అను. 1. 232.

తే. గీ అతని దేహంబునందు సామాలిఁజేసి. కుమా. సం. 4. 52.

2. వ్యాయామము.

ఆ. వె. చదువుసాముగలిగి క్షత్రియుల్ వ పూర్ణ, విద్యాపవఁగ పీటవిముఖికెక్కి. కవి. 1. ఆ.

క. సాము నగడిచి యొడలెటు, సాముగ బట్టి యని సదరసమారి... అని రెండర్థములకును లక్ష్యము వాల్మీ. 2 ఆ.

సాము విశే. సగము.

క. వృధుమేరు సాము కూరకుఁడు, బడనిధి చెలికాని కొడుకు సఖ్య సమాజన్, గొంకోలకదలికదలకు, వడకుం గుబ్బలి సరియొనమధారుఁ ముల్. హర. 5. 24.

సాము వి. వ్యాయామము.

గీ. సాముగండీలు మాకు గోత్రామచంద్ర. మను. 2. 48.

సాముకంటిచుక్క వి. (సామకన్ను + చుక్క) పూర్వ ఫల్గుణీ నక్షత్రము. శ. ర.

సాముకొప్పు వి. అరకొప్పు.

వరిచుట్టి పూదండ వెరిచుట్టుగవనొప్పు: కప్పు చప్పిలు సాముకొప్పు దనర వాల్మీ. 2. ఆ. 18.

సాముదాయికము సం. విశే. అ. ఆ. అ. 1. సామూహికము, 2. మొత్తమునకు లేక సర్వమునకు సంబంధించినది.

సాముద్రము సం. విశే. అ. ఆ. అ. సముద్రమునఁ బుట్టినది.

సాముద్రము సం. వి. అ. న. 1. సముద్ర లవణము. 2. నౌరచేవ యెముక, 3. భాగ్యసూచక దేహలక్షణము.

సాముద్రికము సం. విశే. అ. ఈ. అ. 1 సముద్రమునఁ బుట్టినది, సముద్రసంబంధి, 2. అదృష్ట సూచక దేహలక్షణములకు సంబంధించినది.

సాముద్రికము సం. వి. అ. న. సాముద్రికశాస్త్రము; శరీరావయవములను బట్టియు హస్తరేఖలను బట్టియు ఫలమును చెప్పునట్టి శాస్త్రము.

సాముద్రికుఁడు సం. వి. అ. పుం. 1. సాముద్రిక శాస్త్రవేత్త. 2. హస్తరేఖలమబట్టి భవిష్యత్ఫలములు తెలుపువాఁడు.

సాముద్రుఁడు సం. వి. అ. పుం. 1. సముద్రయాత్ర చేయుఁవాఁడు. 2. నావికుఁడు.

సామునెలముక్కి – అర్ధచంద్రబాణము.

సీ. సామునెలముల్కిదోయి నిశ్చలముగా బఱగించి కాళ్ళురెండును ద్రుంచి కలువదాయ. అ. రా. యుద్ధ. 247.

సామూహికము సం. విశే. అ. ఈ. సాముదాయికము.

సామెత వి. లోకోక్తి.

గీ. రాజమగనైన వెనుకను గాజుకడియ మన్న సామెత నిక్కంబె యయ్యె మాకు. యయా. 3 ఆ. 107.

ద్వి. శ్రమసించినవాఁడు దాసనియన్న సామెత నిజమాయె నటమాటలకును. సారం. 3 ఆ. 112 పు 18 పం.

సామేను వి. సగముమేను, అర్ధశరీరము.

గీ. సామి సామేను చేకొన్నదాన. ఆంధ్రనామ సంగ్రహము.

గీ. హరిభుజాంతరవాసినియైన లక్ష్మి వైరి శివునకు సామేనవై తినీవు. మార్కం. 6. 120.

సీ. ఏసామి సామేన నేత్రొద్దు వలిగట్టు దొరపట్టి వర్మిలితోడ బూనె. నీలా 1 ఆ-12

సీ. అర్ధనారీశ్వరుండగుట నీశానుండు సామేని యంశిలి బాగకుండె. శృ. నై. 4. 129.

తే గీ. ఏమి వినుజాలు కనువాలు నిట్టికేలు, ఏది తోల్చిర మెడచార యెముకకోర, యేది నెలకూన సామేన నిడివచాన, యితఁడు శివేలదొరయని యెటులనందు. చెన్నబ. 3 ఆ. 52.

సీ. ప్రియుని సామేననుండియును దత్తీజంబు సైరింపజాలని శాంభవినగి, ఉ. రా. 1. 84.

సామోద్భవము సం. వి. అ పుం. ఏనుగు.

సామోపచారము సం. వి. అ. పుం. సామోపాయము; శాంతిమార్గము.

సామ్ముఖ్యము సం. వి. అ. న. 1. అనుకూల్యము, ఆదరము. 2. దయ, ప్రసాదము. 3. ప్రత్యక్షము, సమక్షము.

సామ్యము సం. వి. అ. న. 1. సమత్వము, సమానత్వము. 2. పోలిక, సాదృశ్యము. 3. సామరస్యము. 4. అవైషమ్యము, పక్షపాతరాహిత్యము. 5. అభేదము, ఐకమత్యము.

సామ్రాజ్యము సం. వి. అ. న. 1. చక్రవర్తిత్వము, ఏకచ్ఛత్రాధిపత్యము. 2. సువిశాలమైన రాజ్యము. క. అతతసామ్రాజ్య మంతకంతకుఁ జేర్చెన్. నృసిం. పు. 2.

సామ్రాజ్ఞి వి. (రూ. సామ్రాజి) ఉత్తమాశ్వము.
క. తామ్రధ్వజ భూవరుఁ డా, సామ్రమనయనుఁ డగుచుఁ గవలి తంత్రాధిపునీ, సామ్రాజెవ్వరిదన విని, వమ్రు డగుచు లిం గవలి నకుంధ్యజుడున్. జై. 7 ఆ.

సాయమ్, సం అవ్య. అపరసంధ్యాకాలమున. సాయం ప్రాతర్హుతప్రజల్విత.... భార. సౌప్తిక.
సీ. సాయం సమారంభ చక్రవాకద్వంద్వ విరహాన లోకన విభ్రమములు. పారిజాత. 1 ఆ. 95. (ఇది సమాసగతమై ప్రయుక్తమగుచున్నది)

సాయంకాలము సం. వి. అ. పుం. అపరసంధ్య వేళ.

సాయంగేహి వి. సాయంకాలమున ఇల్లు చేరువాఁడు.
ద్వి... వెదకుచు నొక్కచో వీసమంతయును, నాసక్తి లేక సాయంగేహులగుచు. ద్వి. పరమ. 1-42 పా.

సాయంతనము సం. విశే. అ. ఈ. అ. సాయంకాల సంబంధమైనది.
వ...హృదయంబు ప్రియంబునం బెవంగొన సాయ తన సమయంబున. ఉ. హ. 2-110.

సాయంధృతి సం. వి. ఈ. స్త్రీ. సాయంసంధ్యావళి.

సాయంప్రాతలు వి. ఉభయసంధ్యలు.

సాయంమండనము సం. వి. అ. న. 1. సూర్యాస్తమయము. 2. సూర్యబింబము.

సాయంసంధ్య సం. వి. ఆ. స్త్రీ. 1. సంధ్యారుణకాంతి. 2. సాయంసంధ్యోపాసన కి. సంధ్యాదేవి (సాయం సంధ్యకు సరస్వతియని పేరు)

సాయంసంధ్యా దేవత సం. వి. అ. స్త్రీ. సరస్వతి.

సాయ వి ఒక రాగ విశేషము. వంది కా. 2-455.

సాయకపుంఖము సం. వి. అ. పుం. బాణము యొక్క ఈకలు కట్టఁబడిన భాగము.

సాయకము సం. వి. అ. పుం. 1. బాణము. 2. ఖడ్గము. ఉ. ఒండొరు నేయు సాయకము లుక్కున విద్దెలు ద్రుంపఁగా హరి, ఉ. భా. 10. 86.

సాయగౌళ వి. ఒక రాగవిశేషము. వంది కా 2 454.

సాయనము సం. వి. అ. న. విషువద్బిందువు మండి గుర్తింపబడిన గ్రహము యొక్క రేఖాంశములు.

సాయబు హిం. వి. (హిం. సాహెబ్) ప్రభువు.
ఉ....దిట్టతనంబున బొమ్మి కచ్చిమేల్, రాయన దాని బారి నిగళంబునఁ బెట్టున కంటగట్టి తేఁ, ద్రాయపుఁ బెంచికొందు తనుఁబల్మెబు సాయబు జాడ వేడుకన్. చంద్రాంగ. 2. 97.

సాయము వి. సాహాయ్యము, తోడు.

సాయము సం. వి. అ. పుం. 1. అంతము, అస్తమయము, సమాప్తి. 2. దినాంతము. 3. బాణము.

సాయరు హిం వి. సుంకము.

సాయాహ్నము సం. వి. అ. పుం. దినాంతము, ప్రొద్దు క్రుంకువేళ.
వ. వాయుతనయుండు వాయువేగంబున జనిఁ సాయాహ్నంబున నొక్కవటమహీజాత శీతల శిలాతలంబున నునిచి. భార. ఆది. 6. 171.

సాయి సం. వి. న్. పుం. అశ్వికుఁడు, గుఱ్ఱపు రౌతు.

సాయిల వి. దుబుదక్కవాఁడు. (బుడుబుక్కలవాడు)

సాయు అ. క్రి. తొలఁగు, వశించు.
తే. గీ అపుడు చంద్రమతీదేవి యాత్మలోన, లేశ మాత్రంబు చలనంబులేక దైవ, మెల్ల వగపులు సాయంగ నిచ్చెవరము, తగదు చింతింపనింక డెంద మున ననుచు. హరిశ్చం. 5. 125.

సాయుజ్యము సం. వి. అ. న. 1. ఐక్యము, లయము. 2. పోలిక, సాదృశ్యము. 3. చతుర్విధ ముక్తులలో నొకటి.

సాయెబు = సాహేబు వి. హిం. హా. సాహెబు, సాహేబు.

సాయేబు = సాహేబు వి. హిం. హా. సాహెబు, సాహేబు.

సార సం. వి అ. స్త్రీ. 1. గజిక. 2 దగ్ధ.

సారంగ వి. ఇరువది నాలుగు శ్రీరాగములలో నొకటి.

సీ. ... మలహరులు సారంగ రామక్రియలు వసంత గౌళ, గన్నడ యవంగ మంగళ కౌశికయన, వెలయు నారాయణియు, చతుర్వింశతి విధముల దనరారు శ్రీరాగములను హంస. 5 128.

తే. గీ. పూర్వగౌళ సారంగమంగళ కౌశికులును, కన్నడయు చాయయును గౌళ కడునపూర్వమైన భల్లాతకియును నారాయణియును, గ్రమత నిరువదినాల్గు శ్రీరాగములును, ప్రబం. 1. 95.

సారంగము సం. వి అ. పుం. 1. త్వరగా పోవునది. 2. చిత్రవర్ణము. 3. ఇఱ్ఱి. 4. లేడి

శా. సారంగాక్షుల చూపు చోఱగములన్వజ్గాండ లవ్శోమహాదు, ర్వారావర్తముల మ్మనింగి....పారిజా 2. 100.

5. సింహము. 6. ఏనుగు 7. తుమ్మెద. 8. కోయిల. 9. పెద్దకొంగ, కొక్కెర. 10. నెమలి. 11. ఛత్రము 12. పక్షివిశేషము (Flamingo) 13. మేఘము. 14 ఉదుపు. 15 జుట్టు, కేశము. 16. శంఖము 17. కమలము. 18. కర్పూరము. 19 విల్లు. 20. చందనము. 21. జంత్రవాద్యము. 22. ఆభరణము. 23. బంగారము 24. భూమి. 25. చాతకపక్షి. 26 పుష్పము 27. రాత్రి. 28. వెలుతురు. 29. ఒక రాగము.

సారంగవీణ సం. వి. అ. స్త్రీ తంత్రీవాద్యవిశేషము. పండితా. 2. 443.

సారంగి సం. వి. అ. స్త్రీ. 1. ఆడులేడి. 2. తంత్రీవాద్యవిశేషము.

సారంగుఁడు సం. వి అ. పుం. పక్షులవేటకాఁడు, వ్యాధుఁడు.

సారంగుఁడు సం. వి. అ పుం. 1 శివుఁడు. 2. మన్మథుఁడు.

సారండము సం వి. అ పుం. పాముగ్రుడ్డు, సర్పాండము.

సారంభము సం. విశే. అ. అ. అ. ప్రయత్నముతో గూడినది (ఆరంభముతో గూడినది).

సారకము సం. విశే. అ. అ. అ. 1. విరేచనకారి, మలమోచనకారి. 2. నాశనము చేయునది, శుద్ధి చేయునది

సారగంధము సం వి. అ. పుం. చందనము.

సారగ్రీవుడు సం. వి. అ. పుం శివుఁడు.

సారఘము సం. వి అ. న. మధువు, తేనె.

సారటు అం. వి రథము, గుఱ్ఱపుబండి,

సారణ సం. వి. అ. స్త్రీ. 1 పాదరసమువంటి లోహములకు చేయు సంస్కారవిశేషము 2. షడ్జస్వరమునుబల్కు వీణయొక్క తీఁగె.

ద్వి. శాళవట్టియయుఁగత్తరి చోళవణియు లీల పారణయుఁదలిర్ప.... బస. పురా. 70 పు. 29 పం.

సారణము సం. విశే. అ అ అ. 1. కదలునట్లుచేయునది. ప్రవహించునట్లు చేయునది.

సారణము సం. వి. అ పుం. 1. అతిసారరోగము. 2. ఒక విధమైన జీడిమామిడి (వృ. వి.).

సారణము సం. వి. అ. న. ఒక విధమైన సుగంధద్రవ్యము.

సారణము వి. శ్యేనభేదము, డేగలలో నొక జాతి.

ద్వి. సాళువంబుల మంచి జలకట్టియలను, పెద్ద సారణముల బెట్టుగా విడిచి. హరిశ్చ. పూర్వ. 6. 27.

సారణి సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. కాలువ బోదె. 2. చిన్ననది, వాగు. 3. షడ్జస్వరము పలికెడు తంతి.

సీ. జవ్వాదిఁబదనిచ్చి సారణుల్ సారించి సరసత విరడలు చక్కనొత్తి. వాల్మీకి. 3. 183.

సారణికము సం. విణ. అ. ఈ అ. పయనించునది, కదలునది.

సారణికుఁడు సం అ. పుం. యాత్రికుఁడు, బాటసారి.

సారణుఁడు సం. వి. అ పుం. 1 రావణుని వేగుల వాండ్రలో నొకఁడు (శుక, సారణులు) 2. రోహిణీ వసుదేవుల కుమారుడు.

సారతరువు సం. వి. ఉ. పుం. అరఁటిచెట్టు (వృ. వి).

సారథి సం. వి. ఇ పుం. తేరు గడపువాఁడు, రథ చోదకుఁడు.

తే. గీ. రథికునకుఁగల మరికి సారథియుఁ గర్ణ ధారుడును బోలె భార. శాం. 5. 588.

2. సహాయుఁడు. 3. సముద్రము.

సారథ్యము సం వి. అ. న 1. రథమునడుపుటని, రథచోదకత్వము. 2. నియంతృత్వము, నాయకత్వము.

సారద సం. వి ఆ. స్త్రీ. 1. సరస్వతి. 2. దుర్గ.

సారద్రుమము సం. వి. అ. పుం. ఖదిరవృక్షము (వృ. వి).

సారభాండము సం. వి. అ న. 1. సహజమైనయాన పాత్ర. 2. సరకులు, ఓడయందలి పణ్యద్రవ్యములు. 3 సాధనములు, ఉపకరణములు.

సారమితి సం వి. ఇ. స్త్రీ. వేదము.

సారము సం విణ. అ. అ అ. 1. ముఖ్యము. 2. శ్రేష్ఠము. 3. యథార్థము, సత్యము. 4 దృఢము, వీర్యవంతము 5. బుజువైనది, సిద్ధాంతము, నిశ్చితము. 6 సర్వోత్తమము

సారము సం వి. అ. న. 1. జలము. 2. ఔచిత్యము, యోగ్యత. 3 అడవి. 4 ఉక్కు.

సారము సం వి. అ పుం 1. ముఖ్యాంశము. 2. నిగ్గు, ఆయువు పట్టు

తే. వేదసారంబు సత్యంబు విమఁడు సత్య సార మూర్తిదమము దమసారలారం మోక్షమీవరిపాటి భార. శాం. 5.54.

3. రసము, జీవము. 4. తత్త్వము, పరమార్థము. 5. రసము, చేవ.

సీ. తే... అచల స ఋద్ధులా బల సహితసా కనుల ధాగూర్చెఁ బాపలు వెదకుచుఁడగ. రాఘవపాం. 8-121.

6. సంక్షేపము, సంగ్రహము. 7. బలము, వీర్యము, శక్తి. 8. ఉత్సాహము, విక్రమము, శౌర్యము. 9. స్థైర్యము, ధైర్యము, దార్ఢ్యము. 10 సంపద, ఐశ్వర్యము 11. అమృతము. 12 వాయువు. 13. మీఁగడ. 14. రోగము. 15మ పదార్థము. 15. విలువ, అతిశయము, చురుకుపాపు. 16. ఒక అర్థాలంకారము. 17. హృదయము.

సారమేయము సం. వి అ పుం. మగకుక్క

సారమేయి సం. వి. ఈ స్త్రీ. ఆడకుక్క.

సారలోహము సం వి అ. న. ఉక్కు.

సారల్యము సం. వి అ న. 1. బుజుత్వము 2. నిష్కపటత్వము. 3. తిన్నఁదనము, మూటతనము.

సారవంతము సం విణ (త్ త్ తీ. త్.) 1. దృఢమైనది. నరుకు గలది. 2. ఫలప్రదము, బలము గలది 3 రసము గలది.

సారవము సం విణ (అ. ఈ. అ.) సరయూ నది సంబంధమైనది. (ౘ. ర.).

సారస(శ)నము సం. వి. అ. న. 1, మూఁడు పేటలు గల అరుదాని మొలనూలు. 2. కవచము తొడిగిన వాని వడికట్టు.

సారసము వి. వినోదము,

తే అధిప నీ తనయుండు గయ్యంబు బోడుచు, తెంపు వదలక విభవంబు పెంపు మెఱసి, సారసానకు వచ్చిన చందమునను, చెలిమిఁ బొందిరి పాండవేయులును హాయి భారం. భీష్మ. 1. 142.

సారసము సం. విణ. (అ ఈ అ.) 1. సరస్సునకు సంబంధించినది. 2. బెగ్గురు పక్షికి సంబంధించినది.

సం. వి. అ. న 1. తామరపువ్వు. 2. స్త్రీ మొలనూలు.

సం వి అ. పుం. 1. బెగ్గురుపక్షి. 2. పక్షి.

సారసి(క) సం. వి. ఈ. అ. స్త్రీ. బెగ్గురు పెంటి.

సారసుఁడు సం. వి. అ. పుం. చంద్రుఁడు.

సారస్యము సం. వి. అ. న. సరసత్వము.

సారస్వతము సం. విణ. (అ. ఈ. అ.) 1. సరస్వతికి సంబంధించినది. 2. సరస్వతీ నదికి సంబంధించినది. 3. వాగ్ధాటి కలది, వాచాలము. 3. సారస్వత దేశమునకుఁ జెందినది.

సారస్వతము సం. వి. అ. పుం. 1. సరస్వతీ ప్రాంత మందలి దేశము. 2. సరస్వతీ పుణ్యాంగము. 3. బిల్వదండము.

సారస్వతము సం. వి. అ. న. వాఙ్మయము, వాగ్ధాటి, వాక్కు. జడుని కైనను గల్గు సారస్వతమ్ము ద్వి. పరమ. 3. 179 పు

సారస్వతుఁడు సం. వి. అ. పుం. 1. ఒక తెగ బ్రాహ్మణుఁడు. 2. దధీచి వీర్యమును సరస్వతీ నది ధరించుటచే జన్మించిన పుత్రుఁడు.

నారదుని పూర్వజన్మపు బ్రాహ్మణనామము.

సారాంశము సం. వి అ. పుం. 1. ముఖ్య విషయము. 2. పిండితార్థము.

సారాయము వి. మద్యము, మదిర.

సారాయి వి. (సం. సురా. క. సారాయి. త. స్మ. సారాయి) మద్యము,

తే కమ్మ సారాయికై సంచకర మొసంగుఁ, జిత్త జాయత్తయై కాపు చిన్నెలాఁడి. శుక. 2. 484.

సారా(యి) సారాయము యొక్క రూపాంతరము.

సారాలము సం. వి. అ. పుం. నువ్వు, తిల (వ్య. వి.).

సారి[1] వి. 1. యుద్ధయాత్ర.

సీ. నునుమావులను మావులెనసిన కోయ సరదార్ల కెల్లను సారిఁ జెప్పి. శశాం 4. 66.

వ. కంసారి మునుపు సారి వెడలిన దారిని దుముదారిగా వేగంటిదునేదారి రాజసమ్మునగు మీసరమ్మున. ప్రబం. 1. 605.

సీ. సారిగా నీ వొక్కసారి గాటపువీథి దూరుఁచోఁ బొదలఁ బోదూరు రిపుఁడు. అహల్యా. సం. 1. 32.

2. వేఁట.

తే. సామి నా విన్నపము విని సారివెడలి, యొక్క మల చెంతగడె తడవున్న జాలుఁ, జెండు జెండాడి మెకముల జెండువఱచి. దేవరకు వేడ్కఁబుట్టింతు దేవునాన. శుక. 1. 158.

3. చక్రము (కుమ్మరి వానిది)

సీ. బలభేదికరి ...... చిట్టిన సారివోలె నొక్క గోరఁ దిరిగె కుమా. సం. 10. 181.

చం. కర మవిచారి తద్దయు వికారి మనంబది సారి వోలెనే, దిరిగెడుఁ గాని నిల్వదెద. కుమా. సం. 6. 304.

సారి[2] వి. తూరి, తడవ.

వ. ఒక్కొక్క మాటు విధాత పక్షతియు, నొక్కొక్కసారి యూర్ధ్వాయన దుర్విభావంబును శృం. నై. 2. 35.

ద్వి. నీ శార్ఙ్గ మునులును నీ నియోగంబు, సభయును నీవు నీ సారి నూడుఁడు. పండితా. మహిమ 252.

సీ. ఒడి మీఁద నిడుకొని యురముపైఁ దేర్చుట చేరికకది కడసారియేమొ. ఉ. రా. 6 302.

సారి సం. విణ (న్. ఈ. న్.) 1. నడచునది. 2. సారము గలది.

సారి సం. వి. ఇ ఈ. స్త్రీ. 1. పాచిక. 2. పక్షి విశేషము.

సారించు సం. వ. క్రి. 1. చాఁచు.

సీ. కేలు సారించి జంకించి యల్లల్లన పట్టినఁగుబు చలజాతి తెరుగు. చిత్రభార. 4. 36.

వ. అత్తళంబులు కత్తళంబుల వారిచేఁ బూరించియు సారించియుఁ బరశువులు వరకూరుల కొసంగియు వెనంగియు ఉ. హరి. 6. 50.

వ. వింశతి కరంబులు సారించి హుంకరించి. ఉ. రా. 3. 78.

కం. వారిధి రంగస్థలమునఁ, జేర తరంగంబులెదురెట్టులు పైపైఁ బొంంగ నడుమ బలు విరి,సారించిన నరజ ...... తెలఁగెన్. వాల్మీ. 2. 10.

2. త్రిప్పు, ఆడించు.

మ. గద సారించుచు మంత్యగాల విచలత్కాలా కృతిన్ భీముఁడు. భార. ఉద్యో. 2. 188.

మ. కవిసెన్ గుంత ఘుకుఁటి తోమరగదా ఖడ్గాది శస్త్రాస్త్ర తీవ్ర విహారంబు విరోధి దుర్వినహ సంరంభంబుగా నొక్కెడ, ట్టవడిం దర్పుల మెల్ల వారదుఁడు వేడ్కం గుంచె సారింపఁగన్. భార. విరా. 3. 101.

3. ఆకర్షించు, లాగు.

సీ. సారెసారెకు శిల సారించు మౌర్వులు, పటుతటిల్లతలఁ బగిది గాఁగ. భా. రా. సుంద. 369.

4. సరిదీయు, చక్కఁజేయు.

సీ. బహ్వాదిఁ బదనిచ్చి సారణుల్ సారించి బిరడలు చక్కనొత్తి. వాల్మీకి. 3. 133.

వ. గుణంబు సారించి మార్గణంబు నిగిడించి. మార్కం. 2. 3?5.

5. ప్రయోగించు.

ద్వి. ఆ రాక్షసునితోడ నిఖిలాయుధములు, సారించి విడువక సరిపోరి పోరి. రం. రా. ఉ. కాం. 74 పు. 25 పం.

6. వెలకొల్పు. సవరించు.

కం. ఏ పనులకు దీపము దగు నే పనులకుఁ దగదటన్న నింతియుటులనెన్, దీపము మవనందు చీర తెర సారింతున్. వైజ. 3. 30.

7. తెఱచు.

కం. ఈ కోటకు నొక దిక్కున తాళి సారించి యానవాలుగఁ జారుల్, రాకలఁ బోకలఁ జక్రముఁ, జేకొని రక్షకులతోడఁ జెప్పి చనఁదగున్. ఉ. హరి. 2. 93.

7, మెరుగు.

సీ. మృగమదపంకంబు మృదువుగా సారించి తిలకంబు వెట్టుదుఁ జెలువు మిగుల. భార. విరా. 1. 107.

9. విసరు.

వ. కాంచనగర్భ పంకవృందు నిర్ధూతాన్ధకారంబుగాఁగ జెసారించి యుంతకాలంబున. వరాహ. 3. 33.

10. ప్రసరింపఁజేయు, పఱపు.

మ. ...కే, వల రౌద్రోత్తుంగబల్కఁ బన్నె పితరుల్ వాచితురే మీరు బిడ్డల మీఁదన్ గృపవివ్వటిల్లు కడకంటం జూడ్కి సారింపఁగన్. రంగా. 2. 96.

సారిక సం. వి. ఆ. స్త్రీ. పక్షివిశేషము.

సారిక వి. (సం. చర్చరిక. త. చారికై) నాట్యవిశేషము.

సారికలుగొను అ. క్రి. నర్తించు.

వ. ఉరికలెత్తిన కోరికలు సారికలుగొన నానంగుచు. భాగ. 3. 507.

సారిణి సం. వి. ఈ. స్త్రీ. కూపురాశి (ప్రబాళిక).

సారిఫలము సం. వి. అ. పుం. జూదపుఁబలక.

సారు వి. నాట్యగతిభేదము. అం. భా. 1. 130.

సారుగా నేలపైఁ జమరువారు. కుమారసం. 12. 105.

సారు వి. ద్రవపదార్థము. (తమి. సాఱు. క. సారు = చారు)

సీ. గజయూథముల ....... దమజాలఁ బ్రభుపాదతలహతి వడిఁబంపి సారుగా నేలపైఁ జమరువారు .... కుమారసం. 12. 366.

సారువ వి. 1. సోపానపంక్తి. (?)

వ. అదియును బరంబు .... బహు ప్రకారంబులైన సారువులమం జేసి యొప్పుచు. భార. ఆది. 7. 166.

2. అడ్డకట్ట.

కం. ఆ రీతి నేసపోరఁగఁ హేరాళము రక్తనదము లీఁదఁగఁ రామిన్, సారువగట్టెన్ వివిహిత, వైరి మహీభృత్కబంధవారము చేతన్. చంద్రా. 6. 109.

సీ.... అధిప ! యిది మానికపుఁగొనయది లతాంతరజము సారువ యిది కప్పురంపుటనఁటి, చప్పరంబిల్లయది కాంతసదనము. వసు. 2. 52.

సారవ = పేరవ-బరవగు వస్త్రమును పై కెక్కించుటకు వాడవుగా మట్టితో పోసిన మేరవకు సారవ అని పేరు అని వ్యాఖ్య.

ఉయ్యగ్రాహి. టీ. గైర్వాణిన మేరువుల వుప్పాడుల సారవుల వెంట సహాకారమిం దేలా, ధాతుముల జారు హిమవారి కలిత సారణులు. వసు. 1. 22.

3 దిబ్బ.

ఉ. అమ్మ వరాకు పోక వనమల్లె దెచ్చలని మల్లిశాగ్రకుం, ఒమ్మిదెకప్పురంచవంటి సారువకివ్వ సారెసారెవుం. గమ్మని వువ్వు దేనియల కాలువ పొన్నదె యద్దెకటిచే, నిమ్మలబాయ గొజ్జగల సీటదొలగు దొనం దలోదరీ' రాజవాహన. 3. 83.

వ... తండతండంబులగు వేదండంబుల తొండంబుల పై దెల్లదగిలినం గడలవేరని తురగంబులపై మలంగి దంతంబుల కొలందికిం దరువలి కత్తులం దుత్తములుగా మొత్తి విడివించు రవుతులు దేరులగముల చేరువల సారువలు గట్టు వారువంబుల ఉ. హరి. 4. 2:4.

సారవా వి. వర్షాకాలమందు నీరానరాను వండెడు పల్లపుపంట. (శ. ర.)

సారూప్యము సం. వి. అ. న. 1. సమానరూపత్వము. 2. దేవతరూపము వంటి రూపము పొందుట. (చతుర్విధముక్తులలో నొకటి)

సారె వి. 1. తడవ పర్యాయము.

శా. ఏమి పార్థుడు నీవు దండిమగలై యీవచ్చు కౌరవ్య సంగ్రామ క్షోభము కాహుదర్పమునం దీర్పం బెద్ద మిక్కిక్కి మిమ్మెమ్మెల్లన్ వెఱగందిచూచెదము గక సారెకుం బోయిరా, భీముండత్తఱి రిత్తమాటలకుంగోపింపండు నూ పెంపఱన్. భార. ఉద్యో. 3. 65.

2. (సం శారి.) జూదమున కుపయోగించు పని ముట్టు, పొగటాలకాయ, పాచిక, జూదమాడెడు నిడుపాళ్ళు.

వ. సైరంధ్రిం గనుంగొని సారెలు దెమ్మని పనిచి. భార విరా. 1. 244.

వ. సభామండపంబునం బసిండి పలకయు సారెలుం బాచికలును నమర్చి. క. ద్యూతమునకు బలభద్రుని, బ్రీతి సమేతంబు గాంగం బిలుచుటయుం. హరి. ఉ. 8. 228.

సీ. తెగిడ గొనరి వైనికవెట్టి పలకపై సారెలు వోయించి సరముచూచి. ఉ హరి, 3. 120.

3. పీటమెట్టు.

సీ, చెలిచేతి వీణియ చేనంది గవిసెన సడలించి సారెలు చక్కనొత్తి. చెన్నబ. 2. 215.

ద్వి. రాగసంగతులకు రా సారెలొత్తి. హరిశ్చ. పూర్వ. 9. 50.

సీ. చెలియ తెచ్చిన వీణం గెంకేతనంది, కొని మెఱుంగు గవియంగ గవిసెన యొడల్చి, తీంగెలు బిగించి సారెలు దిద్ది శ్రుతులు, గూర్చి యుత్తర తుంబిక కుచముంజేర్చి. చిత్రభార. 3. 88.

4. చక్రము, కుమ్మరివాని చక్రము.

కం. ఒకసారె యేడు తేజులు వికలాంగుండు నూతుండనిల వీథి తెరువుగా. ద్వా. 5. 83.

సీ. విష్ణువు చక్రంబు వేడుకం ద్రిప్పెడు చాడ్పునం బలుమారు సారె ద్రిప్పు. హంస. 5 9.

తే. ధాత్రికుమ్మరి సారె విధమునం దిరిగె. భార. ఉద్యో. 4. 116.

శా. రాలెం జుక్కలు గుబ్బలున్ వగిలె సంద్రంబుల్ గలంగెన్ వడిన్, నేలం గుమ్మరి సారె పోల్కి దిరిగెన్ బ్రీతెన్ దెసల్ భీతుచే. యయా. 2. 66.

5. భక్ష్యవిశేషము.

ఉ. గారెలు బూరె లిడ్డెనలు గమ్మని దోసెలు జక్కిలంబులున్, జారులు గూరలున్ ఫలరసంబులుం దేనెలుం బావకంబులున్, సారెలు బాయసాన్నములు. సానందో. 1 ఆ.

6. గోరువంక.

క. సారెయదె పొడవు మని యొక, సారె యొకతె యతనికి సమయంబున నిచ్చి శాకరెకుఁ జెప్పిన, సారెకవకపటంబుమున సాధ్వ మందెన్. శృ. నై. 8. 163

7. కూతునత్తవారింటి కనుపునపుడు పట్టించి వారిచ్చు అరణము మొ॥ 8. పగడ సాల కాయ (శ. ర.)

సారె 2 అవ్య. మాటికి.

సీ. గోరంబుగా సారెగుంటకన్నులు (శ్రీకృ. శుక. 8.74.

(ఇది పష్ఠ్యంతమై యామ్రేడితార్థమున వాడఁబడును. సారెకన్, సారెసారెకున్, ద్వితీయాంతమయి కూడ నిట్లు ప్రయోగింపబడినది)

కం. వలవని మాటలు సారెం, బలుకం బనియేమి. విప్ర. 2 81.

చం... జగా శివాచిపై, సకియలు గొల్వ నిండుమతి సారె మనోజ శరా ర్తిఁ గ్రాగఁగన్. ఇందు. 8. 70.
చం.. ఘటఘట ధ్వని సారె మలంగి చూచుచున్. ఆము. 3. 77.

ఉ.....నా, సాఁచవో విజృంభణలు సారె వినందగు నంచు నిట్లనున్. ఉ రా. 1.164.

సారెకు అవ్య. మాటికి. సారెసారెకు అని ద్విరుక్తముగను పష్ఠియుక్తముగను దఱచుగ వాడఁబడు.

క. ద్వారక వైకుంఠపుఁ బీ, రుక్మిణి లక్ష్మి మీర లిచ్చట మనికిన్, సారెకుఁ గొల్వఁగ వత్తును, గోరి కతోఁ గంసహర ముకుందము రారీ! పారి. 1. 51.
వ. సారెకున్ దారకల నీరికలెత్తు పొంగరన. మను. 3. 9.

(ఆమ్రేడిత మగుచో సారెసారెకు లేక సారెకు సారెకు.)

వ. ఇత్తెఱంగుఁ జెప్పఁదలంచిన సారెసారెకుం గిలకిల లాడుచున్. నీలా. 2. 81.

ఉ...నూతన మీనకేతన వినోదపరిశ్రమ ఖిన్నులై వయ,జ్ఞాత ముఖీ నృపోత్తములు సారెకు సారెకుఁ నేదఁదేర్చు. విక్ర. 7. 115.

సారె(సె)సత్తులు వి. శయ్యవిశేషములు; బంతికలు

వ. చ క్రకాంతంబులు మణతలు సారెసత్తులు చలువ పక్క లెక్కి... ...కషాయ బు మొద లుగాఁగల ... భక్ష్య భోజ్య లేహ్య చోష్య పానీయాదులు. ప్రబం. 1. 102.

సీ. వదలు మందెఁగలుంగ్రములును పేణీలును సారెసత్తులు బొజ్జె బూరియలును. బ. ప్రభులింగ 5. 82.

గీ. హంసడిభకులు రాజసూయంబు చేయ మనము గన్పించుఁగొని పోక మంచిమాట, నేఁడు సారె సత్తుల మొసల్ వాఁడి చేసి, నోరి చొరవ భూతేశుండు వారిఁ గెలిచె. ఉ. హరి. 4. 157.

ద్వి. వదలు మందెగ లద్దములు పేణీలు, కడు మెత్తనగు పాలగారెలు సారె, సెత్తులు నవుగులు చిమ్మిటుండలను. ప్రభులింగ. 4. 150. పుట. 22 పం.

సారోష్ట్రికము నం. వి. అ. పుం. ఒక విధమైన విషము.

సార్గణము నం. విఔ. అ. ఆ. అ. 1. అడ్డగింపబడినది 2. నిరోధింపఁబడినది.

సార్జంతు (ఆం. సార్జంట్) వి. సేనాధికారులలో నొకఁడు, భటులమీఁది యధికారి, (శ ర. జాతి బంట్రోతు. (బ్రౌ.)

మ.సమరోజ్జృంభిత శౌర్యధుర్యులగు సార్జంతుల్ మయూరుల్ కుమందములున్ వీరులు సోలు దారులు సుబేదారుల్ మొదల్గల్గు సైన్యములు. రంగా. 1. 147.

సార్థకము నం. విఔ. అ. ఆ. అ. 1. అర్థవంతము 2. ప్రయోజనవంతము. 3. ఫలవంతము, లాభకరము.

సార్థము నం. విఔ. అ. ఆ. అ. 1. అర్థముగలది. 2. ప్రయోజనము గలది. సమానార్థకము 4, ఉపయోగకరమైనది. 4. ధనవంతము, సంపన్నము.

సార్థము నం. వి. అ పుం. 1. ధనవంతుఁడు 2. వర్తక సమూహము. 3. మనుష్యసమూహము 4. ఒకే

జాతికి చెందిన జంతువులగుంపు 5. సమూహము, గుంపు 6. యాత్రికుడు.

సార్థవంతము సం. విణ. త్. తి. త్. 1. అర్థముగలది. 2. [illegible] గలది.

సార్థవాహుడు సం. వి. అ. పుం. 1. వణిక్సమూహనాయకుడు. 2. వణిజుడు.

సార్థవాహుడు సం. విణ. 1. ముఖ్యుడు. 2. నాయకుడు "కురు మా మంబ కృతార్థసార్థవాహం"

సార్థికుడు సం. వి. అ. పుం. వర్తకుడు, వణిజుడు.

సార్ద్రము సం. విణ. అ. ఆ. అ. తడిసినది, తేమగలది.

సార్ధము సం. విణ. అ. ఆ. అ. సగము పెరిగినది.

సార్ప(సర్ప)ము సం. వి. అ. పుం. ఆశ్లేషా నక్షత్రకూటమి.

సార్పిషము సం. విణ. అ. ఈ. అ. నేతితో వండబడినది. (రూ. సార్పిష్కము)

సార్లా విణ. అనుకూలము, సఫలము (శ. ర.).

సార్వకామికము సం. విణ. అ. ఈ. అ. సర్వకామములు తీర్చునది.

సార్వకాలికము సం. విణ. అ. ఈ. అ. శాశ్వతము, నిత్యము.

సార్వజనికము సం. విణ. అ. ఈ. అ. సర్వజనులకు సంబంధించినది.

సార్వజనీనము సం. విణ. అ. ఈ. అ. సార్వజనికము.

సార్వజ్ఞము సం. వి. అ. న. సర్వజ్ఞత్వము, అన్నియుం దెలిసియుండుట.

సార్వత్రికము సం. విణ. అ. ఈ. అ. సర్వప్రదేశములకును సంబంధించినది, అన్ని సందర్భములకుం దగినది.

సార్వధాతుకము సం. వి. అ. న. లట్. లోట్. లఙ్. లిఙ్. లయందు ధాతువులకుం జేర్పంబడు ప్రత్యయములు.

సం. విణ. అ. ఈ. అ. వికరణ ప్రత్యయాదులు చేర్చిన పిమ్మట చేర్పదు క్రియాప్రాతిపదికకు సంబంధించినది.

సార్వభౌతికము సం. విణ. అ. ఈ. అ. 1. సర్వప్రాణులకు సంబంధించినది. 2. పంచభూతములకు చెందినది.

సార్వభౌమము సం. విణ. అ. ఈ. అ. సర్వభూమికిని సంబంధించినది.

సార్వభౌమము సం. వి. అ. పుం. ఉత్తరదిగ్గజము పేరు.

సార్వభౌముడు సం. వి. అ. పుం. 1. సర్వభూమండలాధిపతి, చక్రవర్తి, సమ్రాట్టు. (సర్వభూమి పృథివీభ్యామణఞౌ. 5.1.41 పాణి. సూ. సర్వభూమేర్నిమిత్తం సార్వభౌమ అనుశతికాదిత్వా దుభయపదవృద్ధిః).

చం. ధర్మజుం, డలఘుడు యౌవరాజ్యయుతుం డయ్యును జెంపన సార్వభౌముండై. భార. ఆది. 6. 92.

2. అహంయాతి యనువాని పుత్రుడు.

సర్వము సం విణ. అ. ఈ. అ. 1. సర్వమునకుం దగినది.

సార్వము సం. వి. అ. పుం. సార్వుడు; బౌద్ధసన్యాసి.

సార్వవేదసుడు సం. వి. అ. పుం. యాగమునం దన సర్వస్వమును దానము చేయువాడు.

సార్ష్టి సం. విణ. ఇ. ఈ. ఇ. 1. తుల్యబలము గలది. 2. తుల్యావస్థ యందున్నది. 3. సమానాధికారము గలది.

సార్ష్టిత సం. వి. ఆ. స్త్రీ. 1. తుల్యబలత్వము, సమానాధికారము. 2. ఈశ్వరసామ్యము, సాయుజ్యము.

సార్ష్ట్యము సం. వి. అ. న. సాయుజ్యము.

సాల సం. వి. ఆ. స్త్రీ. 1. గోడ, వప్రము, ప్రాకారము. 2. గృహము.

సాల వి. (సం. శాలా. క. సాలె. త. చాలై) 1. ఇల్లు నాటకశాల, గుఱ్ఱపుశాల, వంటశాల. 2. చావడి- మొగసాల, కొలువుసాల; జన్నసాలవడి జన్నసాల నివాసంబుగొని. 2. 66.

సాలంకలు వి. బ. ధాన్యవిశేషము.

సీ. సాలంకెలును రాజనములు సన్నజాజులు దాప్ప మోహనపురసులు. హంస. 4. 128.

సాలంకారము సం. విణ. అ. ఆ. అ. అలంకారములతోఁ గూడినది.

సాలంకృతము సం. విణ. అ. ఆ. అ 1. చక్కఁగా నలంకరింపఁబడినది. 2. అలంకారములతోఁ గూడినది.

సాలకటంకటేయుడు సం. వి. అ పుం. (శ్రీ)మద్రామాయణోత్తరకాండమున బ్రసిద్ధుడగు నొక రాక్షసుని వంశమున బుట్టిన వాఁడు; రాక్షసుఁడు.

మ. అలిన సాలకటంకటేయుఁడు సాల కటకటంబడి— ఆము 3. 68.

సాంకతి సం. వి. న్ పుం 1. ఇంటివానిచే యుద్ధమున బందీగా గొనబడినవాఁడు.

సాలగ్రామము సం. వి అ. పుం. విష్ణుమూర్తి చిహ్నిత శిలా విశేషము విష్ణ్వాత్మకమైన గండకీ నది యందలి శిల "సాలగ్రామము మున్నుగాఁ గొనఁడు"...మనుచ. 1. 55.

సాలనము సం. వి. అ. పుం. 1. సాలవృక్షపు బంక.

సాలపర్ణి సం వి. ఈ. స్త్రీ. ముయ్యాకు పొన్న (వృ. వి.).

సాలపోతకుఁడు సం. వి, అ. పుం. ఒక సర్పరాజు.

సాలభంజిక సం. వి. ఆ. స్త్రీ. వస్త్రదంతకాష్ఠాదుల చేత చేయఁబడిన బొమ్మ; పుత్తళిక. "వేళాభంజనిమై యపుడు సాలభంజిక పలికెన్. సింహా. ద్వా. ఆ. 2. 61.

సాలము సం. వి. అ. పుం. 1. మద్దిచెట్టు.

సీ. తే. దావపావక ఘనశిఖాదగ్ధశాల, సాల సంకాశమగు పిశాచద్వయంబు. ఉ.హ. 2. 122.

2. మద్దిబంక. 3. చెట్టు! 4. గృహావరణము; ప్రాకారము. 5. గోడ. 6. ఒక విధమైన చేప.

సాలమిశ్రి వి. ఒక మందు దినుసు.

సాలాంకము సం. వి. అ. వ. గోడలో కట్టఁబడిన చిలుకగొయ్య.

సాలావృకము సం. వి. అ. పుం. శాలావృకము. 1. కుక్క. 2. కోతి. 3. తోఁడేలు. 4 పిల్లి.

సాలియ వి. సాలె, నేఁత నేయువాఁడు.

ఉ. దాంతదశం గ్రహియించి యిచ్చులో పేనక నిల్చె సంజకడ వేళూని సాలియవాని లోఁగిటన్. పంచతం. 1. 61.

గీ. సాలీఁడు గాఁబోలు సమదవేదండంబు తెలివారచీరెలు దులిచి తెచ్చె. కువల. 2. 69

సాలీఁడు వి. (సాలె+ఈఁడు) సాలెవాఁడు.

గీ. మేషయుద్ధ మధ్యంబున మెఱఁగి యొక్క, శివయు సాషాఢభూతిచే సిద్ధమునియు, దొడరి సాలినిచేత దూతికయును, నాత్మకృత దోషమున గాదె హానిఁబడిరి. పంచ. నా. 1. 164.

2. సాలెపురుగు.

సీ. చెవిగూట నెలకొన్న కవపిట్ట కవకవల్ మొనసి నారద బ్రహ్మ మినుమడింప, మైనిండు సాలీని మగ్గంపుఁ జకచకల్ బూదిపూఁతకు రెట్టిపుట్ట సేయ. చంద్రాంగ. 3. 89.

కం. బోయయు సాలీఁడును మా, కాయజహరుఁ గొలిచి ముక్తిఁగాంచిరి గాదె. శివతత్త్వ. 172. ప.

సాలీయానా హిం. విణ. (రూ. సాల్యానా) సంవత్సరపు. (శ. ర).

సాలు వి. రాంకవము.

సీ.... ముత్యాల మొలనూలు ముదురుచందురుకావి జిలుగు సాలామీఁదఁ జెలువుమీఱ. భాను. 4. 62.

2. సాలువ; శాలువ; ఉన్నితోఁ దయారైన వస్త్రోత్తరీయము. ఏమేలు సలిపెనో హంబట్టుసన్న సాలు. నీలా. 1. 109.

3. సన్నని వస్త్రము.

చం. జిలుఁగగు నాభినామములు చెంపల గంధము లోరపాగలున్, పలిపపుసాలు వింతవలెవాటులు లాగులు రావిరేకులుం, గలిగిన గుజ్జురూపములు. సారంగ. 1. 116.

సీ. వలువ బంగరు సాలు వలెవాటుగా వైచి కేయూరహారము ల్గీలుకొలిపి. కవిజన.. 6. 11.

వ. బంగారుగొమ్ముగఁ దువాలి, జాళువాసాలు శాలువు జెయ్యి. ప్రబం. 1. 28.

ఉ...శుభ రేఖ ప్రాసివే చెప్రికపెట్టె యందుపయిఁజెంద్రిక వన్నియసాలు మట్టి సి. క్రొంద్రతఁ దానె ముద్రయిడి చారులచేఁ బనిచెన్ దయంబునన్. విజ. 8. 181.

**సాలు** హిం. వి. ఏడాది, సంవత్సరము.

**సాలువ=సాలు** (త. చాల్వై. క. శాలువె) వి. ఉన్నివస్త్రము, ఉత్తరీయము.

కం. నందనము వెడలి పయనపు, టందముగ జవాదిపూఁతలంది తొడవులుఁ, గుందనపుటంచు వగ జలుగుం దెలిసాలువలు జారుగొప్పులు నొప్పన్. (ఇది రంభోర్వశుల శృంగార వర్ణనము). వాల్మీకి. 8. 79.

సీ. నీలి సాలువ మీఁదఁగీలుకొల్పినయట్టి నెలవంక కత్తుల తళుకు లెసఁగ. చిత్రభా. 3. 125.

2. సన్నవస్త్రము.

సీ. తనుకాంతి గమపింపఁదనరు వంగిజోడు వలిపెంపు సాలువ వల్లెవాటు. శుక. 2. 428.

3. తృణభేదము.

తే. గీ. తొప్పరంప్రటింత సాలువ యుప్పుగడ్డి, వరిక మల్లాచి మొదయము బైటి తుంగ, మొదలుగాఁ బూరిందలింపఁబొదలు వెడలు. ప్రబంధ 1. 201

**సాలువు** వి. సాలువ.

**సాలుసరి** హిం. విశే. ఏడాదికి సంబంధించినది.

**సాలూరము** నం. వి. అ. పుం. (రూ. శాలూరము) కప్ప; మండూకము.

**సాలె(లియ)** వై. వి. (సం. శాలికః ప్రా. సాలి ట. క. సాలిగ.) బట్టలునేసి జీవించు జాతి.

వ.... అప్పేటి మేటి సాలెయగసాలె పటుసాలె, వానె వైజాతి సాఁతు జేతుల కొమిరెలు తుము లమై...ఆము. 4. 85.

**సాలెత** వి. తంతువాయస్త్రీ, సాలెజాతి యాడుది.

ఉ. .... అ, శాలిక కూలికమ్ముకొన బట్టలు నేసెడి వానికిచ్చె హో,సాలెత గాదు రా కుసుమ సాయకు పట్టపుదంతి యింతియే. వీథినాటకము. 26 ప.

**సాలెపట్టు** వి. 1. సాలెపురుగు వేసిన నేఁత. 2. ఆశా బంధము. (శ. ర.)

**సాలెపురుగు** వి. బొడ్డునందలి నూలు విడిచి నేత నేసెడి యొక పురుగు, తంతువాయము.

**సాలెవాఁడు** వి. నేతనేయువాఁడు.

**సాలేయము** నం. వి. అ. న. (రూ. శాలేయము) శ్వరి చేను.

**సాలోక్యము** నం. వి. అ. న. 1. తుల్యలోకమునం దుండుట. 2. ఇష్టదేవత యున్నలోకము నందుట. (చతుర్విధ ముక్తులలో నొకటి.

**సాల్పడు** అ. క్రి. (సాలు+పడు) (చూడు. చాల్పడు) చీలికాలుగకట్టు.

మ...వారిద, ప్రతతుల్ సాల్పడ. భార. అది. 2.ఒలుగు.

ఉ. మహామారుత మప్పు డీచెను.... ధర, శ్రీరుహశాఖలున్ విఱిగి ప్రెళ్ళఁగ గుల్మలతాలి సాల్పడన్. భార. అర. 3 ఆ.

3. ధారగా ప్రవహించు.

చం. అని మొన విశ్వభూవిభుని హ స్తకృపాణము చంద్రహాస మ,య్యనుమతి చిత్రభాను వన ముజ్జ్వలమయ్యెడు చోట నప్సరో, వనితల చన్నులం బులుకవర్గము నెక్కొనువైరి భీరులో, చనముల నశ్రువారములు సాల్పడువందును నిందునుం బొరిన్ కావ్యా. 5. ఉల్లా. 88 ప.

**సాల్పుటుచు** (ప్రేర.) సాల్వుఁడు.

చ. ప్రతిబలివార్ధి బాడబము భంగి దహించును రాముపోలికన్. శితశతధార సాల్పుటుచు. విక్ర. 6 ఆ. (శ. ర.)

**సాల్వహుఁడు** నం. వి. అ. పుం. సాల్వుఁడను రాక్షసుని జంపినవాఁడు, విష్ణువు.

**సాల్వికము** సం. వి. అ. పుం. ఒకవిధమైన పక్షి.

**సాల్వుఁడు** సం. వి. అ. పుం. 1. రాక్షసుఁడు. 2. సాల్వదేశపు రాజు 3. సాల్వదేశస్థుఁడు 4. శిశు పాలుని తమ్ముఁడు.

**సాల్వేయుఁడు** సం. వి. అ. పుం. నితంతుని కుమారుఁడు (చూ: సేనాదులయన్న).

**సాళఁగనాట** వి. ఒక రాగవిశేషము. పండితా. 2-45ఐ.

**సాళగము** సం. వి. అ. న. శింకాఙ్గుని న్యాయమున నయిన రాగమేళనము.

ద్వి. లాలిత శుద్ధ సాళగములు జెరయఁ, గ్రాలుచు దేశిమార్గంబులు వెలయ. బస పురా. 71 పు. 5 పం.

కం. క్రమ మొందనాళటావళి, గమకముగా శుద్ధ సాళగములును సం, కీర్ణములోగి వు.ఖావఁగ మం, ద్రము మధ్యము తార మత్యుదాదరతమీఱన్. సమీర. 6. 205.

**సాళగించు** సం. అ. క్రి. (-సాళగము) మిశ్రమగు, కలియు.

వ. కమ్మకసింద గంధంబుదోడం దార్కొను నేలకుల సారభంబులును, నేలకుల సౌరభంబులతో సాళగించు కాలాగురు కురంగనాభి కర్పూర గంధసార నీహారవాఃపూరంబుల వలిపులును. కాశీ. 7.185.

ఉ. ... ప్రా,తేశిక మంగళధ్రువలు వీనులకింపుగఁ బాడి రంగవల్, దేశివిధంబు మార్గమునఁ దేటయు నొక్కట సాళగింపగన్, శృ. నై. 7. 16.

ద్వి. చిఱునవ్వు వెన్నెల జిగిసెఱయించు మోవి వెన్నెల సాళగించి. ద్వి. పరమ. 2. 58.

**సాళగింపు** √ సాళగించు. వి. కలగలుపుఁదనము. మేళనము,

సీ. తేరడంబులు సాళగింపులు. కిల్బిషాక్రీడనంబులు నడకించువగలు...దుర్గుణంబుల ప్రోపులు ద్రోహ మతులు, వారకాంతలఁ దడవిన వచ్చుఁ గీడు. పాండురంగ. 3. 43.

**సాళి** వి. రాగములలో నొకటి. [illegible] ద్వి సాళి పెళ్ళ పెళ్ళి జాయును జాజు, ఉచిత మొయ్యారంబు నొగిఁబాడి బ. బ. పు. రా. 71 పు. పం.

**సాళించు** స. క్రి. బలియిచ్చు.

వ. దేవిచేరువ గమ్మని ముందట నిడి [illegible] అమె మెచ్చుగాక యుట్టి మేకము సాళించెద, నకుచుఁ జండి మంత్రి మొదః జెప్పి, పూజకు దోకందు భూమీశుతలఁద్రెంప, జెడిదమైన వాఁడి యసిద మెత్తె. ద్వా. 11. 50.

**సాళియలు** వి. బ. వస్త్రవిశేషములు, అంగపట్టముల మీద వేసికొనుపైఁటలు.

ఉ. చందురుకావిపావడల జాజాపిఱు మెలఁజిందు ద్రొక్కఁగాఁ, గందుపిసాళి సాళియలుగట్టి ...దాటు లనఁ జెన్నగు కీలుజడల్ నటింప నా,సుందరులంద ఱున్ వనము సొచ్చి చలన్మణి నూపురంబుగన్. వాల్మీకి. ౭. 112.

**సాళువము** సాల్వము వి. శ్యేనవిశేషము, ఒకజాతి డేగ.

తే. విజయ విఖ్యాత గుండభూవిభునృసింహ, సార్వ భౌముని బిరుదైన సాళువంబు. జై. భా 1. 45.

చం...మట్టి కానెలన్, బిడియముబంటుపోఁచి పృథు భీషణ బాహుల సాళువంబులన్, దడవి కెరల్చు చున్ జనిరి నాథునిమ్రోల నృపాల నందనుల్. మను. 4. 30.

తే. గీ. మృగయుబంతటఁ దెచ్చిరి లగుడుగిడుగు, జాలె జలకట్టె కఱుజువేసడము జైరి, కురుజు వారిణ యను డేగ కొలము సాళు, వముబఁ బిలుపును వేఁటకు వచ్చువాని. పి శకుం. 1. 110.

2. వేఁటకుక్క కీయబడిన పేరు.

సీ గి పుణ్య తీర్థంబు చేమంతి పోతురాజు, సాళు వము నాఁగఁ జేట్విడ్డజాగిలములు. రాజేశ్వరమా. 5. 7-.

2. పందెపు కోడిపుంజున కీయఁబడిన పేరు.

ఎ. గీ. కూలము పిరంగి వెలివక్క సాళువంబు కాళ రాత్ర్యంతకుఁడు పందెగాండ్రు మెచ్చులనెడు పేరుల పుంజులగొని ముగించి. హంస. 3. 215.

**సాళ్వము** సాళ్వుఁడు=సాళువము వి. 1. ఒక జాతి డేగ.

క. నా పిన్నిమ్మ ముద్దుటాతురు, నా చక్కని తల్లి పిధివశయాడిఁ గవస్నీమణాని పోయె సాళ్వము, లా చిలుక గొంచు లోవృక్షమమువఁ దండ్రీ! రాజశే. ౨. ౬౧.

ద్వి. ముద్దుల గిలిగిల మెఱయుజాడించి. క్రొవ్వున నుప్పొంగు కొమరు సాళ్వములు. అ. మ. క. ౬ ఆ. ౨౨౧ పు. ౨౫. వ.

2. తృణవిశేషము.

ఎ. గీ. వాలిన పిసు కెడ కురులేటి పొదుజగంకవరికి సాళ్వముసొంపు కుదురు గరిమిడి. హంస. ౬.4౬.

**సావకము** సం విశే. అ. ఆ. ఆ. ప్రసవించునది, ఉత్పాదించునది, పుట్టించునది.

**సావకము** సం వి. అ. పుం. జంతు సంతానము, శాబకము.

**సావకాశము** సం. విశే. అ. ఆ. అ. విశ్రాంతి గలది, తీరికగలది, వీలుకలది.

**సావజ్ఞము** సం. విశే. అ. ఆ. అ. అనూయగలది, ద్వేషముగలది, తిరస్కారముగలది.

**సావద్యము** సం. వి. అ. న. యోగిసాధించు సిద్ధులలో నొకటి. ఐశ్వర్యము, (నిరవద్యము, సావద్యము, సూక్ష్మము, యోగసిద్ధులు).

**సావధానము** సం. విశే. అ. ఆ. అ. 1. చిత్తైకాగ్రత గలది, బుద్ధిగలది, అప్రమత్తమైనది.

కం. అనురక్తి సావధానం, బనుచుండెరఁ బట్టికొని మహాసంకల్పం, బనఘుమతి నుచ్చరింపుము, మొనసి వధూవరులఁ దార్పముదమిం బొందన్. రాఘవాభ్యుదయము. ౩. 44.

3. పరిశ్రమించునది.

**సావధి** సం. విశే. ఆ. హద్దుగలది, పరిమితము, సంకుచితము.

**సావనము** సం. విశే. అ. ఈ. అ. సవనములకు సంబంధించినది.

**సావనము** సం. వి. అ. పుం. 1. సవనాంతము, సవనాంతమునఁ జేయుస్నానము. ౨. ముప్పది సూర్యదినములుగల నెల. ౩. సూర్యోదయాది సూర్యోదయాంతమైన దినము. 4. ఒక విధమైన సంవత్సరము.

**సావనుఁడు** సం. వి. అ. పుం. 1. యజమానుఁడు, యాగకర్త. ౨. వరుణదేవుఁడు.

**సావము** సం. వి. అ. పుం. బలి, హవిస్సు.

**సావయవము** సం. విశే. అ. ఆ. అ. 1. అవయవములు కలది. 2. భాగములతోఁ గూడినది.

**సావరణము** సం. విశే. అ. ఆ. అ. 1. కప్పబడినది, దాచఁబడినది. 2. ఆచ్ఛాదితము, పిహితము. 3. ఆవృతము, నిరుద్ధము.

**సావరము** సం. వి. అ. పుం. 1. దోషము, నేరము. 2. పాపము, క్రౌర్యము, హింస. ౩. లొద్దుగ చెట్టు. (వ్యు. వి.)

కం. నావుడు వతఁడొక కీరం,బై వెసఁజని నింగి నిలిచి యగచరపతితో రావణు సందేశముగడు, సావర మునఁ జెప్పి మరలి చనఁ దోనకపుల్. భా. రా. యుద్ధ. ౨౦౩.

**సావర్ణము** సం. విశే. అ. ఈ. అ. ఒకే వర్ణమునకు చెందినది, ఒకే కులమునకుఁ జెందినది.

**సావర్ణ లక్ష్యము** సం. వి. అ. న. 1. ఒకే కులమునకు చెందుటను సూచించు చిహ్నము. 2. చర్మము.

**సావర్ణి** సం. వి. ఇ. పుం. అష్టమ మనువు పేరు. (సూర్యునివలన సవర్ణకుఁ బుట్టినవాఁడు)

**సావర్ణుఁడు** సం. వి. అ. పుం. అష్టమ మనువు పేరు.

**సావర్ణ్యము** సం. వి. అ. న. 1. వర్ణతుల్యము. 2. సమానకులత్వము. ౩. అష్టమ మనువు యొక్క మన్వంతర కాలము.

**సావలి** వి. డుబుడక్కవాఁడు.

**సావళీఁడు** వి.=సావలి

**సావలేపము** సం. విశే. అ. ఆ. ఆ. గర్వముగలది.

**సావశేషము** సం. విశే. అ. ఆ. అ. 1. మిగులుగలది, శేషము గలది. 2. అసంపూర్ణము, లోపము గలది.

**సావష్టంభము** సం. విణ. అ. ఈ. అ. 1. గర్వముగలది, ధీరమైనది, గర్వితమైనది. 2. స్థిరమైనది, దృఢమైనది. 3. శక్తివంతమైనది, ఉగ్రమైనది, తీవ్రమైనది.

**సావహేళము** సం. విణ. అ. ఈ. అ. తిరస్కారము గలది, ద్వేషముగలది.

**సావాసము** వి. (సం. సహవాసః త. చాకవించమ్) కలిసియుండుట, స్నేహము, పొత్తు.

**సావాసి** వి. సౌవిదల్లుఁడు, అంతఃపురపు కావలివాఁడు.

ద్వి. సేవాగతాంగనాశిక్షితంబులును, సావాసులడరించు చండహుంకృతులు. రం. రా. యు. కాం. 290 పు. 6 పం.

కం. నావుడు సంతోషించిరి, సావాసులు వీరవచన చతురత సత్యా, దేవియు నెత్తపు మాటలు,గా విని తెలిసికొని మెచ్చఁ గఁసారాతిన్. ఉ.హరి. 3.142.

**సావి** 1. కాలము.

సీ. తటి తతి వదను హదను సావియదను వాఁగా లాభిధానంబుగాఁ దెలంగు. ఆం. భా. 1. 86.

సీ. వానకాలమువచ్చె వర్షంబు లందందు, జడివట్టి కురిసె నాసావియందు. కాశీ. 7. 40.

చం. విలిఖితమో శిలాకృతియొ విస్మృతిరూపు వహించెనో యనన్, జలన విదూరుఁడయ్యెఁ దొలుసావి పయోధర ధారఁదోగునయ్యెల దళుకొత్తు క్రొత్తపులుపేపువ వేపులకల్ తనూలతన్, మొలవఁగనున్న నవ్వి యదుముఖ్యుఁడు తాపసముఖ్యునిట్లనన్. పాండురంగ. 2. 52.

సీ. కాదంబినీ మార్గ కేదారమున నిండ మొనపిన వెన్నెల మొలకలనఁగ, వడిసావి యెలుకుర్వి బడి గంటబలు మబ్బు కొక్కు గుంపులకిడ్డ కొలుకు లనఁగ. చంద్రాంగ. 5. 52.

2. భ్రాంతి భ్రమ.

కం. నీవిందు సుధన్వునియెడ, సావిం దునిమించి తెందు సాగెద వనుచున్. జై. భా. 5. 60.

వ. తన నీడ నీరిలోపలఁగని యది ప్రతిగజము సావి కదుకొని. కుమా. సం. 1. 65.

3. సారము.

సీ. మెఱసి సిల్కాడచూపు మెఱపులో యొఱపు చిత్తఱవులో తమము నిద్రావసించి, పసిమిలో మిసిమి నిబ్బరపు సంపఁగి పూతావిలో సావి కందర్పు చేతి, విరుసులో విరసు చిత్తరవు వృత్తడివ్రాఁత. (ఇది స్త్రీ వర్ణనము). ఘటికాచల. 2. 87.

**సావి** విణ. మనోజ్ఞము.

ఉ. తుమ్మెద కంటువూ మొగడతోఁడుల దూగుఁ లతాంగి ముక్కు నెత్తమ్మికి జాతిదాయవనితా జనతామణి మోముక్రొంతు క్రొత్తమ్ముల తమ్ములిందు కళికాళిక వాలిక చూపుఁగోపుల, కొమ్మకు సావిమావి సెలగొమ్మకు సాటియెకోటు లెయ్యెడన్. రామా. 4. 66.

ద్వి. సావి గన్నెఱపూవుచాయ నీర్కావి, దోవతి మీగాళ్ళతో నెఱయంగ. ద్వి. పర మ. 3. 225.

**సావి**=సవి (అవ్య.) అని. (అని భ్రాంతిపడి).

కం. తన నీడ నీరిలోపలఁ గని, యది ప్రతి గజము సావి కదుకొని కోపం, బునఁదాఁకి పోఁకొర్చెను. కుమా. సం. 1. 65.

ఉ. ఛాయన భోగిరాట్కటక సన్నిధి దీపితదీప మాలికా,ఛాయఁ బురఃప్రదేశమునఁ జాగిన నిర్ఝర వాహినీమహో, తోయము సావిచీర యొగఁద్రోచి చొరంగఁదలంచె నెంతలో, తోయని కొంకి కొంకి పతితుం డతఁ డాసవపాన విక్రియన్. శివరాత్రి. 4. 40.

సీ. ఇందుబింబంబుఁ జూచి చెందుప్పుగలుసావి, యఱులెత్తి నాకంగ నాసపడిన. కాశీ. 3. 12.

**సావిత** వం. వి. అ. స్త్రీ. 1. మంత్రసాని, 2. కాన్పు చేయు స్త్రీ.

**సావిత్రము** సం. విణ. (అ. ఈ. అ.) 1. సూర్యునకు సంబంధించినది. 2. సూర్యుని వలనఁ బుట్టినది. 3. గాయత్రీ సహితమైనది.

**సావిత్రము** సం. వి. అ. పుం. గర్భము, పిండము.

సావిత్రము సం. వి. అ. న. యజ్ఞోపవీతము.

సావిత్రి సం. వి. ఈ. స్త్రీ. 1 సూర్యకిరణము. 2. ఒక మంత్రము.

సీ. ధూమ్యాదివక్యాంతముగ వ్యాహృతుల తోడ సావిత్రి మున్నాటు చదువుటయును... ... విజ్ఞా. ఆచా. 62.

3. ఉపనయనకర్మ. 4. బ్రహ్మయొక్క భార్య. 5. పార్వతి. 6. కశ్యపుని యొక్క భార్య. 7. సూర్యుని పుత్రి. 8. సత్యవంతుని భార్య. 9. సంధ్యాదేవతకు మధ్యాహ్నకాలపు పేరు.

సావిత్రీపతితుఁడు సం. వి అ. పుం. యథాకాలమున ఉపనయనము చేసికొనని ద్విజుఁడు.

సావిత్రీవ్రతము సం. వి. అ. న. వైధవ్యము ప్రాప్తిచకుండుటకై స్త్రీలు జ్యేష్ఠమాస శుక్లపక్షాంతమున మూఁడు దినములు చేయు వ్రతము.

సావిత్రుఁడు సం వి అ. పుం. 1. సూర్యుఁడు. 2. బ్రాహ్మణుఁడు. 3. శివుఁడు. 4. కర్ణుఁడు. 5. ఒక వసువు.

సావిలి వి. బుడబుక్కలవాఁడు.

ఉ. ఆ వనజాప్తుఁ డద్రిపయి నంబుధి స్వప్రతిబింబముం దగన్, గేవలమైన యద్భుతము గీల్కొను చక్రయుగంబుగా మయూ,ఖావళి సూత్రసంహతి యుగా భువిఁ గాంతుల మేలు తూరువన్. సావిలి డెల్పు ఢక్క యనుచాడ్పున నొప్పె విచిత్రభంగియై ప్రబం. 1. 121.

సావిష్కారము సం. విశే. (అ. ఆ. అ.) 1. అహంకారము గలది. 2. స్పష్టమైనది; సువ్యక్తమైనది.

సావు వి. (రూ చావు)

సాశంకము సం. విశే. (అ. ఆ. అ.) 1. బెదరు గలది. 2. సందేహము గలది. 3. అనుమానించునది. 4. భయపడునది.

సాశంయదకము సం. వి. అ. పుం. ఒక విధమైన బల్లి.

సాశంసము సం. విశే. (అ. ఆ. అ.) కోరిక గలది; ఆశ గలది; ప్రతీక్షించునది

సాశూకము సం. వి. అ. పుం. కంటకము, దస్పటి.

సాశ్చర్యము సం. విశే. (అ. ఆ. అ.) ఆశ్చర్యము గలది, విస్మయము చెందినది.

సాశ్ర(స్ర)ము సం విశే. (అ.ఆ.అ.) 1. సాకోణములు గలది. 2. అశ్రువులు గలది.

సాశ్రుధి సం. వి. ఈ. స్త్రీ. అత్త, శ్వశ్రువు.

సాశ్రువు సం. విశే. (అ ఉ. ఉ.) అశ్రుపూర్ణమైనది.

సాష్టాంగము సం. అవ్య. దండాకారముగా, ఎనిమిది యంగములు నేలకు దగులునట్లుగా.

మ, అవలం దంటికిఁజేసె నంతకుఁడు సాష్టాంగంబు గావించె... పారిజా. 3. 7.

సాసువులు వి. బ అవాలు.

చూడు. 2. అ.

సాసూయము సం విశే. (అ. ఆ. అ) అసూయఁగలది, ఈర్ష్య గలది.

వ. సత్యభామ సాసూయంబుగా వాసుదేవున కిట్లనియె. ఉ. హ. 3. 114.

సాస్న సం. వి. ఆ. స్త్రీ. గంగడోలు.

సాహంకారము సం. విశే. అ. ఆ. అ. అహంకారము గలది. గర్వము గలది.

సాహచర్యము సం. వి అ. న. 1. సహవాసము, కలసి యుండుట. 1. అవినాభావ సంబంధము.

సాహనము సం. వి. అ. న. సహనము.

సాహసము సం. వి. అ. న. 1. బలాత్కారము బొద్ధత్యము. 2. నేరము, చౌర్యాది దోషము. 3. క్రౌర్యము. 4, తెగింపు

శా ఓరీ బ్రాహ్మణధూర్త నా యెదుర నో హో సాహసం బెట్టిదో, వైరిం గోరి నుతించుమాట లెటు గావచ్చెం గృతఘ్నా.... ఉ. హ. 4. 187.

5. తొందరపాటు; అవిమృశ్యకారిత, 6. దండన, శిక్ష. 7. కీర్తి (ధనం).

సాహసాంకుఁడు సం. వి. అ. పుం 1. విక్రమాదిత్యుఁడు. 2. ఒక కవి పేరు. 3. ఒక నిఘంటుకర్త పేరు.

**సాహసి** సం. విణ. (స్. ఈ. స్.) ఉగ్రమైనది, క్రూరమైనది. 2. నిర్భయమైనది, గర్వము గలది.

**సాహసించు** సం. అ. క్రి. తెగించు చొరవ.

మ. శస్త్రాస్త్రంబుల కోరాడ మెత్తురు మేల్మేలని సాహసించుచటి చెంతో ప్రాణపర్యంత నిర్భర దుస్సంకటమైన నవ్వుదురు. చంపూ. రా. 8. 12?.

**సాహసికము** సం. విణ. (అ. ఈ. అ.) 1. బలప్రయోగముచేయునది, తీవ్రమైనది, ఉద్ధతమైనది, తొందరపడునది, వేగిరపడునది, ముందు వెనుకలు చూడనిది.

**సాహసికుఁడు** సం. వి. అ. పుం. 1. తొందరపాటు కలవాఁడు, ఉద్ధతుఁడు. 2. క్రూరుఁడు, అహంకారి, నిర్భీకుఁడు. ?. దోపిడికాడు. 4. వ్యభిచారి 5. బలికుమారుఁడు.

**సాహస్రము** సం. విణ. (అ. ఈ. అ.) వేయింటికి సంబంధించినది. 2. వేయింటితోఁ గూడినది. 3. వేయింటిచే కొనఁబడినది. 4. వేయింటికిగాఁ జెల్లింపఁబడినది. 5. వేయి రెట్లు యినది.

**సాహస్రము** సం. వి. అ. పుం. వేయి మంది గల సేనాదళము.

**సాహస్రము** సం. వి. అ. న. వేయింటి మొత్తము. సహస్ర వస్తు సమాహారము.

**సాహస్రుఁడు** సం. వి. అ. పుం. సహస్ర బలమున కధికారి.

**సాహాయకము** సం. వి. అ. న. 1. తోడ్పాటు, ఆదరణ, అండ. 2 సాహచర్యము, 3. మైత్రి. 4. సహచర వర్గము. 4. సహాయ సేనాదళము.

**సాహాయ్యము** సం. వి. అ. న. 1. తోడ్పాటు, అండ. 2. మైత్రి, స్నేహము.

**సాహిణము** వి (సం. సాధనమ్. ప్రా. సాహిణి) 1. సేన. చూడు. సాహిణి.

2. గుఱ్ఱపుసాల.

కం. సాహిణమునఁ బాశాయన, వాహాగారంబునకును వర్తిలు బేళ్ల. ఆం. శే. 25.

మహాప్రగ్రహ, ఎకరాలన్ మందువా సాహిణములఁ గలభ్రదేశసందోహ వాహ ప్రకరంబుం గొంచు. మను. 1. 40.

ఉ....క్రొం, బావిలుకాని సాహిణపుఁ బ్రోవరి యామని వచ్చె వత్తరిన్. కృ. శకుం. 1. 70.

3. గజశాల.

సీ. రణోత్భయంకరై రావణ మదగంధ నాగంబు దన సాహిణమున నుండ. వరాహ. 3. 65.

4. గుఱ్ఱము.

ఎ. గీ. పవన పౌలస్త్య పశుపతు ల్లవనరూఢిఁ బరఁగు తమ సాహిణముల నిబ్బరము చూప. నిరం. 3. 36.

**సాహిణి** = సాహిణీ వి. (సాహిణము + ఇ) 1. గుఱ్ఱాలసాలపై నధికారి.

గీ. పిలికుంచె తలాటంబు బేరకెంబు, మణుల మొగముట్టువన్ని సాహిణి యొకండు, కర్త యొదుటికిఁ గొనివచ్చె గంధవాహా, బాంధవం బగునొక మహాసైంధవంబు.

2, గుఱ్ఱపురౌతు, సాది.

ఉ. అక్కలకంఠకంఠి తెలియంగనివప్పుడె ధిక్కరింపుచున్, జక్కెర భాణపుందురికి సాహిణిరాయల జంట దారిమేల్, చొక్కపువాఁడి చెంగలువ మూరి కటారినిఁ బోటుప్రేటు పెం, పెక్కఁగ నొక్కటన్ వలిపుటిక్కువఁ బక్కువ లేచి యార్చెవన్. ఉత్తర హరివ్రం. 2. 58.

3. గుఱ్ఱపువాఁడు.

తే. ఉత్తమాశ్వంబు సాహిణి యొకఁడు నిలుప. సారంగ. 1. 81.

చం. ... మోముపట్టనీ, టలరిచి రాజు ప్రోలకు హాయంబొక సాహిణి దెచ్చె చెచ్చెరన్. పె శకుం. 1. 113.

**సాహిణీ** వి. = సాహిణి. రౌతు. గుఱ్ఱపు రౌతు.

చం. .... సాహిణీలు మావుల బఱపంగ. ఆము. 3. 22.

**సాహిత్యము** సం. వి. అ. న. 1. సాహచర్యము మైత్రి, [illegible]వము, సంఘటన. కావ్య వాఙ్మయము.

సీ. నా[illegible] కథాలాప [illegible]గీత సాహిత్య చతురశుక ప్రో[illegible]చితంబు. ఉ. హ. 6. 56.

3. కవిత్వము. కావ్యశాస్త్రము. 4. సామగ్రి సంకలనము. 5. భోజనావసర వస్తువుల మొత్తము.

**సాహిబా** హిం. వి. సాహేబు. (ప్రభువు)

మ. వలుకుం జిల్కల కొల్కి రాచిలుక బాబా సాహిబా నెయ్యవుంగలవన్ సౌఖ్యము గాంచి. దశా. 1. 288.

**సాహు** వి. (క. సాహుకారు, త. సాహుకార్‌కరన్. హిం సాహుకారన్) వడ్డి వ్యాపారము చేయువాఁడు.

సీ. ఇడ్డవడ్డికి వోర్చి మృత్యురూపములైన, సాహులచే ఋణగ్రాహి యగుచు. పాండురంగ. 3. 16.

**సాహుకారు** హిం. వి. సాహూకారు, సాహు. (రూ. సాహుకారి. క. ర.)

**సాహూకారు** హిం. సాహుకారు.

**సాహెబు**=సాహేబు. వి. ప్రభువు, సామంతరాజు.

శా. ఢిల్లీ పాదుషహా నియోగమున రూఢిన్ రాజరాజౌ నిజామల్లీ పేరిటి మేటి సాహెబు. రంగా. 1. 138.

ఉ. మాయబ్బవరంబు లావ నిజమాడెద హైదరు జంగు సాహెబా. రంగా. 2. 80.

**సాహేబు** హిం. వి. సాహేబు, సాహెబు, సాయిబు, (హిం. సాహిబ్).

1. ప్రభువు.

తే. గీ. ఉభయకటముల శ్రీముద్ర లూర్ధ్వపుండ్ర, సంగతాంగార నవయవహారలోహి, శాశత శ్రీల హేజిబు లవుడు వచ్చి, రగణితస్థితి సాహేబునగరి కడకు. రాజవాహన. 5. 35.

2. మగఁడు, భర్త.

సీ. దంటెమ్మ తవని కమ్మంటావ పేరెక్కువందలి కుందేటికంటు వాకటి, చాయలక్కన వంటి సాహేబు పావని తుఁకమాని కనుగుదుంత యొకటి. ప్రబం. 1. 162.

**సాహో** హిం. అవ్య. పరివారజనము సేయు హెచ్చరిక.

కం. నిశ్శాణంబుల జరణవ్ర, దాశ్వంగద భూష లడర ధరవల్లభసౌ, ధశ్వఁగణ భాగంబున శాశ్వర పతి దిగ్గి సురలు సాహో యనఁగన్. వరాహ. 6. 42.

కం. మోహుం దతివై భవమున, సాహో యని కటిక వారు సందడి జడియం,గా హేమరత్న ఖచిత మహా హర్మ్యము చొచ్చియందు నాసీనుండై. ప్రబోధచం. 1. 19.

ఎ. గీ. స్వామి! సాహో పరాకు హెచ్చరిక యనుచు వేత్రహస్తులు పలుమాఱు విన్నవింప. అని. 4.

కం. ... కర్ణపుట. రసాయన సొవిదల్ల సాహో, నివరం బెసఁగంగ నెక్కి నృపుడు నిపుణుఁడై. శుక. 1. 62.

**సాహ్యకృత్తు** సం. వి. త్. పుం. సహచరుఁడు, మిత్రుఁడు.

**సాహ్యము** సం. వి. అ. న. 1. సంయోగము, సహభావము, సఖ్యము, సహాయము. 2. తోడ్పాటు, అండ.

**సాహ్వయము** సం. వి. అ. పుం. పొట్టేలు మున్నగు వానితో జూదమాడుట.

## సి

**సింగఁడు** వి. (స సింహ) 1. ఎలుకువాఁడు. 2. నృసింహుఁడు.

కం. మా సింగఁ డల్లతరి గుండతటిఁ దలమోచి తెచ్చిన యని శుక. 1.

**సింగఁడు** విశ కోపించినవాఁడు.

ఉ. చెప్పిన నద్దురాత్మకుఁడు సింగఁడు బూరఁడునై. పంచ. వేంకటనాథుఁడు అ. 1.

**సింగనాదము** కంటినల్ల గ్రుడ్డు

**సింగన్నదాఁటులు** వి. బాలక్రీడా విశేషము.

**సింగపుఁబీట** వి. (సింగము+పీట) సింహాసనము. తమ్మిపూ సింగపుఁబీట. పాంచా. 1. ఆ.

**సింగపుగొంగ** వి ఖడ్గమృగము, శరభము.

**సింగపుదండ** వి. మల్ల (శాస్త్రములోని) బంధ విశేషము.

**సింగపురాసి** వి (సింహము+రాశి) సింహరాసి.

**సింగము** వి. 1. సింహము.

శా. సింగం బున్న గుహానికేతమునకున్. భార. విరా. 2. 330.

పదోత్తరఘటితమై శ్రేష్ఠవాచక మగును ఉదా. రాచసింగము

2. మల్లబంధ విశేషము.

**సింగరవళి** వి. సింహరావము

**సింగళము** వి. సింహళద్వీపము.

**సింగాణి** వి (సం. శార్ఙ్గమ్) రూ సింగిణి, సింగిణీ. 1. శృంగిణి. శృంగధనువు. 2. బాణము. 3. ఒక రకము కుక్క.

సీ. జిగురంటి నటుల వెన్దగిలి పోనీక యీ సింగాణిమనుఁబోతుఁ జెండివైచు. సా. 1.

**సింగారపుఁదోఁట** (సింగారము+తోట) వి. శృంగారవనము, ఉద్యానవనము.

**సింగారము** విశ మంజులము, హృద్యము.

**సింగారము** వి శృంగారము, అలంకారము, అందము.

సీ. కొమ్మ సింగారంపుఁ గొలఁకునం దేలక బలువిరాలవు వెట్ట దొలఁగు టెట్లు నీలా. 2. 36.

వ. అని పనిచి తానును యోధ వీరోచిత ప్రకారంబున సింగారంబు సత్వరంబుగాఁ జేసికొని. భార. విరా. 3. 144.

**సింగారి** వి. శృంగారి, శృంగారవతి.

**సింగారించు** స. క్రి. (శృంగారించు) శృంగారము చేయు, అలంకారము చేయు, కుస్తరించు, దిద్దు, పారాణించు, సవరించు, హావణించు.

**సింగి** వి ఎఱుకలసాని, చెంచుది.

**సింగిణి** వి. (శార్ఙ్గమ్) రూ. సింగాణి, సింగిణీ, ధనువు, విల్లు.

సీ.... రాణ నొప్పారు పైఁ బాణంబు సింగిణి, తళుకుల కోరుల తరకసంబు. మను చ. 4. ౨౨.

**సింగితమునకువల** వి, చేపలఁబట్టుట కుపయోగించు నొక విధమైన వల.

**సింగినాదము** వి. 1. శృంగనాదము, కొమ్ము వాద్యము.

2. పొడలుగల దుప్పికొమ్ముతోఁ జేయఁబడి యోగులచే నుపయోగింపఁబడు సుషిరవాద్య విశేషము, పిల్లయోగుల వాద్యవిశేషము.

చం. లలిఁ గనుపట్టు కిన్నెరయు లాహిరి మోదము సింగినాదముం, జెలు వలరంగ, కళా. 2. 50.

3. చెప్పుకోఁదగినది కానిదానిని గూర్చి తీసివేతగా మాటాడునప్పు డీమాట వాడఁబడును. ఉదా, (వ్య) ఆ! ఏమున్నది? సింగినాదము.

**సింగిలీకకము** వి. రూ. సింగిలీకము. పెద్ద నల్లకోఁతి. శిరములు దెగిపడు సింగిలీకకములు. వళ. 3. భా.

**సింగులు** వి. బొందిలీలని, బాలాజీ అని పిలువఁబడు వట్టి యొకజాతి జనులు.

**సింగోట** వి. రెండు జింకకొమ్ములు జతచేసి యేర్పరచిన ఆయుధవిశేషము.

సీ. జింకకొమ్ములు రెండు చేర్చి యల్లు లమర్చి డాకేలఁ బూన నొడ్డగనఁ బొడువ సంగతి గల యది సిరగోట యనఁగను దివిదారికొమ్మునాఁ దేజరిల్లు. అం. భా. 2. 206.

**సింఘ (ఘా) ణము** సం. వి. అ. వ. రూ. సింఘాణకము. 1. నాసామలము. 2. ఇనుపత్రుప్పు. 3. గాజుగిన్నె.

**సింఘిణి** సం వి. ఈ. స్త్రీ. ముక్కు.

**సింఘేపోత్రేబ్రాహ్మణులు** వి. బ. కపూరి యెబ్రాహ్మణులు.

**సించ (చి) త** సం. వి. అ. స్త్రీ. పిప్పలి.

**సించనము** సం వి. అ. న. సేచనము, చల్లుట, నీళ్ళుపోయుట.

**సింజ** (రూ. శింజ.) సం. వి. ఆ. స్త్రీ. అందెలు మున్నగు దాని రవళి.

**సింజితము** సం. వి. అ. న. ఆభరణముల మ్రోఁత.

**సింజిని** నం. వి. ఈ. స్త్రీ. వింటినారి.

**సిందుకము** నం. వి. అ. పుం 1. వావిలి. (వృ. వి.) 2. సిందువార వృక్షము.

**సిందురము** వి. (నం. సిందూరమ్) 1. చెందిరము, నాగసంభవము.

కం. పగడము మంకిన విరియుకు జిగురాకును దొండపండు సిందురమును పొంపగు తమ్మికెంపు గుంపును సీలా. 2. 22.

3. వావిలి.

వృషభగతిరగడ :— చెలువ చెలువవుఁ దావి యూరువు సిందుసిందుర మింపుమీఱఁగ. వసు. 3. 149.

4. పెద్దరేకు. 5. అందుగుచెట్టు (వృ. వి.)

**సిందువార(క)ము** నం. వి. అ. పుం. వావిలి చెట్టు.

సీ. ....కర్ణికారముఁ బొడగన్న మాటాడుదు, సిందువారము మీఁద చేఁపు దూర్పు. విక్ర. 1. 188.

**సిందూరతిలక** నం. వి. అ. స్త్రీ బదువ, పుణ్య స్త్రీ.

**సిందూరతిలకము** నం. వి. అ. పుం. ఏనుఁగు.

**సిందూరపుష్పి** నం. వి. ఈ. స్త్రీ. పక్కెచెట్టు.

**సిందూరము** నం. వి. అ. పుం. 1. ఒక విధమైన వృక్షము, వావిలి. (వృ. వి.)

**సిందూరము** నం. వి. అ. న. చెందిరము, జేగురు రాయి రాగద్రవ్య విశేషము.

**సిందూరరసము** నం. వి. అ. పుం. పాదరసముతోఁ చేయఁబడిన యొక యౌషధము.

**సిందూరి** నం. వి. ఈ. స్త్రీ. 1. తెల్లతెగడ చెట్టు. 2. ఎఱ్ఱని వస్త్రము. 2. ఆరెచెట్టు.

**సిందూరిక** నం. వి. అ. స్త్రీ. సిందూరము, జేగురు రాయి.

**సిందూరితము** నం. విశ. ఎఱ్ఱగాఁ జేయఁబడినది. జేగురు రంగు గలది.

**సింధుకన్య** నం. వి. అ. స్త్రీ. లక్ష్మి.

**సింధుకఫము** నం. వి. అ. పుం. ఒక విధమైన చేప యొక్క యెముక.

**సింధుకము** నం. వి. అ. పుం. రూ. సిందుకము, వావిలి చెట్టు (వృ. వి.) ఏనుఁగు.

**సింధుకము** నం. విశ. సముద్రమునకు సంబంధించినది.

**సింధుజ** నం. వి. అ. స్త్రీ. లక్ష్మి.

**సింధుజ(న్మ)ము** నం. విశ. అ. (న.) 1. జలమునఁ బుట్టినది; జలసంబంధి. 2. నది యందుఁ బుట్టినది. 4. సింధు దేశమునఁ బుట్టినది.

**సింధుజ(న్మ)ము** నం. వి. అ. న. రాతి ఉప్పు; లేక సైంధవ లవణము.

**సింధుజుఁడు** నం. వి. అ. పుం. (సింధువ ందనుఁడు; సింధుపుత్రుఁడు) చంద్రుఁడు.

**సింధునాథుఁడు** నం. వి. అ. పుం. (సింధుపతి, సింధురాజు) సముద్రుఁడు. 2. సింధుదేశపు రాజు. జయద్రథుడు.

**సింధుపిబుడు** నం. వి. అ. పుం. అగస్త్యుఁడు.

**సింధుపుష్పము** నం. వి. అ. పుం. శంఖము.

**సింధుమంథజము** నం. వి. అ. న. సైంధవ లవణము.

**సింధులవణము** నం. వి. అ. న. సైంధవ లవణము.

**సింధువారము** నం. వి. అ. పుం. 1. జాత్యశ్వము. 2. సింధుదేశమునఁ బుట్టిన యుత్తమజాతి యశ్వము 3. వావిలిచెట్టు.

**సింధురము** నం. వి. అ. పుం. 1, ఏనుఁగు.

తే. గీ గంధసింధురకుంభా ప్రకాండకరభ, కదళికాకాండ కాంతవర్గములతోడి, పెందొడలు కాంత పెందొడ లెందు వరయ, మదనరేఖకు సరియైన మగువ గలదె- విక్ర. 1. 119.

2. అష్ట సంఖ్య.

**సింధురవదనుఁడు** నం. వి. అ పుం. విఘ్నేశ్వరుఁడు.

**సింధువు** నం. వి. ఉ. పుం. 1. సముద్రము.

ఉ...ప్రమోదరససింధు తరంగల నోలలాడ. భోజ. 4. 40.

2. సింధునది. 3. సింధునది చుట్టుప్రక్కలఁ గల దేశము. 4. మాళవ దేశమందలి యొక నది పేరు. 5. ఏనుఁగు తుండము నుండి యెగఁజిమ్మఁబడిన జలము. 6. ఏనుఁగు కణతలనుండి స్రవించు మదము 7. ఏనుఁగు. 8. విష్ణువు నామము. 9. తెల్లని లవణము. 10. ఒక రాగ భేదము.

సింధువు సం. వి. ఉ. స్త్రీ 1. నది, మహానది. 2. సింధు నది.

సింధువృషుఁడు సం. వి. అ. పుం. విష్ణువు.

సింధుశయనుఁడు సం. వి. అ. పుం. విష్ణువు.

సింధుసంగమము సం. వి. అ. పుం. 1. నదులు సముద్రములోఁ గలియుట. 2. రెండు నదులు కలియు చోటు.

సింధూఫలము సం. వి. అ. న. సైంధవ లవణము.

సింధూరి సం. వి. ఈ. స్త్రీ. పీరపుష్పి, వృక్షవిశేషము.

సింబ సం. వి. అ. స్త్రీ. రూ. శింబ, సింబి. పెసర మున్నగువానిపై పొట్టు.

సింబ (బి) సం. వి. అ ఈ. స్త్రీ. గింజ, బీజము, ద్విదళ బీజము, ఒక విధమైన మొక్క. (వృ. వి).

సింబి సం. వి. ఈ. స్త్రీ. సింబ.

సింహ సం. వి. అ. స్త్రీ. నరము, రక్తనాళము.

సింహకర్ణము సం. వి. అ. పుం. సింహపు బొమ్మలతో గూడిన మూలమున్న దావరము.

సింహకర్ణి సం. వి. ఈ. స్త్రీ బాణము వేయునపుడు ఏర్పడు కుడి చేతి విన్యాసము.

సింహకేస(శ)రము సం. వి. అ. పుం. 1. వకుళ వృక్షము. (వృ. వి.) 2. సింగపు జూలు. 3. భక్ష్య విశేషము.

సింహకేళి సం. వి. ఇ. పుం. పూర్వ జైన విశేషము.

సింహగర్జనము సం. వి అ న. 1. ఏనుఁగులు మున్నగు జంతువులు భయపడునట్లుగా వీరులు చేసెడి ధ్వని. 2. వీరావేశముతో బెట్టు బొబ్బ. 3. సింహారావము.

సింహగుఁడు సం. వి. అ. పుం. శివుఁడు.

సింహఘంటాన్యాయము సం. వి. అ. పుం. సింహము మెడను గంట నెవ్వరును కట్ట లేని రీతి.

సింహతలము సం. వి. అ. న. తెఱచిన యఱ చేతుల జంట.

సింహతలాటము సం. వి. అ. న. కవి పండితులకు సన్మానముగ నిచ్చు సింహపు బొమ్మలతోఁడ గూడిన మురుగు.

సింహతుండము సం. వి. అ. పుం. ఒక విధమైన చేఁప.

సింహదంష్ట్రుఁడు సం. వి. అ. పుం. శివుఁడు.

సింహదర్పుఁడు సం. విశే. సింహము వలె నుద్ధతుఁడు.

సింహద్వారము సం. వి. అ. న. ప్రధాన ద్వారము; భవనము యొక్క ముఖ్య ద్వారము.

సింహధర సం. వి. అ. స్త్రీ. పార్వతి.

సింహనందనము సం. వి. అ. పుం. జన్య తాళ విశేషము.

సింహనర్ది సం. విశే. సింహము వలె గర్జించువాఁడు.

సింహనాదము (సింహధ్వని, రూ. సింహనాదకము.) 1. సింహము యొక్క గర్జనము 2. యుద్ధవీరుని కేక. 3. శివుని యొక్క నామములలో నొకటి. 4 నమ్మకముతో నొక్కిచెప్పుట. 5. సింహముచేయు నాదమువంటి నాదము.

సీ. సముద్భట సింహనాదవదనుడై యున్న నా వాసుదేవుఁడు. ఉ. హరి. 3. 67.

సింహపర్ణ సం. వి. అ. స్త్రీ ఒకానొక యోషధి విశేషము.

సింహపీఠము సం. వి. అ. న. సింహాసనము.

సింహపీఠిక సం. వి. అ. స్త్రీ. సింహాసనము.

శా. ... సింహపీఠికఁ జలత్వం, బొందు మాతంగ్రిమం,జీరం బించుక ఘల్లుమన్న. మనుచ. 4. 76.

సింహపుచ్ఛి సం. వి. ఈ. స్త్రీ. కోలపొన్న, నక్క తోక పొన్న,సింహపు తోకవంటి కొమ్మలుగల పొన్న. (వృ. వి.).

సింహబలుఁడు సం. వి. అ. పుం. కీచకుఁడు. (విరాట రాజు బావమఱఁది.)

సింహమలము సం. వి. అ. న. ఒక రకమైన యుత్తడి.

సింహము (√హింస్.) సం వి. అ పుం 1. మృగ రాజు. 2. సింహరాశి. 3. (ఉత్తరపదమైనపుడు) శ్రేష్ఠము.

సింహముఖము సం. వి. అ. న. అసంయుత హస్త విశేషము

సింహముఖి సం. వి. ఈ. స్త్రీ. ఒకానొక యోషధి.

**సింహయాన** సం. వి. అ. స్త్రీ. పార్వతి.

**సింహరథ** సం. వి. అ. స్త్రీ. పార్వతి.

**సింహరేఖ** సం. వి. అ. స్త్రీ. ర, జ, గగములతోనగు నొక వృత్తము.

**సింహలము** సం. వి. అ. న. 1. తగరము. 2. ఇత్తడి. 3. బెరడు లేక పెంకు. 4. ఒక ద్వీపము.

**సింహలీలము** సం. వి. అ. పుం. 1. జన్యతాళ విశేషము. 2. రతిక్రీడావిశేషము.

**సింహలుడు** సం. వి. అ. పుం. సింహళద్వీపవాసి.

**సింహవాహనుఁడు** సం. వి. అ. పుం. శివుడు.

**సింహవాహిని** సం. వి. ఈ. స్త్రీ. పార్వతి.

**సింహవిక్రమము**, **సింహవిక్రాంతము** సం. వి. అ. పుం. గుఱ్ఱము.

**సింహవిక్రీడితము** సం. వి. అ. న. 1. 108 కరణము లలో నొకటి. 2. జన్యతాళ విశేషము.

**సింహవిష్టరము** సం. వి. అ. పుం. సింహాసనము.

**సింహసంహననము** సం. వి. అ. న. సింహమును జంపుట.

**సింహసంహననుఁడు** సం. విశే. 1. సర్వాంగసుందరుఁడు 2. సింహము యొక్క శరీరమువలె శ్రేష్ఠమైన శరీరము గలవాఁడు.

**సింహాకర్షితము** సం. వి. అ. న. కరణ విశేషము.

**సింహాణము** సం. వి. అ. న. రూ. సింఘాణము. 1. చీమిడి ఇనుపత్రుప్పు. 2. పాండురోగమును బోగొట్టు నినుపనిట్టెము.

**సింహారావము** సం. వి. అ. న. సింహగర్జనము.

**సింహావలోకనన్యాయము** సం. వి. అ. పుం. సింహము ముందుకుఁ గొంతదూరము సాగిపోయి ఒక్కసారి నిలఁబడి వెనుకకుఁ దిరిగి చూచుకొనుచుండునట్లు వరైన నొక కార్యము కావించి మరల దాని నంతను పరామర్శించుట.

**సింహావలోకనము** సం. వి. అ. న. 1. వెనుకచూపు, పునరాలోచనము. 2. సింహము యొక్క చూపు. 3. శబ్దాలంకారమైన యమకములో నొక భేదము. ఇందు వాక్యము మొదటిమాట తిరిగి తుదను గూడ వచ్చును.

ఉదా :— క. మనవేటికి నూతనమూ, తనమూ, యొదఁ బ్రేమ తనకుఁదక్కితి ననుమూ,నను మానక రయ దనరం, దనరంతులు మారి నంపిభవు రమ్మనవే. కావ్యాలం. 4.

**సింహాసనము** సం. వి. అ. న. 1.సింహముఖ మేర్పఱిచిన స్వర్ణమయమైన యున్నతపీఠము, రాచగద్దె.
సీ. సింహాసనస్థులై సిరులు నించినవారు భోగసంపద లచేఁ బొదలువారు .... సార. 5. 101.

**సింహాసనము** సం. వి. అ. పుం. రతిక్రీడా విశేషము.

**సింహాసనాంశ** (అం) అయిదు వర్గంబులు స్వవర్గంబు వచ్చెనేని సింహాసనాంశ యగును (వాచస్పత్యము)

**సింహాస్యము** సం. వి. అ. పుం. 1. ఒక విధమైన హస్తముద్ర. 2. ఒక విధమైన యోషధి విశేషము, అడ్డసరపు చెట్టు (సింహము నోరు వంటి పువ్వులుగలది) (వృ. వి.)

**సింహి** సం. వి. ఈ. స్త్రీ. 1. సింగపుఁ బెంటి. 2. రాహువు యొక్క తల్లి పేరు. 3. అడ్డసరము. (వృ. వి). 4 ములక. (వృ. వి.)

**సింహిక** సం. వి. అ. స్త్రీ. రాహువు యొక్క తల్లి పేరు, అడ్డసరము.

**సింహుండము** సం. వి. అ. పుం. బొమ్మజెముఁడు.

**సిక** వి. శిఖ.

**సికగన్నుదాఁటుట** వి. బాలక్రీడా విశేషము.

**సికత** సం. వి. అ. స్త్రీ. 1. ఇసుకనేల. 2 మొరపనేల. 3. ఒకానొక రోగము. 4. ఇసుక.
వ .... ఉత్పాదిత గగనకోటర విపాటవంబు లయ్యె వయ్యెడ. సార. 5. 89.

**సికతాకూపన్యాయము** సం. వి. అ. పుం. ఇసుకనేలఁ ద్రవ్విన నూతి యొడ్డెప్పటికప్పుడే విఱిగి పడిపోవుచుండును. బలిష్ఠములైన యుక్తులు లేకుండ చేయువాదము మొదలైనవానిని గూర్చి చెప్పునపుడీన్యాయమును వాడుదురు.

**సికతాతలము** సం. వి. అ. పుం. ఇసుకతిన్నె.
సీ. సికతాతల నితంబ వికచబంధూకోష్ఠ, వరతరంగావళీ వళివిలాస .... విక్రమా. 7. 139.

**సికతాప్రాయము** సం. వి. అ. న. ఇసుకతీరము.

సికతామయము సం. విశే. ఇసుకతోఁ గూడినది.

సికతామయము సం. వి. అ. పుం. 1. ఇసుక దిబ్బ. 2. ఇసుకతో నిండిన తీరముగల ద్వీపము.

సికతావంతము సం. విశే. త్రి. సికతామయము.

సికతాసేతువు సం. వి. ఉ. పుం. ఇసుకగట్టు.

సికతిలము సం. విశే. (అ. ఆ. అ.) ఇసుక గలది. (నేల).

సీ.... కాంచన వేద్యలంకార చూర్ణాయిత, ప్రకటిత కర్పూరసికతిలంబు, నిరంకుశో. 1. 62.

సికఫలము సం. వి. అ. న. సీకాయ.

సికా వి. ముద్ర.

సికాయుంగరము వి. ముద్రగల యుంగరము, ముద్దుటుంగరము.

సికారు రూ. షికారు. హ. శ. వాహ్యాళి.

సిక్తము సం. విశే. (అ. ఆ. అ.) 1. తడిసినది, చిమ్మఁబడినది, నీరు పైని జిలుకరింపఁబడినది 2. తడుపఁబడినది, నానఁబెట్టఁబడినది. 3. గర్భాధానము చేయఁబడినది, తడిసినది.

మం. ... పంచాస్త్ర గురుండు భూరికరుణాసిక్తేక్షణాం భోజుఁడై. నార. 5. 88.

సిక్తి సం. వి. ఇ. స్త్రీ. 1. చల్లుట. 2. చిమ్ముట. 3. వెలిగ్రక్కుట.

సిక్థకము సం. వి. అ. న. మైనము.

సిక్థము సం. వి. అ. పుం. 1. ఉడికిన బియ్యము. ఉప్పుడు బియ్యము. 2 అన్నపుముద్ద.

సిక్థము సం. వి. అ. న. 1. మైనము. 2. నీలి మందు.

సిక్యము సం. వి. అ న. చూ. శిక్యము. 1. ఏనుఁగు స్తనాగ్రమందలి మదము.

మ. కరపాద స్తనరోమ కూపకట సత్కర్ణాక్షికోశాలికీ, కరమేఘాతత సిక్యఘర్మ జలరంగద్దాన సంపూర్ణసాగర శీధూన్మద సమ్మతాష్ట మదముల్ గ్రమ్మం దదష్టాంగబం, ధురమై సింధుర మొప్పుచుండె వలగీతుల్ వించు నోలంబునన్. కు. సం. 2. 90.

2. ఉట్టి. 3. చిక్కము.

సిత్యము సం. వి. అ. పుం. 1. స్ఫటికశిల. 2. అద్దము, గాజు.

సిగ వి. 1. శిఖ. 2. సీకాయ చెట్టు. 3. నెమ్మిజుట్టు.

సీ. పొగసుగా విరిసరుల్ చుట్టి, గట్టిగనిడ్డ సిగపెంపు వాఁడెంపు సిరుల సీవ విలా. 2. 50.

సిగదంత వి. 1. శేఖరము. 2. భూషణ విశేషము.

సిగపట్లు వి. దెబ్బలాట.

చం. పలుకులు వాదు రేపి సిగపట్లకు దగ్గఱ చేసి. కువల. చరి.

సిగబంతి వి. 1. శేఖరము. 2. భూషణ విశేషము.

గీ. అమ్ముగాడ వేల యలగక యమ్ములకును, ఖడ్గమంటింపఁగా నేల ఖడ్గములకు, ఖల్ల మదియేల వాయిక ఖల్లములకు, వయ్య యీ బంతి సిగబంతి యయ్యెనేమొ. చంద్ర. 2.

సిగపువ్వులంజుట్టు స్వేచ్ఛగా నుండు, అభయం బను వది సిగపూవులు జుట్టి. (ధర్మజరాజసూయము)

సిగము వి. రూ. సివము. దేవతావేశము.

సిగర వి. రూ. సిగరి. 1. మెంతి మజ్జిగ. 2. మజ్జిగ పులుసు.

సీ. ఒక కొన్ని సిగరులు నొక కొన్ని యంబళ్ళు. పాండు. 4. 184.

దధిశర్కరాదికృత లేహ్యము.

సిగరము వి. శిఖరము.

సిగరి వై. భస్మము.

సిగరెట్టు అన్యదే. వి. కాగితపు తొడుగు గల పొగ మట్ట.

సిగినాలు వి. నాణెమైన వక్కలు.

సిగు వి. సిగ్గు.

సిగ్గరి విశే. 1. సిగ్గు గలవాఁడు. 2. సిగ్గు గలది.

సిగ్గటికత్తియ (పూ. సిగ్గరికత్తె) వి. సిగ్గు గలది.

ఎట్టకేలకుం జెట్టకాలకుం జెవియొగ్గిన సిగ్గటికత్తియలకు. వసు. 423.

సిగ్గిలు అ. క్రి. సిగ్గుచెందు.

చం. .... సిగ్గఱి తుది వట్లు పొలు టిది కర్జమె. భార. ద్రో. 4.

సిగ్గిడి (సిగ్గు+ఇడి) విశ. నిర్లజ్జము. 2. సిగ్గు చెడిన వాఁడు. 3. సిగ్గు చెడినది.

సిగ్గు వి. విడియము, లజ్జ.

తే. కన్నెయవుగాని ప్రౌఢవుగావు నీవు. పువ్వుబోడి రొ సిగ్గెల్లఁ బోవవడిచి. బలుదొసంగులఁ బొరలఁగఁ జాదె నీకు. నింపుకేనియు మఱిపోవ నెంచ వకట. నీలా. 2. 87.

వ. ...ఇంక సిగ్గుమాలి రణంబు సేసె నేనియు ద్రో ణుండు చేయుంగాని యే నిట్టిదాని కోర్వ నదియు నుంగాక. భార. విరా. 4. 195.

సిగ్గుపడు అ. క్రి. లజ్జ చెందు.

సిగ్గుపాటు వి. సిగ్గుపడుట.

సీ. వంచవమై దాగి వర్తించు టిది యేమి ప్రాభవం బని సిగ్గుపాటు చెందు. వై ష. 8. 84.

సిగ్గువోవు (సిగ్గు+పోవు) అ. క్రి. సిగ్గుపడు.

ఎ. గీ. అమరచిత్తంబు గానఁగ నలవి గాక సిగ్గు వోయిరి యచ్చర చెలువ లెల్ల. లక్ష్మీ. 2. 90.

సిచయము సం. వి. అ. పుం. 2. వస్త్రము; ఉదుపు. 2. చినిగిన ప్రాంత యుడుపు.

సిడము వి. ఁ శాదులపై మంచబడు టెంకా.

వ. సిడంబులు ముడివడ వెదలించి. ఉ. హరి. 4. 218.

2. ధ్వజస్తంభము.

కం హయములఁ బాన్పుము రథమున రయమున సిడమెత్తు మిపుడ.... భార. విరా. 4. 4?.

సిడి వి. అంకుశము.

మఱుమఱ మదకరికి సిళ్ళు చూపిన భంగిన్. కుమా. సం. 10. 144.

2. పతపుత్రామా. 3. సిడిమ్రాను.

సీ. అంబోధరము క్రింద వసియాడు నైరావతియుఁ బోలె సిడిమ్రేలె తెఅవ యోర్తు. హంసు. 3. 77.

4. గ్రామదేవత జాతరలో నాటని పివున గాలము గ్రుచ్చి గాని ఒకనిని గంపతోఁ దూర్చుండఁ జెట్టిగాని త్రిప్పునట్టి దూలము.

సిడిముడి వి. 1. చిడిముడి 2. రోషము. 3. కోపము.

సిడిమ్రాఁకు వి. గ్రామదేవతల జాతరకు నాటిన స్తంభము.

సిడులు (రూ. సిళ్ళు) వి. అంకుశము, బరిగోల.

సిత సం. వి. అ. స్త్రీ. 1. చక్కెర. 2. వెన్నెల. 3. అందగత్తె. 4. సారాయము. 5. తెల్ల గరికె. 6. అరబ్బీ మల్లె.

సితము సం. విశ. 1. తెల్లనిది. 2. కట్టఁబడినది, బంధింపఁబడినది. 3. చుట్టఁబడినది. 4. ఎఱుఁగఁ బడినది; తెలిసికొనఁబడినది. 5. పూర్తి చేయఁబడి నది. ముగింపఁబడినది.

సితము సం వి. అ. పుం. 1. తెల్లని రంగు 2. శుక్ల పక్షము. 3. శుక్రగ్రహము. 4. బాణము. 5. పంచదార.

సితము సం. వి. అ న 1. వెండి. 2. చందనము. 3. ముల్లంగి.

సితపాటల సం. వి. అ. స్త్రీ తెల్లకలిగొట్టు చెట్టు.

సితచ్ఛత్ర సం. వి. అ. స్త్రీ. 1. పెద్ద సదాప, కుప్పి చెట్టు, 2. తెల్ల గొడుగు వంటి పువ్వులు గల చెట్టు.

సితచ్ఛత్రి సం. వి. అ. స్త్రీ. సదాప మొక్క.

సితపర్ణి సం. వి. ఈ. స్త్రీ. (చూ) సింహాస్యము.

సితమాషము సం. వి. అ. పుం అలచంద.

సితవాలుకము సం. వి. అ. పుం. గురుగు

సితవీర్య సం వి. అ. స్త్రీ. జీలుగుచెట్టు.

సితశింబికము సం వి. అ. పుం. గోధుమ.

సితశివము సం. వి. అ. న. రూ. శితశివము. 1. ఇందుప్పు. 2. సైంధవ లవణము.

సితశూకము సం. వి. అ. పుం. యవధాన్యము.

సితాంకము సం. వి. అ. పుం. వాలుగాగడమను చేప.

సితాంగము సం వి. అ. పుం. శ్వేతరోహిత వృక్షము. (వ్యు. వి.)

సితాంభోజము సం. వి. అ. న. తెల్లతామర.

సితాంశువు సం. వి. ఉ. పుం. 1. చంద్రుఁడు.

2. హారతి కర్పూరము.

సితాగురువు సం. వి. ఉ. న. క్రథనకము; గంధద్రవ్య విశేషము.

సితాగ్రము సం. వి. అ. పుం. ముల్లు.

సితాతపవారణము సం. వి. అ. న. రాజలాంఛనమైన తెల్ల గొడుగు

సితాపాంగము సం. వి. అ. పుం. నెమలి.

సితాభ(భ్ర)ము సం. వి. అ. పుం. కర్పూరము.

సితాది సం. వి. అ. పుం.. పంచదార మడ్డి.

సితారు వి. వాద్య విశేషము.

సితార్జకము సం. వి. అ. పుం 1. తెల్ల తులసి (వృ. వి.) 2. తెల్ల గగ్గెర (వృ. వి.).

సితాలిక సం. వి. ఆ. స్త్రీ. ఏనుగు జలగ.

సితావరము సం. వి. అ. పుం. శాక విశేషము.

సితాసితుఁడు సం. వి. అ. పుం. బలరాముఁడు.

సితి సం. విణ. 1. తెల్లనిది, 2. నల్లనిది.

సితి సం. వి. ఇ. స్త్రీ. 1. తెలుపు లేక నలుపు రంగు. 2. బంధనము.

సితికంఠము సం. వి. అ. పుం. నెమలి.

సితికంఠుఁడు సం. వి. అ. పుం. శివుఁడు.

సితుఁడు సం. వి. అ. పుం 1. శుక్రుఁడు. 2. తెల్లని వాఁడు.

సితేతరగతి సం. వి. ఇ. పుం. అగ్ని.

సితేతరము సం. విణ. (అ. ఆ. అ.) నల్లనిది.

సితోదరుఁడు సం. వి. అ. పుం. కుబేరుఁడు.

సితోద్భవము సం. వి. అ. న. తెల్ల చందనము,

సితోపలము సం. వి. అ. పుం. స్ఫటికము.

సితోశీరము సం. వి అ. పుం. వట్టి వేరు.

సిద్ధ కిన్నెర వి. తంత్రీవాద్య విశేషము.

సిద్ధాయము వి. 1. వెచ్చపు సొమ్ము వందు గూడఁబెట్టిన ధనము. 2. కప్పము. 3. వ్యయ విశేషము.

సిద్ది అధికబలము గల నీగ్రో జాతివాఁడు.

సిద్దియ వి. బుంగ వలె తోలుతోఁ గుట్టిన పాత్రము.

సిద్దీ వి. సిద్ది.

సిద్దె వి. సిద్దియ; తోలుతోఁగుట్టినపాత్రము.

సిద్ధకము సం. వి. అ. పుం సాలవృక్షము. (వృ. వి.)

సిద్ధక్రియ సం. వి. ఆ. స్త్రీ. పరమహంస క్రియ.

సిద్ధజలము సం. వి. అ. న. పులిసిన బియ్యపు గంజి, బియ్యపు కడుగు.

సిద్ధధాతువు సం. వి. ఉ. పుం. పాదరసము

సిద్ధనది సం. వి. ఈ. స్త్రీ. ఆకాశగంగానది.

సిద్ధపఱుచు అ. క్రి. సంసిద్ధము చేయు.

సిద్ధపుష్పము సం. వి. అ. పుం. కరవీరము, గన్నేరు (వృ. వి. )

సిద్ధభైరవ తంత్రము 1. శివప్రోక్త తంత్ర విశేషము.

సిద్ధమగు అ. క్రి. 1. సన్నాహమగు. 2. సంపూర్ణమగు. ఉ. ... నా మనోరథం, బక్కడ సిద్ధమయ్యె ఫల మబ్బెను ... హంస. 1. 84.

సిద్ధము (√సిధ్) సం. విణ. 1. నెఱవేర్పఁబడినది, చేయఁబడినది, సాధింపఁబడినది, పూర్తి చేయఁబడినది. 2. పొందఁబడినది, ఆర్జింపఁబడినది. 3. జయించినది. విజయవంతమైనది. 4. స్థిరీకరింపఁబడినది. స్థాపింపఁబడినది, 5. ధ్రువపఱుపఁబడినది, నిరూపింపబడినది, దృష్టాంతీకరింపఁబడినది. 6. ప్రమాణీకరింపఁబడినది, హేతుబద్ధమైనది. 7. సత్యముగా నంగీకరింపఁబడినది. 8. నిశ్చయింపఁబడినది, తీర్మానింపఁబడినది. 9. చెల్లింపఁబడినది, తీర్పఁబడినది (ఋణము మొ.) 10. వండఁబడినది. 11. పక్వమైనది, పరిణతమైనది. 12. చక్కగాఁగలిపి. వండి తయారు చేయఁబడినది (ఔషధము మొ.) 13. చేకూరియున్నది (ధనము మొ.) 14. వశపడియున్నది. (మంత్రము చేత) 15. లోఁబఱచు కొనఁబడినది. 16. నిష్ణాతమైనది, నిపుణమైనది. 17. శుద్ధము లేక పవిత్రము అయినది. (తపస్సు చేత) 18. విముక్తమైనది. 19. అతీంద్రియ శక్తుల గలది. 20. పవిత్రము, పుణ్యము. 21. దివ్యము అమరము, శాశ్వతము. 22. ప్రఖ్యాతము, సువిదితము. 23. ప్రకాశించునది, తేజరిల్లునది.

సిద్ధము సం. వి. అ. పుం. 1. అభియోగము. న్యాయ విచారణ. 2. ఒక విధమైన కండ చక్కెర. 3, నల్ల యుమ్మెత్త.

సిద్ధము సం. వి. అ. న. సముద్రలవణము.

సిద్ధయోగి సం. వి. ఇ. పుం. శివుడు.

సిద్ధరసము సం. వి. అ. పుం. 1. పాదరసము. 2. మణి శిల లోనగు సౌషధ విశేషము.

సిద్ధరసుడు సం. వి. అ. పుం. స్వర్ణ యోగి, రస యోగి.

సిద్ధసాధనము సం. వి. అ. న. 1. అతీంద్రియ శక్తులను సంపాదించుట కొఱకు మాంత్రిక కర్మల నాచరించుట, 2. మాంత్రిక కర్మలందు గాని, రసాయనిక ప్రక్రియలందు గాని యుపయోగింపఁబడు ద్రవ్యములు.

సిద్ధసింధువు సం. వి. ఉ. స్త్రీ. దేవగంగ. (గంగానది)

సిద్ధసేనుడు సం. వి. అ. పుం. కుమారస్వామి

సిద్ధస్థాలి సం. వి. ఈ. స్త్రీ. మంత్రసిద్ధుని పాత్ర, కోరినప్పుడు కోరిన యాహార పదార్థములతో నిండి యుండు పాత్ర

సిద్ధాంతకోటి సం. వి. ఇ. స్త్రీ. వాదమునఁ దార్కికమైన నిర్ణయముగాఁ బరిగణింపఁదగిన యంశము,

సిద్ధాంతకౌముది సం. వి. ఈ. స్త్రీ. పాణినీయ వ్యాకరణముపై భట్టోజీ దీక్షితులు రచించిన వ్యాకరణము.

సిద్ధాంతము సం. వి. అ. పుం. 1. వాద ప్రతివాదముల పిదప నిశ్చయింపఁబడిన పక్షము. 2. నవనిధి జ్యోతిష గ్రంథములు. (శ. ర.) 3. పూర్వ వాద భేదము. 4. నిర్ణయము.

క. సంతతి యెడ తెగినంతన, సెంతటి పుణ్యగతులైన పెడతెగునని సిద్ధాంతము విను వా తమ్ముఁడ! చింతి పకు మొక్క తెలిసి చెప్పెద నీకున్. భోజరా. 6 49.

సిద్ధాంతి సం. వి. న్. పుం. 1. పూర్వ పక్షమును ఖండించి సిద్ధాంతమును స్థాపించువాఁడు. 2. శాస్త్ర గ్రంథములందు నిష్ణాతుఁడు. 3. మీమాంసా దర్శనమును అనుసరించువాఁడు. 4. తత్త్వశాస్త్రము నెఱిఁగినవాఁడు.

సిద్ధాంతీకరించు సం. వ. క్రి. సిద్ధాంతము చేయు.

సిద్ధాయము సం. వి. అ. పుం. కప్పము

సిద్ధార్థము సం. విశే. 1. తీఱిన కోరికలు గలది.

సిద్ధార్థము సం. వి. అ. పుం. తెల్ల యావాలు

సిద్ధార్థి సం. వి. న. పుం. ఒకానొక సంవత్సర నామము.

సిద్ధార్థుఁడు సం. వి. అ. పుం. తీరిన కోరికలు గలవాఁడు. 2. శివుఁడు. 3. బుద్ధుఁడు

సిద్ధాశ్రమము సం. వి. అ. పుం. 1. క్షేత్రవిశేషము. 2. ఋష్యాశ్రమము.

సిద్ధాసనము సం. వి. అ. న. యోగాభ్యాసమందలి యొక విధమైనయాసనము.

సిద్ధి సం. వి. ఇ. స్త్రీ. 1. లాభము, ప్రాప్తి, సమగ్రత, సంపూర్తి. 2 జయము, వృద్ధి స్వస్తి. 3. ప్రతిష్ఠాపనము, స్థాపనము 4. నిరూపణము, నిదర్శనము, నిర్ణయము. 5. సామ్రాజ్యము, యాథార్థ్యము. 6. తీర్పు, నిశ్చయము, పరిష్కారము. 7. నిష్కర్ష, నిజము 8. చెల్లింపు, ఆనృణ్యము. 9. మందులు మొదలగు వానిని వండి తయారు చేయుట. 10. చిక్కు విడఁదీయుట, సమస్యలను బరిష్కరించుట 11. సంసిద్ధత 12. పరిశుద్ధత, పవిత్రత. 13. అతి మానుషశక్తి, (సిద్ధులు ఎనిమిది. అణిమ, మహిమ, లఘిమ, గరిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వము.) 14. మంత్రౌషధాదులవల్ల అతిమానుష శక్తులు సంపాదించుట. 15. అద్భుతమైన నైపుణ్యము లేక శక్తి. 16. సత్ఫలితము. 17. పరమానందము, మోక్షము. 18. అవబోధము, బుద్ధి. 19. విధానము, అంతర్ధానము. 20. మంత్రపాదరక్ష. 21. ఒక విధమైన యోగము 22. ప్రయోజనము, ఉపయోగము. 23. పరిపూర్ణ జ్ఞానము. 24. దుర్గాదేవి పేరు. 25. శివుని పేరు. 26. ధరించినవాని నిచ్చవచ్చిన చోటికిఁ గొనిపోవు పావుకోళ్ళు.

సిద్ధించు సం. అ. క్రి. 1. తటస్థించు. 2. ఫలించు, ఈడేరు. 3. ఒడఁగూడు.

వ.... జన్మత్రయంబున దద్దర్శనంబు సిద్ధించు ననుట సిద్ధంబు. భోజరా. 6 312.

సిద్ధిదము సం. విశే. 1. విజయము నిచ్చునది. 2. అష్టవిధ సిద్ధుల నిచ్చునది.

సిద్ధిదుఁడు సం. వి. అ. పుం. శివుఁడు.

సిద్ధియాల వి. నేపాళదేశపు బ్రాహ్మణులలో నొక శాఖ.

**సిద్ధుఁడు** సం. వి. అ. పుం. 1. అణిమాదులైన యష్ట సిద్ధులు గలిగిన దివ్యపురుషుఁడు. 2. అతీంద్రియ దర్శనము గల ఋషి. 3. యోగి, ముని, ఋషి. 4. ఇంద్రజాలమునం దారితేరిన వాఁడు. 5. మంచి మేధ కలవాఁడు. 6. ముక్తుఁడు.

వ. యక్షపతి రక్షో గంధర్వ సిద్ధసాధ్య తపోధనాది వివిధామర విశేషంబులును· నార. 5. 117.

సీ. అట్లు కర్ణాకర్ణి నవ్వార్త విని భూమిఁ గల సిద్ధులెల్ల నయ్యలఘువిద్యఁ బరికించు వేడుక నరుదెంచు చుండంగ .... భోజరా. 2. 140.

**సిద్ధురాలు** (సిద్ధ+అలు)=సిద్ధిపొందిన స్త్రీ.

తే. గీ. సిద్ధురాలు హేమావతీసితకరాస్య, వలపు రేఖాతిశయమైన భవమును దెల్ప ...హంస. 1. 78

**సిధ్మము** సం. వి. అ. న్. న. 1. మచ్చ, పొడ. 2. కుష్ఠవ్యాధి. 3. కుష్ఠపు పొడ.

**సిధ్మల** సం. వి. అ. స్త్రీ. 1. ఉప్పుచేప. 2. సిధ్మము గలది. 3. బొల్లి, పొడ.

**సిధ్మలము** సం. విశే. అ. అ. అ. 2. మచ్చలు గలది. 2. పొడలు గలది. 3. కుష్ఠువ్యాధి గలది.

**సిధ్యము** సం. వి. అ. న. పుష్యమీ నక్షత్రము.

**సిధ్రక** సం. వి. అ. స్త్రీ. వృక్షవిశేషము.

**సిధ్రకారణము** సం. వి. అ. న. దేవోద్యానము.

**సిధ్రకి** సం. వి. ఈ. స్త్రీ. లింగపొట్ల.

**సిధ్రము** సం. విశే. 1. పూర్ణము. శుభము. 2. సంరక్షణము.

**సిధ్రము** సం. వి. అ. పుం. వృక్షము.

**సిధ్రుఁడు** సం వి. అ పుం. పుణ్యపురుషుఁడు.

**సినీవాలి** సం. వి. ఈ. స్త్రీ. 1. చంద్రకళతోఁ గూడిన యమావాస్య, పార్వతి

**సిపాయి** హిం. వి. 1. కాల్బంటు. 2. భటుఁడు.

**సిపారసు** హిం. వి. 1. యోగ్యతా వచనము. 2. యోగ్యతాపత్రిక. (శ. ర.)

**సిప్ర** సం. వి అ. స్త్రీ. 1. స్త్రీ యొక్క కటిచక్రము. 2. మహిషి–గేదె. 3. ఉజ్జయినీ సమీపమునందలి యొక నది పేరు.

**సిప్రము** సం. వి. అ. పుం. చెమట, స్వేదజలము.

**సిప్రుఁడు** సం. వి. అ. పుం. చంద్రుఁడు.

**సిబ్బంది** హిం. వి. 1. సేవకులు. 2. సైన్యము.

**సిబ్బి** వి. 1. ఇత్తడి మున్నగువానితోఁ జేయఁబడిన అంచులులేని గుండ్రని పళ్ళెము. 2. మూఁకుడు 3. పళ్ళెక.

**సిబ్బితి** వి. సిగ్గు.

కం. ఇప్పని దలిదంద్రులకుం, జెప్పఁగ వలె నంచుఁ గలఁచ సిబ్బితి మిగులన్, ముప్పిరిగొనుచుం దైవయి, గప్పు నొరుల చాటువారు గారే కన్నెల్. నీలా. 2. 80.

**సిబ్బితికత్తె** విశే. సిగ్గు గల యాఁడుది·

**సిబ్బితికాఁడు** విశే. సిగ్గు గల పురుషుఁడు.

**సిబ్బిపళ్ళెక** వి. వెడల్పు మూతిగల గంప.

**సిబ్బిమనిమెకము** వి. పసుఁగు.

**సిబ్బియము** (రూ. సిబ్బెము) వి. బొల్లి, పొడ.

**సిబ్బుద్ది**

వ. అని యనేక ప్రకారంబులఁ దన్ను సిబ్బుద్ది నడలఁ బలుకుచున్న వారి నందఱం గటాక్షించి. కు. సం. 6, 18.

**సిబ్బెత** వి. సిగ్గు.

**సిబ్బెము** వి. (సిబ్బియము) 1. బొల్లి, పొడ. 2. శోఫ

**సిఖాండి** సం. వి. ఈ. స్త్రీ. అగ్ని, మేడివృక్షము.

**సిర** సం. వి. అ. స్త్రీ. రూ. శిర. 1. నాడి. 2. బోలు నరము. 3. ఈనె.

**సిరంగఁడు** వి. శ్రీరంగఁడు.

**సిరంగము** వి. శ్రీరంగము.

**సిరకా** వి. 1. పులిమెట్టు. 2. పులియఁబెట్టిన కడుగు నీళ్ళు.

**సిరము** సం. వి. అ. పుం. పిప్పలి కట్టె.

**సిరము** సం. విశే. చల్లనిది.

సీ. సిరమైన పచ్చకప్పురము గందంబుతోడఁ గలిపి పాలిండ్లపై నలఁది యలఁది. విక్రమార్క. 4.162.

2. శిరస్సు·

వృషభగతిఁ గగడ. గాసిగా సిర మంటు వంపక 'కప్పు కప్పురమేల అంతులు. వసు. 2. 148.

3. సీ. తెక్కులఁ జ్రేవల సిరవుమించుచుఁ గోడఁ దరపాల తకుకులు తడఁబడంగ. విక్రమా. 7 116.

సిరము వి. శిరస్సు.

సిరస్తాదారు హిం. వి. 1. ఒకానొక యుద్యోగి 2. లెక్కలు చూచువారికి పై యుద్యోగస్థుఁడు (శ. ర.)

సిరా సం. వి. అ. స్త్రీ. 1. రక్తనాళిక. ధమని —, గొట్టము వంటి పాత్ర. 3. ప్రవాహము. పఱు.

సిరా హిం. వి. కలముతోఁ గాగితము మున్నగువాని పై వ్రాయుట కుపయోగించు ద్రవపదార్థము.

సిరాజాలము సం. వి. అ. పుం. 1. కంటి యందలి ధమనులు ఉబ్బుట. 2. నాడుల సమూహము.

సిరాజి వి. ప్రవాహము. 2. ఒకానొక దేశము.

సిరాజి విశ. శ్రేష్ఠమైనది.

సిరాజీ వి. 1. సిరా. 2. సంపూర్ణమగు నాణెముకలది. 3. దేశవిశేషము.

సిరాణము వి. ఆయుధ విశేషము.

వ. సెలకట్టె పట్టెంబు సిరాణంబు చక్రంబు మొదలగు కైదువులు. ఉ. హరి. 4. 418.

సిరామోక్షము సం.వి.అ.పుం. ధమనులను ద్రుంచుట.

సిరావ్యధము సం. వి. అ. పుం. ధమనులను ద్రుంచుట.

సిరి వి. 1. లక్ష్మి. 2. సంపద. 3. శోభ.

ఆ. వె. అంత నీలఁగూడి ... ... బలుగుదాత్వె లుపు తలఁకు లేని సిరులఁ దనరుచుండె. నీలా. 3. 112.

సీ. హొగనుగా విరివయల్ చుట్టి గట్టిగ విడ్డసిగ వెంపు వాఁడెంపు సిరుల నీవ. నీలా. 2. 60.

4. పీతలంతి యందు మునుముందు వచ్చినవారికి చెప్పెడు గుర్తు.

సిరికమ్మి వి. అడ్డకమ్మి. 2. తోరణపుఁ గమ్మి.

సిరిగంధము వి. రూ. (శ్రీగంధము) 1. చందనము. 1. శ్రీ చందన వృక్షము.

వృషభగతి నగడ, అలసి యలసిరి గంధ మడరెడు నాసనాద ఘుటంగి వగుదుబె వసు. 3. 149.

సిరిగట్టు వి. శ్రీశైల పర్వతము.

సిరిపూటి వి. శ్రీ పుత్రుఁడు, మన్మథుఁడు

సిరిమంతుఁడు విశ. శ్రీమంతుఁడు.

సిరివరుఁడు వి. విష్ణువు

సిరిసింగనాలవృత్తి బాలక్రీడా విశేషము (రూ. సిరి సింగణాలవృత్తి).

సీ. విమతుఁ డెందేగిన వెసకెరవ నన్న యున్నతి వాఁడు సిరిసింగనాల వృత్తి రా. వి. 2. 23.

సీ. చిట్లబొట్లకాయ సిరిసింగణాలవృత్తి. గుడుగుడు గుంచాలు కుందెనగుడి. శ్రీ కాళహస్తి. 3 83.

సిరోత్పాతము సం వి అ. పుం. 1. ధమనులకు సంబంధించిన వ్యాధి. 2. కంటికలక.

సిల వి. (రూ. సెల) నీరు పట్టు తావు.

సిలము సం వి అ. న. (రూ. శిలము) ఉంఛవృత్తి.

సిలాజిత్తు వి. (రూ. సిలాజిత్తు) ఒకానొక మందు దినుసు

సిలుగు వి. 1. ఉపద్రవము

కం. ముచ్చులు జారులుఁ బోరఁబోరి, తిచ్చులఁ గఱ వులను రాచసిలుగులఁ జెడియున్, జచ్చియుఁ బ్రజ కొంచెముగా, నెచ్చోట్లును బాడయగు మహీతల మెల్లన్. హరి. 9. 47.

2. హాని. 3. కష్టము

సిలువ వి క్రీస్తును బంధించి వధించిన కొఱ్ఱు.

సిల్హము సం వి. అ పుం. 1. చిల్లమడ్డి. 2. అదుగు బంకతోఁ జేసిన సుగంధ ధూపద్రవ్యము.

సివంగి వి. 1. సివ్వంగి 2. సివంగివలె నుండు కుక్క 3. కస్తూరి.

చం. పులియఁడు బూచిగాఁ దనుంబోకులరా జను మంతిగాఁడు చెంగలు వసివంగి భైరవుఁడు... ... మనుచ 4. 32.

సివము వి. (రూ. సిగము) 1 ఆవేశము. 2. దైవము మేని మీఁదికి వచ్చుట.

సివమెత్తు అ. క్రి. దైవావేశమగు.

సివరము సం. వి. అ. పుం. ఏనుఁగు.

సివా అవ్య. (రూ. సివాయి) తప్ప, కాక.

సివారు వి. (రూ. శివారు) పెద్ద గ్రామమునకుఁ జేరి యుండు చిన్న పల్లె.

సివిలు ఆం. విశే. ఆస్తి విషయమైనది. (వ్య. వ.)

సివ్వఁగి వి. సివంగి.

సిషాధయిష సం. వి. అ. స్త్రీ. 1. సాధించు కోరిక. 2. నిరూపించు కోరిక.

సిసల్ (లు) హిం. విశే. నిర్ధారణమైన (వ్య. వ.)

సిసువరకము వి. శుశ్రూష.

సిసువు వి. (రూ. శిశువు) బిడ్డ.

సిసువుఁడు వి. శిష్యుఁడు.

సిసృక్ష సం. వి. అ. స్త్రీ. సృష్టింపవలె నను కోరిక.

సిసృక్షువు సం. విశే. సృష్టింపవలె నన్న కోరిక గలవాఁడు.

సిసృప్స సం. వి. అ. స్త్రీ. పోవలెనన్న కోరిక.

సిసృప్సువు సం. విశే. పోవలెనన్న కోరిక గలవాఁడు.

సిస్తు వి. 1. కప్పము. 2. పన్ను. 3. రాజ సంవర్శన వేళ నిచ్చెడు కానుక. 4. అందము. 5. సొంపు.

సిహుండము సం. వి. అ. పుం. జెముడు. (వృ. వి.)

సిహుల్లిక సం. వి. అ. స్త్రీ. కాల్చు చేతుల వగిలిన కుష్ఠువు.

సిహ్లకము సం. వి. అ. పుం. (సిల్హము. రూ.) ధూపము.

సిహ్లకి సం. వి. ఈ. స్త్రీ. (సిహ్లా) సాంబ్రాణి చెట్టు.

సిహ్లభూమిక సం. వి. ఆ. స్త్రీ. 1. సిల్హము. ధూపము.

సిహ్లము సం. వి. అ. న. 1. సిల్హము. 2. ధూపము.

సిక్కు వి. (సిడులు) 1. ముళుకోల. 2. అంకుశము. 3. బరికోల.

కం చెలులు విటు మనిన వలుకెద, గొలవిం గొని చూడినట్లు గొని కాలఁగ బిట్టలఁ గోప వహ్నిఁ గాచెం, జలచుటి మదకరికి సిక్కు మాపినట్లంగిన్. కు. సం. 10. 144.

# సీ

సీ అవ్య.) జుగుప్సా సూచకమైన యవ్యయము.

సీ వి. శ్రీ, సంపద (వ్య. వ.)

"సీ రాము సేన వాలు మెకంబుల్" మను. 4 ఆ.

సీకరము సం. వి. అ. పుం. తుంపరులుగాఁ బడు వాన తుంపర (శీకరము).

సీకాయ వి. శిఖాఫలము. నూనె మొదలగువాని జిడ్డును పోగొట్టు దినుసు

సీకారి వి. గాయకుఁడు.

సీత సం. వి. ఆ. స్త్రీ 1. శ్రీరాముని భార్య. 2. నాఁగటి చాలు. 3. దున్నఁబడిన భూమి. 4. గంగ (తూర్పు శాఖ). 5. మద్రపతి కేతనపు గుర్తు. 6 వ్యవసాయము. 7. ఇంద్రుని భార్య. 8. ఉమ. 9. లక్ష్మి. 10. మద్యము.

సీతభేది వి. అమవిరేచనము.

సీతాకోకచిలుక వి. చిత్రవర్ణమయమైన పెద్ద రెక్కలు గల యొక పురుగు.

సీతాదరిద్ర్యము సం. వి. అ న వ్యవసాయపుఁ బని ముట్లు.

సీతాధ్యక్షుఁడు సం వి. అ. పుం. వ్యవసాయ పర్య వేక్షకుఁడు.

సీతా(శీ)నకము సం. వి. అ పుం. బటాణి గింజ.

సీతాపతి సం. వి. అ. పుం. శ్రీరాముఁడు.

సీతాఫలము సం. వి. అ. పుం. 1. ఫల విశేషము. 2. సీతాఫలపు చెట్టు.

సీతాభోగములు (బహు) సం. వి. అ. పుం. శాలి ధాన్యము.

సీతి వి. శైత్యము.

సీతు(వు) వి. 1. చలికాలము.

సీ. కావనయు సీతువు వర్జించి మందు శేషవి గాక మున్న సస్యముల పంట లొదవెడు తటి నెత్తువది శత్రువయి. భా. శాం. 2 ఆ.

2. చలి.

సీతు సకలాంగకంబులు ప్రీతున్నము లయ్యెడు. భా. శాం. 8. ఆ.

**సీతోసీరము** సం. వి. అ. పుం. వట్టి వేరు.

**సీత్కారము** సం. వి. అ. న. ఊపిరిని నోటితో లోనికిఁ పీల్చునప్పుడు చేయు ధ్వని.

(సిట్టూర్పు చలిబాధ మున్నగువాని నిది సూచించును.)

**సీత్కృతము** సం. వి. అ. న. సీత్కారము.

ఉ. నాన దొలంగి చుంబన మొనర్చుచు కాదొకఁ డొక్క చంద్రబింబాననమోముఁ జద్రుఁ జన కాంతర బింబితుని బునఃపునః పావక పానకర్మము నెపంబునఁ జేసి తదోష్ఠ పల్లవం, బానుచు నాచరించెను సముచిత సీత్కృత చూత్కృతంబులన్. శృం. నై. 6. 188.

**సీత్కృతి** సం. వి. ఇ. స్త్రీ. 1. సీత్కారము. 2 రతి ధ్వని విశేషము.

**సీత్యము** సం. విశ. (అ. ఆ. అ) దున్నఁబడినది (నేల).

**సీత్యము** సం. వి. అ. న. బియ్యము; వరిధాన్యము.

**సీదరపుఁబెద్ద** వి. ఆదిశేషువు.

**సీదరము** వి. (రూ. సీద్రము.) 1. ఎద్దడి. 2. బీదతనము. 3. సర్పము.

సీ. అనయంబు వడకతప్పని గోత్రపతు లెప్పుడును సీదరము తేలి యనఘభోగులు. వసు. 1 ఆ. 98. (చివరి రెండర్థములకు)

సీ. తరిత్రాడు సీద్రంబు పొంటంటి గాలిచే జడియు చందమున నంచలు భ్రమింప. పాండు 3. ఆ.

**సీద్యము** సం. వి. అ. న. సోమరితనము.

**సీధుగంధము** సం. వి. అ. పుం. 1. వకుళ వృక్షము. 2. మద్యవాసన.

**సీధుపము** సం. విశ. (అ. ఆ. అ) మద్యము త్రాగునది.

**సీధుపానము** సం. వి అ. న. మద్యము త్రాగుట.

**సీధుపుష్పము** సం. వి. అ. పుం. కదంబ వృక్షము. వకుళ వృక్షము.

**సీధుపుష్పి** సం వి. ఈ. స్త్రీ. ధాతకి, ఆరెపువ్వు

**సీధురసము** సం. వి. అ. పుం. 1. మామిడిచెట్టు. 2. మద్యరసము.

**సీధువు** వి. (రూ. శీధువు) 1. పక్వమైన చెఱకు రసము నుండి చేయఁబడిన కల్లు. 2. మద్యము. 3. ఏనుఁగు కన్నుల యందలి మదము.

తరల. పదను మీఱు రసాలపేశల పల్లవావళు లుక్కురం, జిదిమి కుత్తుకబంటి తద్రస సీధువుంగొని చొక్కి వక్కొఁదమ కోయిల గుంపు నార. 2. 110.

**సీధుసంజ్ఞము** సం. వి. అ. పుం. వకుళ వృక్షము.

**సీధ్రిము** సం. వి. అ. న. గుదము (?)

**సీనా** వి. మెత్తని చక్కెర.

**సీపము** సం. వి. అ. పుం. పడవ రూపమున నుండు యజ్ఞపాత్రము.

**సీపి** హిం. వి. ముత్యపుఁ జిప్ప.

**సీమ** సం. వి. అ. పుం. ఎల్ల, సరిహద్దు. 2. ఎల్ల క్షేత్రాదుల యెల్లలను సూచించు గుట్ట. 3. గుర్తు. 4. తీరము. 5. తిజము. 6. పుఱ్ఱె యందలి వాని వంటి కుట్టు. 7. ఔచిత్య మర్యాద 8. అత్యున్నతి. 9. ఫాలము. 10. మెడ వెనుక భాగము 11. అండకోశము. 12. కేశాభరణము.

**సీమ** సం. వి. న్. స్త్రీ. 1. ఎల్ల, సరిహద్దు, పొలిమేర, 2. అండకోశము, 3. పెడదల 4. వరిమడి.

**సీమ** సం. వి. ఆ. స్త్రీ. 1. ఎల్ల. 2. ప్రదేశము. 3. పరిమాణము. 4. వరి మడి. 5 వృషణము. 6. ఉనికి 7. చెఱువు మొదలగు వాని గట్టు.

సీ. అమృత పూరాశ్చర్య తమవిరజానదీ సీమావరుద్ధ సంస్కృతి కథంబు. కళా. 8. 204.

చం. అలన యొకర్తు వగ్గు కృకలాసముఁ జేరఁగ దెచ్చివంచవన్, నలునకుఁ బంచె వట్టు నెలనాగ పదద్వయ మధ్యమంబునన్, నిలిపిన గాలుత్రాక నది నీవియ సీమకు. శృం. నై. 6. 111.

**సీమంతకము** సం వి అ. పుం. పాపట దిద్దుట.

**సీమంతకము** సం. వి. అ. న. సింధూరము, కెంపు.

**సీమంతకుఁడు** సం. వి. అ. పుం ఒకానొక నరకవాసి.

సీమంతమండనము సం. వి. అ. న. సిందూరము.

సీమంతము సం. వి. అ. పుం. 1. పాపట.

శా..... పౌరాంగనా, సీమంతంబులఁ బువ్వురేణు వునుమన్ సింధూర రేఖాకృతిన్. విక్ర. 1. 94.

2. గర్భ సంస్కారార్థము 4, 6 లేక 8 వ నెలలో చేయునట్టి కర్మ విశేషము.

గీ. పాలఁతికిని గర్భ మేర్పడఁ బుంసవనము, మానుగా నాఱు నెలలసీమంతవిధియుఁ, జేయఁదగు విజ్ఞా. కాం. 1. 14.

3. సరిహద్దురేఖ 4 పొలిమేర.

సీమంతితము సం. విశే. (అ. అ. అ) 1. పాపటవలె విడఁదీయఁబడినది. 2. గీఁతచే విడఁదీయఁబడినది.

సీమంతిని సం. వి. ఈ స్త్రీ. అఁదుది, ముత్తైదువు.

సీ. సుమతి సీమంతినీ కమనీయ శశికాంత పాంచాలికా శీతభానుఁ డగుచు. విక్ర. 1. 163.

సీమంతోన్నయము సం. వి. అ. పుం. 1. సీమంతము. గర్భవతులకు 4 వ 6 వ లేక 8 వ నెలలలో పాపట తీయు నుత్సవము.

సీమఅగిసె వి. ఒక విధమైన అగిసె.

సీమక సం. వి. ఆ. స్త్రీ. 1. చీమ. 2. చీమల పుట్ట. 3. వాలుక క్రింద నుండు కురుపు.

సీమకము సం. వి. అ. పుం. 1. వృక్షవిశేషము. 2. చీమలపుట్ట. 3. చీమ లేక చిన్న కీటకము.

సీమకరక వి. శ్లేష్మమును హరించు ఓషధి విశేషము.

సీమటపాకాయ సీ. వి. చిన్నరకము టపాకాయ.

సీమరేఁగు వి. పెద్ద రేఁగుపండు (యాపిల్)

సీమలింగము సం. వి. అ. న. సరిహద్దు గుర్తు

సీమవంగ వి. రామమునగకాయ (టొమాటో).

సీమాంతము సం. వి. అ. పుం. సరిహద్దురేఖ.

సీమాంతపూజనము సం. వి. అ. న. 1. గ్రామపు సరిహద్దును బూజించు నుత్సవము. 2. గ్రామపుఁ బొలిమేరకు వచ్చినప్పుడు నూతన వరుని సత్కరించుట.

సీమాటి వి. సౌభాగ్యవతి.

సీమాధిపుఁడు సం. వి. అ. పుం. పొరుగురాజు.

సీమానిశ్చయము సం. వి. అ. పుం. సరిహద్దు విషయమై చేయఁబడిన న్యాయస్థానపుఁ దీర్పు.

సీమాలింగము సం. వి. అ. పుం. సరిహద్దురేఖ.

సీమావివాదధర్మము సం. వి. అ. పుం. సరిహద్దు వివాదములకు సంబంధించిన న్యాయము.

సీమావివాదము సం. వి. అ. పుం. సరిహద్దుల విషయమై యేర్పడు తగాదా.

సీమావృక్షము సం. వి. అ. పుం. సరిహద్దు గుర్తుగా నుండు చెట్టు.

సీమాసంధి సం. వి. ఇ. పుం. రెండెల్లలు కలియు చోటు

సీమాసేతువు సం. వి. ఉ. పుం. సరిహద్దుగా నుండు గట్టు లేక వంతెన.

సీమోల్లంఘనము సం. వి. అ. న. సరిహద్దు నతిక్రమించుట.

సీరము సం. వి. అ. పుం. నాఁగలి.

సీరకుఁడు సం. వి. అ. పుం. సూర్యుఁడు.

సీరధ్వజుఁడు సం. వి. అ. పుం. జనకుఁడు.

సీరపాణి సం. వి. ఇ. పుం. బలరాముఁడు.

సీరము సం. వి. అ. పుం. 1. నాఁగలి. 2. జిల్లేడు మొక్క.

సీరయోగము సం. వి. అ. పుం. ఎడ్లను నాఁగలికిఁ గట్టుట.

సీరవాహకుఁడు సం. వి. అ. పుం. కర్షకుఁడు.

సీరాంగము సం. వి. అ. న. నాఁగటి కట్టు.

సీరాయుధుఁడు సం. వి. అ. పుం. శివుఁడు.

సీరాసనము సం. వి. అ. న. సీరము.

సీరి సం. వి. న్. పుం. బలరాముఁడు.

గీ. వదుమ వయిదు బాణంబుల వలెనె సీరి. ఉ. హరి. 3. 76.

సీరుఁడు సం. వి. అ. పుం. సూర్యుఁడు.

సీర్ణము సం. వి. అ. న. చల్లబడినది.

సీల రూ. చీల. మేకు, మొం.

సీలంధము సం. వి. అ. పుం. ఒక విధమైన చేప.

సీలమండ వి (రూ చీలమండ) చరణ గ్రంథి.

సీలము సం. వి. అ. న. నాఁగలి.

సీలు అం. వి. 1. ముద్ర. 2. అచ్చుపోఁత. 3. తిరుగుట.

సీవకుఁడు సం. వి. అ. పుం. కుట్టువాఁడు.

సివనము సం. వి. అ. న. 1. బట్ట మొదలగువవి కుట్టుట. 2. కుట్టు.

సీవని సం. వి. ఈ. స్త్రీ. 1. సూది. 2. గుజ్జము గుద స్థానము క్రింది భాగము.

సీవిరి వి. ఆలవట్టము. 2. వింజామర. 3. కల్లు.

సీసకము సం. వి. అ. న. 1. సీసము. 2. సత్తు 3. మల్లబంధ విశేషము.

వ. వాసుదేవుండు సీసకంబు పూనినవాఁడై వేయుండు. ఉ. హరి. 2. 64.

సీసజము సం. వి. అ. న. సిందూరము.

సీసము సం. వి. అ. న. 1. సీసకము. 2. సత్తు 3. ఛందో విశేషము. 4. వెట్టి. 5. రోషము.

సీసా వి. గాజు పాత్ర విశేషము.

సీహుండము సం. వి. అ. పుం. జెముడు చెట్టు

# సు

సు ఉపసర్గము. 1. మంచి. 2. తగిన. 3. పూర్ణము. 4. సమృద్ధము. 5. అశ్రమము. 6. అందమైన.

సు = చు. అవ్య.

చు అను నవ్యయము కళల మీఁద గసడదవాదేశముచే సు అగును చూ; చు.

సుంకపుఁగానులు అడవుల నుండి కట్టెలు మొ. తెచ్చుకొనుటకై చెల్లించెడి రొక్కము,

చం. వలనగు పుట్టగోచి బిగివాళ్ళను సుంకపుఁగానులు న్విభా. సిలు కరసాన గొడ్డలియు జిక్కము నన్ సొరకాయ బుఱ్ఱలోఁ, జలిదియు నుంచి బంధుజన సంతతి దర్శనభీతి తోఁగుచున్. గెళవులఁ బూచు కొంచు నరిగెన్ హననంబునకై రయంబునన్. శుక. 3. 248.

సుంకమడుగు సుంకమిమ్మని నిర్బంధించి యడుగు.

సీ. ... నవ పింఛమయ భూష లవధరించి నటించు వంకజాతుని చెల్వు సుంక మడిగి; ... మను. 3. 19

సుంకము (సం. శుల్కమ్. ప్రా. సుక్కో. సుంగో. క. సుంకె.) వి. వర్తకుల పైని విధించెడి పన్ను.

సీ. తే గీ. .. సుంక మన దాణ మనఁగను శుల్కమెనఁగు ... ఆం. భా. 2. 192.

సీ. ...ధాన్యములు సువర్ణాదాయములును దుర్గాదుల నుడియు బేహారుల సుంకములును. ఉత్తర హరిశ్చం. 1. 67.

2. వివాహము నందుఁ గన్యక కిచ్చు ధనము.

ఎ. గీ. ఉంకువన వోలియనఁగను సుంకమనఁగను బైఁడి యనఁగన్యకాశుల్క వాచకమగు. ఆం. భా. 2. 179.

(సంకవంగ అని ముద్రిత పాఠము)

3. ప్రతిబంధము.

చం. అతఁడు తదల్ప పాపఫల మందుట సుంకము తీతిపోయి త, చ్చృతదళపత్ర నేత్రునకుఁ జాఁగిలి మ్రొక్కె. ఆము. 6. 44.

సుంకము పట్టు, పన్ను రాఁబట్టు.

చం. సుంకము పట్టువభాంకు రాంకము. శృం. నై. 5. 105.

సుంకరి వి. శుల్కాధికారి, పన్ను రాఁబట్టువాఁడు. (సుంకము + అరి)

సీ. ... శుల్కాధికారి, చనును సుంకరి యనఁగను ... ఆం. భా. 2. 183.

కం. నమ్మకు సుంకరి జూదరి. సుమతి. శ. 62.

కం. నరకమ్మెడు బేహారులు, నరపతి సుంకరుల కెక్క నమ్మిక తోడన్, నరకమ్మిన సొమ్మునఁదా, రరువది యగు పాలు సుంకమీఁదగుఁ బ్రీతిన్. విజ్ఞా. ప్రాయ. కాం. 83.

సీ. కాలంబు పేరి సుంకరి యంబరంబునఁ దొడిచి నట్టి యరుణముద్ర యనఁగ. (సూర్యోదయ వర్ణనము). రాజవాహన. 4. 29.

కం. నీ వడకలు గంటిఁగదే, కానవవే నగరఁ జెప్పి కాఁపించెద ని, న్నేనంచుఁ గుంటిసుంకరి, పూనిక జెద రించుఁ గొలఁది బొమముడి వెట్టన్. కుః. 8. 256.

గీ. మాట నిలకడ సుంకరి మోటకేల, చెవిటివానికి సత్కథాశ్రవణ మేల. రామ. 4. 58 ప్రా.

**సుంకరీఁడు** వి. (సుంకరి+ఈఁడు) శుల్కాధికారి, సుంకము తీయువాఁడు.

కం. అడిగిన పతితో నిట్లను, దడవాయెను సుంక రీఁడు తమ లెక్కలకై వడియున్నాఁ డిదె కనుమని, పడఁతి యతనిఁ జూపఁ జూచి భయ ముప్పొంగన్. హంస. 4. 115.

**సుంకీఁడు** వి. శుల్కము పుచ్చుకొనువాఁడు, పన్ను రాఁబట్టువాఁడు.

ద్వి. లెంకరామంచయ్య లీల మీనగరి, సుంకీఁడు సుంకేశుబంకయ్యగారు. బస. పురా. 2 ఆ. 37 పు. 488 ప.

**సుంకు** వి 1. సస్యకుసుమరజము, పువ్వాళ, రజస్సు, దుమ్ము.

సీ.... సస్యకుసుమసంఘ చమ సుంక నంగమ ... ఆం. భా. 2. 187. ప్రా.

మ. బిరుదున్ గంటలు గట్టి సుంకు పెలయన్ బింకంబుతో నెంతగాఁ, గఱకల్ జూపెను బోదు రన్ వికసి ప్రుక్కన్ ప్రాలుచున్ గంకిగాఁ, బరు చొందం దెగువం తెగాఁ గమల గర్భంబుల్ దృణ ప్రాయమై, సరసీజావన జ ఘికా ప్రతిభ కెంచన్ సాటిరా నేర్చునే. ఉత్తర హరివం. 3. 58. ప్రా.

ద్వి కరమూల యుగళి బంగరు సుంకురాల విరి బంతి కెంగేల వికసింప మఱియు. ద్వి. పద్మ 2 57. ప్రా

మ. అనుచుం గాంచన కింకిణీవముతో నాబద్ధ మాల్యాసితో, మిసుకుల్ దట్టవుఁ బట్టైనామము లతో మేలుక్కవన్ బోసి తె, చ్చినదుడ్లున్ గుది కోలలుం దరుముచున్ జేకొల్లలన్ మోది యొ, క్కనిఁ బోనీయక సుంకు రాలిచిన రక్తస్రావ గాత్రంబుసన్. శ్రీరంగ. 3. 98 ప్రా.

2. ప్రతిబంధము.

సీ. మీసమలఁ బట్టి చి మెఱుఁగులఁ బట్టించి కుత్తుఁ బట్టించి సుంకణంచి. కవిక. 3. 47. శ. ర పా.

3. పెండ్లియందుఁ బళ్ళెమువఁ బోసి వధూ వరుల మీఁద చెరుగు వస్త్రపొట్టు.

కం. కంకణరాజత్కరులకుఁ, బంకజ నేత్రులకుఁ బుణ్యభాగులకు ముమా, శంకర భక్తుల కవ్వడు, సుంకులు చల్లిరి శశాంక సుందర వదనల్. ప్రబోధో త్తర. 8. 170.

కం. పల్లవపాణులు గొందఱు, వళ్ళెరములఁ బూని రవలబంగరు గాజుల్, ఘల్లురన సుంకుఁ జెరిగిరి. యల్లో నేరేడటంచు న య్యింతికున్. ప్రబం. 1. 151.

వ. జెగ్గురు పెండ్లికొడుకువకు సుంకులు చల్ల ఘువ వేదికా సమాజంబు. చంద్రికా. 4. 68.

కం. సుంకులు జెరిగిరి మునివర, పంకజలోచవలు సువ్విపాటసఱోలే, యంకురము లెత్త సభ వా రింకను వివపతె వటందు రేమవర్తిన్. పా. 5. 121.

వ. ఇరుగెలంకుల కుంకుమపు సుంకుల వెనపల్లు బింకెపు చంకల పొంకంబును. ప్రబ. . 7.

**సుంకేసరి** వి. వృక్షవిశేషము.

సీ గొగుపాగడములు గోరంటలును జెన్నవెలము సుంకేసరి వెఱ్ఱి చిక్కి. హంస. 4. 1.

సుంకేసల సుంకాసరి, అని ప్రా.

**సుంకేసలము** వి. వృక్షవిశేషము.

**సుంత** వి. కొంచెము; ఇంచుక.

కం. ఏ నింతవాఁడ నేనయి, పూనుదునఁట యెద్ది గాకపోయెడు నని సుంతైన ఫల మంద రీఱడు మానవులక కాదు విను మమర్త్యులకైనన్. పాండు రంగ 5. 238.

ద్వి. చూడు మేమందు నీచుఁడ సుంతలోన, నాడు దానిది యును ంటకపోదు. సారంగ. 1. 81 పు. 9. పం.

సీ. వరశంఖ పూగసంపద గళస్థము నీకు సతితోఁక ముకి సుంత నసలరాదె. చంద్రికా. 6. 133.

సుందరము సం. విణ. (అ. ఈ. అ.) 1. అందమయినది. 2. అందగాడు. 3. అందమయినది.

సుందరి సం. వి. ఈ. స్త్రీ. 1. అందగత్తె. 2. ఒకానొక చెట్టు.

సీ. చిటిగాఁడు సుందరి చీకొట్టునమ్మయుఁ దెల్లదుమ్మల్లి౦దకళ్ళ తొట్టి. హంస. 4 9.

సుకంటక సం. వి. అ. స్త్రీ. పాపదమునకుఁ బనికి వచ్చు నొక మొక్క (వ్య. వి.).

సుకండువు సం. వి. ఉ. పుం గజ్జి, చీడ.

సుకందకము సం వి. అ. పుం. ఉల్లి.

సుకందము సం. వి. అ పుం. 1. ఉల్లి. 2. తృణవిశేషము. 3. చిలకడ దుంప.

సుకత సం. వి. అ. స్త్రీ. సాధువు కాని యావు, ఒట్టియ. (శ. ర.)

సుకదట్టము వి చిలుకవచ్చ వన్నె గల బట్ట.

రగడ. గింజెంబులు బతి సీల్దసలీలను గిము కాశ్రకులు సుకదట్టమ్ములు ... కలిగిన వలు వన్నెల పట్టుఁబలు. కవి. 8. 195.

సుకము (సం. సుఖమ్) వి. హాయి.

సీ తే. గీ ... హాయి సుకము సుమారమం చవఁగ సుఖము .... ఆం. భా. 1. 93.

ద్వి. వకవకలై యింతవ్రతము దక్క నను-సుకము దక్కఁబోయెఁ జూచిరే యనుచు. ద్వి. ప: మ. 4. 302 పు. ప్రా.

సుకర సం. వి అ. స్త్రీ. సాధువైన యావు; తేలికగా మాలిమియైన యావు.

సుకరము సం విణ (అ. ఆ. ఈ. అ.) సులభమైనది, సులభముగాఁ జేయఁదగినది.

సుకరము సం. వి అ న వితరణము; ఔదార్యము; ఈవి.

సుకర్మము సం వి. న్. న. 1. మంచిపని. 2 ఒక గ్రహ యోగము.

సుకర్ముఁడు సం. వి. న్. పుం. 1. ధర్మకర్మము చేయువాఁడు. 2 విశ్వకర్మ.

సుకలుఁడు సం వి. అ. పుం. దాతయు, భోక్తయునైనవాఁడు, దానధర్మముల చేత ఖ్యాతి గడించినవాఁడు.

సుకవాసి విణ, కష్టపడక సుఖముగా నుండువాఁడు.

ద్వి. ధనరాశి యిచ్చోటఁ దఱలక యిత్తు, నొకవిచారము మాకు నొదవె నీరాజు, సుకవాసి పని పంద చూపు గుఱ్ఱంబు. హంస. ఉత్త. 1 96. ప్రా.

సుకసుకము వి. మిక్కిలి సుఖము. (సం. సుఖసుఖమ్)

ద్వి. లోలత నఱచేతిలో నిమ్మపండు, లీల లోషింపలాలితవై భవమున సుకసుకంబున నుండి గ్రుక్కక దావఁ గెకరిఁ చెరవు విధి గెలువ నీ వశమె. పవ నాథ. 1. 67 పు. 15 పం.

ద్వి. సుకసుకంబున నుఁడి సుత సోదరాది, సకల బాంధవులతోఁ జావఁగోరెదవు రం. రా. అర. కాం. 171 పు. 7 పం. ప్రా.

సుకాండము సం. వి అ పుం. కారవేల వృక్షము. (వృ. వి.).

సుకాండి సం. వి. న్. పుం. తుమ్మెద.

సుకాండిక సం వి అ. స్త్రీ. కాండీరలత

సుకాష్ఠము సం వి. అ న. వంటచెఱుకు

సుకారి వి ఎద్దులమీఁద సరకెత్తి-ముకాని యూరూరు తిరిగి వర్తకము చేసెడి యొక జాతి.

సీ అడుబిడ్డ సుకారియల్లుఁడు పిఁజారిమఱఁదలు గోడలు మారువాడి. శతకము. శర.

సుకించు (సం. సుఖించు) అ. క్రి. సుఖపడు. సుఖముగా నుండు.

కం. వినుగులు మేమును నీదయ, నని తొప్పడ వడవిఁ గడపు చల్లఁగ దలకె, దైన బ్రొద్దు వొడుచు చెలుఁగక, యొకపరిగీముల సుకించి యుంటిమి పామీ. రామేశ్వరమా. 5 69. ప్రా.

సుకిని వి. సుఖవతి.

సుకియ వి. అ భక్ష్యవిశేషము, బూరెలు అని బ్రౌ.

ద. అప్పములు వెన్నప్పములు సుకియ లమృతకల శంబులు లాగులు చక్కెరబూరు లుక్కెరలు ప్రబం. 1. 1 2.

మ ఇడి రమ్మోని కుపాయనంబులు మనోభీష్టంబుగా బూరియల్, వడలుం జక్కెర కజ్జికాయలును లాడ్వా లుక్కెరల్ పూర్ణపుం, గుడుముల్ గారెలు బెల్లమండిగలు నౌగుల్ కమ్మచాఁపట్లు సూఁటిడు లున్ దోసెలు నప్పముల్ సుకియలున్ హేరాళమై కన్పడన్. రామా. 2. 115 ప్రా.

సీ. కుడుములు సుకియలుఁ గడియుంపు టట్లు వెన్న ప్పాలు వడియంబు లప్పడాలు. కళా. ౯. 81. ప్రా.

**సుకియించు** అ. క్రి. సుఖించు.

ఎ గీ. గుండియలు ప్రమింగి దిగకున్న గ్రుడ్లు మిడిచి ధరణిఁ బొరలాడు పెనుముదిసయ్యములును, ముదుమ వంజుళ్ళు ముచ్చటమునుఁగ మెసఁగి, చొక్కి సుకియించు ఒలితంపురక్కసులును. మైరా. 3. 142. ప్రా.

**సుకుందకము** నం. వి. అ. పుం ఉల్లి.

**సుకుమార** నం. వి. ఆ. స్త్రీ. 1. దొంతరమల్లె. 2. అరటి.

**సుకుమారము** నం. విశే అ.ఈ అ.) 1. మృదువైనది. 2. అందమైనది. 3. లేఁతది.

**సుకుమారము** నం. వి. అ పుం. 1. శాలిధాన్యము. 2. ఒకవిధమైన చెఱకు గెడ 3 శ్యామాక ధాన్యము. 4. అవాలు. 5. అడవి సంపంగి.

**సుకుమారము** నం వి అ న. తమాలపత్రము

**సుకుమారి** నం వి. ఈ స్త్రీ వనమల్లిక (వృ. వి.).

**సుకుమారుఁడు** నం వి. అ. పుం. 1 లేఁతవయస్సు వాఁడు. 2 యువకుఁడు 3. అందగాఁడు.

**సుకృతము** నం. విశే అ. ఆ అ. 1. చక్కగాఁ జేయబడినది. 2. పూర్తిగాఁ జేయఁబడినది. 3. యోగ్యముగా నిర్మింపఁబడినది. 4. సహాకరింపఁబడినది 5. పవిత్రమైనది, పుణ్యమైనది. 6. అదృష్టవంతమైనది.

**సుకృతము** నం. వి. అ. న. 1. ధర్మకర్మము, మంచి పని. 2. పుణ్యము. 3. అదృష్టము, శుభము. 4 ప్రతిఫలము, లాభము

**సుకృతి** నం. విశే న్. 1. మేలుచేయునది 2. శుభమైనది, పుణ్యమైనది. 3. తెలివిగలది, వివేకముగలది 4. ఉదారమైనది, దయగలది. 5. అదృష్టము గలది.

**సుకృతి** నం. వి. న్. పుం. 1. మంచిపనిచేయువాఁడు. 2. పుణ్యశాలి, అదృష్టవంతుఁడు, కృతార్థుఁడు.

**సుకృత్తు** నం. విశే. త్. త్. త్. 1. మేలుచేయునది. 2. లాభకరమైనది. 3. పవిత్రమైనది. 4. విజ్ఞమైనది, తెలివిగలది. 5. మంచియాగములు చేయునది.

**సుకృత్తు** నం. వి. త్. పుం. 1. నిపుణుడైన పనివాఁడు. 2. త్వష్ట.

**సుకృత్యము** నం. వి. అ. న. 1. మంచిపని. 2. సత్కర్మ.

**సుక్కురుఁడు** వి. (నం. శుక్రః) శుక్రాచార్యుఁడు.

ఆ వె. అనుచు దాని చందమంతయు వెలిగించి, సుక్కురుండు వనుప నోఁకుఱేఁడు, మరల దీవి కఁగి మఱిమీఱికోటలు, గట్టి నేసి మూఁకఁ గావు వెట్టె. అచ్చ. రా. యుద్ధ. 487, ప్రా.

**సుక్కుళ్ళు** (ప్ర సుక్కుళ్ళు రూ.) వి. బ. ముడతలు.

సీ. మృదుతనూసుమవల్లి మిగులఁ గ్రాఁగఁదొడంగె నీలైన మైపూఁత పేటు లెత్తె, సొగసులేఁ జెక్కుల సుక్కుళ్ళు గనుపట్టె వదనారవిందంబు వాడుపాఱె. (సుక్కుళ్ళు ప్రా. పా) భోజను. ౬. 17.

**సుక్రతువు** నం వి ఉ. పుం 1. ఇంద్రుఁడు 2. మిత్రావరుణుఁడు 3. అగ్ని. 4. శివుఁడు. 5. సూర్యుఁడు. 6 సోమము.

**సుఖ** నం. వి ఆ స్త్రీ వరుణదేవుని రాజధాని.

**సుఖంఘుణము** నం. వి. అ. పుం. 1. ఖట్వాంగము. 2. కపాలము 3. అగ్రమునఁగల దండము.

**సుఖంబు** క్రి. విశే సుఖముగా.

ఆ ....రుజము వెఱుఁగకముం, భావమున సుఖంబు జీవించుచుండె. భార. ఆది 4. 158.

**సుఖంబుండు** అ క్రి సుఖముతో నుండు.

ఆ. వె ఇట్టి తలఁపు లుడిగి యింటికిఁ జని సుఖం, బుండుమని పురోహితుండు వలుక, విని మనంబు

లోన వెలసిన వైరాగ్య, మగ్గలింపఁ బల్కి తతని తోడ జాహ్నవి. 4. 158. ప్రా.

**సుఖచారము** సం. వి. అ. పుం. ఉత్తమాశ్వము.

**సుఖద** సం. వి. ఆ. స్త్రీ. 1. దేవవేశ్య, అప్సర. 2. గంగానది. 3. జమ్మిచెట్టు (వృ. వి.).

**సుఖదము** సం. వి. అ. న. విష్ణుపదము.

**సుఖబోధము** సం. వి. అ. పుం. 1. సుఖజ్ఞానము. 2. సులభమైన జ్ఞానము.

**సుఖభోగులు** వి. బ. ధాన్యవిశేషము.

సీ. వచ్చసరుల్ రెడ్డిపాలవంకెలు సుఖభోగులు వచ్చ కర్పూరవరులు. హంస. 4. 128. ప్రా.

వ. సుఖభోగులు సన్నమాదులు గౌరవంక రాజనాలు కాటుక రేకులు.... ప్రబం. 1. 112. ప్రా.

**సుఖము** సం. విశ. అ. ఆ. అ. సంతోషకరమైనది. 2. తృప్తికరమైనది, ఇష్టమైనది. 3. మధురము అనుకూలము. 4. సులభము, సుకరము.

**సుఖము** సం. వి. అ. న. 1. ఆనందము. 2. తృప్తి. 3. దుఃఖరాహిత్యము. 4 సౌలభ్యము. 5 స్వాస్థ్యము భద్రత, ఆరోగ్యము, క్షేమము, ఐశ్వర్యము. 6. సౌకర్యము 7. స్వర్గము. 8. జలము. 9. ఇంద్రియములకు సుష్ఠుగా నుండునది.

**సుఖము** అవ్య 1. ఆనందముగా. 2. స్వస్థముగా. 3. సుకరముగా. 4. శాంతముగా. 5. స్వచ్ఛందముగా.

**సుఖముండు** మి. అ. క్రి. సుఖముతో నుండు.

తే. .. సురేశ్వరుఁడుదనదు, పురమునకు నేఁగి సుఖముండెఁ గురువరేణ్య! భార. శాం. 4. 153. ప్రా.

కం. ...అవిషా, దమ్మున సుఖముండిరి వినయమ్మొప్పఁగ కాలివహోత్రు వాశ్రమభూమిన్. భార. ఆది. 6. 227. ప్రా.

**సుఖవర్చకము** సం. వి. అ. పుం. 1. సజ్జీకారము. 2. క్షారము.

**సుఖవాసము** సం. వి అ. పుం. పుచ్చకాయ.

**సుఖవాసి** సం. వి. న్. పుం. 1. కారుబుడమ (వృ. వి.) సుఖముగా వసించువాఁడు.

**సుఖశ్రవము** సం. విశ. (అ. ఆ అ.) 1. సులభముగా వినఁదగినది. 2. చెవికి ఇంపైనది.

**సుఖసంకథావినోదంబులు** వి రాజు కొలువు దీర్చి జరుపు ఇష్టగోష్ఠి.

(శ్రీ) మన్మహామండలేశ్వర కాకతియ్య గణపతిదేవ మహారాజులు ఓరుగల్లు నిజరాజధానిగా సుఖసంకథా వినోదంబులం బృథివి రాజ్యంబు సేయుచుండగా 1173 దుర్గిశాసనము. గు. జి.

**సుఖసంగి** సం. విశ (న్. న్. ఈ. సి. న్) సుఖము నందాసక్తి కలది.

**సుఖస్పర్శము** సం. విశ అ. ఆ అ. 1. ఆహ్లాదకరమైన స్పర్శ కలది. 2. సంతోషప్రదము. 3. రమణీయము.

**సుఖాంతము** సం. విశ. (అ ఆ. అ.) 1. సంతోషముగఁ బర్యవసించునది. 2. అనుకూలము. 3. మైత్రీపూర్ణము.

**సుఖాయతము** సం. వి. అ పుం. సుశిక్షితమైన అశ్వము

**సుఖాయనము** సం వి. అ. పుం. సుఖాయతము.

**సుఖావహము** సం. విశ. (అ ఆ అ.) సుఖము గలిగించునది.

**సుఖాశకము** సం. వి. అ. పుం. దోసకాయ

**సుఖాశము** సం వి. అ. పుం 1. సుఖముగా భుజించుట. 2. ఆహ్లాదకరమైన ఆహారము.

**సుఖాస్వాదము** సం. విశ. (అ. ఆ అ.) 1. మంచి రుచి గలది, అహ్లాదకరమైనది. 2. సుఖానుభవము.

**సుఖి** సం. వి న్. పుం. 1. యతి. 2. సుఖము గలవాఁడు.

**సుఖి(యిం)చు** సం. అ క్రి సుఖపడు; సౌఖ్యమనుభవించు.

కం. ... అ, కుంజరసుతతో నక్కపి, కుంజరుఁడొక కొన్ని యేండ్లు కూడి సుఖించెన్. ఉ. రా. 6. 89.

చం. ... ఈ ద్విజుం, డనయము లజ్జజీవుఁడు విరామయుఁడున్ దృఢయౌవనుండు నై, వనితయుఁ

దానుఁ గూడి శతవత్సరముల్ సుఖయించుచుండె డున్. మార్కం. 2. 195.

వ. ... వరు లీచరిత్రంబు విన్న రోషనిర్ముక్తులునై సుఖయింతుము. వరాహ. 5. 97.

సుఖైషి సం. విశ. న్, న్. ఈ. న్. 1. సుఖము నపేక్షించునది 2. సుఖమును ఆశాసించునది.

సుఖోదర్కము సం. విశ. (అ. అ. అ.) 1. సుఖమున బర్యవసించునది. 2. సుఖప్రదము. 3. సుఖోత్పాదకము

సుగంధ సం. వి. ఆ. స్త్రీ. తులసి (వృ. వి.).

సుగంధకము సం. వి. అ. పుం. 1. గంధకము 2. ఎఱ్ఱతులసి (వృ. వి.). 3. నారింజ (వృ. వి.).

సుగంధము సం. వి. అ పుం. 1. సువాసన. 2. గంధకము.

సుగంధము సం. వి. అ. న 1. చందనము. 2. నీలోత్పలము. 3. ఒక విధమైన సువాసన గల గడ్డి. 4. Small cumin seed.

సుగంధారుఁడు సం. వి. అ. పుం. శివుఁడు.

సుగంధి సం. విశ. సువాసన గలది. 2. పవిత్రమైనది. సుగుణములు గలది.

సుగంధి సం. వి. ఇ. పుం 1. మంచి వాసన. 2. పరబ్రహ్మము. 3. నూగుదోస (వృ. వి.). 4. ఒక విధమైన సువాసన గల మామిడి (వృ. వి.).

సుగంధి సం. వి. ఇ. న. 1. పిప్పలివేరు. 2. ఒకవిధమైన సువాసనగల గడ్డి. 3. ధనియాలు.

సుగంధిత్రిఫలా సం వి. ఆ. స్త్రీ 1. జాజికాయ, పోకచెక్క. 3. లవంగము.

సుగంధిమాల సం వి. ఆ. స్త్రీ. మావలి (వృ.వి.). శ.ర.

సుగంధిమూలము సం వి. అ. న. వట్టివేరు.

సుగంధిమూషికా సం. వి. ఆ. స్త్రీ. 1. చుంచు. Musk rat ?

సుగంధుఁడు సం. వి. అ. పుం. వర్తకుఁడు.

సుగతుఁడు సం. వి. అ. పుం. బుద్ధదేవుఁడు.

సుగమము సం. విశ. అ. అ. అ. 1. సుఖముగాఁ బొందఁదగినది. 2. సులువైనది 3. స్పష్టమైనది, సుగ్రహమైనది.

సుగము సం. విశ. అ. అ. అ. (వ్యతి. దుర్గము) 1. చక్కగా నడచునది. 2. బాగనైనది, ఒయ్యారము గలది. 3. సుఖముగాఁ బొందఁదగినది. 4 సుబోధము, సుగ్రహము

సుగము సం. వి. అ. న. 1. మలము. 2. సుఖము.

సుగము వి. సుఖము, సుకము.

సీ.... సంతన మంచన సంతోస మంచన నలరు సంతోషంబు వెలయుసుగము.

తే. గీ. హాయి సుకము సుమాళము చనఁగసుఖము అం. భా. 1. 98.

సుగవాసి = సుకవాసి. విశ. సుఖవాసి సుఖముగా నుండువాఁడు.

ఉ. వచ్చినఁ బెద్దరెడ్డి సుగవాసివి మే లిపుడైన నీద కున్, వచ్చితె యంచు. శుక. 2. 443. వ్రా.

సుగహన సం. వి. ఆ. స్త్రీ. భూతపిశాచాదులు చొరకుండునట్లు యజ్ఞభూమిచుట్టు నిర్మింపఁబడిన ఆవరణ.

సుగాలము వి. ఆయుధ విశేషము.

తే. గీ. చిఱుతచెయ్యమ్ము గండక త్తెర తుపాకి గోరకము సుగాలమును గ్రద్దగోళ్ళు బట్టె. చూరికాధారించు న వీరుఁ డెవుడు హంస. 1. 205.

సుగిపట్టములు వి. బ వస్త్రభేదము

వ .... శ్రీతోపులును శ్రీరామతోపులును జీబులును సుగిపట్టంబులును సన్నవలిపెంబులును. ద్వా. 3. 206. వ్రా.

సుగుడి విశ. పరసుఁడు, గుణవంతుఁడు, యోగ్యుఁడు,

తే. వలచి పట్టినకాలిమి వదల కిప్పు, డెన్ని చెప్పెదు ఆగవు వివేకతమున, మొనసి యూరకె రతిరంగము నకు రాని సుద్దు లివియేల చాలింపు సుగుడివౌదు. (సుగణి యని ముద్రితపాఠము) సారంగ. 2, 117 వ్రా.

కం. మునలి కపియించెనవు డ, య్యనికాక్షేత్రజ్ఞుల రాజయక్ష్మ శోకం, బెనఁగ నిలియించ నగు న ద్దెనఁబాలుఁడు సుగుడిగామి తెల్లమియె కదా! మను. 4. 91. వ్రా.

సుగుడితనము వి. యోగ్యత. మంచితనము.

గీ. అని విచారించు తనకు చింతైనలేక, సుగుణతన మును మాకెల్ల యగుచుఁ దిరుగ వాబిధమునెల్లఁ గడు దేవదేవి రోసి. విప్ర. 4. 15. ప్రా.

సుగృహీతనాముఁడు సం. వి. న్. పుం. 1. పవిత్రమైన నామము గలవాఁడు. 2. సార్థకనాముఁడు.

సుగృహీతము సం. విణ. అ. ఆ. అ. 1 గట్టిగాఁ బట్టుకొనబడినది. 2. ఉచితముగాఁ బ్రయోగింపఁబడినది. 3. తగినట్లుగా స్వీకరింపఁబడినది.

సుగ్గడి విణ. (ప్రా. సుగ్గమ్ = విదగ్ధమ్ దేశీయ నామమాల) నీతి కావ్యుఁడు.

ఉ. ...సుగ్గడి వైతి నీ మొగము చూడగ నెట్టులు నేర్తు చెప్పుమా. దశకు. 4. 46. ప్రా.

సుగ్గడితము విణ (సం. సుఘట్టితమ్) సుఘట్టితము, తళుకయిన నేత గలది.

ఉ. కుమ్మలు పావ్యవాహములు గుత్తపు సుగ్గడితంపుఁ దోఁపు రెంటమ్ములు. ఆం. భా. 2. 152. ప్రా.

చం. పడఁతి యొకర్తు చెందిరిక పావడఁబై తడియొత్తిపైన సుగ్గడితపుజీబు నేత్ర మొక కామిని గట్టనొసగ నంబరెం, పెదలిచి నిండు వెన్నెల వహించి పయోనిధి మండలంబు వెల్వడు మదురాజు వానల కళానిధి యంబుగ్గహంబు వెల్వడన్. వసు. 5 81. ప్రా,

మ సిరిమైగోవజవాజి పూఁత కలిమిన్ కెంతన్ గుకాళింప గుజరి నిద్రాతగటీకురాళములలో సంపంగిపూఁకాన్పుతన్, సరగంచున్ బనిపట్టు సుగ్గడితపున్ సయ్యాటపున్ గప్పులన్ దరుణుల్ గాంచిరి సౌఖ్య సంపద నిశాంతశ్లేషలై యత్తటిన్. చంద్రాంగ. 4. 70.

సీ. బంగారు సరిగంచు రంగు సుగ్గడితంపుఁ దెలి దువ్వటము కెళకెళల సీస. ఘటికాచల. 2. 15.

సుగ్రాసము సం. వి. అ. పుం. సరసమైన యాహారము,

సుగ్రీవము సం. వి. అ. పుం. 1. మంచి మెడ గలది. 2. హంస. 3. ఒక విధమైన ఆయుధము, 4. శ్రీకృష్ణుని రథాశ్వములలో నొకటి.

సుగ్రీవుఁడు సం. వి. అ. పుం. 1, వీరుఁడు. 2. శివుఁడు 3. ఇంద్రుఁడు. 4. వాలి తమ్ముఁడు.

సుగ్లము సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి యలసినది.

సుచకము సం. వి. అ. పుం. మొఱఁగెడి కుక్క.

సుచక్షువు(స్సు) సం. వి. స్. పుం. 1. మంచి కన్నులు గలవాఁడు. 2. వివేకము గలవాఁడు. 3. మేడిచెట్టు (వృ. వి.).

సుచరిత(త్ర) సం. వి. అ స్త్రీ. పతివ్రత.

సుచరిత(త్ర)ము సం. విణ. (అ. ఆ. అ.) మంచి నడవడి గలది.

సుచరిత(త్ర)ము సం. వి. అ. న. 1. సత్ప్రవర్తనము 2. సుకృతము; పుణ్యము.

సుచర్మము సం. వి. న్. పుం. భూర్జ వృక్షము (వృ. వి.).

సుచింత సం. వి. ఆ స్త్రీ. గాఢమైన ధ్యానము.

సుచింతనము సం. వి. అ. న. సుచింత.

సుచిత్ర సం. వి. ఆ స్త్రీ ఒక విధమైన కాయ.(పొట్ల కాయ?).

సుచిత్రకము సం వి. అ. పుం. 1. లకుముకిపిట్ట. 2. పొడలపాము.

సుచిరము సం. అవ్య. 1. చాలకాలము. 2. చాల సేపు.

సుచిరాయువు (స్సు) సం. వి. స్ పుం. దివ్యుఁడు దేవత.

సుచూటి సం. వి. ఈ స్త్రీ. పట్టుకారు

సుచేలకము సం. వి. అ. పుం సన్నని వస్త్రము.

సుచ్ఛత్ర సం వి ఆ, స్త్రీ. సట్లెజ్ నది.

సుచ్ఛత్రుఁడు సం వి అ పుం. శివుఁడు.

సుజనత సం. వి. ఆ. స్త్రీ. 1. మంచితనము, సాధుత్వము, 2. సుజనుల సమూహము. 3 ధీరత్వము ఉదారత్వము.

సుజనుఁడు సం. వి. అ. పుం 1 సాధు పురుషుడు 2. దయ గలవాఁడు. ఉదారుఁడు. 3. ఇంద్రుని సారథి.

సుజన్మము సం. విణ. న్. 1. మంచి వంశమునఁ బుట్టుక గలది.

సుజలము సం. వి. అ. న. తామరపూవు

సుజాతము సం. విణ. (అ అ. అ.) 1. చక్కఁగాఁ జెరిగినది. 2. చక్కఁగా ఉత్పాదింపఁబడినది. 3. ఉన్నత వంశమునఁ బుట్టినది. 4. అందమైనది.

సుడాలము వి. అశ్వగతి భేదము.

తే. గీ. తనకుఁ బ్రతిదేవుఁ డెందు లేడనుచు వెనుక, వగిది తగునడ్డవేదెము ల్వరపి మఱియు, ధంజళి మురళి ఝుళిపిఝుంపయు సుడాల, మనఁ గడు లెనఁగఁ జూపుచు హాళిమీఱ (సుధాలము· ముద్రిత పాఠము) ప్రబం. 1. 186. వ్రా.

చం. పతిగవిభుండు మింటివయి ధంజలికా మురళీ సుడాల వల్గితముల రా నెదుర్చడిన ఖేచరవర్గము లోనరించి యద్భుతముగ మ్రొక్కి లేనగవులోఁ గనుగొంచు .. పారి. 2. 102.

సుడి వి. 1. గాలిల చక్రభ్రమణము, బ. సుడులు, సుళ్ళు మొ.

చం. ...కాచకటకాకృతి సుళ్ళ మెలంగె గాడుపుల్. ఆము. 5. 128.

చం. కురిసిన క్రింది పుప్పొడులఁ గొంచు నగంబుల మీఁదికై పిశం, గరుచుల గొన్ని పెల్లగసె గాడ్పుల సుళ్. ఆము. 5. 124.

2. జలావర్తము.

వ. పూఁదేనియ కాలువ వాళ్ళ సుళ్ళంబడి వడివడిం దిరుగు కెంపు బొంగరంబులుం బోని మెట్టదామర మొగడులును. యయా. 4. 13.

మ్రుక్కులు తరఁగలు పొక్కిలిసుడి. నీలా. 2. 17.

3. రోమావర్తము.

చం. అనువగు సుళ్ళ నొప్పు మలయానిలవాహము నెక్కి. మను. 6. 26.

4. వ్రట్టువసుడి.

సీ. పట్టెపట్టెపయను బరిపష్టి తలకట్టు గ జిసున్న కియ్యయు సుడియు మడియుఁ గలుకొవ వ్రాయ వంబులు వ్రాయ వ్రాయఁ గొంకు కొసరుము తేతపుఁ గొనకయు దు లలితముక్తా ఫలాకార విల సనమున, మతిమంత్య బ్రతివరుఁడు పాండురంగ. 1. 71.

5 కష్టము, బాధ.

కం. సుడి యెఱుఁగనివారి, సుడివడ సుడిగాలి తెఱంగు దక్కసుఁడు విసరెడి యా, సుడిగాలి ధూళి గన్నుల, మడిసిన గోకులు చెగడి సుడివడి రథిపా! భాగ. 10. 265.

6. రాజులకు కోటల సుడి వచ్చు ఆదాయభేదము.

సీ. ...ధాన్యములు సువర్ణాదాయములును దుర్గాదుల సుడియు బేహారల సుంకములును ఉత్తరహరి శ్చం. 1 67.

7. అదృష్టము.

వ్యవ. వాని సుడి బాగున్నది. చూ. సుడిగొను.

సుడిఁబడు = సుడివడు అ. క్రి. బాధపడు, కలవర పడు.

ఉ. ....గ, ర్వాలసుదై సుడిం బడక. భాస్క. 11. 100. వ్రా.

సీ. వతనాభిసాభి సౌందర్య మెంచిన యంతఁ బలు వివేకము సుడిఁబడఁ దొడంగె. శకుం. 4. 58.

సుడితయిదువ వి √సుడి చక్రము.

తే. గీ. వలమురి సుడితయిదువయుం బులుఁగు సిడము, పసిఁడినుమువలువ కలిమి పడఁతుకయును, గలుగు మగఁడగు నిను మదిఁదలఁచినపుడె విడిచి చనుఁగదె బలుకీల విడుమగములు. అ. రా. అరణ్య 114.

సుడికొల్పు స. క్రి· కష్టపెట్టు; బాధించు.

ద్వి. "సురుచిరావర్తంబు సుడికొల్పు వాజి, గురు చక్రములఁ దిరుగుడుపెట్టు విఱుఁదు" ద్వి. పదమ. ?. 222 పా.

సుడిగట్టు √సుడి వి. చక్రవాళపర్వతము.

సీ తన యాన సుడిగట్టువెనుకఁ బర్వఁగఁ జాల తేజున మించె నేరాజుతాత. యయా. 1. 19.

సుడిగాడ్పు √సుడి. వి. సుడిగాలి (సుడివలె గుండ్రముగఁ దిరుగుగాలి)

ఉ. నేను మెలఁగ్వఁగా గొడుగునీడ వహించు వసుంధరాస్థలి, సీమనె యెక్కియాడెను విచిత్రగతిం దురగోత్తములు వా, భూవిభుఁడు తద్రథములు వో యెడతెవ్వక యభ్యసించు వా, శాయ్యవచక్ర చంక్రమవిహారములన్ సుడిగాడ్పు లిప్పుడున్. వైష. 1 85.

సీ. సుడిగాడ్పు తేరినల్కుట్టుఁ జుట్టలు వెట్టి గడిఁది మంటలు వెల్వఁగ్రక్కె వార్క. ఉ.రా.6 285. వ్రా.

**సుడిగాలి** దే. వి. 1. సుడియు (చుట్టుచుట్టి వీచు) గాలి. వాత్య.

కం. కదునర్మిలిఁ గ్రేపుం జను, గడువఁదొడఁగె వొక్క సురభిగురు పార్శ్వరయం, బడువత్స వక్త్ర ఫేనము సుడిగాలిం దూలిపడియె నొడపై వనభూ! భార. శాం. 3. 5. 17.

తే. ఇల సుడిసి చుట్టుచుట్టి దుమ్మెత్తి యెగసి, పోయి తము ముంచు సుడిగాలి .... ఆము. 4 81.

2. ఒకానొకజాతి పందెపు కోడిపుంజు.

తే. (చిలుకు) ఒమ్ము సుడిగాలి చక్రంబు వలజడ దరి, కూలముపిరఁగి వెలివక్క సాలువంబు కాళ రాత్ర్యంతకుఁడు పందెగాండ్రు మెచ్చులవెడు పేరుల పుంజుల గొని ముగించి. పంప. 8. 215.

**సుడిగొను** అ. క్రి. 1. కలతనొందు, బాధపడు.

శా. జాలిం బొందెడు బలాయముల్ సుడిగొనె న్వారంగముల్ సిచ్చె వే,గోలంబుల్ వెదరెన్ జమూరు గణ మాక్రోశించెఁ బంచాస్యముల్, తాలాంకావర జుండు మందరమహాధాత్రీధరం బెత్తినన్. హర. 6. 46.

కం. శూద్రుండు పిలిచె నేనియు. శూద్రుం డనుమతి యొసంగ శూద్రుఁడు చూడన్, శూద్రుని యింట భుజించిన, శూద్రాదిక నీచజాతి సుడిగొంద్రు ద్విజుల్. శేష. 8. 18.

2. భ్రమించు, తిరుగు.

కం. బలువిడి మొఱయఁగ పతం,బులుఁ దలలుం బగిలివారి బొందులు సుడిగొం, చిఱఁ గూలజూచి. భా. రా. యుద్ధ. 5. 12. వ్రా.

3. చుట్టుకొను, పెనఁగు.

సీ. సుడిగొని వెదలంగఁ గదఁగు క్రొత్తావి యల్లన మీఁది కెగయఁగ మొనలు విచ్చి. నిర్వ 6, 59 వ్రా.

కం. సుడిగాలి వచ్చి నిమ్మన్, సుడిగొని కొనిపోవ మింట సుడిసుడిగొనుచున్, బెగఁ డడరెడి నా ముద్దుల కొడుకా. భాగ. 10. స్కం. 68.

4. అదృష్టము ఫలించు.

చం. సుడిగొని రాముపాదములు సోఁకిన ధూళి వహించి రాలు యే,ర్పడ లోకకాంత యయ్యె నఁట వమ్ముగ నీతని పాదరేణు వి,య్యెడ పడినోడ సోఁక విది యేమగునో యని సంశయాత్ముఁడై, కడిగె గుహుండు రామపద కంజయుగంబు భయమ్ము పెంపునన్. మొల్ల. రామా. అయో. 52.

**సుడిగోరు** వి. తంతి మీటుటకు బంగారు లోనగు వానితోఁ జేసి వ్రేలికి వేసికొనెడు గోరు.

ద్వి. శ్రుతిగూడఁ దంత్రులు సుడిగోళ్ళ మీటుచు. హరిశ్చ. 2.

**సుడిపురువు** √సుడి. వి. అరణ్యజంతువిశేషము.

తే. గీ. సుడిపురువు నుస్తెపదులును మిడుత మెదుకు, చెలికుపాల్ పాలెరకుఁ గ్రోలి యరతిఁ గెరలి. ప్రబం. 1. 150.

**సుల్లయ** వి. తమలపాకుల బరువునందు సగము.

**సుడియ** విశే. తులువ శ. ర.

**సుడియాఁడు** అ. క్రి. పరిభ్రమించు.

ద్వి. పుడమిలోపల సాలెపోలయుబండి. సుడియాడెనిని చెప్పు చొక్కపుమాట, విధమాయె ముంచె నా విధమెల్ల దెలిసి. సారంగ. 2. 52 పుట 4. పం.

**సుడియు** అ. క్రి. తిరుగు, భ్రమించు.

కం. మాతతనయనారాచ. న్యాతము లై వారణంబు లొలుకుచు సుడియన్, భూతలమునఁ బొరలుఁ దెరలు, వే తూలుచు జిఱ్ఱఁదిరుగు విచ్చుం జచ్చున్. భార. కర్ణ. 1. 88. వ్రా.

సీ. కరులదానంబులకు మధుకరము లెలుఁగి, కుంజరమ్ములు నీరిలో గ్రుంకియున్న. మీఁద సుడియుచు నుండెఁ దుమ్మెదలు .... కుమా. సం. 1. 65.

ఆ. వె. గీము విడిచి సుడిసి గిక్కురుమనకుండు, జీవు విడుచువేళ శివుని దలచు, మనసుగొల్పకయును

మాయచేఁ బొంగెడు, పాపవరులకేటి వరము వేమ. వేమ. 3. భా. 105.

2. ప్రసరించు, వ్యాపించు.

సీ. ఎద మేని నెత్తావి సుడియంగఁ బయ్యెద సగము దూలించి పై మగుడఁ దిగిచి. భార. విరా. 2. 64.

సీ. అరుణాంఘ్రితలదీప్తి నవనీతలంబెల్ల ....తనులత సుడియునెత్తావి గైకొని సమీరుఁడు గంధవహుఁ డనురూఢిఁ దనర .... కుమార. సం. 6. 690. వ్రా.

తే. అనుచుఁ గరములు మొగముల కడ్డమిడుచుఁ గోసినటువలె మనసున రోసి రోసి, గ్రాసి యుమియుచు సుడియు దుర్గంధమునకు, నాసికలు మూసికొనుచు నన్యాసినరులు. వాల్మీకి. 2. 89.

సీ. క్రొవ్విరు లెసఁగి .... కమ్మవాతెఱవానన గలసి కలయ నోడుముట్టుచు మార్పులు సుడియుచుండు. కుమా. సం. 3. 9.

3. చుట్టుకొను, క్రమ్ము, వ్యాపించు.

సీ. మధుసమాకలిత మై ... తరుణిచే నోఁకినఁదావి వాంపిరివోవు తమ్మిసాఁ దగు సుగంధంబు సుడిసె. కుమా. సం. 2. 317.

వ. వెన్నెలలు అరవిరిచెందొవ మొగదలం బడి సుడియుచు. పారి. 2. 52.

కం. సుడి యెఱుగని హరి సుడివడ, సుడిగాలి తెఱంగు రక్కసుఁడు విసరెడి యా, సుడిగాలి ధూళి గన్నుల సుడిసిన గోపకులు బెగడి సుడివడి రధిపా. భాగ. 10 స్కం. 265.

4. అడ్డువచ్చు, వచ్చు.

స్రగ్ధర. చొచ్చున్ గేహాంతరంబుల్ సుడిసిన మగలన్ బట్టులన్ బిట్టుపాట్టల్, వచ్చున్ కాకాని ధారన్. ఉ. రా. 4. 92.

సీ. అంతంతఁ బనిబిడ్డలడ్డంబు సుడిసిన బంకించి మిన్నంటఁ జౌకళించి. భోజరా. 9. 25. వ్రా.

కం. తొడుకుఁ దివటీవు వసరము, బడిఁబోకుము తురగ గార్దభ ద్విరదాదుల్, వడచుపథంబున కడ్డము, సుడియకు దుర్జనులు మెలఁగుచో నిలువకుమీ. భోజరా. 6. 34.

గీ. దేవి యిటగాక మఱియను లావు ముట్టి, బలియుబికరంబు జోగు గోపాకమనుచు, వీధికేవ్వారు సుడిసిన వెక్కిరించు, నయ్యనమగన్నకొయ్యగయ్యాళితల్లి. విప్ర. 3. 15.

5. డాయు, సమీపించు.

కం. నా వదనము కమలం బని, తావికి నొక మత్త షట్పదము సుడిసిన నే, నా వేగంబున దానిలు, జోవఁగఁ జోఁవఁగ ... దశకు. 4. 93.

సీ. ఉపహతి గావింప నొకకాక మేతెంచి, సుడియంగ బలుమారుఁ జోఁపి చోపి, కడుదయ్యుటయును. భా. రా. అయో. 164.

సీ.... సుడిసిన మొగమెత్తి చూడకుండు, వరాకు కుసుమబాణుని నైవఁగునిటు జేయు .... పాత్రముల్ నెత్తమాడు, ఆము. 1. 59.

(వి. రూ. ఇద్వ్యక్ర. సుడిసి, సుడిసెను. సుడిసెదను)

6. వీఁచు.

మ....నానాల తాం, తవనామోదముఁ బొందుచున్ సుడియు నిత్యంబుం గరం బిష్టమై. భార. ఆది. 8. 79.

సీ. కరువలి సుడియమిఁ గదలక చెన్నొందు నెఱవిరి తమ్ముల నుఱక తెగడి. భార. విరా. 2. 33. వ్రా.

సీ. దశదిశాంతరములఁ దఱచుగా విస్ఫులింగములు గ్రక్కుచు వడగాలి సుడియ. వరాహ. 2. 64.

7. సుడిగా వీచు.

ఆ. సుడియు గాలిఁ బువ్వుబోడి దన్నుఁ గవ్వునో యనుచు బెగ్గలించు. విరా. 2. 304.

సీ. బడిబడిఁ గమ్మపుప్పొడి నివ్వుకలు చల్లి వెదవెదగా గాలి సుడిసె నేని. రాజశే. 3. 80.

ఆ. వె. కనినయప్పు డచటఁ గడునుగ్ర మగురక్త, వృష్టి గురిసె నుల్క లష్టదిశల బడియె, నఱకు లఱచె బిడుగు లుర్విని బడి, మ్రోసె గాడ్పుసుడిసె మాసె నిమఁడు. నిర్వ. 3. 56.

8. మెదలు, ఆడు.

సీ. సుధఁ జిందు మోవిపై సుడియు తేనియలొల్కు క్షీరోదకన్యాయసార మెనయ. ఉత్తర. హరిశ్చం. 1. 34.

ఆ. వె. సూన్యతంబుగాని సుడియదు

కొంకకఁ బాఱు కొంకులేదు. భాగ. 9. స్కం. 648.

కం. అనిలుండ వయ్యు నయ్యో వనమునే యిల మెంగఁ నంబుజముఖియుఁ దా, నమలక సుడియ వేలా, నను నేచెద వింతచలమున నవమానా! రామా. 6. 28.

9. చలించు, కదలు.

సీ. అలకలన్ దరుణుల నార్చుచు దారాడిచూపు వర్తకు లన సుడిసె కొమలు .... కుమా. సం. 3. 179.

10. సంచరించు, మసలు.

ద్వి. చోరుల జారుల సుడియఁగనీక వారల దండింతె వదలక వట్టి. రం. రా. అయో. కాం. 13 పు. 6 పం.

కం. ఆ కేసరి వరకేసరి, కాకున్న మదీయదేశ కావ నగిరులన్, భీకరవారిచర్యోత్కర, నూకంనికరముల కెట్లు సుడియఁగ వచ్చున్. జై. భా. 7. 212.

తే. గీ. చూచి యా దివ్యపురుషుండ మూచు వేఁడి. చూపులకు జంకెలకుఁ జెంత సుడియ వెఱచి. ఉ. రా. 4. 11.

11. లీనమగు, అడఁగు.

కం. చక్కెరయును లవణంబును గ్రక్కున నుదకములయందుఁ గరగినరీతిన్, మిక్కిలి తమిఁగను ఘను మది, చొక్కుచు నానందజలధి సుడిసి వశించున్. సీతారా. 3. 58.

12. కలఁత నొందు.

కం. నీ కోడలు కొడుకున్నకై, శోకం బుడిగింపలేక సుడిసినయది య, స్తోకబలంబునఁ దమ్ముఁడ, వేకదఁగవలయు బాలు విడిపించుటకున్. హరి. ఉ. 3. 46.

**సుడివడు** = సుడిఁబడు అ. క్రి. (సుడి + పడు) పరిభ్రమించు, (అవశతచే) గిరగిరఁ దిరుగు

కం. పడుచును లేచుచుఁ బాఱుచు సుడివడుచును దెసలు గలయఁ జూచుచు. భా. రా. అర. 2. 234.

కం. మునుఁ జనితల గరుడుఁడు కొని యరిగెడుఁ దెమ్ములివ బాతఁ దచటికిఁ జని త, ద్గురు దని లావులి సుడివడి, సురగాలిం బడిన చొప్ప చొరుగున కోలెన్. జై. భా. 5. 83.

2. చుట్టుకొనుచు రాలు, పడు.

ఉత్సాహ. చుక్కత్రొక్కు డెక్కడైన సుడివడంగఁ దొడఁగె. రామా. 6. 108.

3. ఆవర్తములు గలదియగు, సుడులుగలది యగు, సంక్షోభించు.

కం. సుడివడి యడలుచు బన్నము. లెడనూపక పొడమనంత వెలయఁగఁ గడలో, నుడుకుచు నుండెడి వారల, నెడ దారఁకుఁ గినియ బోలునే యొకి మీఁదా? అం. రా. యుద్ధ. 77.

సీ. తొగజేని పరివార మగుతార సంఘంబు శంఖరింఖన్మణిసరణిఁ జూప, జవనీతవారిదంతజలధర వ్రాతంబు కూలశైవలజాలలీలఁ దోప, సుడివడి తిరిగెడు సురవిమానశ్రేణు లెడనెడఁ బడువల వడువు దెలుప చంపూరా. 3. 20.

వ. వలిమించు గ్రొమ్మించు చొదులఁ దియ్యఁది పడిన దలి సుడివడుచు నొడలోము నోవరి గాలియల వోక పోకలకు మను. 2. 28.

4. చిక్కుపడు.

తే. గీ. అనుచు లావణ్యనిధి కామిని సరోజ, నేత్ర తన కూర్మి గానరా నిలిచి సరస, సానుకూల వాక్యముల లవారి గొలిపె న, సుంధరాథ ర్త చిత్తంబు సుడివడంగ. వరాహ. 6. 123.

సీ. ఒకచోఁ బువర్వు ను పూఁగె వృషముకొమ్మ సుడి వడ్డ ముత్యాలజోగువోలె. కాశీ. 1. 133.

5. కలఁతపడు, బాధనొందు.

చం. ...నీదు సైన్యముల్, సుడివడ భీష్ముఁడాఁకుటయుఁ జూచి మనంబున నాఁటదానితోఁ, బోడుతునె యంచు మార్కొనక పోయెఁ దొలంగి యతండు భూవరా! భార. భీష్మ. 2. 285.

కం. కురువంశము ద్రుంచుటకుఁ, గౌరజాలక నామనంబు సుడివడియెడు. భార. ఉద్యో. 4. 66.

వ. కొడుకు చెడుపడవడికి వడలుకడలిం బడి సుడివడియెడు తల్లిదండ్రుల. పాండురంగ. 3. 24.

శా. వైశంపాయనుఁ డెంతయున్ సుడివడెన్ వాడె

స్సుమ_తుం డశి, క్లేశం బంధిరి పై లపై మిములు దుఃఖ చెన్ మదిన్ దేవలుండు భీమ. 2. 69.

వ. అమ్మొన నిక్కువడియును సుడివడియును గ లంగియుఁ దొలంగియు. భార. ద్రోణ. 2. 18.

6. చెదరు.

కం. నిను గనినప్పుటఁ గోలెను, దనమది సుడివడఁగ రామధరణీశుఁడుఁ గిన్ గను గొనఁ గోరెఁడు దద యంజన దిద్యోధ వదినెపైతి చను మద్యోధకున్. భాఃః. అర. 149.

కం. వేణీభుకుచకుంభ, శ్రోణీభాఃముంఁ గొను సుడివడఁగ గదా, పాడిఁ గరుడించి వల్లవ, పాణిశి గర్భంబునందుఁ బ్రాపై నిలిచెన్. రామా. 3. 85.

సీ గళగళధ్వనులతోఁ గంఠశృంఖల లూడ్చి సుడి వడఁ గుక్కల నదవిఁ గలిపి. మను. 4. 108.

7. సంక్షోభించు, తొట్రుపడు

వ.... బయలువడి చేయునవిలేక యాకరకు మగిడి తుటుము విచ్చుచుఁ దద్వారదాఖినయవత్పరాచీనక రాజులై సుడివడు నెడం బొదము .... ఆము 4.85.

చం. అదరుచు హుంకరించుచు నహంకృతిఁ జూపుచు నస్త్రధారలన్, సుడివడఁజేయుచున్ బెగడుమన్ బెగడించుచు నిల్వరింముచున్, గడఁగుచు గోసరిం చుచు ముఖాముఖ నిల్చుచు బిట్ట దల్చుచున్, జడియక పోరి రయ్యుభయ సైన్యములన్ గలయోధు లద్ధ తిన్. ఉ. రా. 4. 295.

8. దుర్బలమగు, నిస్సత్త్వమగు.

కం. కడిమిం దాకిన యుంపడిఁ,బడు గడిచిన భంగి యైనబమ్మటితోడన్, సుడివడుచు నుండి కొండొక, దడవునకున్ దెలిసి నిలిచి తాలిమికలిమిన్. భా. రా. సుంద. 29.

సీ. అనికంబు వీఁడు వాఁ డనక యెక్కఁగ వేల్పు, లేమఁగునకు వీపుగూనుబోయె, వరుసలు పెట్టి దువాళించ సుడివడి, వెలిమావు మోపదు వెనుక కాలు. వరాహ. 10. 16. ప్రా.

9. తిరుగు, వెనుదిరుగు.

ద్వి. సుడివడ కెగరక పొలయక జడు, వడక వెక్క డక తప్పక జారుపోక. పండితా. దీకా. 61.

వ పెకవినవువికరి యసురవరు కరాంగుళంబులు దెగనడిచె నడిచిన సుడివడక మదముల తాటించిన. మను. 4. 115.

కం. నీచత్వమునకు దోయక, చూచిన నరులెల్ల వేఁడి సుడివడక కదున్, యాచన చేసి పదార్థ ము, గోచరముగ సంగ్రహించుకొని వచ్చెనెవన్. చంద్ర రేఖా. విలా. 1. 56.

10. చెడు; నశించు.

సీ. చెరువు గట్టించిన శెట్టిధర్మం బెల్ల, సుడివడ కుండంగ నడుపుతల్లి. ద్వా. 4. 146. ప్రా.

కం. వి కర్మంబున విభుఁడగు, శ్రీకంఠుని యోగము మయునిచే సుడివడియెన్ పైకుంఠుఁ దేవిధంబునఁ, గై కొని తత్క్రియ చక్కఁగా నొనరించెన్. భాగ. 7 స్కం. 389.

సుడివఱచు వ. క్రి. √సుడివడు. సుడివడఁజేయు.

వ. తనవారి గ్రోలినవారి జఠరగోళంబులం గల నకల రోగంబు లిట్లు సుడివఱతు ననుచుందంబునం దంతరాంతరంబులు పొచ్చి సింహ శరభ శార్దూ లాదిమృగంబుల సుడివఱచుచు. వరాహ. 10. 62.

సుడివాలు వి. చక్రాయుధము.

సీ సుడివాలుచిందంబు వదరఁ బూనినవాని. శ. ర. అచ్చు. కాలకాం. 62.

సీ. తెల్లదేవరాజు సుడివాలు కేలునఁ దనరిన యొదయ. ప్రబం. 1. 216.

సుడివా(ల్దా) లు దా (ల్పు) లుపు వి విష్ణుమూర్తి.

కం. సుడివాలుదాల్పు నడుగునఁ, బొడమిన పెన్వెల్లి దంని పొలుపొందఁ గ నక్కడ గుహుఁడని యొకు చెంచుల, యొదయనిఁ బొడగాంచి వాని యొద్దికి వలనన్ అ రా. అయోధ్యా. 100 ప్రా.

మ ...నీ కిప్పుడా,సుడివాల్దాలుపుకన్న వేలు కలకే చుట్టంబు లేవంకలన్ నీలా. 1. 90. ప్రా.

సుడివాల్దొర వి విష్ణువు.

కం. వలమురి సుడివా,ల్దొర వంటి యొప్పుగల దే వంజాణయ మీనుఖాన వలపుల కేఁడా! యయా. 5. 1.

సుడివోవు అ. క్రి. (సుడి+పోవు) చెడు, నశించు, సుడివడు.

సీ. ప్రవిమల కుసుమ సంపద యెల్ల సుడివోయి, రూపు దక్కిన మహీరుహము భంగి. మార్క. 1. 168. ప్రా.

సుడిసుడిగొను వ. క్రి. = మిక్కిలి సుడిగొను; మిక్కిలి తిరుగుడువడు.

కం. వీఁక చెడి ఘనగదాహతిఁ, దోఁకయుఁ గద లింపలేక దున్నపోతిడన్, మోఁకలిలఁ బడియె నేలను, సోఁకోర్వక దిగ్గజాలు సుడిసుడి గొంచున్. భాగ. 8 స్కం. 661.

కం. సుడిగాలి వచ్చి నిన్నున్, సుడిగొన కొనిపోవ మింట సుడిసుడి గొనుచున్, జెడఁ గడరెడి నా ముద్దులఁ కొడుకా! భాగ. 10 స్కం. 268.

సుడిసుడులుగట్టు మిక్కిలి సుడులుకట్టు; అవిచ్ఛిన్నముగా ప్రవరించు.

గీ. కన్ను వెన్నవకుండఁ జీకాకువఱచె; సుడిసుడులుగట్టి యగ్గుండ్ల పోసవాన. రంగా. 3. 90.

సుడుము వి. 1. కంటకాది ఖారము; కంప తొడుగు. విత్తనములు చల్లిన పిదప చేను చదును చేయుటకై యీడ్చెడి కంప. 2. నూలు గొత్తెల గుంపు. శ. ర.

సీ. ... తొడుగట్టి యీడిక సుడుము కంప, యవ దనర్చును గంటకాది ఖారము ... ఆం. భా. 2. 38.

సుత సం. వి. ఆ. స్త్రీ. కుమార్తె.

సుత దే. అవ్య. ప్రభృత్యర్థకము; మొదలుకొని (ఆది సుత; నాటి సుత మొ.) శ. ర.

సుతంగముఁడు సం. వి. అ. పుం. పుత్రుని గన్న తండ్రి.

సుతంత్రి సం. విశే. (ఇ. ఈ. ఇ.) 1. మంచి తీగెలు గలది; 2 శ్రుతి రమ్యమైనది

సుతనువు సం. విశే. 1. అందమైన శరీరము గలది. 2. సుకుమారమైనది. 3. సన్ననిది; కృశించినది.

సుతనువు సం. ఉ. ఈ స్త్రీ సుందరి, కోమలి.

సుతపము సం. విశే. స్. 1. తీవ్రమైన తపస్సు చేయువది. 2. మిక్కిలి వేడి గలది.

సుతపము వి. స్. న. తీవ్రమైన తపస్సు.

సుతపుఁడు సం. వి. స్. పుం. 1. తాపసుఁడు; యోగి, సూర్యుఁడు.

సుతమామ్ సం. అవ్య. 1. సర్వాతిశయముగా 2. సర్వోత్తమముగా.

సుతము సం. విశే. (అ. ఆ. అ.) 1. ఉత్పన్నము; జనితము. 2 పిండఁబడినది. 3. పోయఁబడినది.

సుతము సం. వి. అ. న. సోమరసము.

సుతరామ్ సం. అవ్య. 1. మిక్కిలి మేలుగా. 2. గుణోత్తరముగా. 3. బొత్తిగా; పూర్తిగా. 4. ఫలితముగా, పర్యవసానముగా.

సుతర్దనము సం. వి.అ. పుం. కోకిలము.

సుతలము సం. వి. అ. న. 1. అగాధత్వము. 2. సప్త పాతాళములలో నొకటి. 3. మందిరము యొక్క ఆధారబంధము, మూలబంధము.

సుతవస్కర సం. వి. ఆ. స్త్రీ. ఏడుగురు బిడ్డల తల్లి.

సుతశ్రేణి సం. వి. ఈ. స్త్రీ. ఎలుక చెవి, మూషకపర్ణి (వృ. వి.).

సుతారము విశే. (హిం. సుతార్) సుకుమారము, శ్రేష్ఠము.

కం. అర లేక చుక్క తెలఁగున, మెఱయు సుతారంబు మేలిమి నిట్టునలై. రత్నపరీక్ష. 49.

గీ. తళుకు లీను సుతారపు ముత్తెముల పెద్దచొకట్లు చెక్కులఁ జొకళింప. శ్రీరంగ. 10. 112.

సుతారి వి, సురంగము త్రవ్వెడి సాధనము.

శా. జెట్టిం జీమలు బట్టినట్లపుడు నిశ్రేణుల్ శిరస్త్రాణముల్, కట్టుంగోలలు పాఱచిప్పలు సురంగంపున్ సుతారుల్. రంగా. 3. 60.

సుతాళము వి. అతిశయము.

గీ, రాగమా యిది మది కనురాగ మనుచు ...... తాళమా యిది రతికి సుతాళమనుచు. కవిరా. 497 పొరట.

సుతి వి. (సం. శ్రుతిః) కంఠస్వరాదులకు సహాయమగు తంతి లోనగు వాని ధ్వని.

తే. గీ. తొలుత సుతికోయిల యొసంగరో దగోర, వంక కాళము లుగ్గడింపంగ నెమలి, సకియ పటి యింప మరునాట్యశాలలిల, పంతువగఁ బొల్చు కేళీ గృహాంతరమున. ప్రబం. 1. 768.

ఉ. వెన్నెల రాచశాచలువ విప్పుట రంగులఁ జేరి జాలువా, కిన్నర లూని జాను తిలకింపఁగఁ బాటలు వాడు బానవా,ల్కన్నియమిన్న గాణలకు గాట ముగా సుతు లిచ్చు వచ్చుటన్, గ్రొన్నన కమ్మ దేని యలు గ్రోలుచుఁ దుమ్మెద బోటి కూటువల్. అ. రా. బాల. 120.

సుతిగూడు = సుతి కూడునట్లు చేయు, శ్రుతి గలుపు.

కం. గానము సొబగుల పోనై, తేనెలవానై సరస్వ తీకరవీణా, తానవుటక్కై యమృతవి, తానము తానై తగును సుదతి సుతిగూడన్. రాజవాహన, 4. 108.

సుతిగూరుచు(ర్చు) = సుతి గూడునట్లు చేయు.

సీ. నారదసుతిఁ గూర్పనేరవు నీవు తెమ్మని వీణె టుంగు టుంగునను మీటు. దశా. 4. 119.

సుతిమీటు = సుతి యేర్పడునట్లు తీగ మీటు.

వ. ప్రియుండు పని డిదండియఁ బాని సుతి మీట విభుని చెంత వసియించి చిన్ని కిన్నెరం బాని పంచ చర దేవతా విజయ ప్రపంచ సముచితంబు లగు నూతన గీతంబులు పలికించి. చంద్రికా. 4. 107.

సుతి సం. వి. ఇ. స్త్రీ. సోమరసము పిండుట.

సుతి సం. వి. న్. పుం. సంతానము గలవాఁడు, తండ్రి.

సుతికాఁడు (√సుతి) వి. సుతి వేయువాఁడు.

సీ. ... సుతికాఁ డవంబను శ్రుతి విధాయి. ఆం. భా. 2. 287. ప్రా.

సుతి_త్తము సం. వి. అ. పుం. పగడపు చెట్టు (వృ. వి.). (Coral Tree)

సుతిని సం. వి. ఈ. స్త్రీ. సంతానము గల స్త్రీ; తల్లి.

సుతీక్ష్ణదర్శనుఁడు సం. వి. అ. పుం. శివుఁడు.

సుతీక్ష్ణము సం. విశ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి కార మైనది. 2. మిక్కిలి పదునైనది. 3. మిక్కిలి బాధ కలిగించునది.

సుతీక్ష్ణము సం. వి. అ. పుం. శిగ్రు వృక్షము (వృ. వి.).

సుతీర్థుఁడు సం. వి. అ. పుం. 1. మంచి గురువు. 2 శివుఁడు.

సుతుంగము సం. విశ. అ. ఆ. అ. మిక్కిలి ఎత్తయి నది.

సుతుంగము సం. వి. అ. పుం. కొబ్బరి చెట్టు (వృ. వి.).

సుతుఁడు సం. వి. అ. పుం. 1. కొడుకు. 2. రాజు.

సుతేజము సం. విశ. స్. 1. మిక్కిలి పదునైనది. 2. మిక్కిలి ప్రకాశించునది. 3. మిక్కిలి శక్తి గలది

సుతేజుఁడు సం. వి. స్. పుం. సూర్యుని ఆరాధించు వాఁడు.

సుత్తడువు వి. గజశాల మొ. నిర్మించుటకు పాతెడు మేకు.

కం. నేలల సుత్తడవులతోఁ, గీలిత శృంఖలములైన కీలకములతో, వాలానంబులతో గజ, శాలలు ప్రథ వించె వటివిశాలలు పెక్కుల్. వరా హ. 4. 118.

సుత్తి = సుత్తె వి. 1. చిన్న సమ్మెట, కంచరి మున్నగువారి పనిముట్టు. మట్న కన్ను సుత్తి, అడ్డ కమ్ము సుత్తి, బొద్దు సుత్తి, గుబ్బసుత్తి, మునిసుత్తి. ఆం. భా, 2. 298.

వీని భేదములు = పొడసుత్తి, పెద్ద సుత్తి, జాతి సుత్తి. మూరకవి తిట్టు కంసాలి సుత్తి పెట్టు. (చాటువు)

సుత్తె = సుత్తి వి. రాగలి మీఁద బంగారు లోనగు వాని మంచి సాఁగఁగొట్టెడు సాధనము, చిన్న సమ్మెట, అల్పసంఖ్య.

చం. కమలము కట్లసంచి యొరగల్లును గత్తెర సుత్తె చీర్ణముల్, ధమనియు శ్రావణంబు మొల శ్రాసును బట్టెడ నీరుకాయకా,ణము వలుకారు మూన బలువాజె పరీక్షల మద్యులాదిగా సమరఁగ భద్రకాంక సమావ్యాయుఁ డొండొక డుండు నప్పు డిన్. హంస. 2. 181.

సీ. సు త్తెవాటుల వారు వెత్తని పొమ్ము సొం పల రించె నెవ్వాఁడు పాంబునకును. రాజవాహన. 1. 9. ప్రా.

తే. గీ. బాలఁతికుచయుగళంబుతోఁ బోరుటకును, గాదె చక్కని పొవన్న కలశతులు, నొక్కులై చిక్కుపడి రాలఁ దుక్కపట్టి సుత్తె పెట్లకు లోనయ్యెఁ జోద్యముగను. సీతా. 2. 128.

సుత్య నం. వి. ఆ స్త్రీ 1 సోమలతను కొట్టి పిడుచుట, సోమపానము 2. స్నానము.

సుత్రాముఁడు నం. వి న్. పుం. ఇంద్రుఁడు.

సుత్వుఁడు నం. వి న్. పుం యజ్ఞము నందు సోమ లతను కొట్టి పిడిచినవాఁడు. (శ. ర.)

సుద తు. వి. కొన, అగ్రము.

సీ. సొగటాలపైఁ గోర్కి సుదకు వచ్చిన యంత వింతమాటల గాంవింపనేస్తు. నిరం. 2. 83.

సుద విశ. చివరిది. కడపటిది.

సీ. ఇటు చేసి తేజీల నెరయు మిన్నుల తేరి జోదు పుట్టినకొండఁ జూచినాఁడ, నిటునేల తేజేం కెటు కైన చెంగావి సుదసంజఁ దగుకొండఁ జూచినాఁడ. వరపథూ. 5. 22.

సీ. అధిపుమై ముద్రింవ వనియు వేలాక రామ, సుదగోళ్ళఁ గుసుమముల్ చిదిమితెచ్చు. కవి 6. 65.

సుదకొమ్మ = కొమ్మ కొన.

ద్వి. మనమున నెదిరించి మగ కోకిలములు, ముకుళ ల తెక్కలు మురువుగాఁ దీర్చి, చొక్కంపు లేమావి సుదకొమ్మ లెక్కి నవనాథ. 1. 12 పు. 2 పం.

సుదంతము నం. వి. అ. న. వేత్రము, వేపబెత్తము.

సుదంతి నం. వి. ఈ. స్త్రీ. వాయవ్య దిగ్గజము యొక్క భార్య.

సుదంతుఁడు నం. వి. అ. పుం. నటుఁడు.

సుదక్షిణ నం. వి. ఆ. స్త్రీ. దిలీప మహారాజు భార్య.

సుదక్షిణము నం. విశ (అ. ఆ. అ.) 1. హృదయ పూర్వకమైనది. 2. వదాన్యమైనది. 3. మంచి దక్షిణ గలది (యజ్ఞము).

సుదతి నం. వి. ఈ. స్త్రీ. మంచి దంతములు గల స్త్రీ.

సుదర్శన నం వి ఆ స్త్రీ. 1. అందగత్తె, 2. స్త్రీ 3. ఆజ్ఞ. 4. ఒక ఓషధి (వృ. వి)

సుదర్శనము నం. విశ. అ. ఆ. అ. 1. అందమైనది 2. సుఖముగాఁ జూడఁగలిగినది.

సుదర్శనము నం. వి. అ. పుం విష్ణుచక్రము పేరు.

సుదర్శనము నం. వి. అ. న. 1. అమరావతి. 2. జంబూద్వీపము. 3. మేరు పర్వతము వందలి నేరేడు (వృ. వి).

సుదర్శనుఁడు నం. వి. అ. పుం. 1. శివుఁడు. 2. మేరు పర్వతము. 3. రాబందు.

సుదానము నం. వి. అ. పుం. 1. మేఘము. 2. పర్వతము. 3. సముద్రము. 4. ఐరావతము.

సుదాయము నం. వి. అ. పుం. 1. శుభప్రదమైన కానుక. 2. పెండ్లి యందు అల్లునికి, ఆడుబిడ్డకు నిచ్చెడి అరణము.

సుదినము నం. వి. అ. న. 1. మంచిరోజు. 2. మబ్బు లేని దినము,

సుదీర్ఘము నం. విశ. అ. ఆ. అ. మిక్కిలి పొడవైనది.

సుదీర్ఘము నం. వి. ఆ. స్త్రీ. ఒక విధమైన దోసకాయ,

సుదుర్లభము నం. విశ. (అ. ఆ. అ.) అరుదైనది. బొత్తిగా లభింపనిది.

సుదూరము నం. విశ. అ. ఆ. అ. 1. మిక్కిలి దూరమం దున్నది. 2. ఎక్కువ దూరము.

సుదృక్కు నం. విశ. అందమైన కన్నులు గలది. వివేకము గలది.

మ. గురు విద్వేషికి ... పికస్వరముం బంచమ శబ్దమిందుకు సుదృగ్జాలంబు రాఁ జెల్లునే ? వసు. 3. 124,

సుదృక్కు నం. వి. స్త్రీ. అందమైన కన్నులు గల స్త్రీ.

సుదృఢము నం. విశ. (అ. ఆ. అ.) మిక్కిలి గట్టిది మిక్కిలి బలమైనది.

సుద్ద శుద్ధమృత్తిక, తెల్లమట్టి.

సీ... శుద్ధమృత్తిక, యొప్పు సుద్దయం చన మీఱు, బంకమ న్ననఁగఁ గుంభకఁమృత్తు. ఆం. భా. 2. 5. వ్రా.

సుద్దంతట్టుట వి. కమ్మరి క్రియలో నొకటి.

(నెల్లూరు తిరుపతి దత్తమండలముల వాడుక)

సుద్దగించు అ. క్రి. కమసాలి. బంగారు లోవగు వానిని సుత్తెపిడితో మిట్టపల్లములు లేకుండఁజేయు.

చం. కరఁగను లోతపోయఁగను గ్రాఁచగ దించను గమ్మ్రీదియఁగా, నొరయఁగ వన్నియల్ మిగుల నుండఁగఁ జూఁపఁగ బాదెగట్ట జే, కరయఁగఁ దీర్పఁ జెక్కఁబడి యచ్చువవేయఁగ సుద్దగింవగా సారిదిని జిత్రచిత్రముగ సొమ్ములు నేయ నతండు నేరుచున్. హంస. 2. 182. వ్రా.

సుద్దము విశే. నిర్మలము. (సం. శుద్ధమ్) (త. సుత్తమ్)

సీ. నిడుదచేతులవాఁడు నిద్ద పుటద్దంపు నెఱిచెక్కు జోటివాఁడు, అ. రా. సుందర. 88.

సీ. మక్కు మాసివదినా మలివంబు విలసిల్లు, సుద్దమం చనఁగను శుద్ధ మొప్పు, ఆం భా. 3. 25. వ్రా.

సుద్ది[1] వి. సల్లాపము, ముచ్చట.

ఉ.... మునిదారులతోఁదగ సుద్దులాడుచున్, నిద్దపు వేడ్క.... దశా. 6. 88.

సామెత (సం. శ్రుతిః).

సీ. ప్రజలఁ గాననివాని పాయసం బనుసుద్ది తునుమ వాదృష్టి యంధునకు నిచ్చి ... రాజవాహన. 1. 38.

గీ. అబాలగోపాల మైనసుద్ది వగవారి వగవారు చుట్ట లగుట. కాశీ. 5. 292.

3. నుడి. మాట, (స. సూక్తి).

ద్వి. సుధ లొల్కు తియ్యని సుద్దులవాని, బుధులకు హితవాత్మఁ బూనెడువాని. రం. రా. అయోధ్యా కాం. 84. పు. 13. పం.

ఉ. ఇప్పటి నీతలంపు తెఱఁ గిట్టిదయా నిటమీఁద నెప్పు డే, చొప్పున నుండునో నిజము సుద్ది యొకుం గము. శృం. నై. 2. 67.

కం. ...పె, న్నదుల మద్దుల ముద్దుల సుద్దుల కాల కుఁడు ద్రొచె జోడఁ బడఁగన్. వి. పు. 7. 18.

4. వృత్తాంతము, వార్త.

సీ. నిషధదేశపు విప్ర నికరంబు పూజించి యలయక ప్రియుసుద్ది యడుగఁ దలచు. శృ. నై. 1. 74.

వ. ఇట్లు గావించి యక్కరువలిపట్టి క్రమ్మఱ యక్కొమ్మ చేతిగుఱుతు గొనివచ్చి ముద్దియ సుద్ద విడి వెలిఁగించినం బొంగి రాముం డతని గౌఁగిటం జేర్చి గరవించి యుడుగఁ రిచ్చి యనిచిన. యయా. 3. 27.

5. ప్రసంగము.

తే. స్వామి యుత్తరపథిక పాశ్చాత్యు లెల్ల, వేద ముల సుద్ది మొదలంట విడిచిరి. ప్రబోధచం. 2. 46.

6. జాడ.

తే. గీ. అందు వేశ్యాగృహ బున హైమపాత్రఁ, గన్న యగసాలిబత్తుఁ డాగిన్నె సుద్ది, నేకతంబునఁ దలవరి కెఱుకచేసి, చనియె ఘనమైన మెచ్చు గైకొని ముదమున. వైజ. 4. 76.

కం. ఆకన్నప్రతిమసుద్దులు, మాకు మునుపు కలిమి జేసి మహనీయ తదీయాకృతి పొలుపంతయు, భవ దాకృతి గని యతండ యనుకొంటి మొగిన్. ప్రభా. 2. 104.

సుద్ది[2] (సం. శుద్ధిః. క సుద్ది. త. చుద్ది) విశే. ధౌతము. శుచియైనది.

సీ.... అద్దేవి దర్శింప నమఁగుఁజెలులఁ గెడఁగూడి కన్నియ పడుచనై యొకవాఁడు నీరాడి కడుసుద్ది చీఁగట్టి. చమత్కా. 2. 12.

సీ సుద్దిగా మన్నాను సుదతి ముట్టకు మన్న గబ్బి గుబ్బలగ్రుమ్మి కౌఁగిలించు. రాధికా. 3. 127.

సీ. సుద్దిగమన్నాను వద్దుర మైత్రావాల, వలిన బంగా రాన కంటుగలదె. అహల్యా. 4. 211. వ్రా.

సుద్దిగాఁడు పరిశుద్ధుఁడు.

అటువంటి సుద్దిగాఁడు కాడటందువు. శుక. 1.

సుద్దిచేయు స. క్రి. శుద్ధిపఱచు.

సుద్దులకత్తె వి. మాటకారి, మంచిమాటలు చెప్పునది.

ఉ. సుద్దులకత్తెయై యొచటఁజూచిన నేచి చరించు
నేరికిన్, బుద్దులు చెప్పరాను వలుకోఁకలు కోవఁ
దొడంగు నంచు నో, వద్దను బాయకుండి తలవాఁకిలి
దాఁటఁగనీక వాలి నే, ప్రొద్దున గాచు క్రొంబసిఁడి
బొజ్జగురున్నను బ్రస్తుతించెదన్. (ఇచట ప్రకరణ
మునుబట్టి వాగ్దేవత యని యర్థము వచ్చును.)
ఉత్తర హరివం. 1. 6.

సుద్దులకన్నె వి. సరస్వతి.

ఉ. సుద్దులకన్నె కన్నుఁగవ చొక్కపుటెక్కులు మోవి
నొక్కమై, ముద్దిడువేళ మోవికిని మోవికొలంతఁ
దలంచి వేలుపుం, బెద్దకుఁ బంచవక్త్రి గని పెంచిన
మేటికి పంచవక్త్రి వౌ, దద్దిర యంచు నవ్వు చతు
రాస్యుఁడు మాకుఁ జిరాయు వీవుతన్. రాజ
వాహన. 1. 3.

సుద్దులకుమారుఁడు (ళ్ళు) వి. (బ)? గొల్లసుద్దులు
పాడువారు ?

వ. పరిహాసకులు సుద్దుల కుమాళ్ళు కొమ్మూ్మరి
దాసళ్ళు తవిరుదాసళ్ళు .... హంస. 3. 29,

సుద్దులమారి వి. అడిబంద, వాదాలుఁడు, ప్రేలరి.

సీ. వలువిత్తు వలుగాకి ప్రాడ్వాకుఁ డుచ్ఛిష్ట మొందు
సుద్దుఁమారి యుకిపికట్టె. హంస. 5. 113.

సుద్దులాడు అ. క్రి. (సుద్దులు+ఆడు) మాటలాడు

సీ. పోరోగిరవు జడదారిఁ గాంచిన వేల్పు పెద్ద
ముద్దియతోడ సుద్దులాడి. సేతుపం, 1. 6, పుట.
తాళపత్ర.

సుధ నం. వి. అ. స్త్రీ. 1. అమృతము. 2. పాలు.
3. సున్నము. 4. జెముడు (వృ. వి.). 5. దాఁగ
(వృ. వి.). 6. ఇటిక. 7. రసము. 8. తేనె.
9. మెఱవు తీఁగ.

సుధన్వుఁడు నం. వి. న్. పుం. 1. మంచి విలుకాఁడు
2, ఆదిశేషుఁడు. 3. విశ్వకర్మ.

సుధర్మ నం. వి. న్. పుం. వి. అ. స్త్రీ ఇంద్రుని సభ

సుధర్ముఁడు నం. వి న్. పుం. ధర్మములను చక్కఁగా
నిర్వర్తించువాఁడు,

సుధాంగుఁడు నం. వి. అ. పుం. చంద్రుఁడు.

సుధాంశువు నం. వి. ఉ. పుం. చంద్రుఁడు. కర్పూ
రము.

సుధాకరుఁడు నం. వి. అ. పుం. చంద్రుఁడు.

సుధాజీవి నం. విశే. న్. పుం. సున్నపు పనివాఁడు;
గోడ కట్టువాఁడు.

సుధానిధి నం. వి. ఇ. పుం. చంద్రుఁడు. కర్పూరము.

సుధాపాణి నం. వి. ఇ. పుం. ధన్వంతరి.

సుధాభిత్తి నం. వి. ఇ. స్త్రీ. 1. సున్నముచేసిన గోడ.
2. ఇటుకగోడ. 3. అపరాహ్ణమున బదవ
ముహూర్తము.

సుధాభుక్కు నం. వి. క్. పుం. దివ్యుఁడు, దేవత.

సుధాభృతి నం. వి. ఇ. పుం. 1. చంద్రుఁడు.
2. కర్పూరము. 3. యజ్ఞమందలి బలి.

సుధాయిన దే. వి. ఒక స్వరస్థాయి.

ద్వి. నిగిడిసుధాయిన నిగితంబు ... ఆదిగా సొగయు
తాయములు. బస. పురా. 71 వు. 11 వ.

సుధారత్నము నం. వి. అ. న. ముత్యము.

సుధావర్షి నం. వి. న్. పుం. 1. బ్రహ్మ.
2. చంద్రుఁడు. 3. కర్పూరము.

సుధావాస నం. వి. ఆ. స్త్రీ. ఒక దినుసు దోస.

సుధామూతి నం. వి. ఇ. పుం. 1. చంద్రుఁడు.
2. యజ్ఞము, 3. కమలము.

సుధాస్రవ నం. వి. ఆ. స్త్రీ. చిఱువాలుక, కొండ
నాలుక.

సుధాహరుఁడు నం. వి. అ. పుం గరుత్మంతుఁడు.

సుధితము నం. విశే అ. ఆ. అ. 1. దృఢము,
పూర్ణము. 2. మంచిది దయగలది. 3 సుఖము
గలది, సమృద్ధమైనది. 4. చక్కఁగా గుఱిపెట్ట
బడినది (బాణాది).

సుధితి నం. వి. ఇ పుం. గొడ్డలి.

సుధీ నం, విశే. ఈ. మిక్కిలి తెలివి గలది.

సుధీ నం. వి. ఈ. పుం. మేధావంతుడు, విద్యా
వంతుఁడు.

సుధీ నం. వి. ఈ, స్త్రీ. మేలయిన మేధాశక్తి.

సుధోద్భవుఁడు సం. వి. అ. పుం. ధన్వంతరి.

సుధ్యుపాస్య సం. వి. అ. స్త్రీ. 1. పార్వతి. 2. పార్వతి చెలికత్తె. 3. స్త్రీ. 4. ఒకరంగు పదార్థము.

సుధ్యుపాస్యము సం. వి. అ. పుం. రాజప్రాసాదము. వి. అ. న. బలరాముని గద.

సుధ్యుపాస్యుఁడు సం. వి. అ. పుం. శ్రీకృష్ణుని పరిచారకుఁడు.

సుధూమ్రవర్ణ సం. వి. అ. స్త్రీ. అగ్నిదేవుని సప్తజిహ్వలలో నొకటి.

సునయన సం. వి. అ. స్త్రీ. 1. అందమైన కన్నులు గల యాడుది. 2. ఆడుది.

సునయనము సం. వి. అ. పుం. హరిణము, లేడి.

సునయము సం. వి. అ. పుం. 1. సత్ప్రవర్తన. 2. మంచి యాశయము, మంచి విధానము.

సునాభము సం. విశే. (అ. ఆ. అ.) 1. మంచి బొడ్డు గలది. 2. మంచి కేంద్రము గలది.

సునాభము సం. వి. అ. పుం. 1. సత్వరము. 2. మైనాక పర్వతము. 3. తెల్లగినియ. (వృ. వి.) (శ. ర.)

సునామణి హిం. వి. చదివి వివిపించుట.

సునాయాసము విశే. మిక్కిలి సులభము

శా. ఆరామంబులు పెక్కు గల్గను సునాయాసంబుగా నేచి. విక్ర. 1. 97.

సునారము సం. వి. అ పుం 1. కుక్క పొదుగు. 2. పాముగ్రుడ్డు. 3. పిచ్చుక.

సునావము సం. వి. అ న. నౌకాయానమునకు యోగ్యమైన జలము.

సునాసీరుఁడు సం. వి అ పుం. ఇంద్రుఁడు.

సునిభృతము సం. విశే. (అ ఆ. అ.) ఏకాంతము, దృఢము, రహస్యము.

సునిశ్చలుడు సం, వి. అ పుం. శివుఁడు

సునిషణ్ణకము సం. వి. అ. న. నీరుచెంచలి. (వృ. వి )

సునీతము సం. విశే. (అ. ఆ. అ ) 1. మంచి నడవడి గలది 2. నాగరకము, మర్యాదకలది.

సునీతము సం. వి. అ. న. 1. సత్ప్రవర్తన. 2. సన్మార్గము, మంచిపద్ధతి, వినయము.

సునీతి సం. వి. అ. స్త్రీ. 1. సత్ప్రవర్తన. 2. యోగ్యత. ఔచిత్యము. 3. సన్మార్గము, సదాచారము. 4. ధ్రువునితల్లి పేరు.

సునీథము సం. విశే. (అ. ఆ. అ.) 1. మంచిది, యుక్తమైనది 2. ధార్మికము, సుశీలము.

సునీథుఁడు సం. వి అ పుం. 1. బ్రాహ్మణుఁడు. 2. శిశుపాలునిపేరు (?) 3. మంచినాయకుఁడు. (వైదికము).

సునీల సం వి అ. స్త్రీ నారపీచు, గోగునార.

సునీలము సం. విశే. అ. ఆ అ. నల్లనిది, నీలమైనది.

సునీలము సం వి అ. పుం. దానిమ్మచెట్టు. (వృ.వి.)

సునీలము సం వి అ. న నీలమణి

సున్న వి. (సం శూన్యమ్) (ప్రా. సున్న. సుణ్ణ.) అనుస్వారము, బిందువు. ఇది నిండుసున్న యరసున్న యని ద్వివిధము

తే. గీ.... మానధైర్యము లున్న లనుచు, సుదతి కోంట్లకుఁ ద్రవప్రాసి చూపెననఁగ. ఆము. 5. 154.

ఉ. కన్నులు దీర్ఘముల్ నగుమొగం బవురా తలకట్టు తమ్మివూ, వున్నమచందమామలకుఁ బొక్కిలి చక్కఁదనంబు, చెప్పఁగా నున్నదె మేబులంతులు పయోధరముల్ మఱి కౌనుసున్నయా, వెన్నిక కెక్కు బ్రాతఫలమిన్వరవర్ణినికి న్నిజంబుగన్. విజ. 2. 104.

2. అంకెలలో శూన్యస్థానము దెలుపు వర్తులరేఖ. సారంగ. 2. 5.

అ. అధ్యుఁడొక్క డున్న నందఱు పూజ్యులే లెక్కమీఁద సున్న లెక్కనట్లు, అతఁడు పోవువెనుక నందఱుఁ బూజ్యులె. లెక్కచెంత సున్న లేఁగినట్లు. బ్రౌ.

సున్న విశే. (సం. శూన్యమ్) లేనిది. శూన్యము.

ఉ. ... ఎవ్వనిం, జూచిన నల్పమానవుఁడు సున్న తదీయ పదస్యకోటలోన్. విక్ర. 5. 128.

కం. వలపువటవావులా వహి, యలవత్యము సున్న

తలఁపు లక్ష్మణార్యుల్.

చం. కపటము లేద సంగముఖంబున నోట పాలకిక్క యెట్టిదో, కృపణవిధంబునాస్తి నహి కిల్బిషవర్తన మిల్ల కల్ల యెల్లప్పుడును సున్న తన్న తయహంకరణం బెటువంటిదో కదా, కుపితవిరోధి హర్త యగు గొబ్బూరి తిమ్మ నృపాలమౌళికిన్. రామా. 146.

**సున్నగిల్లు** అ. క్రి. గుంద్రనగు.

**సున్నగు** (సున్న + అగు) అ. క్రి. సున్నయగు, శూన్యమగు, క్షీణించు, తగ్గు.

ఉ. అన్నము లేక యుండిన లయం బగు దేహము రక్తమాంసముల్, సున్నగునింద్రియస్ఫురణ శుక్ల మదాతిశయంబు దూరమౌ, వన్నెల మీఁద ప్రేమ చెడు సచ్యుత నీవయి నిల్పు మానసం, బెన్నటికైన జ్ఞానులకు హెచ్చు దరిద్రతపాటియే సిరుల్. కుచేల. 8. 58.

కం. అన్నవఁ గనమూయుట రొద, సన్నగిలుట. గాఁగిలింత సడలుట నేర్పుల్, సున్నగుట వరూధినిరతి, కన్నెతనపు రతియుఁబోలెఁ గడునింపానఁ గెన్. మను. 3. 117.

**సున్నచుట్టు** అ. క్రి. శూన్యముచేయు, లేదను.

సీ. ఒకటి పంక్తిని వ్రాయుమూహ నేర్చినవాఁడె సున్న చుట్టక వ్రేలు చూపినావు .... భవ్యభర తుండ రాయన భాస్కరుండ. చాటుపద్య మణి మంజరి. 1వ భా. 80. పా.

**సున్నపుఁగాయ** వి. √ సున్నము. చూర్ణకరండము.

సీ ... సున్నపుఁగాయనాఁజూర్ణకరండ మౌ .... అం. భా. 2. 167.

**సున్నము** వి. (సం. చూర్ణమ్. ప్రా. చున్నం. త. చున్నమ్. క. సుణ్ణ. హిం. చూనా) ముత్తెము మొ. కాల్చిన తెల్లని యొక దినుసు పదార్థము.

కం. అ...భ్యున్నత సౌధము మీఁదను, సున్నము నిగుడించినట్టి జోడరుగులపై. భీమ. 2. 126.

సీ మేనఁ బొక్కులు పొక్క మెదియించి సున్నంబు మెత్తఁజెల్లునె మీకు మెలఁతలార! నీలా. 3. 34.

శా. ... తన షాంసము ద్రోయిన నేను బోవుదున్ మఱవక వేటఁబోవ జలమగ్నత గానది సున్నము. ఆము. 5. 61.

**సున్నమెత్తు** అ. క్రి. 1. శిథకై సున్నపుబొట్లు పెట్టు. 2. సున్నము చేయు.

వ. ... సున్న మెత్తుటయుం బొట్టుకారులం బట్టుట యు సౌధసౌవర్ణభూషణాది నిర్మాణంబు లయ్యెను. ఆము. 4. 1"8.

**సున్నసేయు** (సం. శూన్యమ్) శూన్యము చేయు.

చం. ఇలువడి సున్నసేసి హృదయేశుల సిగ్గులు వుచ్చి యత్త మామల నెరియించి. భాగ. 10 స్కం. పూర్వ. 9. 77.

**సున్ని** (సం. చూర్ణమ్) వి. చూర్ణము, బియ్యము మొ. పిండి.

ఉదా మినుప సున్ని. చెన్న. బ. 2. 72. చోడి సున్ని = చోడిపిండి అం. భా. 2 2:0 వ్రా

కం. కనుఁగొనిన మది కసహ్యత, దనికెడి యీ పాతసున్ని తగ నాకైదా, చివదానవె చాలు సుమా, యని మిగిలిన దచట మనిచి యతఁడేఁగెనెసన్. చెన్నబ. 2. 46.

**సున్నితము** విశే. కచ్చితము.

**సుపంథ** (సుపథిన్) సం. వి. న్. పుం మంచి దారి.

**సుపక్వము** సం. విశే. (అ. ఆ అ.) 1. చక్కఁగా వండఁబడినది. 2. చక్కఁగా పండినది.

**సుపక్వము** సం. వి అ. పుం. ఒక రకము మామిడి పండు.

**సుపత్ని** సం. వి. ఈ. స్త్రీ. మంచి భర్త గల స్త్రీ.

**సుపథము** సం. వి. అ పుం. 1. మంచి మార్గము, మంచి త్రోవ. 2. మంచి విధానము. 3. సత్ప్రవర్తన.

**సుపద్మ** సం. వి. ఆ. స్త్రీ నద పేరు.

**సుపర్ణ (ర్ణి)** సం వి. ఆ ఈ. స్త్రీ 1. పద్మముల సమూహము. 2. తామర కొలను 3. గరుడుని తల్లి పేరు.

**సుపర్ణము** సం. విశే (అ. ఆ. అ) 1. మంచి రెక్కలు గలది. 2. మంచి ఆకులు గలది,

**సుపర్ణుఁడు** సం. వి. అ. పుం. 1. గరుత్మంతుఁడు. 2. సూర్యకిరణములలో నొకటి. 3. దేవయోని విశేషము. 4. అప్రాకృతిక పక్షి విశేషము. 5 కోడి పుంజు.

**సుపర్యాప్తము** సం. విశే. (అ. అ. అ.) 1. మిక్కిలి విశాలమైనది. 2. మిక్కిలి యోగ్యమైనది.

**సుపర్వ(ము)** సం. విశే. (న్. ఈ. న్.) 1. మంచి కణుపులు గలది. 2 పెక్కు అతుకులు కలది.

**సుపర్వ(ము)** సం. వి. అ. పుం. 1. వెదురు. 2. బాణము. 3. ఒక తిథి (పూర్ణిమ, అమావాస్య అష్టమి, చతుర్దశి) 4. పొగ.

**సుపర్వుఁడు** సం. వి. న్. పుం. దేవత, వేలుపు.

**సుపా(ప్పా)ణి** వి. (సాం.ని. స్థా. 91) 1. ముత్యము.

తే. గొప్ప పాలుపమంచి సుప్పాణి కూర్పుదంపు, దంబు పగడంబు జగడంబు నంబరంబు, తెసఁగిన గుడార్లు గలుగు నవ్వనుమతికు పాళెమీకించి గజ రాజ భయము మించి. కృష్ణ. 3. 76.

చం. వడిగల కెంపుటారవల వింతపసల్ గల కాళి వజ్రపుం, గడియములున్ సుపాణులు చౌకాటపు చౌకశికట్టు వగ్గము ల్గదుఁ బ్రియమొప్ప నిచ్చి శుక. 1. 165.

2. శుభ్రమైన నీరు గల ముత్యము.

సీ. నలు వొందు నునుకుందనపు గంద మెరఁబూసి యొగిఁ బాణి సుప్పాణి యొంట్లు దాల్చి. లక్ష్మి. వి. 5. 4.

వ. చూచువారి పెదవులకు, జవు లొదవించు నాదెంపు టాణిసుప్పాణి ముంగురులు గలుగు జరాతి వహాంతకారులును. ప్రబం. 1. 78.

3. ముత్తెములం దుండెడి తళుకు ధాళధళ్యము.

ఉ. కోడి బలారికిన్ బలనిషూదనదత్తము లైన గొప్ప కట్టాణి సుపాణి యొంటు లలరారె. వసు. 5. 87.

తే. దాడిమీ బీజరాజి కెందళుకు మొల్ల, మొగ్గల విసాళమును ముత్యముల సుపాణి, తమ్మి పువ్వింటి గొలువున్న నెమ్మినడయు, దంతురాలక సుస్నిగ్ధ దంత పంక్తి. పాండురంగ. 3. 192.

తే ఈ వెం ది యొంపల్ పైఁడిలో చెలంది, ఈనె [illegible] బు లేనెలంత, యీ సుపాణి రద శ్రేణిచే సుపాణి యీ విటారు మృగిమద [illegible] [illegible]. వి. 1. 150.

**సుపార్శ్వము** సం. వి. అ. పుం. 1. ప్లక్షము. (వృ. వి. ) 2. ఒక విధమైన మేడిచెట్టు. (వృ. వి.) [illegible] పాతి పుత్రుని పేరు.

**సుపీతము** సం. వి. అ. న. పచ్చ ముల్లంగి.

**సుపీతము** సం. వి. అ. పుం. ఐదవ ముహూర్తము.

**సుపుంసి** సం. వి. ఈ. స్త్రీ. మంచి భర్త గల స్త్రీ.

**సుపుష్పము** సం. వి. అ. పుం. 1. శిరీషము. (వృ. వి.) 2. పగడపు తీగ.

**సుపుష్పము** సం. వి. అ. న. 1. లవంగము. 2. స్త్రీ రజస్సు.

**సుపుష్పి** సం. వి. ఈ. స్త్రీ. అరటిచెట్టు.

**సుపూరకము** సం. వి. అ. పుం. ఒక పుష్ప వృక్షము (వృ. వి.)

**సుపూరము** సం. విశే. (అ. అ. అ.) 1. తేలికగా నింపదగినది. 2. చక్కఁగా నిండినది.

**సుపూరము** సం. వి. అ. పుం. ఒక విధమైన నిమ్మ. (వృ. వి.)

**సుప్తము** సం. విశే. (అ. అ. అ.) నిద్రించినది.

**సుప్తి** సం. వి. ఇ. స్త్రీ. 1. నిద్ర. 2. తిమ్మిరి. 3. నిద్ర యందలి పథము.

**సుప్పనక** చుప్పనాక. వి. శూర్పణఖ.

తే.గీ. చని వెరపుమీఱ నొకయాకుఁ జవికె నచట, నిలుపుకొని పండ్లు దుంపలు నెలమిఁ దినుచు, మున్న చో నబ్బురం బొప్ప నొక్కనాడు, సుప్పనక యను రక్కస జోటి యొకతె. అ. రా. అరణ్య. 3.

**సుప్పనాతి** = చుప్పనాతి వి. శూర్పణఖ.

తే. గీ. అట్లు వాండ్రదు ముక్కు రడఁగిన వడలుచు సుప్పనాతి మిగులఁ బ్రుక్కి లంక, కరిగి తోడఁబుట్టు వగు రావణుని గాంచి, తన తెఱంగు దెలియ వినుచుటయును. అ. రా. అరణ్య. 15.

**సుప్పాణి** విశే. నీరు గల, ధాళధళ్యము గల.

వ. పోఁడగండి గొప్ప సుప్పాణి ముత్తెంపుఙాల తడంబులు. ఉ. రా. 1. 158.

వ. సుప్పాణి ముత్తియంపుఁ గ్రచ్చు టోవరులఁ గ్రచ్చుకొని. ఉ. రా. 6. 158.

సుప్రకాశము నం. విశ. (అ. అ. అ.) 1. స్పష్టమైనది, వ్యక్తమైనది. 2. బహిరంగమైనది, ప్రసిద్ధమైనది.

సుప్రతర్కము నం. వి అ పుం. ఉత్తమ నిర్ణయము, ప్రశస్తమైన తీర్పు.

సుప్రతిభ నం. వి. అ. స్త్రీ. 1. సారాయము.

సుప్రతిష్ఠ నం. వి. అ. స్త్రీ. 1. మంచి స్థితి. 2. కీర్తి, ప్రసిద్ధి. 3. స్థాపన, నిర్మాణము 5. ఐదవ ఛందము. 6. ప్రతిష్ఠించుట.

సుప్రతిష్ఠితము నం విశ. అ. అ. అ. 1. చక్కఁగా నెలకొల్పఁబడినది. 2. ప్రతిష్ఠచేయఁబడినది. 3. ప్రసిద్ధికెక్కినది.

సుప్రతిష్ఠితమునం. వి. అ. పుం. ఉదుంబరవృక్షము. (వృ. వి.)

సుప్రతిష్ఠాతము నం. విశ. 1. పరిశుద్ధము చేయఁబడినది. 2. పరిశోధింపఁబడినది. 3. నిర్ధారణచేయఁబడినది, అంతేరినది, సంపూర్ణజ్ఞానముగలది.

సుప్రతీకము నం. విశ అ. అ. అ. 1. ఒక చక్కని రూపముగలది, అందమైనది. 2. మంచి శరీరము గలది.

సుప్రతీకము నం. వి. అ పుం. ఈశాన్యదిక్కు నందలి యేనుఁగు.

సుప్రతీకుఁడు నం వి. అ. పుం. 1. కామదేవుఁడు. 2. శివుఁడు.

సుప్రపాణము నం. వి. అ. న. మంచికొలను.

సుప్రభ నం. వి. అ స్త్రీ. అగ్నిదేవుని సప్తజ్వాలలో నొకటి.

సుప్రభము నం. విశ. అ. అ. అ. మిక్కిలి కాంతి గలది, ఉజ్జ్వలమైనది.

సుప్రభాతము నం. వి. అ. న. 1. పవిత్రమైన ఉదయము లేక దినము. 2. తొలిప్రొద్దుపొడుపు, వేకువ, వేగుఁబోక.

సుప్రయోగము నం. వి. అ పుం. 1. ఒక చక్కని నిర్వహణము. 2. సన్నిహిత సంబంధము. 3. నైపుణ్యము, కౌశలము.

సుప్రసన్నుఁడు నం. వి అ. పుం కుబేరుఁడు

సుప్రసాదుఁడు నం. వి. అ పుం. శివుఁడు.

సుప్రియ నం. వి. అ స్త్రీ. 1. మనోహరి, అందగత్తె. 2. ప్రియురాలు.

సుప్రియము నం. వి అ. పుం. రెండు లఘువుల పాదముగల వృత్తవిశేషము.

సుఫల నం. వి. అ. స్త్రీ. 1. గుమ్మడి (వృ. వి.) అరఁటి. (వృ. వి.). 3. ద్రాక్ష. (వృ వి.). 4. వెట్టిపుచ్చ. (వృ. వి.).

సుఫలము నం. వి. అ. అ. అ. 1. మచిఫలము గలది.

సుఫలము నం వి అ పుం 1. దానిమ్మ. (వృ. వి). 2. రేఁగుచెట్టు. (వృ. వి.). 3. కర్ణికారము. (వృ. వి.). ఒకవిధమైన చిక్కుడు. (వృ. వి).

సుబంధము నం. వి. అ. పుం. నువ్వులు.

సుబలుఁడు నం. వి. అ. పుం. 1. శివుఁడు. 2. శకుని తండ్రిపేరు.

సుబా వి. (హిం. సుబా) 1. రాజ్యభాగము. రాష్ట్రమం దొకభాగము.

సీ. ప్రబలి సాహెబు సుబా యెంత యేలిన బేగంబు లకుఁ గుట్టుపోఁగులేను. వేణుగో. శ. 14.

శా. ఢిల్లీ పాదుషహా నియోగమున రూఢిన్ రాజరాజౌ నిజా, మల్లీ పేరిటి మేటి సాహెబు సుబా యాత్మం గళింగంబు రా, జల్లీలన్ ఘనుడా ఫరాసువకు మూసా బూసి యన్వాని కత్యుల్లాసంబున నాధిపత్య మొసఁగన్ యోజించి రావింపుచున్. రంగా. 1. 138.

2. మండలాధిపతి.

కం స్త్రీ బాల వృద్ధ జనములతో బహుకాలంబు నుండి నొంచవపుఁబసన్ కాబానిగాలు గొంటిమి మీ కోటి సుబాల వద్ద మే మలఁతులమే. రంగా. 1. 172.

మ. అధికారంబు వహించి వచ్చిన సుబాదామీఁద ఖావంద తెవ్విధినైన న్సరుకారు శిస్తు ఫణితిన్

విత్తము చిత్తంబు ప్రాణసౌఖ్యం. గొల్పక క్రోఁడు నేవనక మీరాకోట క్షేత్రపాలకన్, పథము ల్దప్పిన వల్కు వల్లఁగునే సాక్షాత్య లోకేశ్వరా' ఏంగా. 2. 74.

**సుబాంధవుఁడు** సం. వి. అ. పుం. శిష్టుఁడు.

**సుబాహువు(ఁడు)** సం. వి. ఉ. పుం. 1. మంచి బాహువులు గలవాఁడు. 2. మారీచుని సోదరుఁడు.

**సుబేదారు** వి. సేనాధికారులలో నొకఁడు.

మ. సమరోజ్జృంభిత శౌర్య ధుర్యులగు సార్జంతుల్ మయూరుల్ కుమేదములన్ వీరులు సోలు దారులు సుబేదారుల్ మొదల్గల్గు సైన్యముల. ఏంగా. 1. 147.

**సుబోధము** సం. విణ. (అ. ఆ. అ.) సులభముగా అర్థమగునది.

**సుబోధము** సం. వి. అ. పుం. 1. మంచి వార్త. 2. హితవు.

**సుబ్బనచూలి** వి. √సుబ్బు (సుబ్బన్ + అ + చూలి) ప్రకటితమగునట్లు చేసెడి కొల్లి, పెద్ద కొల్లి. (చూలి + చూలి = చుబ్బన చూలి. అని శ. ర.) జుబ్బనజూలి — జుబ్బునజూలి, — సుబ్బునసూలి అని బ్రౌ. జుబ్బనజూలి అని. చి ని. 'చుబ్బన చూలి' అని ముద్రితములు. ఈ పాఠములన్నియును వ్యుత్పత్తి శూన్యములగుట చేత పై విధముగా గ్రహింపఁబడినది.)

చం. ... రాము పెమ్మలుకుల పాలివార లయి మోహము సు(చు)బ్బన చూలి గాఁగ ... .... భా. రా. యు. 1453.

గీ. జరయుఁ దెవులును పగయును భీతియ నవఘ సుఖము లెప్పుడుఁ జు(సు)బ్బన చూలులు ... ... మార్క. 4. 128.

(పుష్కలములు అని భావము)

**సుబ్బనచూలులాడు** స. క్రి. (√సుబ్బు) — సుబ్బన చూలులు + ఆడు) పెద్ద కొల్లగొను.

సీ. ఇప్పురాణం బెప్పు డింపార జిహ్వకు నమృతంబు గాఁ గ్రోలునట్టివారు, దుఃఖనిర్ముక్తులై సార సంసార సుఖములు సుచుబ్బన చూలులాడి హా. ఉ. 8. 68.

ఉ. ... వేల్పు వెలగుబ్బెతలః గవగూడి పైబయిఁ జుబ్బన సూ(చూ) లులాడుటకుఁ జొత్తురు. తన్మధురాధరామృతంబు .... రామా. 1. 45.

(పుష్కలముగా ననుభవించు అని భావము)

**సుబ్బు** అ. క్రి. బయటపడు, ప్రకాశమగు. (క సుబ్బ = శుభ్ర)

సీ. నా ప్రాణసఖుల చందము నమ్మరాదు మా సుబ్బుసుబ్బుల దూలిఁ జాతురోకొ... కృ. శకుం. 3. 43.

శా ...ఁదివికం గ్రొమ్మించు పుట్టించుచన్ గుబ్బల్ పాదవుఁజట్లు కమ్మల ముసుఁగుల్ సుబ్బలి బ్లో కమాన్, బిప్పి గబ్బి మిటారు లెక్క తుఃగి బృందంబు చిందెన్ వడల్. రాజవాహన. 2. 80.

2. వ్యాపించు, ప్రసరించు.

కం. ఆ చిత్రఫలక మెవ్వరు, చూచిన వెలి విసరి యపుడు సుబ్బెడునది నీ, వే చూచు చేనుచూచుట, యోచించల నయన! యింతయు నెఱుఁగుదువే? ప్రభా. 185.

3. లోక ప్రవాదము, జనశ్రుతి.

సీ. నా ప్రాణసఖుల చందము నమ్మరాదు మా సుబ్బుసుబ్బుల దూలిఁజాతు రొక్క. కృ. శకుం. 3. 43.

**సుబ్రహ్మణ్యుఁడు** సం. వి. అ. పుం. 1. కార్తికేయుఁడు, కుమారస్వామి. 2. యజ్ఞము నందు నియుక్తులగు పదునార్గురు యాజకులలో నొకఁడు.

**సుభంగ** సం. వి. ఆ. స్త్రీ. కొబ్బరిచెట్టు.

**సుభగ** సం. వి. ఆ. స్త్రీ. 1. భర్త యొక్క ప్రేమకు పాత్రురాలైన భార్య. 2. పూజనీయమైన మాతృదేవి. 3. అడవి మల్లె. 4. పసుపు. 5. ప్రియంగు లత. 6. తులసి.

**సుభగంమన్యుఁడు** సం. వి. అ. పుం. 1. అదృష్టవంతుడను, అందగాడను అని తలఁచువాఁడు. 2. ఆత్మశ్లాఘాపరుఁడు, స్వాభిమాని.

**సుభగము** సం. విశ. (అ. ఆ. అ.) 1. అదృష్టము గలది. 2. అభివృద్ధి గలది. ప్రియమైనది, అందమైనది. 3. ఇష్టమైనది, ఇంపైనది, మనోజ్ఞమైనది. 4. ప్రసిద్ధమైనది, ఉదాత్తమైనది.

**సుభగము** సం. వి. అ. పుం. 1. అశోకము. (వృ. వి.) 2. చంపకము. 3. వెలిగారము. 4. ఎఱ్ఱ కలువ. (వృ. వి.)

**సుభద్ర** సం. వి. ఆ. స్త్రీ. అర్జునుని భార్య, అభిమన్యుని తల్లి

**సుభద్రకము** సం. వి. అ. పుం. 1. దేవతా విగ్రహములను ఊరేగించుటకైన రథము. బిల్వ వృక్షము (వృ. వి.)

**సుభద్రము** సం. విశ. (అ. ఆ. అ.) సురక్షితమైనది. సుఖమైనది, అదృష్టము గలది.

**సుభాషితము** సం. విశ. (అ. ఆ. అ.) చక్కగా బలుకబడినది.

**సుభాషితము** సం. వి. అ. న. 1. ధారాళమైన వచనము. 2. చమత్కారమైన వాక్యము. 3. సూక్తి. 4. హితవచనము 5. మంచి యభిప్రాయము.

**సుభిక్ష** సం. వి. ఆ. స్త్రీ. ఆరెపువ్వు.

**సుభిక్షము** సం. వి. అ. న. 1. మంచి భిక్షము. 2. ఆహార సమృద్ధి. 3. పాడిపంటల కలిమి.

**సుభీరకము** సం. వి. అ. పుం. పలాశ వృక్షము. (వృ. వి.)

**సుభూతికము** సం. వి. అ. పుం. బిల్వ వృక్షము (వృ. వి.)

**సుభ్రువు** సం. వి. ఊ. స్త్రీ. మంచి కను బొమలు గల స్త్రీ.

**సుమంగలము** సం. విశ. (అ. ఆ. అ.) 1. శుభప్రదమైనది 2 యజ్ఞ సమృద్ధి గలది.

**సుమంగలి** సం. వి. ఈ. స్త్రీ. పుణ్య స్త్రీ; ముత్తైదువ.

**సుమంతుఁడు** సం. వి. ఉ. పుం. మంచి యాలోచన చెప్పువాఁడు.

**సుమతి** సం. వి. ఇ. పుం. మంచి బుద్ధి గలవాఁడు.

**సుమతి** సం. వి. ఇ. స్త్రీ. 1. మంచి బుద్ధి దయ, మైత్రి. 2. దేవతా వర ప్రసాదము. 3. ఆశీస్సు, వర ప్రదానము. 4 ప్రార్థనా గీతము (మంత్రము) 5. కోరిక. 6. సగరుని భార్య పేరు.

**సుమదనము** సం. వి. అ. పుం. రసాలము.

**సుమధ్యమ)** సం. వి. ఆ. స్త్రీ. చక్కని నడుము గల స్త్రీ

**సుమన** సం. వి. ఆ. స్త్రీ. బొండు మల్లె.

**సుమనము** సం. వి. అ. పుం. 1. గోధుమ 2. ఉమ్మెత్త.

**సుమనస్సు(ము)** సం. వి. స్. న. మంచి మనస్సు, తృప్తి, సంతోషము, దయ.

**సుమనస్సు (ము)** సం. వి. స్. పుం. 1 దేవత, దివ్యుఁడు. 2. విద్వాంసుఁడు. 3. వేదాధ్యాయి. 4. గోధుమ. 5. వేపచెట్టు. (వృ. వి.)

**సుమనస్సు(ము)** సం. వి. స్. స్త్రీ. 1. బొండు మల్లె. 2. మాలతీలత.

**సుమనఃఫలము** సం. వి. అ. పుం. ఉమ్మెత్తచెండు.

**సుమనఃఫలము** సం. వి. అ. న. జాజికాయ.

**సుమనోరజము** సం. వి. స్. న. పుప్పొడి.

**సుమము** సం. వి. అ. న. పువ్వు.

**సుమము** సం. వి. అ. పుం. 1. కర్పూరము, 2. ఆకాశము

**సుమారు** హిం. వి. కొంచెమెచ్చు తగ్గు. (శ. ర.)

**సుమాళము** వి. సంతోషాతిశయము.

మ....అంత నారదుఁడు గయ్యం బింతటం గల్గెఁబో, గనుఁగో నా కనుచున్ సుమాళమునఁ జంకల్ వేసి కొంచున్ వడిన్, వినువీథిం జనుదెంచి. వరాహ. 11. 92.

2. సంతోషాదుల వలనఁ గలిగిన పారవశ్యము.

వ. కంతు నాలోకించి నెత్తంబోక పలుక యాడుదమే యని యుబ్బుమై మాటగాఁ బలికిన నతండు నీవు సుమాళంబున నున్నవాఁడవు నేఁడు నీ తోడ నాడి జయింపరాదు. భార. విరా. 5. 244.

కం. సంతోష కలకలంబున వింత సుమాళమున వచ్చు విభుని కెదురుగా, నెంతయు వేడుకఁ జని త,

ళ్కాంత గని యొ వతని చేతఁదవరెదు బాలున్. వర. 1. 184.

తే. ఔర మధుమద మమరెఁ బుష్పాసవంబు, గ్రోలిన సుమాళ మవుడు తత్కేళికలకుఁ జూత పున్నాగ కురువ కాశోకతరులు, వన్నె నవ్వులు పువ్వులై నివ్వటిల్లె. రామా. 2. 100

3. మూర్ఛ.

సీ. పొరుగు పొలువు పొమ్మ పొలిమిడి పోలును, మాళము బవిళి మైమఱవు భ్రమరి, యవఁగ మూర్ఛాహ్వయం బలరారుచుండును ... ... అం. భా. 2. 223. వ్రా.

4. మత్తత; గర్వము.

మ. .... అల్లి ల మ,ద్దైన వాడిక్కన దుస్సమాన మిది సందేహాస్పదం బీదవం.చు సుమాళంబునఁ బాండితుల్ వెలవు నీచున్ రోఁత వాక్రువ్వగన్. వంచతం. 1. 13.

5. ముఖము.

సీ. తే. గీ. ... హాయి సుకము సుమాళ మం చవఁగ సుఖము ... అం. భా. 1. 98. వ్రా.

6. వినయము.

చం. కొమ్మ యొక్కర్తు వచ్చి సుమాళంబున మ్రొక్కి తాను కొనఁగెన్ జెంగల్వలాజేనికిన్. యయా. 5. 46.

సుమాళి విశే. (సుమాళము + ఇ) సుమాళము గల వాఁడు, గర్వముగలవాఁడు.

కం. జూదరివి సుమాళివి వెఱ,వాదివి తమకరివి గెలువవచ్చునటే దా,మోదర నిను మాళమటయు, వాదెనఁ గనుఁగొనక పిలువుమనె జాంబవతిన్.

"సుమాణి" యని పుస్తకమునందలి పాఠము. ఉ. హరి. 3. 118.

సుమాళించు అ. క్రి. 1, సంతోషముచే పరవశమగు.

ద్వి. ఎత్తినవేడ్కతో నృపుఁడొక్కపలక, నెత్త మాడుదమన నృపుఁ జూచి యతఁడు, నీవు సుమా ళించి నన్ను నీ వెఱుఁగ, వీవెంత నేనెంత నేనాడ ననిన, విరాటపర్వము. 4. 64. వృ,

తే. కాంత కుటిలా... బను కాసుమొగులు, వితత ముగ నాఁక ఆకు విరయ బాతె, దమ్మఁగని సుమాళించు నవుని హ్వా...య, ననమయూరము చెలరేఁగి నాట్యమాడె. కళా. ... 63.

2. ఉత్సహించు, వేడుకపడు.

మ. పెసరుఁగాయకు మెత్తకమ్మలకునై వేటాడు మన్ గొత్తెలన్, మసలంజూచుచు దోసచేల్ చెలకు బాల్ మగ్గాడుచున్ సజ్జఁగో,య సుమాళించుచు సేవరా పెగసి. రాజవాహన. 2. 65.

సుమిత్ర సం. వి. ఆ. స్త్రీ. లక్ష్మణశత్రుఘ్నుల తల్లి.

సుముఖము సం. విశే. అ. అ. ఈ. అ. 1. మంచి ముఖముగలది, అందమైనది. 2. ఆనందము గలి గించునది. 3. సిద్ధమైనది, అనుకూలమైనది, ఆతు రత పడుచున్నది.

సుముఖము సం. వి. అ. న. వ్రేలిగోటిగీరు.

సుముఖ(ఖి) సం వి.అ.ఈ.స్త్రీ. 1. అందమైన ముఖము గల స్త్రీ. 2. అద్దము.

సుముఖుఁడు సం. వి. అ. పుం 1. విద్వాంసుఁడు. 2. గరుత్మంతునిపేరు. 3. గణపతిపేరు. 4. శివుని పేరు.

సుముఁడు సం. వి. అ. పుం. చంద్రుఁడు.

సుమూలకము సం. వి. అ. న. ముల్లంగి.

సుమేఖలము సం. వి. అ. పుం. ముంజగడ్డి.

సుమేధు(ధసు)ఁడు సం. వి. స్. పుం. పండితుఁడు, ప్రాజ్ఞుఁడు.

సుమేరువు సం. వి. ఉ. పుం. 1. మేరుపర్వతము. 2. శివుఁడు

సుమ్నము సం. వి. అ. న. 1. బుక్కు. 2. ఆనం దము, సుఖము. 3. వరము, రక్షణ, ప్రసాదము. 4. యజ్ఞము.

సుయవసము సం. వి. అ. న. మంచిగడ్డి, పచ్చిక.

సుయామునుఁడు సం. వి. అ. పుం. విష్ణువు పేరు.

సుయుక్తుఁడు సం. వి. అ. పుం. శివుఁడు.

సుయోధనుఁడు సం. వి. అ. పుం. దుర్యోధనుఁడు.

సుర వి. గాలిష్టుడి,

**సుర** సం. వి. ఆ. స్త్రీ. 1. కల్లు, సారాయము. 2. జలము. 3. పానపాత్రము. 4. పాము.

**సురకసువలి** వి. సుడిగాలి, సుళిగాలి.

కం. ఉరుగంగ సుడి వడువున, నగి తృణావర్తుఁడవని కవరాఁ ముగా సురకసువలియై విస విస, వరుదరుదన ముంచి విసరి వారిఁ గొనిపోయెన్. భాగ. 10 స్కం. 264.

వ. ప్రళయకాలంబున సురకసువలిచే దిద్దిరం దిరిగెడు కులనగంబులం గ్రేడిసేయ. భార. భీష్మ. 1. 267.

**సురంగ(ము)** సం. వి. ఆ. స్త్రీ. 1. సొరంగము. భూగర్భ మార్గము.

కం. సురంగ సేయ నొక్కెడ మూపెన్. దశకు. 6. 140.

2. కన్నము. రంధ్రము,

**సురంగంబు** (క. సురంగ) వి. ప్రకాశము.

వ. మఱియు ... పసిండి యాయగంబున నుఱియ సురంగంబుగాఁ దొంగరి వట్టియంగట్టి చెన్ను మిగులం గై సేసిన. కుమార సం. 9. 224,

**సురంగము** సం. వి. అ. పుం. 1. మంచి రంగు, 2. నారింజ (వృ. వి.) 3. సొరంగము. కన్నము.

సీ. ఎదుటి సురంగంబు లెఱిఁగి యాచాయఁగాఁ గల్పి చు ప్రతి సురంగములగములు. కువల. 3. 18.

**సురంగము** సం. వి. అ. న. రక్త చందనము, ఎఱ్ఱ గంధము. 2. సింధూరము, ఇంగిలీకము.

**సురంగయుక్(జుండు)** సం. వి. క్. పుం. కన్నపు దొంగ.

**సురంగిక** సం. వి. ఆ. స్త్రీ. మూర్వా వృక్షము. (The MURVA Plant)

**సురంజనము** సం. వి. అ. పుం. పోకచెట్టు.

**సురంటి** వి. సురఁటి. వీవన.

ఉ. కప్పురపున్ దళంబునఁ జొగల్ జలియించి సురంటి గాడ్పుచే. కవిరాజ. 3. 108.

**సురంటి** వి. సురఁటి. విసనకఱ్ఱ.

మ. సిను పారంగపుర షు లే.బొం.సురంటి గాడ్పు ఓసుంపు పె.ఏను గైకొ గమకి బఁ ప్రాణసఖు డాడన్ దెల్లమయ్యెన్ జమీ. చంద్రాంగ 4 167.

మ. ఒకనాఁ డింద్రుఁడు వైజయంత మణిసౌధో దగ్రభాగంబునన్, సకియల్ కొందఱు కుంచెగిండి సురఁటీ సామ్రాణి ... పూని కొల్వగ ... దశా. 4. 18.

**సురఁగ(సం. సురంగా)** వి. వృక్ష విశేషము, రక్త చందన వృక్షము ? (ఇది తరంగము, తరఁగ వంటిది)

ద్వి. పొరి నశోకంబులు బోకబోదియలు, సురఁగలు బొన్నలుఁ జూతపోతములు. రం. రా. ఉ. కాం. 116. పు. 6. పం.

ద్వి. వఱపైన గురువింద పందిరుల్ దూఱి, సురఁగల పొరుగున సురుగుచు డాసి, చూతపోతమ్ముల సుదగొమ్మ లెక్కి. నవనాథ. 3 అ. 222 పు. 16 పం.

**సురఁటి(టీ)** వి. 1. వట్రువ విసనకఱ్ఱ.

ద్వి. మరువంపుఁ గొనలఁ జమర్చిన యట్టి, సురఁటి వట్రువ గాలి సుడియంగఁ ద్రిప్పు. హరిశ్చ. పూర్వ 782.

మ....ఘ,ర్మలవంబుల్ దొలఁగింపఁగా సురఁటియై రంజిల్లు నిచ్ఛాగతిన్. పారి. 1. 60.

సీ. వేయి గన్నులు గల వేల్పు తొయ్యలి చేతఁ జూపట్టు చెంబట్టు సురఁటి యనఁగ. విక్ర. 6. 67.

2. మల్ల విద్యా విశేషము.

వ. మొగ్గ ప్రాలుటలును సురఁటి పల్లటి మొదలగు లాగు వరుసలును. మల్లు పురా 8 69.

3 పారావత విశేషము, పారావతము.

సీ. ... ... నేలి, పల్లటి యంతర పల్లటి సురఁటి లకోరి బట్టి యొడ్డికూకి బకదారి, దూరబారు లవంగ శారికాఖ్య ... ఆం. భా. 2. 58.

4. గళరవము.

వెలయుఁ జామర గళరుతములు సురఁటన. ఆం. పద. నానా. 72. ద్రా.

**సురఁటితానము** వి. (సురఁటి, వీవన జరిగే పట్టు) గలది, గాలి.

ఇల్లే సురఁటి వీవుల పట్టు. ఆం. సం. దేవ. 22 వ్రా.

**సురకరువలి** వి. సుడిగాలి.

వ. ... తమ తమ పరిధానంబులు పెట్టి జలక్రీడ లాడుచున్న వని సురకరువలి చేతం బ్రేరితంబు లయి కలిసిన ఆది. 3. 134.

**సురకాని** వి. కానిలో నాలుగవ భాగము

కం. హరి యుత్తర భాగంబునఁ బురుషుఁడు దాఁ బాపమైనఁ బుణ్యం బైనన్, సురకాని యెత్తు చేసిన బరిణతిమై మేరుకుధర భారముఁ జూపున్. పాండు. 4. అ.

**సురకారువు** నం. వి. ఉ. పుం. విశ్వకర్మ.

**సురకార్ముకము** నం. వి. అ. న. ఇంద్రధనుస్సు

**సురకాలి** వి. ఒకదినుసు ఫిరంగి.

**సురకేతకము** నం. వి. అ. పుం. 1. ఎఱ్ఱమద్ది 2 చూత వృక్ష విశేషము. (వృ. వి.)

**సురక్రోవి** వి. ఒకవిధమైన ఫిరంగి. ఆ. భా. 2. 218.

**సురగజ్జెలు** వి. బ. చిఱుమువ్వలు. ఒక విధమగు గజ్జెలు.

సీ. ధ్రువమండలము కులపర్వతంబులు కలసి తద్దయు రమ్య మగుసురగజ్జలపగిది గాఁగ .... కుమా. సం. 8. 22. వ్రా.

**సురగవి** నం. వి. ఈ. స్త్రీ. కామధేనువు, వేల్పుటావు

**సురగాడ్పు** వి. సుడిగాలి.

చం....మబ్బుత్రోవకుం బలుపుగఁ గ్రమ్మి దుమ్మె గని పాఱి వడిన్ సురగాడ్పు పెంపునన్. అ. రా. కిష్కింధా. 80.

చం....అత్తఱి సురగాలి సుళ్ళుగతిఁ దార్కొని మింటి ధరాతలంబునన్. చంద్రాంగ. 2. 38. వ్రా.

**సురగాలి** వి. 1. సుడిగాలి.

సీ. సురగాలి తిరువుల సురుఁగదే యీ తన్వి యచలంబులై చన్ను లమరకున్న. హరిశ్చ. వం. 3. 35.

వేటకుక్క కీయఁబడిన పేరు.

ఉ. బెబ్బులికూన దానవుఁడు భీముఁడు గామిడి గట్టిగట్టి వాగబ్బిరకారితారి సురగాలి గయాళి వయాళి పట్టెదెం, దుబ్బిరిపింగిణి మిసిని. రాజ వాహన. 3. 54.

**సురజఃఫలము** నం వి. అ. పుం. తీడమామిడి చెట్టు. (వృ. వి.)

**సురజ్యేష్ఠుఁడు** నం. వి అ. పుం. బ్రహ్మ, వేలుపుఁబెద్ద.

**సురటి** నం. వి. ఈ. స్త్రీ. రాగవిశేషము.

**సురతము** నం. వి. అ. అ. 1. చక్కగా క్రీడింపఁ బడినది. 2. ఖేలనశీలము గలది. 3. బాగుగా అనుభ వింపఁబడినది. 4. దయగలది, మృదువు.

**సురతము** నం. వి. అ. న. 1. ఆనందము. 2 మిథున క్రియ.

**సురతాణి** వి. మేత్రైవది.

రగడ. ధాకచూపట్టు సురతాణి పింగాణీలు. కళలు దేరు పిరంగి కత్తులు జూరీలు. హంస. 5. 356.

**సురతాణి** వి. = సురథాణి, సురధాణ, వి. రాణి, స్వతంత్రురాలు.

గీ. రేయి సురతాణి జగ మావరింపఁదలచి, పాలుచు నిరులను బలురికిబులను బనిచి, కొఱల నెత్తిన సున్నంపుగుండ లనఁగ, జాలఁగనుపట్టెఁ దారకానముదయంబు. విప్ర. 3. 28.

గీ. మేటి రతులకు సురతాణిమించుబోణి, దాని కెనయైనదాని జగానఁ గాన. క్రీడా. 1. 50.

2. చక్రవర్తి, రాజు, సామంతరాజు.

కం. ఈ రీతిం గెందలిరుల కోరిసురతాణి గాఁకఁ గూర్పఁజకోరిమత్తమ, యూరీరవములకు సురిలి యుగ్మలి మరిలోన్. చంద్రాంగ. 4. 179.

**సురతాణిలగ్గ** వి. నలుమూలలను డి లగ్గపట్టుట.

సీ ... లగ్గనా సురతాణిలగ్గ యనఁగఁ, బాషాణ దాగ్వాగ్ని భాండాదికాభిన, లగ్గరిం పనఁగఁ జెలంగు.... ఆం. భా. 2. 219. వ్రా

కం. మనుజేంద్రుఁ డంత సేనల, బనుపుచు సురతాణి లగ్గఁబట్టించిన వర్ధనుజపతి పిరధాన్యం,బునఁ జెగు వకు జొచ్చియెక్కర ముదిరిన కినుకన్. శువం 3.12.

సురతాణీసలాము వి. నమస్కారభేదము.

వ. సాఁతేత్రము౻దలి సాలగ్రామస్వామి సురతాణి సలాము, అయోధ్యయందలి రఘూద్వహునకు దోయిలి. ప్రబం. 1 850.

సురతాని వి వాద్యవిశేషము. (ఒక విధమగు వీణ)

సురతాలి సం. వి. ఈ. స్త్రీ. 1. చేటిక. 2. కార్పుకర్త. 3. శేఖరము, శిరోమాలిక.

సురతి సం. వి. ఇ. స్త్రీ. 1. సుఖానుభవము. 2. సంతృప్తి.

సురతోషకము సం. వి. అ. పుం. కౌస్తుభరత్నము.

సురదన సం. వి. అ. స్త్రీ. మంచిదంతములు గల స్త్రీ.

సురదీర్ఘిక సం. వి. అ. స్త్రీ. ఆకాశగంగ.

సురదుందుభి సం. వి. ఈ. స్త్రీ. తులసి. (వృ. వి.)

సురద్విషుఁడు సం. వి. ష్. పుం. అసురుఁడు, వేల్పు దాయ.

సురధాణ = సురధాణి. హర. 1. 22. గ్రా.

సురధాణి = సురధాణ, తురకదొర. వి. (హి. సుల్తాన్) చక్రవర్తి.

సీ. గజపతి సురధాణి గడిదుర్గముల కెల్లనే రాజు వజ్రాంకుశోరు తల్పు. ప్రబోధచం. 1. 16.

సురధాని = సురధాణి. వి.

కం. సురధాని యేల రక్కసి, సురధానీలీల నముచిసూదనముఖ్యుల్, దరిదాపెఱుఁగక మేరువు, దరిదాపునఁ గూడి మిగుల దహతహపడుచున్. దశా. 4. 122.

సురనిమ్నగ సం. వి. ఆ. స్త్రీ. ఆకాశగంగ.

సురపతి సం. వి. ఇ. పుం. ఇంద్రుఁడు, వేల్పుతేఁడు.

సురపొది వి. ఒకానొక చెట్టు. కాకాంగము. (వృ వి.)

సురపున్నాగము చూ. సురపొన్న.

సురపొన్న వి. (సం. సురపున్నాగః) సురపున్నాగము, సుమేరువృక్షము. (వృ. వి.)

గీ. ననుచు సురపొన్నఁ గనుగొన్న నవ్వదెవుడు పొగఁడ ఱెక్కలిమధువున బ్రోదిసేయ దిందుముఖ దోహదక్రీడ కిడ విడిచె నలరువిలుకాని ముఖులకు కాళ్ళ మలిక. విప్ర. 1. 168.

సీ. నారువ సురపొన్నవారిజమును బొన్నెల్లి మూలుగ విల్లునెమిలి యడుగు. హంస. 4 11.

సీ. తోడి కన్నెలుఁ దానుఁ గూడి మాడి చరించు సురపొన్ననీడలఁ జూచి చూచి. రాజశే 2. 65.

వ. మదనచాప విముక్తంబులై మొదలం గ్రోలిన భవశరీరభస్మాంగరాగంబు పరాగ వ్యాజంబున వెదలం గ్రాయుచున్న సురపొన్నలు. శృ. నై. 1 95.

చం కవఁ దిలకంబుఁ గేసరముఁ గల్గుమియన్ రహిఁ గాడఁ బ్రేంకనం, బునిమురమావి నవ్వ సురపొన్న సుఖాంబుజ మెత్తఁ జంపకఁ,బు నెఱిగ పుంగిలం గొరవి మూర్కొన వావిలి దన్న వంజుళం,బు నడువ గోఁగునై తరుణి పూచు సురద్రుమమన్ని పువ్వులన్. పారి. 4. 9.

సురభి సం. విశే. ఇ. ఈ. ఇ. 1. మంచి వాసన గలది 2. మనోజ్ఞమైనది.

సురభి సం. వి. ఇ. స్త్రీ. 1. కామధేనువు. 2. ఆవు. 3. అందుగు. (వృ. వి.) 4. మురయనెడు గంధద్రవ్యము. 5. తులసి. 6. మల్లె. 7. సువాసన గల చెట్టు. 8. మద్యము. 9. భూమి. 10. ఆవు. 11. సప్తమాతృకలలో నొకటి. 12. తూర్పుదిక్కు. 13. సీమసాంబ్రాణి చెట్టు. (వృ. వి.)

సురభి సం. వి. అ. న. 1. బంగారు. 2 వాసన గల కలువ. 3. గంధకము.

సురభి సం. వి. అ. పుం. 1. వసంతఋతువు. 2. చైత్రమాసము. 3. సంపెంగ. (వృ వి.) 4. జాజికాయ. 5. సుగంధము. 6. సాలవృక్షపు బంక. 7. జమ్మి. (వృ. వి.) 8. కదంబము. (వృ. వి.) 9. సువాసనగల ఒక దినుసు గడ్డి. 10. వకుళము (వృ. వి.).

సురభిసాయకుఁడు సం. వి మన్మథుఁడు

తే....ఆ కుమార. హంసమలకేళి కాననాభ్యంతరమున, సురభిసాయక సాయకజ్వరితుఁడగుచు. చంద్రాంగ. 4. 94.

సురభిక సం. వి. ఆ. స్త్రీ. ఒక దినుసు అరటి.

సురభితము సం. విశే. ఆ. ఆ. ఆ. 1. సువాసనగలది.

2. సుగంధిఫలము.

సురభిత్రిఫలి సం. వి. ఈ. స్త్రీ. 1. జాజికాయ. 2. లవంగము. 3. పోకచెక్క.

సురభిత్వక్కు సం. వి. చ్. స్త్రీ. పెద్ద యేలకి.

సురభిదారువు సం. వి. ఉ. పుం. సాలవృక్షము. (వ్య. వి.)

సురభిళము సం. విశే. అ. ఆ. అ. మంచివాసన గలది.

సీ. నిశ్వాససురభిళానిలముల వంపద సరసవసంత రుసరణిఁ జేయ. కవి. 3. ఆ.

సురభీకరించు సం. స. క్రి. పరిమళవంతఁజేయు.

మ. క్రమపాకంబునఁ గెంపుతోడివజు పెక్కన్ మిక్కుటంబైన గంధము దిక్కుల్ సురభీకరింపరన మంతర్గామి యయ్యెన్. హరి. పూర్వ. 7. 77.

సురయాయి విశే. మిక్కిలి వల్లనిది.

సీ. వడగలు తడఁబడఁ దొడరుభోగుల గెల్చి సురమాయి జల్లులఁ గాంచె భామ. 4. ఆ.

(దీనికి వ్యుత్పత్తియందు వికల్పముగా అంత్యవర్ణ లోపము.)

చం. చటులతఁ బాంథులం గెలువఁజాలిన కంబరదైత్యభేదికిన్, బటువగు తెక్క తోడు సురమా జగజల్లుల మేటిరౌతు బంట్లకు కలకంఠముల్ మనకు కావలి వచ్చుని దాలు వావురాలకు వన వాటిలోనజలజానన యే గతిదాఁగ వచ్చితే. భామ. ఆ. 3.

సురమాలి విశే. గాలి నించినది. (చూ. బాలీసు). శ. ర.

సురర్షి సం. వి. ఇ. పుం. దేవ ఋషి.

సురలాసిక సం. వి. ఆ. స్త్రీ పిల్లనగ్రోవి.

సురలోకము సం. వి. అ. పుం. స్వర్గము, వేల్పుల్రోలు.

సురవన్నెలు వి. బ. వస్త్ర విశేషము.

వ. ముయ్యంచులును వెంటపాళ్ళును నిండువన్నెలును సురవన్నెలును పుప్పొడి వన్నెలును. ద్వా. 3. 206.

సురవర్త్మము సం. వి. న్. న. ఆకాశము, వేల్పుఁదెరువు.

సురవల్లభ సం. వి. ఆ. స్త్రీ. తెల్ల గరిక.

సురవల్లి సం. వి. ఈ. స్త్రీ తులసి (వ్య. వి.)

సురస సం. వి. ఆ. స్త్రీ. 1. సింధువారము (వ్య. వి.) 2. దుర్గాదేవి. 3. తులసి (వ్య. వి.) 4. నాగమాత.

సురసము సం. విశే. (అ. ఆ. అ.) 1. స్వాదువు. రసభరితము. 2. మధురము. 3. సుందరము.

సురసము సం. వి. అ. న. 1. తులసి. 2. గోపరసము (ఒక దినుసు బంక) 3. పరిమళము గల గడ్డి. 4. వల్లి గగ్గెర (వ్య. వి.)

సురసుందరి సం. వి. ఈ స్త్రీ 1. దేవతా స్త్రీ. 2. దుర్గాదేవి.

సురసుర వి. ప్రుక్కుట యందలి యనుకరణము.

చం. ...గొజ్జెఁగ తూపుచేత వ్రచ్చెనుపుగఁ బొంచి కంటికి విసింపనివాఁ టపుడేని యార్పెఁ బో, సురసురప్రిక్క మెత్తనగుచోటనె గుద్దలి వాఁడియాఁ గదా. సారంగ. 3. 33.

కం. వెరవుగ నాకటి పెల్లున సురసుర ప్రెక్కెదరు మన శిశువులం జూడన్, దురితము దారిద్ర్యం బులఁ బొఁదయక మనుచున్న వారె పుణ్యులు జగతిన్. (ఇచట తీవ్రముగా నని యర్థము). కుచేల. 1. 49.

2. కాలుటయం దనుకరణము.

మ. ప్రతి బాణ ప్రకరంబులన్ నిజముఖ ప్రాదుర్భవద్దుర్భరా, ద్భుతకీలా పటలాహుతిన్ సురసుఱం బోఁజెట్టుచుం జానకీ, పతి బాణంబులు ముంచె నేని కలభప్రాయుండవు. రామా. 6. 163.

ద్వి. కుఱుచమంటల జిమ్మకొని యన్నకసవు, చేఱుచుఱఁ గమరంగ సురసుర పుట్టి. హరిశ్చ పూర్వ. 2232.

సురస్థానము సం. వి. అ. న. దేవాలయము.

సురాకారము సం. వి. అ. పుం. సారాయపు బట్టి. కొబ్బరిచెట్టు.

సురాచార్యుఁడు సం. వి. అ. పుం బృహస్పతి, వేల్పుటొజ్జ.

శార్దూలదృష్టిఁ జైఁబడిన సురియకాండ్ర వంత మిదియె. ద్వా. 7. 47.

**సురియాళు(వు)** వి. మాలవాడు. ఆం. భా. 2. 289 వ్రా.

సీ. తే. గీ.... వచ్చు సేవించు సురియాళు వైష్ణ వుండు.... ఆము. 9. 9.

"ఆళు" అన్నది అరవపదము అని శబ్దరత్నా కరము.

**సురిపట్టము** వి. సూరతుదేశ సంబంధమైన పట్టు సేలువు.

కం. అట్టియెడఁ బెండ్లిపనులన్, దిట్టలగు పురంధ్రు లచట నిలిపిరి వహ్నిన్, బెట్టిరి మణిపీఠిసురి, పట్ట ముపైఁ బఱచి రందుఁ బతియున్ సతియున్. మను. 5. 89.

**సురుంగా** నం. వి. ఆ. స్త్రీ. సురంగము, రంధ్రము.

**సురుఁగంబడు** అ. క్రి. అదృశ్యము. (రూ. సురుఁగఁ బడు.)

చం. చిదియవు కొండపైఁబడినఁ జీమ చిటుక్కనినం గరంబులుం, బదములు దోఁకయుం దలయు బల్విగు పూన్కినడం డొకింతయున్, గడలక నిల్చి యొయ్య సురుఁగంబడ పోవఁగ నేర్తురాగుమై, మదకములోని కట్టెతెఱఁ గున్నదియే పెరసత్త్వ కోటికిన్. హరి. ఉ. 5. 20.

**సురుఁగు** అ. క్రి. 1. అదృశ్యమగు, కనబడకపోవు.

ఉ.... వరాహము కడంకనదర్శితమయ్యె నయ్యె డన్.

ఉ.... పంది సురింగిపోయిన నృపాలతమూజుఁడు చిన్నవోయి (మొఱింగిపోయిన అని. శ. ర. పా.) విక్ర. 8. 77.

కం. వచ్చి తపోవిఘ్నమునకుఁ, జొచ్చినఁగాకున్న మగుడి సురిఁగిరి యంతన్, జెచ్చెరగ నె బ్రహ్మవాటిని, యచ్చెరుతెరువునకు వెరచి రసురులు సురులున్. శేష. 1. 90.

2. మరలు, పరాఙ్ముఖమగు.

చం. తిరుగని మందరాద్రికళదీయని పూర్ణశశాంకు డాలలన్, సురఁగని పార్థుఁడీకు కనుపోఁకని మన్మథుఁ డొక్కఁడొంకునుం బోరయని ధర్మమూతి యుడివోవని కల్పమహీరుహం బవన్, వరగుణ ధాముఁడైన పెదవల్లభ భూవరుఁడొప్పు నెంత యున్. వంచ నా. 1. 30.

కం. పెరిగిన చీఁకటి తమ గని, సురిగి యరిగి వరుణునగరుఁ జొచ్చినదాలిన్, మెరిగిన వెంబడిఁ దానును, వరిగిన క్రియ నినుఁడు గ్రుంకె నపరాం బుధిలోన్. వై. జ. 2. 52.

3. తప్పించుకొను.

వ. అన్నాతి యల్లన సురిఁగి ధేనుకాశ్రమంబున కరిగి. భార. శాం. 5. 207.

చం. సురిఁగెడు వారి గొందులకుఁ జొచ్చుచు డాఁగెడు వారి మద్దశా,తరమునఁబాఱు వారివని దూఱము లేగినవారిఁ గ్రంతలం, దిరిగెడు వారి మాటుకొని క్రమ్మరు వారిని బట్టి కీశులు,ధ్ధరగతి మంటలోపలను ద్రోతురు విక్రమ దుర్నివారులై. భా. రా. యుద్ధ. 1154.

చం....వి, వెరపున నింక మా ఋణము వేగమె తీర్చెదొ కాక మిన్నకే. సురిఁగెదవో వివేక గుణ శూన్యతఁ బొంది యసత్యవాదివై. హరిశ్చం. 4. 28.

కం. తిరుగరు పలు కర్థులకును, మరుఁగరు ధనమిత్తు రితర సుదతీమణులన్, మరుగరు.... భాగ. 10. స్కం. పూర్వ. 1604.

తే. గీ. ఏను యాతుధానుఁడనైన నితరజనుఁడ, నైన నెఱిఁగి నివారింతురవుడు నన్ను. గాలికైన రక్కసులకుఁ గానఁబడక. సురిఁగి యీ పుర ద్వారము పొరఁగరాదు. భా. రా. సుంద. 69.

ద్వి. తిరుగునే ముట్టిన ధీరుండు గలన, మరుగునే ముట్టినసూరుఁ డెవ్వలన. పండి తా. పురాతన. 90.

4. తప్పించుకొనిపోవు.

ద్వి. తమ్ము మోచినచోటఁ దగవట్టి పెట్టి, మిన్నక సురిఁగిన మెత్తురే జనులు. హరిశ్చ. ఉత్త. 2. 488.

తే. గీ. కపటములు పన్ని యిపుడు నన్నమ్ము మొఱగి. సురుఁగఁ జూచెద వేమఱుఁ జమ్ము నిమ్మఁ, గనికరము మానసంబునఁ గదియనీక, డాపిగాఁ జేసి యేలుదువాని యుడిపి. హరిశ్చ. 4. 151.

ద్వి. సురఁగక వంటయిల్ సొచ్చిన శశము గరు
డసేయక యూరగా నుండఁదగునె హరిశ్చం. పూర్వ.
1298.

5. విశ్రమించు, తొలఁగు.

సీ. నెమ్మి యేమయ్యెనో నే డాట గలిసక
యరుగు దెంచితి వని సురిగె నొకతె. యయా. 5.
22.

గీ. అని గిలుక్కునఁ యయ్యమరనాథ, పుత్త్రిఁ
దండటి నిండ్ల-కుఁ బోవఁ బనిచి, సురఁగ దురదుర
నా యింటి కరుగుదెంచి, యేమి చెప్పుదుఁ బొద
రింటి కేఁగుదెంచె. కువల. 6. 58.

6. దాఁగు.

చం. తరులు గిరుల్ నరుల్ సురలు దైత్యులు
పతులు లోనుగాఁ బరా, చరతతి చూడఁ బాడ
నవసన్నత నెం దడగెం దమంబు నిర్భగ మయి
యిమ్మెయిం బొదల భాస్కరి చంద్ర విలాస
మెచ్చుటన్, సురిఁగె మహాజలం బఖిల భూవ్యతఁ
జేర్చుట యేమి చందమో ! హరి. ఉ. 9. 95.

సీ. చందురు నిల్లితో సమరంబునకు నేఁగునగిదిఁ
గుప్పించి యుప్పర మెగయును, సురిఁగిపోయెన
వన్నెఁ జొ(? ) జోటులే దిరక, నీవె దిక్కనుక గి
నెదురువచ్చు భార. అర. 2. 63.

సీ. ఏ దెస వచ్చునో యిది యని వలుమాఱు,
సురుఁగుచుఁ గ్రిగంటఁ జూచువాని. భాగ. 10.
స్కం. 878.

చం. .... అల ఘోషయాత్రలోఁ గురుపతి డించి
క్రీడికృపకుం దగు పాత్రము నేసి యెక్కడన్.
సురిఁగితి చెప్పుమా నిజము సూతతనూభవ వాకు
వేప్పడన్. భార. కర్ణ. 2. 83.

ద్వి. వరుసత్రొక్కు నీఁబడి పడఁజాలలేక సిరిగిరి
మంతఁగ సురుఁగ వచ్చితివా. బస. పురా. 62 పే.
18 పం.

7. పాఱిపోవు.

వ. వెఱిగి సురుఁగు వారును గ్రేఁగి లోఁగువారును
గుంది కుందువారును ద్రావి కూలువారును వెఱచి
పఱచువారును నై పలుదొసఁగుల నెసంగుచుండి
రప్పుడు. అ. రా. యుద్ధ 864.

తే. సురిఁగి భయమున గొందులు సొచ్చువారు,
నెగిచి పరతేర సందుల కేఁగువారు. భా. రా.
యుద్ధ. 1845.

చం. అరుదుగఁ దమ్మభూవిభుని యన్నను దాడికి
నోడి శాత్రవుల్, దిరుగని డొంకలుం బడని తెక్కలి
టెంకులు పాదచారులై, యరుగని కానలుం జొరని
యీఱమి కోనలు భీతచిత్తులై, సురుగని త్రోవలు
న్నిలువఁజూడని గ్రేవలు లేవు భూస్థలిన్. వి పు.
1. 44.

తే టలిగట్టినయట్లకు మఱికి పెద్ద,బావలం దున్న
వెన్నలు బావుకొనుచు, నుట్టులను ద్రచ్చిబానల
మరలద్రోచి, సురుఁగుఁ జెలికాంద్ర కెల్లను జూఱ
విడిచి హరి. పూర్వ 5 208.

8 చొచ్చు, ప్రవేశించు.

కం. కరవాల భైరవునిచే నరుగుదు రరు లంక్కమం
డలాకారములో, సురిఁగి యన నధికపదనుగు,
నరయఁగ నాకార శబ్ద మధికం బగుటన్. కావ్యా.
6. ఉల్లా 109.

9. మృతి నొందు.

చం తుఁగము చన్న మార్గమును, దూకొను
వృతము కొమ్మ మాలవాఁ, డంపిన చేను వాని
మత యన్నము వెట్టినతావు, దానిఁ జెచ్చెర వరి
యించి కాపురము సేన యిల్లును నాలుబిడ్డలున్,
సురిగినచోటు దాను సొద చొచ్చిన భూమియుఁ
జూచెఁ దెల్లగన్. వాసిష్ఠ. 2. 255.

ఆ. వె. అప్పు పుచ్చుకొన్న యతఁ డిచ్చిన నరుండు,
సొమ్ము దెగకమున్న సురిఁగిరేని, వడ్డి చెల్లకున్న
వర్తింతురే రీతి,నందు నిందుఁ దెలుపుమయ్య తాత.
శేష. 8. 241.

10. తగ్గు, నశించు.

సీ. శ్రుతి పుటంబుల శక్తి సురిఁగిపోవకమున్న, వదు
లాననమునఁ బర్వకయమున్న. కాశీ. 3. 84.

11. భగ్నమగు, విఱుఁగు.

వ. భుజావష్టంభంబున విజృంభించిన మరలు మాతం
గంగంబులును సురుఁగు రథంబులును దిరుగు పదా

తులు నై తమసైన్యంబు దైన్యంబు వహించిన. వరాహ. 5. 26.

12. వాడు, మ్లానమగు,

సీ. అంగజ నీ లోచనారవిందములు సురిఁగి యున్నవి గాని సొంపులేదు. వీర. 2. 63.

కం. పరభూమి ప్రజయుఁ జేరుమ, తిరముగ ధర యేలురాజు దేశంబునకున్, మరుగుడు రెప్పటి ప్రజలును, నరపతి న్యాయంబు దప్పి నడచిన యేనిన్. రుక్మాం. 2. 26.

13. వెనుదీయు.

ద్వి. మరగి చొచ్చినయట్లు మత్తపోవనము సురుఁగక చొచ్చి కానుగ నన్నుఁ గొనక. హరిశ్చ. పూర్వ. 1198.

14. బాధపడు.

సీ. సురగాలి తిరువుల సురుఁగదే యాతన్వి యచలంబులై చన్ను లమరకున్న. హంస. 3.

సురుగాడ్పు వి. సుడిగాలి.

ఎ. గీ. దొనఁగు లెనగించే సురగాడ్పు తుటుము ధాడి, కదలి తద్దయు గడగడ వడఁకుగాని, వేల్పు రాకన్నెఁ గాంచి రా వెలఁదు లపుడు. కని. 4.47.

సురుఁగుడు వి. ఒకానొక యెఱ్ఱచాయ చెక్క చెట్టు, సురుగుడు చెట్టు,

సీ. జువ్వి మామిడి జీడి సురుగుడు మొలుగు పాపట చంద్రవనిక పాలరేల. వేం. పంచత. 4. 471.

ద్వి. సురుగుఁ గ్రమారేళ్ళ జాతపోతములను, గురు వకంబులఁ గేఁదగుల వశోకముల. హరిశ్చ. పూర్వ. 725.

సురుఁడు వి. దివిటీ మాఱుగా కాల్చి పట్టుకొనెడు వెలుతురు కట్టెలకట్ట. ఆ. భా. (శ. ర.).

సురుమా-సుర్మా (ఉర్దూ. సుర్మా) కాటుక. చంద్ర. 2. 131.

సురుమాయి వి. కాటుక.

సీ. వడగల తొడిఁబడఁదొడరు భోగులగెల్చి సురుమాయి జల్లుల సొబఁగుఁ గాంచె, మద్దండగతి విల్లు మత్పలంబుల గెల్చి యతనుధ్వజశ్రీల నందుకొని యె, బాణసంపద జూన్న తూణీరముల గెల్చి బిసరుహాళుల విభ్రమముఁ జెందె, గండోత్కటంబులై కరియు గుత్తుల గెల్చి ఘనవాద్య కుంభలాంఛనముఁ గాంచె, తిరిత దళమెత్తు పోకబోదెల హసించి, విజయ మంగళ శంఖాంక విఖ్యాతి గాంచె, వలల వేనలి నతిచూపు నతివ జంఘ. కలికి చనుదోయి తొలి నాగ కంధరమును. భాను. 4. 15,

చం. చటులతఁ బాంథులన్ గెలువఁజాలిన శంబర దైత్య భేదికిం బటువగు తెక్కజోదు సురుమాయి గజల్లుల మేటి రౌతు బంట్లఁట కలకంఠముల్ మదకుకావళి వచ్చునిదాలు పావురాలఁట వనవాటి లోన బలజాతన యెగతి డాఁగ వచ్చితే. భానుమ. 3. 14.

సురుము వి. చూర్ణము, పొడి.

సురూపము సం విణ (అ. అ. అ.) 1. సుందరము. 2. విజ్ఞము, తెలివిగలది.

సురూపుఁడు సం. వి. అ. పుం. శివుడు.

సురూపుఁడు సం. వి. అ. పుం. చక్కనివాఁడు విద్వాంసుఁడు.

సురె నై. వి. (ప్రాకృ. ఛురికా) రూ. సురియ, కత్తి.

ద్వి. వెలువడియై సురె వెలికి ప్రాణమున కొర గోపినట్టుల నొకదెసఁ జేర్చి. బస. పురా. 186 పు. 16 పం.

సీ. గాటంపుమూఁగారు ఘనకృపాణము గాఁగ బోక క్రొంకెలి గోళ్ళు సురెలు గాఁగ. రసిక. 5. 176.

సీ. జాతి నీలపుఁ దాళి చాకచక్య ప్రభల్ కస్తూరి వెలిపూఁతఁ గుస్తరింపఁ, పొగసు పూర్వ పట్టంపు సురెవాలుమై తళుక్క పాంబట్టు దట్టపై నోలసింప. సారంగ. 1. 79.

కం. విరసమునఁ గొట్టువతి నా, పరిగరితలలోన బ్రతుకు పైతునె నే, సురెఁబోదు గ్రాటఁ బోఘన్. వేం. పంచత. 4. 480.

తే. ... సాయకములు మరున కేమ గల్గి గేదఁగి సురె యొక్కుడయ్యె. అము. 4. 114.

సీ. కరవాడి చిటురాకు సురెకత్తిచే నొత్తి మగం ఘానము గొను ఘానటేఁడ. షుదక్షి. 5.59,

సురెయాకు వి రూ. సురియాకు.

సురేకారము వి. ఒక దినుసు ఉప్పు.

సురేభము సం. విశే. (అ. అ. అ.) మంచి కంఠ స్వరము గలది.

సురేభము సం. వి. అ. న. తగరము.

సురేష్టము సం. వి. అ. పుం. సాలవృక్షము (వృ. వి.).

సురోత్తరము సం. వి. అ. పుం. చందనము.

సురోదము సం. వి. అ. పుం. కల్లు సముద్రము.

సుఱసుఱ వి. ప్రుక్కుటయందగు వనుకరణము.

చి.....సుఱసుఱం దుదసుళ్ళుగ ప్రుక్కెవోయనన్. ఆము, 5. 128.

సుఱ్ఱు వి. సుక్కుటయందగు వనుకరణము.

సీ. ముళ్ళన్ని గలిగిన సుఱ్ఱున ప్రుక్కక యను వయ్యుఁ బరులకు వలవుగాక, తనలోని బడబాగ్ని దరిజావ మండియు వడగాలి మీలనై నుడియనీక. హ్యా. 2. 160.

చం. వెలుఁగుల జేని వేవెలుఁగు వేడిమి సుఱ్ఱున ప్రుక్కు నావగ్గా, కలశనమున నీమ్ముదుల కాయము లన్. చంద్రాంగ. 2. 52.

సులక్షణము సం. విశే. (అ. అ. అ.) 1. శుభ లక్షణ ములు గలది 2. అదృష్టము గలది.

సులక్షణము సం. వి. అ. న. 1. పరిశీలనము, పరీక్ష, నిర్ణయము. 2. మంచిలక్షణము లేక చిహ్నము,

సులతాను హిం. వి. తురుష్క ప్రభువు.

చం. జవజితవైనతేయములు కాహణము లశ్వల కాను చూడ్కికిన్, దవిలిచె నత్తరిన్ మదము ధారిత రేచిత వల్గితప్లుత, ప్లవన పులాయితాది గతు లన్. రంగా. 3. 18.

సులభకోపము సం. విశే (అ. అ. అ.). శీఘ్రముగాఁ గోపించునది, చిరాకు గలది.

సులభము సం. విశే. (అ. అ. అ.) 1. సుఖముగా లభించునది. 2. తేలికగాఁ జేయఁదగినది. 3. యోగ్య మైనది, సిద్ధమైనది. 4. సహజము. స్వాభావికము.

సులభము సం. వి. అ. పుం. సులువు, అల్పయత్నము.

కం సులభమునఁ దీర్పవని నై, బలువగుయత్నంబు సేయఁ బరిచూచిన యే ములు ముంటఁ దివియ కడి దము, జరిపించిన యట్టిజేల చందము వచ్చునన్. కవి. 2. 48.

సులువు వి.

గీ. అన్నియును జోచుచుండెన నఃతో యింతో, యంతచను మానమునకు రా నింతెకాని, నేను బట్టెద వచ్చచో నౌనె ధనము, దులిచినప్పుడు తెలియ నా సులువు లెల్ల.

విశే. చులకనైనది

సులోచన సం. వి. ఆ. స్త్రీ. 1. అందమైన. కన్నులు గల స్త్రీ. 2. ఇంద్రజిత్తు భార్య పేరు.

సులోచనము సం. విశే. (అ. అ. అ.) అందమైన కన్నులు గలది.

సులోచనము సం. వి. అ. పుం. లేడి

సులోహకము సం. వి. అ. న. ఇత్తడి.

సులోహిత సం. వి. ఆ. స్త్రీ. అగ్నిదేవుని సప్త జిహ్వ లలో నొకటి.

సులోహితము సం. విశే. (అ. అ. అ.) మిక్కిలి ఎఱ్ఱ నైనది.

సుల్తాను వి. ఒకానొక తురక పేరు.

కం. సిరిగుబ్బ చన్నుగొండల, దరులం గలిమొగుల వగిదిఁ దవిలి తిరుగు వ,మ్మరు తంద్రి మనువు వన ములు, నెఱయఁవమీన్ భావ సింగిణీ సుల్తానా. యయా. 3. 1.

సువక్త్రము సం. వి అ. న. 1. మంచి ముఖము లేక నోరు. 2. సుష్ఠూచ్చారణము

సువక్త్రుఁడు సం. వి. అ. పుం. శివుఁడు.

సువచనము సం. వి. అ. న. మంచిమాట. 2. వాగ్ధాటి.

సువచస్సు సం. వి. స్. న. చూ. సువచనము.

సువదన సం. వి. ఆ. స్త్రీ. అందమైన ముఖము గల స్త్రీ.

సువర్చకము సం. వి అ పుం క్షారము, లవణము.

సువర్చల సం. వి. ఆ స్త్రీ. నింగిమిరి (వృ. వి.)

సువర్చలము సం. వి అ. న. అవిసె (వృ వి.)

సువర్చసుఁడు సం. వి. అ. పుం. శివుఁడు.

సువర్చి సం. వి. ఇ. పుం. సువర్చకము.

సువర్చిక(ము) సం. వి. అ. పుం. ఆ. స్త్రీ. సువర్చకము.

సువర్ణ సం. వి. ఆ. స్త్రీ. 1 అగ్ని యొక్క సప్త జిహ్వలలో నొకటి. 2. నల్ల కలబంద (వృ. వి.) 3. పసుపు. 4. ఏటి పుచ్చ. వెఱ్ఱి పుచ్చ. (వృ. వి.)

సువర్ణకము సం. వి. అ. న. 1. ఇత్తడి, కంచు 2. సీసము. 3. బంగారము.

సువర్ణకారుఁడు సం. వి. అ. పుం. కంసాలి.

సువర్ణపుష్పము సం. వి. అ. న. చెంగల్వ.

సువర్ణ పుష్పితము సం. విశే. (అ. ఆ. అ.) బంగారము సమృద్ధిగాఁ గలది.

సువర్ణపృష్ఠము సం. విశే. (అ. ఆ. అ.) బంగారు పూత గలది. బంగారు నీరూరినది.

సువర్ణ బిందువు సం. వి. ఉ. పుం. 1. విష్ణువు. 2. శివుని మూర్తి విశేషము.

సువర్ణము సం. విశే. (అ. ఆ. అ.) 1. మంచి రంగు గల. 2. మంచి కులమునకుఁ జెందిన. 3. మంచి కీర్తి గల.

సువర్ణము సం. వి. అ. పుం. 1. మంచి రంగు. 2. మంచి కులము 3. ఒక యాగము. 4. ఉమ్మెత్తకాయ.

సువర్ణము సం. వి. అ. న. 1. బంగారము. 2. బంగారు నాణెము. 3. పదునారు మాషముల యెత్తు బంగారము. 4. ధనము, 5. మంచి గంధపు చెక్క (వృ. వి.) 6. సిందూరము (Red Chalk) 7. నాగ కేసరము (వృ వి.) 8. మంచి వర్ణము గలది. 9. మాడ. 10. ఒక పువ్వు. 11. నల్లి అగరు.

సువర్ణయూథి సం. వి. ఈ. స్త్రీ. పచ్చమల్లె.

సువర్ణరేతుఁడు సం. వి. స్. పుం. శివుడు.

సువర్ణవత్ సం. విశే. (త్. ఈ. త్.) 1. బంగారముతోఁ జేయఁబడినది. 2. బంగారు రంగు గలది. 3. అందమైనది.

సువర్ణవర్ణ సం. వి. ఆ. స్త్రీ పసుపు.

సువర్ణవర్ణుఁడు సం. వి. అ. పుం. విష్ణువు.

సువర్ణాక్షుఁడు సం. వి. అ. పుం. శివుఁడు,

సువహేఁడు వి. శివుఁడు (?)

సీ. తులకించు తన కీర్తి తొవహేని సువహేని కవహేని చకచకచ్ఛవి హసింప. రఘువం. 1. 52.

సువసంతకము సం. వి. అ. పుం. 1. మంచి వసంత ఋతువు. 2. చైత్ర పూర్ణిమ. 3. వసంతోత్సవము. కామోత్సవము.

సువహ సం. వి. ఆ. స్త్రీ. 1. వీణ (Lute). 2. అంసగు (వృ. వి.) 3. కారేలి (వృ. వి.) 4. చెప్పుతట్టు (వృ. వి.) 5. నల్ల వావిలి (వృ. వి.) 6. సర్పాక్షి (వృ. వి.)

సువహము సం. విశే. (అ. ఆ. అ.) 1. చక్కగా మోయునది. 2. సహనము గలది, ఓర్పునది. 3. తేలికగా మోయదగినది.

సువారము వి. వంట.

ఉ. అక్కన్నియ యిల్లు నిల్పు తెలి గన్నులు ప్రొక్కులు గన్న ఫాలముల్వెన్నలు చిందవం దఱుని జేరి సువారపుటింటి ముంగిటన్ బహు. 8. 4.

కం. వంటయొకించుక చేయుం, డంటన్ విన్నారొ లేదో యచటి సువారం, బింటి కలకంఠు లొగిగదె, యంటబె కావించి రీశ్వరాయుతమునకున్. పాంచాలీ. 4. 89.

చం. పొడి మిరియంబుగా వెదలిపోయెడు కొండల నుగ్గు చేసి యెక్కుడు జలజంతులం బొలసుకూరలు వండి వెసంద చిప్పలం, దుడుకఁగఁ బెట్టి ముత్తియపు టోగిరముల్ కడు గ్రుమ్మరించె న,య్యోధ రఘువీర సాయకము లెక్కడ నేర్పె సువారపుంబనుల్. రామా. 7. 107.

సువాల వి. ఆడువారు పెండ్లిండ్ల యందు సువ్వి యను పదముతో నాలాపము చేసి పాడెడు పాట.

శా. నీ కే వచ్చు సువాలయున్ ధవళమింతి యల్లో నేరేళ్ళుగా, కల్యాణములంచు వింటికడి నే కిలిన్ విజృంభింతువే, వాకిలిచ్చుట వంచు నిద్దలు సతుల్

వాక్యోపవాక్యంబులన్, గాత్రైముందల పట్లకుం
డొడగిరా కళ్యాణ వేదీ స్థలిన్. పాంచాలి.
4. 24

**సువాళించు** స. క్రి. త్రిప్పు.

తే. వింత గాఁగ నొకానొక విలసన బుఁ, జూప
నయ్యెంతిఁగదుఁ రాము జూడవెఱచి, కడము పూ
రండ లెల్ల నొక్కటఁగఁ బట్టి, బాలకపుడు సువా
ళించి పాఱవైచె. (దృష్టి దోషము తీయునపుడు
శిశు న్నునకుఁ జుట్టు త్రిప్పుట యని తోఁచెడిది) కళా
7. 68.

**సువానము** సం. వి. అ. పుం. 1. మంచి నివాసము.
2. మంచి వాసన.

**సువాసిని** సం. వి. ఈ. స్త్రీ. 1. భర్త బ్రతికియున్న
స్త్రీ. సుమంగళి. 2. కన్య.

**సువాసుఁడు** సం. వి. అ. పుం. శివుఁడు.

**సువిత్తు** సం. వి. ద్. పుం 1. పండితుఁడు. 2. తెలివి
గలవాఁడు. 3. నేర్పరి.

**సువిదల్ల** సం. వి. అ. స్త్రీ. వివాహిత. పెండ్లి అయిన
స్త్రీ.

**సువిదల్లము** సం. వి. అ. న. అంతఃపురము,

**సువిదల్లుఁడు** సం. వి. అ. పుం. (రూ. సౌవిదల్లుఁడు)
అంతఃపురము కావలివాఁడు.

**సువిదితము** సం. విశ. (అ. ఆ. అ.) చక్కఁగా
తెలియఁగఁబడినది. స్పష్టముగాఁ దెలిసినది.

**సువిదిత్రము** సం. వి. అ. న. 1. కుటుంబము. సంసా
రము. 2 సంపద, ధనము.

**సువిదుఁడు** సం. వి. అ. పుం. 1. అంతఃపుర పరిచార
కుఁడు. 2. రాజు.

**సువిధాముఁడు** సం. వి. అ. పుం. ప్రధానుఁడు.

ద్వి. ద్వారపాలుర సువిధాముల విండ్ల వారిఁ దలా
రులఁ వారికొయేరి. బస. పురా 3. 512 పం.

**సువిహితము** సం. విశ. (అ. ఆ. అ.) 1. చక్కఁగా
మంచఁబడినది. 2. చక్కగా పలంకరింపఁబడినది
3. చక్కగా ననుష్ఠింపఁబడినది;

**సువీ(బీ)జము** సం. విశ. (అ. ఆ. అ) మంచి
గింజలు గలది,

**సువీ(బీ)జము** సం. వి. అ. పుం. గసగసాల కాయ.

**సువీ(బీ)జము** సం. వి. అ. న. మంచి గింజ.

**సువీ బీ జుఁడు** సం. వి. అ. పుం. శివుఁడు.

**సువీర్య** సం. వి. ఆ. స్త్రీ. అడవి ప్రత్తి (వృ. వి.)

**సువీర్యము** సం. వి. అ. న 1. గొప్ప పరాక్రమము.
శౌర్యము. 2. వీరుల సమూహము (సమృద్ధి)
3. రేగుపండు

**సువృత్తము** సం. విశ. (అ. ఆ. అ) 1. మంచి ప్రవ
ర్తన గలది 2. మిగుల గుండ్రనైనది.

**సువృత్తము** సం. వి. అ. న. 1. మంచి నడవడి.
2. మంచి పద్యము.

**సువృత్తి** సం. వి. ఇ. స్త్రీ. సుగహన.

**సువేలము** సం. విశ. (అ. ఆ. అ.) 1. నిశ్చలము,
ప్రశాంతము 2 వినీతము, అనుద్ధతము.

**సువేలము** సం. వి. అ. పుం. త్రికూట పర్వతము.

**సువ్వాలు** వి. ఇ. వ. పాటలో విశేషము.

కం. ఆ లలనామణి కాగ, య్యాళి యొకానొక్క
వేళ నక్కఱతోను, వ్వాలు నోళ్లవములు ధవళా
లున్ మొదలైన పాటలందగు నేర్పున్. శుక. 1.
484.

**సువ్రత** సం. వి. ఆ. స్త్రీ 1. పతివ్రత. మంచి
యిల్లాలు. 2. సాధువైన ఆవు.

**సువ్రతుఁడు** సం. వి. అ. పుం. నియమవంతుఁడైన
విద్యార్థి (A Religious Student)

**సువ్వలాల** వి. చూ. సువ్వాల.

**సువ్వాల** వి. ఆడవారు పెండ్లిండ్లలో సువ్వి యను
పదముతో ఆలాపము చేసి పాడెడు పాట.

కం. ఆ లలనామణి కాగ, య్యాళి యొకానొక్క
వేళ నక్కఱతో సువ్వాలలు సోబానలు ధవళా
లున్ మొదలైన పాట లాదగ నేర్పున్. శుక. 1 ఆ
(శ. ర.)

**సువ్వి** వి. దంచుట యందగు ధ్వన్యనుకరణము.

**సుశకము** సం. విశ. (అ. ఆ. అ) సులభముగాఁ
జేయ వీలయినది, సుకరము,

సుశర్ముఁడు నం. వి. ఒకని పేరు. రూ. సుశర్మ.
కం. ఇలఁబడిన సహచరులఁగని.యలిగి సుశర్ముండు దాకె నర్జునున్. భార. భీష్మ. 3. 55.

సుశల్యము నం వి. అ పుం. ఖదిరవృక్షము. (వృ.వి.)

సుశవి నం. వి. ఈ. స్త్రీ. చూ. సుషవి.

సుశాకము నం. వి. అ. న. అల్లము.

సుశారదుఁడు నం. వి. అ. పుం. శివుఁడు.

సుశిక్షితుఁడు నం. విశే. (అ. ఆ. అ;) 1. చక్కగా నేర్పబడినవాఁడు. 2. వినీతుడగువాఁడు.

సుశిఖ నం. వి ఆ. స్త్రీ. 1. నెమలి నెత్తి మీది కుచ్చు. 2. కోడిపుంజు నెత్తి మీది కొండె.

సుశిఖము నం. వి. అ. పుం. అగ్ని.

సుశీతము నం వి. అ. న. పచ్చని చందనము. (శ్రీ చందనము)

సుశీమము నం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి చల్లనైనది.

సుశీమము నం వి. అ. పుం. చల్లఁదనము.

సుశీల నం వి. ఆ. స్త్రీ. 1. మంచి శీలము గల స్త్రీ. 2. యముని భార్య. 3. కృష్ణుని అష్టమహిషులలో నొకతె.

సుశీలము నం. విశే. (అ. ఆ. అ.) మంచి గుణము గలది, మంచి వడవడిక గలది.

సుశ్రుతము నం. విశే. (అ. ఆ. అ.) 1. చక్కగా వినఁబడినది 2. వేద విజ్ఞానము గలది.

సుశ్రుతము నం. వి. అ. న. సుశ్రుతాచార్యునిచే రచింపఁబడిన ఆయుర్వేద శాస్త్ర గ్రంథము.

సుశ్లిష్టము నం. విశే. (అ. ఆ. అ.) 1. చక్కగాఁ గూర్పఁబడినది. 2. గుప్తముగా ధరింపఁబడినది.

సుషమ నం. వి ఆ. స్త్రీ మిక్కిలి శోభ.

సుషవి నం. వి. ఈ. స్త్రీ. 1. ఒక దినుసు గుమ్మడి. 2. నల్ల జీలకఱ్ఱ 3. కాకర, (వృ. వి.) 4. జీలకఱ్ఱ.

సుషాఢుఁడు నం. వి. అ. పుం శివుఁడు.

సుషి నం. వి. ఇ. స్త్రీ. 1. రంధ్రము, బెజ్జము. 2. గొట్టము.

సుషి(షీ)మము నం. విశే. (అ. ఆ. అ.) 1 చల్లని. 2. ఆహ్లాదకరమైన.

సుషి షీ)మము నం. వి. అ పుం. 1. చలి 2. ఒక దినుసు పాము. 3. చంద్రకాంత శిల.

సుషిమము నం వి. అ. న.. చల్లదనము.

సుషిర నం. విశే. బెజ్జము గలది.

సుషిర నం వి. అ. న. 1. బెజ్జము. 2. పిల్లనగ్రోవి లోనగు వాద్యము.

సుషిర నం. వి. ఆ. స్త్రీ. గువ్వగుత్తిక (వృ. వి.)

సుషిర నం. వి. అ పుం. కిక్కస (వృ వి ) (శ. ర.)

సుషుప్తి నం. వి ఇ. స్త్రీ 1. ఒళ్ళెఱుఁగని నిద్ర. 2 గాఢ నిద్ర.

సుషుమ్నము నం వి. అ. పుం. సూర్యకిరణములలో నొకటి.

సుషుమ్న నం. వి ఆ. స్త్రీ. ఒక నాడి.

సుషేణము నం. వి. అ పుం 1. ఒక చెట్టు, కరమర్దము. 2. పేము, వేత్రము.

సుషేణము నం వి. అ. పుం. కలివి.

సుషేణిక నం. వి. ఆ. స్త్రీ. నల్ల తెగడ (వృ. వి.)

సుషేణుఁడు నం. వి. అ. పుం. 1. విష్ణువు. 2. ఒక వానర నాయకుఁడు.

సుష్ఠు అవ్య 1. బాగుగా, చక్కఁగా 2. ఎక్కువగా. 3. నిజముగా, యుక్తముగా.

సుష్మము నం వి. అ. న. త్రాడు, దారము.

సుసత్వ నం వి ఆ. స్త్రీ. జనకుని భార్య.

సుసరభేత్తు సులువుగా రోమములఁ దొలఁగఁ జేయు మందు.

సుసరము విశే. సూక్ష్మము. సన్నము.

మ. వసుధానాయక వేటకుఁ గదలు నత్యంతెక్కి మేనింతకున్, సుసరంబై లఘువౌ మృగంబుల భయ శోభంబులన్ దర్గుఁడ, ప్రసరంబేర్పడఁ జేతి మూటమెఱయింపన్ జొటగున్ వేఁటదుర్వ్యసనం బంద్రు ధరిత్రి విట్టిగతి సౌఖ్యం బొందుచోఁ గల్గునే? ద్వా. 3. 20.

**సుసికత** సం. వి. అ. స్త్రీ 1. మంచి యిసుక. 2. పంచదార.

**సుస్తి** హిం. వి. సోమరితనము.

**సుస్థత** సం. వి. అ. స్త్రీ. 1. క్షేమము, ఆరోగ్యము. 2. భద్రత.

**సుస్థము** సం. విశే. (అ. ఆ. అ.) 1. యుక్తమైనది. సరియైనది. 2. ఆరోగ్యవంతము, భద్రము. 3. ధనవంతము. 4. సుఖవంతము. అదృష్టవంతము.

**సుస్థితి** సం. వి. ఇ. స్త్రీ. సుస్థత.

**సుస్థిరము** సం. వి. అ. న. సుస్థిరత్వమని భావప్రధాన నిర్దేశము, నిలుకడ,

కం. రాజునకు విజయమూలము, రాజితమంత్రంబు సుస్థిరంబున దానిన్, రాజాన్వయ రక్షించితె. భార. సభా. 1. 27.

**సుస్మిత** సం. వి. అ. స్త్రీ మంచి చిఱునవ్వు గల స్త్రీ.

**సుస్వపనుఁడు** సం. వి. అ. పుం. శివుఁడు.

**సుస్వరము** సం. విశే. (అ. ఆ. అ.) 1. చెవికింపైనది 2. ఉచ్చధ్వని గలది.

**సుహిత** సం. వి. అ. స్త్రీ. అగ్నిదేవుని సప్త జిహ్వలలో నొకటి.

**సుహితము** సం. విశే. (అ. ఆ. అ.) 1. యోగ్యము. ఉచితము. 2. ఉదారము. ఉపకారము. 3. అనుకూలము, అనురక్తము. 4. తృప్తము, ప్రీతము.

**సుహృత్తు** సం. విశే. ద్. మంచి హృదయము గలది. దయ గలది. ప్రేమ గలది.

**సుహృత్తు** సం. వి. ద్. పుం. 1. మిత్రుఁడు. సఖుఁడు 2. సహాయుఁడు.

**సుహృదయము** సం. విశే. (అ. ఆ. అ.) 1. మంచి హృదయము గలది. 2. ప్రేమ గలది. 3. దయ గలది.

**సుహృదయుఁడు** సం. వి. అ. పుం. మిత్రుఁడు, సఖుఁడు.

**సుహృదుఁడు** సం. వి. అ. పుం. మిత్రుఁడు, సఖుఁడు.

**సుళి** వి. ఝుంకారము.

**సుళిగవ** = ఝుంకారము, ఝూంకారమును.

కం. చెలులు తలకట్టు లాచా. పులునైత్యతత్వములు మిత్రములు గుడిగవయున్. సుళిగవయు నేత్వ యుగమును, తెలుపగు చుట్టములు ద్వివిధ శృంగౌత్వమ్ములన్. అప్పక. 3. 46.

**సుళువు** విశే. తేఁతయైనది.

సీ. వలెవాటు వైచిన సుళువు చెందిర కావి వలివ పముల్ పదపల్లవముల జీరం. చంద్రికా. 1. 107.

సీ. సుళువు ఛాయల పేరి తెలినీరు బుగ్గల యొద్ద పట్టెపుఁ గత్తి నొనరఁ బట్టి, పచ్చతాపితదట్టి పస మించు పచ్చరాచిలుక క్రొంబిడి వంకి వలవఁరించి. చంద్రాంగ. 2. 68.

**సుళ్ళఁబెట్టు** స. క్రి. (సుళ్ళన్ + పెట్టు) 1. సుడిగుండము వేయు. 2. చిక్కులు పెట్టు.

సీ. వక్రగతులు మాఱు వర్తించు చందంబు బెట్టుగా పడిసుళ్ళఁబెట్టురట్టు ... గీ. మదిదలంచియె యెందును గొదవలేక, సకల సౌభాగ్యము గ్రోలంచు జహ్ను కన్య, యంచిరప్ప నృపాలు భార్యా పతంస మైన గంగాంబయై కీర్తిపంరె జగతి. (రెండర్థముల కిదే). ఇందు 1. 77.

**సుళ్ళసూరి** విశే. 1. సుడులు గలవాఁడు 2. చుట్లఁ బెట్టువాఁడు.

కం....లనిలుడు సుళ్ళసూరి కమఠారి నిశాచరుఁడ. శృం. 1. అ.

**సుళ్ళెములు**

సీ. చతురతై కొప్పుల జడ సుళ్లెములు వెట్టి లీలమై పుష్పమాలికలు జేర్చి. వీర. 3. 149.

**సుళ్వు** వి. వీలు, అవకాశము (రూ. సుళువు. సులువు)

సీ. ఇనుఁడు గన్పడని సుళ్వెఱిఁగి ముందేవాలు కొంచకయిల వల్లుకొనిరనంగ. ప్రబం. 1. 64.

## సూ

**సూ** = చూ. అవ్య. 'చూ' అను అవ్యయమే కళల మీఁద గసడద వాదేశముచే "సూ"గా మారును. (చూడు. అవ్య).

1. నిశ్చయార్థకము.

కం. శ్రీమంతుఁడె కులవంతుఁడు, శ్రీమంతుఁడె సుభగరూపజితకంతుఁడు సూ, శ్రీమంతుడె గుణవంతుఁడు, శ్రీమంతుఁడె సిద్ధశేముషీ మంతుండున్. విక్ర. 2. 175.

**సూ** (ఉత్తర పదముగా) సం విశే. ఈ = జనకము, ఉత్పాదకము.

**సూ** సం. వి. ఈ. స్త్రీ. కన్నతల్లి, జనని.

**సూకము** సం. వి. అ. పుం. 1. బాణము, 2. గాలి, 3. కమలము.

**సూకరము** సం. వి. అ. పుం. (రూ. శూకరము) 1 పంది 2. ఒకవిధమగు లేడి.

**సూకరి** సం వి. ఈ. స్త్రీ. 1. ఆడు పంది. 2. ఒకవిధమగు నాచు.

**సూకరుఁడు** సం. వి. అ. పుం. కుమ్మరవాఁడు.

**సూక్ష్మతండుల** సం. వి. ఆ. స్త్రీ. 1. పిప్పలి. (వృ.వి.) 2. ఒక దినుసు గడ్డి.

**సూక్ష్మ తండులము** సం. వి. అ. పుం. గసగసాలు. (వృ. వి.)

**సూక్ష్మదర్శి** సం. విశే. (గా. నీ. న్) 1. చురుకైన చూపు గల. 2. వివేకము గల, 3. కుశాగ్ర బుద్ధి గల.

**సూక్ష్మదర్శిత** సం. వి. ఆ. స్త్రీ. 1. చురుకైన చూపు గలిగియుండుట. 2. తీక్ష్ణదృష్టి. 3. తెలివి. 4. భవిష్యద్దర్శనము, ముందు చూపు.

**సూక్ష్మదేహము** సం. వి. అ. పుం. లింగ శరీరము.

**సూక్ష్మపత్రము** సం. వి. అ. పుం. 1. కొత్తిమిర, ధనియము (వృ. వి.). 2. అడవి జీలకఱ, విష కంటకాలు. (వృ. వి.) 3. అడవి చెఱకుగడ (వృ. వి.) 4. తుమ్మ చెట్టు (వృ. వి.) 5. ఒక దినుసు ఆవాలు.

**సూక్ష్మపర్ణి** సం. వి. ఈ. స్త్రీ. ఒక దినుసు తులసి.

**సూక్ష్మబీజము** సం. వి. అ. పుం. గసగసాలు.

**సూక్ష్మమక్షిక(ము)** సం. వి. అ. న. ఆ. స్త్రీ. దోమ.

**సూక్ష్మమానము** సం. వి. అ. న. సున్నితమైన కొలత. సరియైన కొలత.

**సూక్ష్మము** సం. విశే. (అ. ఆ. అ.) 1. అగోచరము, స్థూలము కానిది. 2. అల్పము, చిన్నది. 3. సుకుమారము. పలుచనిది 4. సున్నితము. 5. తీక్ష్ణము. చురుకైనది, 6. నిపుణము, చతురము 7 సరియైన, కచ్చితమైన, ఒప్పయిన.

**సూక్ష్మము** సం. వి. అ. పుం. 1. అణువు. 2. ఇంగుది. (వృ వి.) సం. వి అ. న. 1. సర్వవ్యాపియైన చైతన్య తత్త్వము. 2. పరమాత్మ 3. అల్పత్వము. 4. ఒక యోగసిద్ధి (సావద్యము, నిరవద్యము, సూక్ష్మము) 5. నైపుణి. చాతుర్యము. 6. కపటము, మోసము. 7. సన్నని దారము. 8. ఒక అర్థాలంకారము. (అసంలక్షిత సూక్ష్మార్థ ప్రకాశః సూక్ష్మ ఉచ్యతే ప్ర. రుద్రీ.)

**సూక్ష్మవాక్యము** సం వి. అ న ఉత్తరసాక్షి చెప్పిన మాట.

**సూక్ష్మశర్కర** సం. వి. ఆ స్త్రీ సన్న యిసుక.

**సూక్ష్మశాలి** సం. వి. ఇ పుం. సన్న బియ్యము.

**సూక్ష్మషట్చరణము** సం. వి. అ. పుం చిన్న పేను. మలి పేను.

**సూక్ష్మాత్మ** సం. వి. న్. పుం. శివుఁడు.

**సూక్ష్మీకరించు** సం. స. క్రి. సూక్ష్మముగాఁ జేయు, సంగ్రహపఱుచు.

వ. ... సర్వోపమా ద్రవ్య సముచ్చయం బగు సౌందర్యం బనేకత్రా వస్థానదిదృక్షచే విరించి సూక్ష్మీకరించి యథాప్రదేశ నివేశితంబుగా నొనర్చెనో యని. హర. 3. 23,

**సూక్ష్ముఁడు** సం. వి. అ. పుం. శివుఁడు.

**సూక్ష్మైల** సం. వి. ఆ. స్త్రీ. చిన్న ఏలకి.

**సూచ** సం. వి. అ. స్త్రీ. 1. వేధ, గ్రుచ్చుట. 2. అంగాభినయము. 3. గూఢచర్య. రహస్యాన్వేషణము. 4. అభినయ విశేషము.

**సూచకము** సం. వి. అ. పుం. 1. గ్రుచ్చునది, 2 సూది, 3. భూతము, పిశాచము. 4. కుక్క. 5. కాకి. 6. పిల్లి. 7. సన్న బియ్యము.

**సూచకము** సం. విశే. అ. (స్త్రీ. సూచికా) 1. చూపునది, నిర్దేశించునది. 2. వెల్లడి చేయునది. ప్రకటించునది. 3. నిరూపించునది.

**సూచకము** సం. వి. అ. స్త్రీ. సూచనము, సూచకమగు చిహ్నము.

కం. ఒక పత్త్రితము దిశా,యక సంయుతుఁ డగుచు గురునియోగమునను సూ,చక యున్నతబిన్ శుభ సూ,చకముఁ తోడుత గురుఁడు శక్రున కనియెన్.. దశా. 2. 96.

**సూచకుఁడు** సం. వి. అ. పుం. 1. కల్లలమారి. చాడీకోరు. 2. రహస్యము బయట పెట్టువాఁడు. 3. గూఢచారి. 4. కథకుఁడు. బోధకుఁడు, ఉపాధ్యాయుఁడు. 5. సూత్రధారుఁడు. 6. ఒకానొక బుద్ధుఁడు. 7. ఒక సిద్ధుఁడు. 8. కపటి, మాయావి,

**సూచన(ము)** సం. వి. అ. స్త్రీ. అ. న. 1 పొడుచుట. కుట్టుట, రంధ్రము చేయుట. 2. నిర్దేశించుట, ప్రకటించుట. 3. నేరము బయటపెట్టుట, నిరూపించుట 4. అభినయించుట, అభినయము. 5. వ్యక్తము చేయుట. 6. వార్త. 7. ప్రదర్శనము, వర్ణనము. 8. లక్షించుట. 9. రహస్యముగా పరిశీలించుట, 10. కపటము, ద్రోహము. 11. క్రౌర్యము, హింస.

**సూచము** సం. వి. అ. పుం. 1. కుశాగ్రము. 2. తెల్లమొలక.

**సూచి** సం. విశే. న్. (స్త్రీ. సూచినీ) 1. గ్రుచ్చునది. కుట్టునది. 2. చూపునది, నిర్దేశించునది. 3. వెల్లడించునది. బయట పెట్టునది.

**సూచి** సం. వి. న్. పుం గూఢచారి, ఉత్తసాక్షి.

**సూచి** సం. వి. ఇ. ఈ స్త్రీ. 1. గ్రుచ్చుట, కుట్టుట, బెజ్జము వేయుట. 2. సూది, కుట్టని, 3 కుశాగ్రము. 4. అగ్రము, కొన. 5 మొగ్గ చివరి భాగము. 6. సేనా ముఖము, వ్యూహభేదము. 7. త్రికోణము. 8. కంకువు. 9. ఆంగికాభినయము. 10. నాట్య విన్యాస భేదము. 11. గ్రంథస్థ విషయముల పట్టిక. 12. పట్టిక, జాబితా. 13. సూది. కంటకురాలు. సూది వంటిది.

తే. లోకముల కెల్ల సూచి యల్లుండ్ర బూచి, ...అయ్యింతి తల్లి. కుక. 3. 18,

**సూచించు** సం. స. క్రి. 1. చూపించు, నిర్దేశించు, 2. ప్రకటించు. 3. వ్యక్తము చేయు. 4. బయలు పలుచు, వెల్లడించు. 5. అభినయించు. ప్రదర్శించు. 6. అన్వేషించు, కనిపెట్టు, గమనించు.

**సూచిక** సం. వి. ఆ స్త్రీ. 1. సూది. 'దుర్వాచిక సూచికాంకుర పరంపర' నైషధ. 2. ఏనుఁగు తొండము తెలియఁజేయునది.

**సూచికాధారము** సం వి అ. పుం. ఏనుఁగు.

**సూచికాముఖము** సం. వి. అ. న. శంఖము, నత్తగుల్ల

**సూచికుఁడు** సం. వి. అ పుం. దర్జీవాఁడు.

**సూచితము** సం. విశే. (అ. ఆ. అ.) 1. కుట్టఁబడినది. 2. రంధ్రము వేయఁబడినది. 3. నిర్దేశింప బడినది. 4. ప్రకటింపఁబడినది. 5. వెల్లడింపఁబడినది. తెలుప బడినది 6. గ్రహింపఁబడినది. విదితమైనది.

**సూచిని** సం వి. ఈ. స్త్రీ. 1. సూది. 2. రాత్రి.

**సూచిమంతుఁడు** సం. వి. త్. పుం. గరుత్మంతుఁడు, సం విశే. (త్. త్. త్.) కొన గలది

**సూచీకటాహన్యాయము** సం వి అ. పుం సూది, గుండిగ అను రెండు వస్తువులను ఉత్పత్తి చేయవలసినప్పుడు ముందు సూదిని, తరువాత గుండిగను ఉత్పత్తి చేయవలెను. రెండు పనులు ఏకకాలమున కలిగినప్పుడు సుకరమైన దానిని ముందుగా చేయవలెను.

**సూచీపత్త్రకము** సం. వి. అ న. విషయముల పట్టిక.

**సూచీపత్త్రకము** సం. వి. అ. పుం ఒక ఓషధి.

**సూచీపుష్పము** సం. వి అ పుం. మొగలి, కేతకి.

**సూచీ(చి)భేద్యము** సం. విశే. (అ. ఆ అ) 1. సూదితో పొడువఁదగినది. 2 దట్టమైనది. చిక్కనిది, సూచిభేద్యైస్తమోభిః — మేఘ.

**సూచీముఖము** సం. విశే. (అ. ఆ. అ.) 1. సూది వంటి సన్నని ముక్కు గలది. 2. సూదివంటి మొన గలది.

**సూచీముఖము** సం. వి అ. పుం. 1. ఒక పక్షి. 2. తెల్ల దర్భ. 3. అభినయ హస్త విశేషము.

**సూచీముఖము.** సం. వి. అ న. వజ్రము.

**సూచీరోమము** సం. వి. న్. పుం. అడవి పంది.

**సూచీవదనము** సం. వి. అ. పుం. 1. దోమ. 2. ముంగిస.

సూచీశాలి సం. వి. ఇ. పుం. సన్న బియ్యము.

సూచ్యము సం. విణ. (అ. ఇ. ఈ.) 1. సూచింపఁదగినది. 2. ప్రదర్శనయోగ్యము కానిది. నీరసమైనది· సం. వి. అ. న. ప్రదర్శన యోగ్యము గాని ఇతి వృత్త భాగము.

సూచ్యాస్యము సం. వి. అ. పుం. ఎలుక.

సూటి వి. 1. విధము,

తే. తత్తఱింపఁ దొణఁగి యిత్తఱి నిదియేమొ, సూటి గాదు తలఁపఁ బాటిగాదు, తగదు మాను మన్నఁ బగవార మగుదు మిక్కటికి మనము పులిన కటికి మనము (పోఁడచేడియల్. కర్తృపదము) సారంగ. 2. 68.

చం. వడి నపరాద్రిఁ జెందవని వాసిగఁ బద్మిని నెత్తి మీఁదఁ జే,యిడి కరసంగతిన్ సమయ మేగఁ దదాశ గురించి రాగ మేర్పడఁగఁ జనంగఁ దేజ మెదఁ బాయఁడె యీయినుఁ డంచు ప్రోఁత పెల్లడరఁగ జాటు సూటి సరసాళితముల్ మొఱసెం గొలంకులన్. కువల 4. 7.

సీ. చివురాకుఁ జేసినఁ జేసెఁ గాకజుఁడందుఁ దాజేటినే సూటిఁదారు కోలిపె ... అనుచు జనులెల్ల నచ్చెరువందఁ బాద,ములును మీఁగాళ్ళు జంఘ లూరులవలగ్న,మును గుచంబులు మోముఁ గొప్పును మెఱయఁగ, నా మహాశ్వంబు నీరజాకాక్షి యయ్యె. చిత్ర భార. 5. 81.

మ. జననాథాగ్రణి యొక్కనాఁడు హిమవజ్జాతుండు కోలాహలా, ఖ్యనగాధీశుఁడు ప్రాలి కుత్తుమతినాగన్ వేగవేగవ్వ మీ,టిన సూటిన్ బొటద్రేలి గోట నెగమీటం గుంతికాహార్య, కాననగర్వాగ్రహుఁడై బలారి తనతో సఖ్యంబు వాటింపఁగన్. వసు. 1. 119.

సీ. త్రిమ్మరుమేర రసమ్ము కదలు మాడ్కి నీట మునిఁగి లేచు సూటి కాటి, కాణ మేగు వికాన. ప్రబం. 1. 181.

సీ. దేవపూజాపేటిఁ దిగిచి నంబులసూటి కదుమించు తెలనాకుగములు నించి నంబి వాని విధము) ఇది మునిని మోహింపఁజేయుటకు ప్రయాణమగు మేనక వర్ణనము) చంద్రాంగ. 8. 12.

2. గురి, లక్ష్యము.

రగడ. సూటిదప్పక యేమి చొక్కింపు కోదులుమ. పి. శకుం. 2. 125.

చం. సమదగజంబుపై కులుకుసాములనైరికి సూటి పెట్టు నా, గమకముఁ జూచి భూపతి ముఖంబున వ్యాధులమూఁక నిల్వలే, కమిత భయాప్తి నోరసిలె సారంగ. 1. 100.

మత్తకోకిల. కోటి సూర్యులు కోటి చంద్రులు కోటి కోటి తటిల్లతల్, సూటిగాఁ బరిపాటిగా నొకచోట నిల్చిన రీతి న,మ్మేటి వెల్గు దగన్ త్రికూటము మీఁదఁ జూడుము దృశ్యమున్, దాఁటి మాయగు మాట మాటికిఁ దాల్మిఁ జేసటు మీటుచున్. సీతారా. 1. 156.

తే. తెరవ నెరవంక బొమలును మెఱుఁగు వాడి, చూపులును జూచి తనచేతి సూటి రోసి, యత్రున న్యాయ మొనరించినట్టి సుమశరాసనుండనఁ జెలి మీఁదియాన మందె. విజ. 2. 168.

3. ప్రతి.

ఉ. బంగరు బొంగరాల పరిపాటి చనుంగవ మీల సూటి తళుక్కుంగను. దోయి చంద్రు ప్రతికోటి మొగం బెలదేఁటి ధాటికన్నం, గడు మేటి వేణి పులినంబుల సాటి పిఱుం దయారె చిత్రాంగద పాటికోటి గలదా యని మెచ్చుఁ గిరీటి సూటికిన్. విజ. 1. 150

సూటుకాఁడు విణ. 1. గురికాఁడు. 2. అందగాఁడు.

సూటిగొను అ. క్రి. లెక్కసేయు, లక్ష్యపెట్టు.

తే. ఉత్తరవర్యంబు హైదరుజంగుఁ గలిసి, చూచితి రెమి మొక్కింతైన సూటిగొనక, రావు కులసంభవుండైన రంగ నృపతి, కార్యమితర ప్రపంచంబుగా నొనర్చె దంగా 2. 18/.

సూటిపడు అ. క్రి. 1. సరికాకు.

మ.... అవంచనాయతి యాన్వచ్ఛిక సూక్తి సూటి పడ ... వసు. 2. ఆ. (శ. ర.).

2. జరుగు, సంభవించు.

తే. తగవు దప్పని ధర్మ మీతరుణు లందు, సూటిపడె మేలు మే లనిజోకఁ జెలులు, సరస మాడంగ విరుల వసంత మాడి, రాలతాంగులు పంతెయుపాకరమ్మున. కవిరాజ. 4. 98.

ద్వి. టక్కులు గేవలు డంబకంబులును. పొక్కులు నేర్పులు మాటిమాటలను. పండితారా పురాతన. 122.

**సూదరి** (సూఁదరి). విజ (సూదు+అరి) పగ గల వాఁడు. ఈసు గలవాఁడు.

కం. వేఁడెదు వర్థులఁ గమగొన, వాఁడికుశాంమువఁ దెండవలదా యను నీ, సూఁదరి మాటల పరుషము, పోఁడిమి చెడునట్టి యర్థములఁ గల్పములన్, కావ్యా. 6. ఉల్లా. 128. ప.

**సూడి** వి. గుడి.

ద్వి. వడి సూడిపట్టి యవ్వలను గువ్వలను గెడపుచు వేఁట నీ క్రియఁ జల్పువేళ. అ. మ. క. 5. 250. పు. 8 వ.

**సూడించు** అ. క్రి. పగగొను,

కం. చేడియ చూపులు దమలో మూడించె...విక్రమా. 8. ఆ. (శ. ర.).

**సూడిగము** వి. 1. చేతికడియము, ఆభరణ విశేషము.

కం. ఎనలేనిగొనబు వాఁడా, పెను మిముకుందెగలు త్రాగడు పేరమివాఁడా, చెనటి పొలదిండ్ల మూఁడా, కమవినుతుల రాచసూడిగంబుల తేఁడా. అ. రా. సుందర. 1. 81.

సీ. గిబ్బ రాత త్తడి బెల్బుటితోలును గాలిమేవరి సూడిగముల జోడు. రామ. శ. 1.

సీ. తీఁగయు వాడి ముత్తెపుఁ బేర్లు పందిదం, డలు సూడిగములు గొడిపరములును. కళా. 7 66.

2. ఆడుదాని చేతి గాజులు.

గీ. లలన సాక్షాత్కరించిన లక్ష్మివోలెఁ గంకణంబు లతో సూడిగముల రాయ, విశ్వనాథుని కళ్యాణ వేదియందు, ముగ్గు వెట్టంగ మోహించుముజ్జగంబు. కాశీ 5. 146.

**సూడిద** వి. కానుక.

ద్వి ప్రిదులక గొనిపోయి భీమణుం దవెడి, మొద లితలారి సమ్ముఖమునఁ బెట్టి, కా మరిఁగె నా చోరుఁడు. హరి ఉత్త. 2880.

చం. అతుల మహాసుభావ మని యవ్విరిఁ దానొక శార్దవేసి యచ్యుతునకు నిచ్చకం బొదవ సూడిద యిచ్చిన నిచ్చఁగాక. పారి 1, 85

చం. అభినవ భోజరాజ బిరుదాంకుఁడు శ్రీరఘు నాథశౌరికిన్ శుభమతి సేలినందులకు సూడిద చేసితి నేర మిక్కలిన్. సకల గణింప మన్నన లొనర్పఁ బ్రబంధము నింతయుత్తమ, ప్రభునకు నంకితం బొనరుపఁగలిగెం గదయంచు వేడుకన్. విజ వి. పి 53.

**సూడిదపెట్టు** స. క్రి. కానుకయిచ్చు.

సీ. తరుణియొక్క తె పూవుదండ సూడిద పెట్టి, హేలాపరిరంభ మెచ్చరించె జై. భా, 8, 76.

**సూదు** స. క్రి. 1. కాల్చు, అంటించు.

కం. ఇట్టిక సూడిన వాఁడో. యెట్టిదు కొవ్వాడో యనుచు మల్లన మూడం, బట్టగుచు మగిడి చూడక, పట్టణమున కేఁగె లజ్జ బండతనమునన్. ఉ. హరి. 1, 36.

ఆ. కోటకొక్క రాయిఁ గూల నొక్కఁగఁజేసి, ముండ్లకట్టె నొకనికఁడ్లు పెటికి, వేఁడి కొఱువులెత్తి సూదుదు రొక్కని భల్లతతుల నొకనిఁ గ్రుళ్లడంచి. సావందో. 2 ఆ.

2. నాటించు.

చం. అగు నగు జైని మాలిచితి వంచు విజృంభణ వృత్తి నివ్విధన్, సొగయని మాటలం జెవులు సూఁడకు సైఁచిన దానఁ గాను నా, మగనికి నిన్ను వంటి కొఱమాలిన మానిసు లీడె భర్తతోఁ, దెగి యెడఁ దెవ్వకం బ్రదికి తేమని యైదువనై సుఖం చెదన్. వేం. పంచతం. ౨. 260.

**సూదు** వి. 1. ఈర్ష్య.

కం. సూడొక్కటియును మఱి దాఁగిడొక్కటి యును జగంబు కీర్తించుటకై, యూడొక్కటియును గలదే, పోఁడిమిగా మీ కటంచు బోధించవలెన్. ఉత్తర హరిశ్చం. 4. 209.

2. వైరము. పగ, కసి, కక్ష, విరోధము

ద్వి. సోముఁడు కామారి సూదు సాధింపఁ, గాము నమ్ములు విల్లుఁ గైకొన్న కరణి, మురిపెంబు నిండారు ముఖమండలమున, సొరిది చెన్నగు వాఁడి చూపులు బొమలు.

రం. రా. ఉ. కాం. 99 పుట, 21 పం

ఆ. అయ్యొ పగకు రాముఁ డలయక రాజుల, నిరువ దొక్క మాఱు నరసి చంపె, జగతి క్షీఁద రాజ

శబ్దంబు లేకుఁడ, సూడు దీర్పలేని సుతుఁడె. భాగ. 6. స్కం. 486.

చం. కనుఁగవఁదన్ను గెల్వఁగ మృగం బలమూఁడు న కిందు రేతు నే, నని .... అము. 5. 12.

కం.... నాదృష్టి పథమున ధృతితో, నిలిచిన నిష్ఠుర వి శిఖా, ర్భుల ముంచి మదీయ సఖుని సూడిటు దీర్తున్. భాగ. 10. స్కం, ఉత్త. 895.

గీ. హారధమర్భంగ కార్య మెవ్వరికిఁ దెలిసి, సూడు పుట్టింతు నని నిల్చుచో నిలువక, కలహభోజనమౌని వల్లదలఁ దిరుగ శివుని విలుద్రుంచె రఘువీర శేఖ రుండు. ఉ. రా. 1. 88.

కాలనేమి కొడుకు లేద్వురుఁదన చేత మడిసితొంటి సూడుఁ దీర్పఁగఁ బూని యిచ్చోట, బుట్టి రిపుడు. నీలా. 3. 69.

వ. మహిషాసురునిఁ జంపిన సూడు తన మనంబు నంబాయక యివ్విధంబున దుర్గయందు బద్ధ మత్స రుండై యారాతుసుండు, కళా. 9. 23.

సీ. వలుహేఁడులకు సూడు బలియించి పొలియించి లలిఁగేరు వంట వలంతి సరిదె. నీలా. 1. 52.

3. విరోధి, వైరి, శత్రువు.

కం. చెనటి పొలదిండ్ల సూడా, కను వినుకుల రాచ సూడిగంబుల హేఁడా! అ. రా. సుందర. 181.

కం. తవసూడగు ధనదదిశాంగన నిముఁ డొడిగూడ బోకగని యామ్యదిశాంగన మెచ్చి...కుమా. సం. 4. 442.

ఉ. ...నె, త్తామర సూడు రాగరసధాముఁడు పోముఁడు దోఁచెఁ దూర్పునన్. వరాహ. 4. 13.

కం. రాకొమరుఁజూచి యచ్చి గు,రాకుంబోఁడియు వలంతిరొ యిట్లను నౌ, సోఁకుడుల సూడ వినుమా, నీకుం దన మొదలి తెఱఁగు నెఱిఁ నెఱిఁగింతున్. అ. రా. బాల. 145.

సూడుకాఁడు వి. పగవాఁడు, శత్రువు. అం. భా. శ. ర.

సూడుకొను అ. క్రి. పగఁగొను. విద్వేషించు.

ఎ. గీ. ఇరుగు పొరుగుల వారినిం టింటి వారి సూడు కొనఁదిట్ట మఱి కాని కూడు గుడువదు. భోజరా. 3. 37.

సూడుపట్టు అ. క్రి. పగగొను.

ఉ. తంద్రికి సూడు పట్టక వృథాస్థితి నుండితి నింట నిందతో, మంద్రె మహాస్త్ర సాధనులు. భా. రా. యుద్ధ. 1283.

సూడుపట్టు స. క్రి. విరోధించు.

కం. హారు సూడుపట్టు కొలకై, పొరిఁ బోరి తవ మూఁచరించు వృషాప్తుఁడుగా, కరయఁగ త్రిభువన ముల నెవ్వరి యందుల నిట్టి రూపవంతుఁడు గలఁడే. పద్మ. పు. 2. 121.

సీ. భాను చంద్రుల సూడు పట్టి గెల్వ వనంగఁ గంధర పటలాంధకార మడరె, విక్ర. 4. 81.

తే. చూడవేటకు నిడువాలు పోగమీల సూడు పట్టంగఁ జాలెడు చూపుఁగొనల. శృం. నై. 8. 50.

సూడుపట్టె వి, — క్రీడా విశేషము.

కం. కొందఱు గణపతు లత్తటి, మంద రహిమ వత్రప్రధానమహిత మహిళ్ళ, శృంగారాంబులు గొని కడు, నందముగా సూడుపట్టె లాడుదురు శివా. శివతత్త్వ. 384. వ.

సూడుబంటు వి. పగఁదీర్చుకొను కూరుఁడు.

సీ....రాజరాజు, నయిదోడు సూడుబంటయి మనము జఘూతి, నిమ ముమ్న దెగటార్త నని నరవరు, తేజ మిముఁదాకె. రాఘ. 4. 242.

సూత(త) సం. వి. అ. స్త్రీ. ప్రసవించిన స్త్రీ, పురి టాలు, బాలెంతరాలు.

సూతకము సం. వి. అ. న. 1. పుట్టుక, 2. పురుడు; జాతాశౌచము. 3. పాదరసము.

సూతకము వి. మృతాశౌచము, జాతాశౌచము.

కం. ద్విజులకుఁ బదిదినములు భూ, భుజులకుఁ బండ్రెండు దివసములు నిలుశూద్ర, వ్రజములకుఁ బతుమాసము లు జనాధిప సూతకంబులు సుమీ వరు సన్. వి. పు. 4. 253.

కం. సూతకము బొద్దుఁ గోయగ, నాతతముగఁ బొందుఁగాని యంతకు మును నం, జాతుఁడగు సుతువికతమున, సూతకమును లేదు ద్రవ్యశుద్ధియుఁ గల్గున్. విజ్ఞా. ఆచార కాం. 19.

సూతము సం. విశ. (అ. ఆ. అ.) 1. జనితము,

ఉత్పన్నము, కనఁబడినది. పుట్టినది. 2. ప్రోయఁబడినది. వెలువరి పఁబడినది.

సూతము సం. వి. అ. పుం. వ. పాదరసము.

సూతిరాజము సం. వి. అ. పుం. పాదరసము.

సూతి సం. వి. ఇ. స్త్రీ. 1. పుట్టుక, ప్రసవము, కాన్పు 2. బిడ్డ, సంతానము. 3. మూలము, జన్మస్థానము. 4. సోమరసము పిండుచోటు.

సూతి కా) గృహము సం. వి. అ. వ పురిటిల్లు.

సూతికాషష్ఠి సం. వి. ఈ. స్త్రీ. ప్రసవించిన ఆఱవ నాఁడు పూజింపబడు ఒక దేవత.

సూతుఁడు సం. వి. అ. పుం. 1. రథచోదకుఁడు. సారథి. క్షత్రియునకు బ్రాహ్మణ స్త్రీ యందు జన్మించినవాఁడు. 3. వైశ్యునకు క్షత్రియ స్త్రీ యందు జన్మించినవాఁడు. 4. వంది; భట్టు; మాగధుఁడు 5. వడ్రంగి; రథకారుఁడు. 6. సూర్యుఁడు. 7. వ్యాసుని శిష్యులలో నొకఁడు.

సూత్థానుఁడు సం. విశే (అ. అ. అ.) నేర్పరి. (శ.ర.)

సూత్కరము సం. వి. అ. వ. సారాయము బట్టీపట్టుట.

సూత్య సం. వి. ఆ. స్త్రీ. చూ. సుత్య.

సూత్రకంఠము సం. వి. అ. వ. పావురము; కాటుక పిట్ట; మందపిచ్చుక.

సూత్రకంఠుఁడు సం. వి. అ. పుం. 1. బ్రాహ్మణుఁడు

సూత్రకర్మ సం. వి. వి. వ. వడ్రంగిపని, వడ్రంగము

సూత్రకృత్తు సం వి. త్. పుం. సూత్రములు రచించువాఁడు.

సూత్రకోణ(క)ము సం. వి. అ. పుం. డమరుకము.

సూత్రగండిక సం. వి. ఈ. స్త్రీ. దారమునకు పురి పెట్టు సాధనము.

సూత్రచరణము సం వి. అ. వ. 1. దారమున గ్రుచ్చుట. 2. కూర్చుట, వర్ఫఱుచుట, క్రమబద్ధము చేయుట. 3. సూత్రములుగాఁ గూర్చుట.

సూత్రతర్కుటి సం. వి. ఈ. స్త్రీ. వంకుకోల, నూలు చుట్టెడు కొయ్య.

సూత్రధారుఁడు సం. వి. అ. పుం. 1. ప్రస్తావనను నిర్వహించు ప్రధాన నటుఁడు. (నాట్యస్య యదను ష్ఠానం తత్ సూత్రం స్యాత్సబీజకం, రంగదైవత పూజాకృత్. సూత్రధార ఇతీరితః") 2. వడ్రంగి. శిల్పి. 3. కొన్ని సూత్రములను రచించినవాఁడు. 4. ఇంద్రుఁడు.

సూత్రపట్టు అ. క్రి. (సూత్రము + పట్టు. ముడివేయు.
సీ. కొలిచి మింటికి నేలకును సూత్రపట్టంగ నేనేర్తు మఱియుచు నేననేర్తు-విప్ర 4. 28.
2. సూత్రము వేసి తిన్నగా నుండునట్లుచేయు.
సీ. తేఁ వరఁగు వీథులు పురిసూత్ర పట్టినట్లు. ఆము, 1. 52.

సూత్రపట్టు వి. నూలువేఁత.
(సూత్రము + పట్టు).
ఆ. గాడ్పు వేల్పు పట్టి గట్టెక్కి యుక్కునఁ జాచె సూటి నేటి కోటమగని; భావిసేతు వప్పు వడలంక కడకును సూత్రపట్టు మాడ్కిఁ జాడ్కి వెలుఁగ. రామా. 9. 62.

సూత్రపడు ము. అ. క్రి. జతపడు.
కం. క్షేత్రంబు పురుష కారము, ధాత్రీశ్వర! బీజ మరయ దైవము రెండున్, సూత్రపడఁ గూడె నేనిన్. భార. అను. 1. 134.

సూత్రపఱుచు స. క్రి. సూత్రపడు ధా. పే. (సూత్రము + పఱుచు) సూత్రించు, సూత్రముగాఁ జేయు.
సీ. ప్రామినుకులు సూత్రపఱిచి లోక హితంబుగా నిర్వహించె నెవ్వాని బుద్ధి. వరాహ. 1..6.

సూత్రపిటకము సం. వి. అ పుం. బౌద్ధమతమునకు సంబంధించిన త్రిపిటకములలో నొకటి.

సూత్రపుష్పము సం. వి. అ. పుం. ప్రత్తిచెట్టు

సూత్రపెట్టు అ. క్రి. ముడివేయు.
ద్వి. నేలకు నింగికి సూత్రపెట్టఁ జాలెడు నాబుద్ధి నమసె. హరిశ్చ. ఉత్త. 2714.

సూత్రభిత్తు(దుఁడు) సం. వి. ద్. పుం. దర్జీవాఁడు.

సూత్రభృత్తు సం. వి. త్. పుం. సూత్రధారుఁడు.

సూత్రము సం. వి. అ. వ. 1. దారము, త్రాడు, 2. నూలిపోగు. 3. తీగె, తంత్రి, 4. యజ్ఞోప

పీఠము 5. ఆట బొమ్మలకు గట్టఁబడు దారము. 6 అల్పాక్షరము, అసందిగ్ధము అయినవాక్యము 7. సూక్తి, సంక్షిప్త విధి వాక్యము. 8. సూత్ర గ్రంథము. 9. నియమము, నిబంధన. 10. ఏర్పాటు.

సూత్రము వి పన్నుగడ.

వ. దైవగతిం జేసిన యొడ్డిన సూత్రంబునకు సుయోధనుం డొడంబడియెనేనియు నదియు సకలజన సమ్మతంబయిన విధంబగు. భార. ఉద్యో 1. 90.

సూత్ర యంత్రము సం. వి. అ. న. 1 మగ్గములోని కండె. 2. మగ్గము.

సూత్రల సం. వి ఆ స్త్రీ పంచెకోల, నూలుచుట్టెడు కోయ్య.

సూత్రవతీశుఁడు సం. వి. అ. పుం విష్వక్సేనుఁడు.

ఉ. ... త, త్సూత్రవతీశు వందనముతోఁ గని యాతఁడు పూజసేయఁగా. ఆము. 9. 95.

సూత్రవేష్టనము సం. వి. అ. న. మగ్గములోని కండె.

సూత్రాత్మ సం. వి. న్. పుం. సర్వాంతర్యామియైన ఆత్మ.

సూత్రాముఁడు సం. వి. న్. పుం. సుత్రాముఁడు

సూత్రాలి సం వి. ఈ స్త్రీ 1. రుద్రాక్షలు మొ॥ వానితోఁ గూర్చబడిన తావళము. 2. కంఠహారము

సూత్రి సం. విశ. న్. సి. న్. 1 దారములు గలది. 2. నిబంధనలు గలది.

సూత్రి సం. వి. ఇ. పుం. కాకి.

సూత్రించు స. క్రి. 1. బంధించు, గ్రుచ్చు. 2. లక్షణము నిబంధించు; సూత్రవాక్యము రచించు. 3. ఆలోచనము చేయు, పథకము వేయు; క్రమబద్ధము చేయు. 4. సడలించు. 5. కూర్చు, జత పఱుచు.

శా. శ్లోకంబుల్ శతకోటిఁ గాండములుగా సూత్రించి రామాయణం బేకైకాక్షర మెల్ల పాపముల మాయింపంగ నిర్మించి ... ... భీమ. 1. 5.

సూత్రిక సం. వి. ఆ. స్త్రీ. ఒక విధమైన గిన్నె, మూఁకుడు.

సూత్రితము సం. విశ. (అ. ఆ. అ.). 1. కూర్పఁబడినది, గ్రుచ్చఁబడినది. 2. క్రమబద్ధము చేయఁబడినది. 3. సూత్రములుగా రచింపఁబడినది.

సూదంటు వి. అయస్కాంతము.

ద్వి. సూదంటు శిలయును సూదియుఁ జేర, సూది మోహంబునఁ జువ్వన నెగసి, అంటుకొన్న విధాన. ప్రభులిం. 3. 75. పు. 13. పం.

సూదకర్మ సం. వి. న్. న. వంటపని, పాచనము.

సూదనము సం. విశ. (అ. ఈ. అ.). 1, చంపునది. చెఱుచునది. 2, ప్రియమైనది.

సూదనము సం. వి. అ. న. 1. చంపుట. చెఱుపు, వధము. 2. అంగీకారము, వాగ్దానము. 3. చిమ్ముట, పారవేయుట, విసరివేయుట.

సూదము సం వి. అ. పుం 1. నాశనము, సంహరణము వధము. 2. వడపోఁత, పారఁబోయుట. 3. బావి. ఊట. 4. వండినపప్పు. 5. వంటకము. భోజన పదార్థము. 6. బఠానీ బ్రద్దలు. 7. బురద, రొంపి. 8. పాపము, దోషము. 9. రథచోదకత్వము. 10. లొద్దుగ చెట్టు.

సూదశాల సం. వి. ఆ. స్త్రీ. వంటసాల.

సూది వి. సూచి, గుడ్డలు కుట్టుసాధనము (సం.సూచీ).

ఉ, సూదులు ద్రిప్పుచంద మగుచు న్వెతవెట్టక యుండి నెచ్చెలు, ల్గాదులు వెట్టరే చెవులలోపల. వి. శకుం. 3. 194.

ద్వి. పాలుపొందఁ దా దారపోసినదైన సూది మోపెడు నంత చోటునా భూమి, లేదని కడపిన లెక్కింప హరిశ్చ. ఉత్త. 1746.

తే. గీ. కటికి చీఁకటి పుడమి యాకసము జతయొ,నర్చి కాటుక బరిణచందమునఁ జేసి, చెలఁగు నభిసారికల దీవనలను బెరిగి, సూదిమొన కెడమీక పెచ్చువను నెరపె. ప్రబం. 1. 64.

కం. కరవాడి సూది తుదమొన. నరదరనం బడిన ముత్తియంబును లోలెన్. శృ. నై. 8. 6.

సూదిగొంటు వి. ఒక దినుసు పోఁక, లతాపూగము.

సూదితము సం. విశ. (అ. ఆ. అ.). చంపఁబడినది.

సూదిమల్లె వి. ఒక దినుసు మల్లె (వ్య. వి.).

**సూదుఁడు** సం. వి. అ. పుం. వంటవాఁడు.

**సూన** సం. వి. ఆ. స్త్రీ. 1. కబేళా 2. మాంస విక్రయ శాల. 3. వధ, నాశనము 4. కొండ నాలుక. 5. మండలము, మేఖల. 6. గవద బిళ్ళలు. 7. కాంతి కిరణము. 8. నది. 9. కుమార్తె. 10. ఏనుఁగు తొండము.

**సూనగాఁడు** మి. గ్రా. విశే. (సూన + కాఁడు) చంపువాఁడు. ఖట్టికుఁడు. కటికవాఁడు.

గీ. చాకిలోయవాఁడు జలగరిగొడగరి. కుక్క సూనగాఁడు కోడిపంది, బొడ్డు క్రింది యంగములు విప్రు సోఁకిన వచటు గడుగ వలయు నంద్రు బుధులు. విజ్ఞా. ఆచార. కాం. 68.

**సూనము** సం. విశే. (అ. అ. అ.) 1. పుట్టినది. ఉత్పన్నము. 2. వికసితము, పుష్పితము 3. రిక్తము, శూన్యము.

**సూనము** సం. వి. అ. న. 1. ఉత్పాదనము, ప్రసవము. 2. పూవు. 3. మొగ్గ.

**సూనరి** సం. వి. ఈ. స్త్రీ. సుభగతియైన స్త్రీ. 2. సౌభాగ్యవతి.

**సూనరి** మి. గ్రా. విశే. (సూన + అరి) చంపువాఁడు. (సూన=వధస్థానము) "పంచసూనా "గృహస్థస్య తాభిస్స్వర్గం న విందతి"

చం. చెఱఁబెట్టి గిరివ్రజ మన్పురఁబులోఁ గొలయక నిత్య మొక్కొక్కని సూనరివోలె వధించి నేమమున్. భార. సభా. 1. 118.

**సూనరి** మి. గ్రా. విశే. పూలమ్మువాఁడు. "సూనరి యన్నంబు జూదరియన్నంబు" (శ. ర.)

**సూని** సం. వి. న్. పుం. 1. కసాయివాఁడు. కటికవాఁడు. 2. వేటకాఁడు.

**సూనుఁడు** సం. వి. ఉ. పుం. 1. పుత్త్రుఁడు. 2. బిడ్డ, సంతానము. 3. దౌహిత్రుఁడు. 4. తమ్ముఁడు. 5. సూర్యుఁడు 6. జిల్లేడు చెట్టు. (వృ వి.).

**సూనువు** సం. వి. ఉ. స్త్రీ. పుత్త్రిక, కూఁతురు.

**సూనృత** సం. వి. ఆ. స్త్రీ 1. సత్యవాక్కు. సత్య వాగ్దేవత. 2. శ్రవ్యమైన గేయము. మధుర గీతి. 3. ఉషస్సు. 4. అన్నము, ఆహారము.

**సూనృతము** సం. విశే. (అ. ఆ. అ.). 1. సత్యమైనది. 2. శుభ్రమైనది, సుభగమైనది. 3. ప్రియమైనది.

**సూనృతము** సం. వి. అ, న. 1. సత్యవచనము. 2. సాధుభాషణము. 3. శుభము, శోభనము.

**సూపకారుఁడు** సం. వి. అ. పుం. వంటవాఁడు.

**సూపధూప(క)నము** సం. వి అ. న. ఇంగువ.

**సూపము** సం. వి. అ. పుం. 1. సుఖ పేయమైన వంటకము. వండినపప్పు. వంటమనిషి. 4. వంటపాత్ర. 5. బాణము. 6. బఠాణీ బద్దలు.

**సూపాంగము** సం. వి. అ. న. ఇంగువ.

**సూమము** సం. వి. అ. పుం. 1. జలము, 2. క్షీరము. 3. ఆకాశము, స్వర్గము.

**సూయాణము** వి. శత్రు భయంకరమైన దండయాత్ర.

సీ. తగువాజ్ఞ సూయాణముగ నొనరించె మంచిగ నేలనాలుగు చెఱఁగులకును. భార. విరా. 5 ఆ. 320.

(సం. సూచీయానమ్, క. సూయాణ.) సూచీముఖ వ్యూహముతో వెడలు దండయాత్ర. అని కొందఱు (సం. సూచీవానమ్, క. సూయాణ) సూదితో కుట్టి చేయు బటావని అని మఱికొందఱు.

**సూరకరుఁజు** వి. పక్షివిశేషము (రూ. సూరకురుంజు)

వ. వలుదవడలు వలుఁదవడలుగా సదామోదకములుగా మెసవుబ్రహ్మరాక్షసులును దరిసూరకురుంజుల సందడింజొరకు నంజులంబలెఁ దలపుత్తెంగుఁజుంజుట్టుఁ గొలుకు జుంజురుపిశాచంబులును (ఇది యుద్ధవర్ణనము) చంద్రాంగ. 6. 98.

**సూరణము** సం. వి. అ. పుం. ఒక విధమైన గుజ్జుగల దుంప. కందగడ్డ.

**సూరత** సం. వి. ఆ. స్త్రీ. 1. పాడియావు. 2. సాధువైన ఆవు.

**సూరతము** సం. విశే. అ. ఆ. అ. 1. దయగలది. మృదువైనది. 2. శాంతమైనది.

**సూరత్తు** వి, ఒకానొక దేశము.

సీ. రత్నకంబళ్లు సూరత్తుకుత్తిని పట్టుదిండ్లు సేమంతి పూచెండ్లు గంధవొడులు ధూపములు పుష్పాదులు

తక్కులుగుల్కు నిలువుటద్దములును. సావందో. 1. అ.

**సూరము** సం వి. అ. పుం 1. జిల్లేడుచెట్టు (వృ వి.) 2. సోమము.

**సూరసూతుఁడు** సం వి. అ. పుం. అనూరుఁడు, సూర్య సారథి.

**సూరి** సం. వి. ఇ. పుం 1. సూర్యుఁడు. 2. పండితుఁడు, ఋషి. 3. పురోహితుఁడు. 4. పూజారి, అర్చకుఁడు. 5. జైనాచార్యుల బిరుదము. 6 శ్రీకృష్ణుఁడు.

**సూరి** సం. విశే. న్ జీ. న్. 1. తెలివిగలది, విద్వత్తుగలది.

**సూరి** సం. వి. ఇ. పుం. విద్వాంసుఁడు, పండితుఁడు.

**సూరి** సం. వి. ఈ. స్త్రీ. 1. సూర్యునిభార్య. 2. కుంతీదేవి. 3. నల్లావాలు.

**సూరి** వి. చిన్నకత్తి.

ద్వి. చిఱిచేసిన మరుచే సూరి యనఁగ, నొక వింత సొగసుతో నుమ తేజరిల్లె. మృత్యుంజయ. 1. 11.

ఉ. అక్కలకంఠి తెలియం, గనినప్పుడె దిక్కరింపు చున్, ఱక్కెరజాణవుందురికి సాహిడి చాయలబంటదారి మేల్, చొక్కపువాఁడి చెంగలువ సూరి కటారినిఁ బోటుప్రేటు పెం, పెక్కఁగ నొక్కటన్ వలపుటుక్కునఁ బక్కున రేచి యార్చినన్. ఉత్తర. హరివం. 2. 63.

**సూరుఁడు** సం. వి. అ. పుం. 1. సూర్యుఁడు. 2. విద్వాంసుఁడు. 3. వీరుఁడు, శూరుఁడు. 4. రాజు.

**సూరెగిలు** అ. క్రి. (సూరెగిల్లు రూ.) ప్రక్కకొదుగు.

సీ. కమనీయబాహుచిత్రగతుల నేపారుచో సుర విమానంబులు సూరె గిలఁగ గదలి బాలేందుశేఖరుం దెదురునడవ నిగిడె గరుడుండు కైలాసనగముపైకి. భోజరా. 7. 34.

**సూరెగిల్లు** అ. క్రి. సూరెగిలు. రూ. ప్రక్కకొదుగు.

మ. అసురాధీశ తనూజు కోత్తలకుఁగా కత్యంత భీతిం గలంగి సురానీకము సూరెగిల్లివరజ క్రీడాదరం బారఁగా. నిర్వ. 6. 103.

**సూరెపాను** ఆలవట్టము (శ. ర.) వస్త్రముతో గుండ్రముగాఁ జేసిన విసనకఱ్ఱ.

**సూరెపుటము** వి (సం. సూర్యపట) మేలుతరపు మొకమాలు, సూర్యపటము.

సీ. సూరెపుటంపు బల్ జోగంటఁ గట్టిన పట్టదాళి ధయోధురట్టి యనఁగ (ఇది పరిఖావర్ణనము) రాజవాహన. 1 62.

సీ జంపు సూరెపుటంపుఁ గెంపునిద్దఁపుతేవ గుత్తంపుబంగరు కొమ్ముకట్లు ప్రబం. 1. 53.

చం. విరితొగచందువాతెగల వేడుకయావడి యంగణంబులోఁ, బఱచిన రత్నకంబళిని బాగుగ సూరెపుటంపుగద్దియన్, వఱలు మెఱుంగుబంగరపు వన్నెజగాబురుసాతివాసిపై, ధరణిజతో వసించెఁ బతి తక్కుతలాడలఁ జేతులూనుచున్. ఉ. రా. 6. 118.

**సూరెలు** వి బ. వ. పార్శ్వములు, ఇరుగెలంకులు.

వ. అందు నడుమ నరనాథుం డొప్పియుండెఁ దమ్ములుఁ జేయంగల దొరలును సూరెల నిలిచిరి. భార. భీష్మ. 3. 10.

చం. సునిశిత శస్త్రపాణులొగి సూరెలఁ గొల్వఁగ. భా. రా, కిష్కిం. 125.

కం. సూరెలను వందిజను లిం,పారఁగ నుతియింప నొప్పునట్టి మహీశుల్. భార. స్త్రీ. 2. 19.

ఉ. అతని సూరెలం దమయుదంచితయానము లుల్లసిల్ల న,త్యాయతవైభవంబు లెలరార నలం, కృతులై దిగీశ్వరుల్; ప్రీతిఁ దనర్చి రెంతయును రెంపున. హరి. ఉ. 4. 103.

ఉ. కోరి చుఱుక్కునాథుకడకున్ జనునింతిక రత్నకాంచనా,కారములైన భూషణ నికాయములం దడవంగనేల యీ,సూరెల్రాలు వంగములు సోయగ మెంతకు లేదు చూడుఁడా మారుని పూవుదూపులకు మాఱట రూప మనంగ నొప్పెడున్. కావ్యా. 2. ఉల్లా. 27.

ఉ. ... రాజు సూరెలన్ సారెకునైచు నయ్యుభయ చామరలో యనమించె నెంతయున్. దశా. 2. 276.

సీ. హేమాద్రివిస్తా మెంత సప్తాశ్వుడు నిచ్చలు సూరెల వచ్చునటై....కుమారసం. 3. 248.

ఉ. సూరెల నున్న మంత్రులను జుట్టములం గడుఁ గూర్చుమిత్రులన్. భార. ఆది. 2. 198.

చం. హెచ్చరిక యటంచుఁ గంచుకులు సారెకు సూరెల నగ్గడింప ... దశా. 1. 288.

చం. అన విని నవ్వి యొక్కఁడు మదస్త్రబలంబున కోల్వఁ డోపినన్, సునిశితబాణముల్ వఱపి సూరెల నందఱు నొక్కపెట్ట యేపునెఱపుఁ డన్న. భాం. భీష్మ. 2. 837.

కం. నమ్మము వెఱవకు మేనును దమ్ములునుం గోట నీకుఁ దాత్పర్యముమై నిమ్మేటిమగలు సూరెల నెమ్మి నిలువ నింద్రుండైన నీ కెదురగునే. భార. ద్రోణ. 2. 295.

సూరెలువాలు దే. అ. త్రి. (సూరెలు + పాలు) ప్రక్కకొడుగు.

సూర్క్షణము సం. వి. అ. న. అగౌరవము, అవమానము.

సూర్క్షము సం. వి. అ. పుం. ఒక దినుసు చిక్కుడు (వ్ృ. వి.).

సూర్ణము సం విశే. అ. అ అ. బాధితము, హతము, హాతము.

సూర్పము సం. వి. అ. పుం (రూ. శూర్పము) చేట.

సూర్మి సం. వి. ఇ ఈ స్త్రీ. 1. లోహప్రతిమ. 2. ఇంటి స్తంభము. 3. కాంతి, ప్రకాశము. 4. జ్వాలామయము.

సూర్య సం. వి. ఆ. స్త్రీ. 1. సూర్యునిభార్య. 2. సూర్యునిపుత్రిక. 3. సూర్య వివాహసంబంధమైన మంత్రము. 4. క్రొత్త పెండ్లికూతురు. 5. ఒక ఓషధి. 6. వెట్టిపుచ్చ (వ్ృ. వి.).

సూర్యకమలము సం. వి. అ. న. ప్రొద్దుతిరుగుడు పూవు.

సూర్యకాంతము సం. వి. అ. పుం. 1. సూర్యకాంత మణి, శిల. 2. స్ఫటికశిల.

సూర్యకాంతి సం. వి. ఇ. స్త్రీ. 1. సూర్యుని వెలుఁగు. 2. ఒక దినుసుపూవు. 3. నువ్వుపువ్వు.

సూర్యక్రాంతము సం. వి. అ. పుం. వృక్షవిశేషము.

సీ. కుప్పి సూర్యక్రాంత ముప్పుడునరవండు గాడిదె కడపరకన్నెకొమం. హంస. 4. 10.

సూర్యగ్రహణము సం. వి. అ న. రాహువు సూర్యబింబమును మ్రింగుట.

సూర్యగ్రహము సం. వి. అ. పుం. 1. సూర్యుఁడు. 2. సూర్యగ్రహణము. 3. రాహుకేతుగ్రహములు. 4. జలకుండిక అడుగుభాగము.

సూర్యజ సం వి. ఆ. స్త్రీ. యమునానది.

సూర్యజుఁడు సం. వి. అ. పుం. 1. సుగ్రీవుఁడు. 2. కర్ణుఁడు. 3. శని. 4. యముఁడు.

సూర్యతనయ సం. వి. ఆ. స్త్రీ. యమునానది, కాళింది.

సూర్యనక్షత్రము సం. వి. అ. న. తత్కాలమున సూర్యుఁడుండు నక్షత్రము.

సూర్యపటము సం. వి. అ. పుం. మేలుతరపు మొకమాలు.

ఎ. గీ. "చాయసూర్య పటంపు గుళ్ళాయపొసఁగ" చంద్రా. 2. ఆ.

సూర్యపర్వము సం. వి. న్. న. సూర్యసంబంధమైన పుణ్యదినము (గ్రహణసంక్రమణాదులు).

సూర్యపుత్రి సం. వి ఈ. స్త్రీ. 1. యమునానది. 2. మెఱుపు, విద్యుత్తు.

సూర్యభక్తము సం. వి. అ. పుం. బంధూకవృక్షము (వ్ృ. వి ).

సూర్యము సం. వి. అ. పుం. 1. అర్కవృక్షము (వ్ృ. వి.). 2. ద్వాదశసంఖ్య 3. గోబి (కాబేజి).

సూర్యయంత్రము సం వి. అ. న. 1. ఉపాసనార్థమైన సూర్యమండలరేఖాచిత్రము. 2. సూర్యగమనాదికమును కనిపట్టుసాధనవిశేషము.

సూర్యవిలోకనము సం. వి. అ. న. నాల్గు నెలల వయస్సుగల శిశువుచేత సూర్యదర్శనము చేయించుట.

సూర్యసంక్రమణము సం. వి. అ. న. సూర్యుఁడు ఒక అయనము నుండి వేరొక అయనమున ప్రవేశించుట.

సూర్యసంక్రమము సం. వి. అ. పుం. చూ॥ సూర్య సంక్రమణము.

సూర్యసంక్రాంతి సం. వి. ఇ. స్త్రీ. చూ॥ సూర్య సంక్రమము.

సూర్యసంజ్ఞము సం. వి. అ. న. కుంకుమపువ్వు.

సూర్యసిద్ధాంతము సం. వి. అ. పుం. ఒక ప్రసిద్ధమైన జ్యోతిషగ్రంథము. ఇది సూర్యునిచే నావిష్కృత మైనదని కొందఱి విశ్వాసము.

సూర్యహృదయము సం. వి. అ. న. ఆదిత్యహృదయము అను మంత్రము.

సూర్యానువర్తిని సం. వి. ఈ. స్త్రీ. ప్రొద్దుతిరుగుడు (వృ. వి.).

సూర్యాపాయము సం. వి. అ. పుం. సూర్యాస్తమయము, ప్రొద్దుగ్రుంకుట.

సూర్యాలోకము సం. వి. అ. పుం. 1. సూర్యకాంతి, వెలుఁగు.

సూర్యావర్తము సం. వి. అ. పుం. ప్రొద్దుతిరుగుడు పూవు

సూర్యాహ్వము సం. వి అ పుం. పెద్దగోవి (కాబేజి వంటిది).

సూర్యాహ్వము సం వి. అ. న. రాగి.

సూర్యుఁడు సం. వి అ. పుం. 1. రవి. 2. శివుఁడు.

సూర్యోఢుఁడు సం. వి. అ. పుం. 1. సాయంవేళ వచ్చిన యతిథి 2. ప్రొద్దుగ్రుంకువేళ.

సూర్యోపస్థానము సం. వి అ, న. సూర్యోపాసనము.

సూలవై వి రోగ విశేషము, కడుపులో నొప్పి,

తే. దోలికొని వారి నిలిపితి సూల వొడిచి. దశకు. 6. 163.

సూలచేకటులు వి. బ. (రూ. సూలచేకట్లు) కంకణ విశేషము (శ. ర.).

సీ. సూలచేకటులు దాల్చి శుక. 1. 148,

సూషణ సం వి. అ స్త్రీ జనని, తల్లి.

సూష్యంతి సం వి. ఈ. స్త్రీ. గర్భిణి, ఆసన్న ప్రసవ మైన స్త్రీ.

సూసకము వి. స్త్రీలు తలను ధరించెడు తిరుగుడు బిళ్ళ.

సీ. చెంగల్వ పూదండఁ జెక్కు చెండుములుపై, ఘనసారమున సూసకము ఘటించి. మను. 6. 5,

ద్వి. సిరులంట జారుపట్టు రాణికములు గట్టి, వరసరత్న ముల సూసకము లమర్చి. అ. మ. క. 5 ఆ. 288. పు. 8. పం.

ద్వి. నేసమత్యము లొల్క సీమంతవీథి, గానిగాఁ దెసి సూసకము మణుల్ దొరఁగ. రం. రా. ఉ. 65. పా. 5. పం

సూసరి వి. సున్నము పూయువాఁడు, వేపకుఁడు

సూసవి (?) అర్థ నిర్ణయము చేయుటకుఁ బ్రయోగాంతరము కనఁబడలేదు. (సూ+సవి. అని విడదీయవచ్చు నేమో)

కం. కేడెము కత్తి తుపాకి కాడియు విండ్లమ్ము లీటెలం గొని తొలుతన్ జోటులు దాలిచి మేనులు జోటులు తమకన్న లేదు సూసవి కినుకన్. ప్రబం. 1. 782.

సూహోత సం, వి. విధుని యేవురు పుత్త్రులలో నొకఁడు.

సీ. సుతుల సుహోత్రుఁడు సూహోతగయుఁడు కపిలుం డవఁగోరి కనియె నేవుర. హరి. పూర్వ. 3. 86.

సూళ వి. రాగవిశేషము. (అనితోఁచెడిని)

సీ. కెలకుల గుజరాతి కెంపు జంత్రపు బొమ్మ లలఁతి వాయించు మద్దెలల రవళి, కెరలి కుందనపుఁ బంజరము వెల్వడి చిల్క లొయ్యన సూళాదులుగ్గడింప, నెడనెడ గొరవంక లివురు గైదువుజోదు బిరుదు వక్కాణించి పేరువార. (ఇది కేళీగృహవర్ణనము) చంద్రాంగ. 6. 181.

సూళగేరి వి. నాగవాసము (అని తోఁచుచున్నది).

సీ. చెలువొందునా యేమి జేజేనగరి సూళగేరి లోపలి మిటారిరిక్కైన. చంపూరా. 4, 83,

**సూళ(ళ్ళ)గే(కే)రి** వి (క. సూళ (ళె)గే(కే)రి). వేశ్యవాటిక.

గీ. అనుచు దమలోన గుజగుజలాడు కొనుచు, వలు గడలఁ బాఱఁ జిడిముడి గలిగి మెలఁగు, మరసతుల పద్దు నను వేల్పు సూళగేరి, వంతటను వాల్లకల్లోల మయ్యె. వసుచ. చంద్ర. 3. 37.

తే. గీ. వలపు తలకెక్కి వాని మందులకుఁ జిక్కి తాత మెల్ల ను రోయు నీజన్మమేల, యొక్కనికి దక్కి చాకరైయున్న చెలిని, సూళగేరిని వెదకివఁ జూవఁగలవె?. ప్రబం. 1. 951.

**సూళ్ళు** వి. బ. బాలక్రీడా విశేషము.

సీ. గచ్చకాయలు, కిఱ్ఱుగానుగ త్రిప్పు, గుజ్జె పెఱ్ఱుడు, మంటి గూళ్ళు సూళ్ళు. హంస. 3.149

## సృ

**సృంక** సం. వి. అ. స్త్రీ. ఆభరణముల ధ్వని, మార్గము

**సృంజయులు** సం. వి, అ. పుం. బ. ఒకజాతి ప్రజలు.

**సృకండువు** సం. వి. ఉ. పుం. గడ్డి, చీడ.

**సృకము** సం. వి. అ. పుం. 1. గాలి. 2. బాణము. 3. పిడుగు. 4. కలువ, కైరవము.

**సృకాలము** సం. వి. అ పుం. (చూ. సృగాలము) నక్క

**సృక్కణి** సం. వి. ఈ. స్త్రీ. పెదవి; పెదవి మూల.

**సృక్కము** సం. వి. అ. న. న్. న. సెలవి, పెదవి మూల.

**సృక్కి(కీ)** సం. వి. న్. న. ఈ. స్త్రీ. చూ. సృక్కము.

**సృక్వణి (సృక్వణి)** సం. వి. ఈ.స్త్రీ. చూ. సృక్కము.

**సృక్వము** సం. వి. ఈ, స్త్రీ. చూ. సృక్కము.

**సృక్విణి** సం. వి. ఈ. స్త్రీ. చూ. సృక్కము. పెదవి మూల.

**సృగము** సం. వి. అ. పుం. 1. బాణము. 2. భిండి పాలము. 3. సొఁగు. (శ. ర.).

**సృగాలము** సం. వి. అ పుం. నక్క. (రూ. సృకాలము).

**సృజన** సం. వి ఆ. స్త్రీ. సృష్టి.

తే గీ. ఇంద్రుతో పాటిగాఁగఁ బక్షీంద్రుఁ దొల్లి, సృజనసేయఁ డెయా విశ్వసృజుఁడు గడఁగి. భోజరా. 4, 67.

**సృజించు** దే. స. క్రి. పుట్టించు; నిర్మించు.

తే. కమల గర్భు సృజించి సకల జగద్ధు, రాని యుక్తినిఁ గావించి. భార. శాం. 2. 337.

కం. కమలభవుండు చాఁదపము కల్మినకాదె సృజించె నెల్లతో, కములను. భార. శాం. 5. 478.

**సృజికాక్షారము** సం. వి. అ. పుం. మూలక్షారము; స్థిర క్షారము.

**సృజి(యి)ంచు** సం. స. క్రి. 1. నిర్మించు.

సీ. అతనికి నాతఁడిట్లను బ్రహ్మ జగములు సృజి యించి భూత సంసృష్టిసేయ. భార. శాం. 3.442.

సీ. నిండారు చందురు నినుపాలు నమఁగాంతి చెలు వగా మరుఁడు సృజించినట్లు. మార్క. 3. 64.

వ. .... ఇమ్మహాద్యాది భూతంబు లేడును నానా విధ వీర్యంబులు వెలిగాఁ బ్రజల సృజియింపం జాలవు.... మార్క. 4. 8.

**సృజ్యము** సం. విశే. (అ. ఆ. అ.) సృజింపఁదగినది.

**సృణి** సం. వి. ఇ. స్త్రీ. ఈ. స్త్రీ అంకుశము.

కం. ... కుటిలాభల దనుజగజ, స్ఫుటన కళా సృణికదేవ చూడా మణికిన్, నిరంకుశో. 1. 25.

**సృణీ** సం. వి. ఇ. పుం. 1. శత్రువు. 2. చంద్రుఁడు.

**సృణి(ణీ)క** సం. వి. అ. స్త్రీ. లాలాజలము; ఉమ్మి.

**సృతి** సం. వి. ఇ. స్త్రీ. 1. నడక, గమనము, గతి, 2. మార్గము, బాట. 3. పీడనము, హింసనము.

**సృత్వరము** సం. విశే. (అ. ఆ. అ.) 1. కదలుచున్న, నడచుచున్న, 2. ప్రవహించుచున్న. 3. వ్యాపించు చున్న.

**సృత్వరి** సం. వి. ఈ. స్త్రీ. 1. నది; ప్రవాహము. 2. తల్లి.

సృదరము సం. వి. అ. పుం. సర్పము.

సృదాకువు సం. వి. ఉ. పుం. 1. వాయువు. 2. అగ్ని. 3. వేడి. 4. వజ్రాయుధము. 5. సూర్యబింబము. 6. కొండ.

సృదాకువు సం. వి. ఉ. స్త్రీ. నది; ప్రవాహము.

సృపాటము సం. వి. అ. పుం. 1. కొలమానము లేక పరిమాణము.

సృపాటి సం. వి. ఈ. స్త్రీ. చూ. సృపాటము.

సృపాటిక సం. వి. అ. స్త్రీ. పక్షిముక్కు.

సృప్రుఁడు సం. వి. అ. పుం. చంద్రుఁడు.

సృమరము సం. విశే. (అ. ఈ. అ.) 1. నడచుచున్నది. 2. కదలుచున్నది. 3. ప్రవహించుచున్నది.

సృమరము సం. వి. అ. పుం. 1. ఒక విధమైన లేడి. 2. పెద్ద చమరమృగము. (శ. ర.)

సృష్టము సం. విశే. (అ. ఆ. అ.) 1. సృజింపఁబడినది; నిర్మింపఁబడినది. 2. విడువఁబడినది. 3. త్యజింపఁబడినది. 4. నిశ్చయింపఁబడినది. 5. అధికమైనది.

సృష్టి సం. వి. ఇ. స్త్రీ. 1. సర్గము; ఉత్పత్తి. 2. ప్రపంచోత్పత్తి. 3. ప్రకృతి, ప్రపంచము. 4. సృజింపఁబడినది; భూతము. 5. స్వభావము. 6. త్రిగుణాత్మక స్థితి.

సృష్టించు సం. స. క్రి. సృజించు, సృష్టిచేయు.

సీ. మలయాచలంబునఁ గలశతనూజుండు ద్రావిడ శాస్త్రము నిఘంటు,వు ... లక్షణస్థితియు మొదల సృష్టింపఁదలపోసి ... కాశ. 3. 141.

సృష్టికర్త సం. వి. ఋ. పుం. 1. ధాత, బ్రహ్మ. 2. సృజించువాఁడు. 3. నిర్మాత, ఉత్పాదకుఁడు.

సృష్టిచేయు వి. స. క్రి. సృజించు.

మ. ... గ్రక్కునఁ దైత్రిలోక్యము సృష్టిచేయుమని శ్రీకాంతుండు పంపన్. దశా. 1. 301.

## సె

సెంటెమ్ము అ. వి. 1. శిక్షావిధి. (శ. ర.) 2. వాక్యము.

సెక వి. తాపము, కాఁక, వేఁడిమి, సెగ.

ఉ. ... సెకలెల్లఁ దొలంగ మెలంగెఁదమ్మి పూ, జొంకరకళ్ల తుంపరలచేఁ గయిదండ యొసంగు కెమ్మెరల్. అచ్చ. తె. భార. వి. 3. ఆ. 41 పు.

ఉ. ఆసతిగూడి యానఁటి నవ్యమెఱుంగక యుండ నీమనం, గానివితప్పవత్తి జరగల్పితనంబునఁ జెంపఁ గొట్టుచుం, దాసెకపుట్టయప్పుడు తనర్చురతిన్. ముఖ చుంబనంబునుం జేసెనొ కోయనంగ. పర. 2. 46.

చం. ... కరమరుదారెఁదేంట్లు సెకగందిన ముత్తెపు సేసతో యనన్. అము. 4. 151.

మ. సెకలీన్మల్కి యొకండు ద్రేసి తలఁద్రుంచెన్ వేల్పులగ్గింపఁగాన్. ఉ. రా. యుద్ధ. 498.

సీ. అగరుధూపముచేత నయోగ్యతనూవల్లి సెక పోఁకె నని యొదకెయ్యిపెట్టె. మను. 6. 8.

అకటా బెడిదపు వలపుల సెకలంబడి. నీలా. 1. 112.

సెకకంటి వి. ఫాలాక్షుడు.

చం. కళలకు పొమ్ము...సెకకంటికి మింటికిఁ దెమ్ము తెమ్ము తొయ్యలి సయిదోడు. హరిశ్చ. వం. 4. 16.

సెకలి(లిం)పు వి. సకిలించుట? సెగ.

ద్వి. అలవిష్ణుచిత్తకవ్యకతోడఁ గూడఁ జిక్కని తొలుబల్కు సెకలింపు లేక, చొక్కపొంపెక్క. ద్వి. పరమ. 5. 440 పు.

ద్వి. మించి మేఘంబుల మీఁదఁ దాలుచును జెలు వారు తొలుఁబల్కు సెకలింపు లెసగ. ద్వి. పరమ. 3. 286 పు.

సెకవెలుగు వి. సూర్యుఁడు.

కం. ... అవరుం గ్రక్కున నెదమకమ్ము సెకవెలుగు వకున్. య. 1. ఆ.

సెగ వి. అగ్ని.

తే. పురుషు మనసెంత దృఢమైనఁ బువ్వుఁబోఁడి వికృతిఁ జైకొన్న సెగపొంత వెన్నగాదె. కవిరాజ. 2 17.

"ఏమి చేసెనా సెగకంటి సామిగూర్చి" నీలా. 1. 109.

2. వేడి, వేడిమి.

వెక్కసమగు వంరాశి సెగలఁగ్రాఁగుచు. నీలా. 2. 48.

వ. నిట్టూర్పుసెగలం బొగులు వాతెఱలతో. ఉ. రా. 4. 94.

వ. మిగుల సెగలెగయు రవికాంత శిలాతలంబులం దెకతెక నుడుకెత్తి. పారి. 2. 87.

కడుపుమండించు నాఁకటిచిచ్చు సెగదాఁకి గవంసై యున్న కన్దవలవారు. శృ. నై. 7. 58.

3. తాపము, గ్రీష్మము.

సీ. సెగకుల్కి మఱుఁగుఁ జొచ్చిన జవ్వనరవిజల సరణి మల్లెలతోడి జరలు మెఱయ. ఆము. 2. 58.

సెగకంటి వి. శివుఁడు.

సీ. ఒక్క కాత్యాయని పొందంగ సెగకంటి పౌరుషం బరజేసి ప్రజలు నేర్పు. చంద్రికా. 2. 58.

సెగతేఁడు వి. అగ్ని.

సెగతేని దావ గొణ్ణెఁగలబంతి. య 1 ఆ.

సెగ్గము వి నింద్యము; రోత.

మ. మగడా నీవు జగంబు చొప్పుమిగులన్ మానంబు వాటింతుకా,లిగ సెగ్గంబగు మాట వాటిలెనె. నిర్వ. 5. 101.

కం. సెగ్గంబుల చెనఁబోవక, సిగ్గులు గైకొనక మానసీమ జనక పే,రగ్గలిక రెండు మనసులు దగ్గటి చూపుబడి నుత్కటంబుగఁగలసెన్. హరి. ఉ. 7. 176.

ఉ. ఇంతకుమున్న యిచ్చెలువ లెవ్వరుఁజూడరు నిన్ను నేడకా వింతగ వచ్చితే కతలు వేయును నేటికి నవ్వనక్తమై, చింతయు భాషణంబుల్నను చేఁతలు నీ త్రివిధంబు నీడుగా, వింత దలంకనేల కలనెవ్వఁడు దగ్గఱనేని సెగ్గమే (చెలు లుషాకన్యతో నన్నమాటలు) ఉ హరి. 5. 94.

సెగ్గించు స. క్రి. 1. రోయు.

ద్వి. తమసేయక్రమముఁ దత్క్రియముఁ గద ముట్టఁ దెలిపి భూకాంతు సెగ్గించి. ద్వి. పరమ. 6. 488.

సీ. కడు వశక్తుఁడు బ్రోవఁగాఁజాలఁ డితఁడని సెగ్గింతు రర్థిఁ గృషీవలుండుబడుగు మునలెద్దు రోసినవగిది. భాగ. 8 స్కం 981.

శా ఏ నుండఁగ నరేంద్రసింహముల నీ విట్లెల సెగ్గించె ది,చ్చో నుగ్రాటవిలోన నాఁడటు పశుస్తోమంబులం గాచున, ల్లానే కేశవ లావుఁ జేవ యును ధైర్యంబుం గలం డంద్రు. హరి. ఉ. 1. 113.

ఆ. దానవ సంఘంబు గాలవశతఁ బొందుటేటికి సెగ్గింపఁ బొమ్ము నీవు.

2. నిందించు, తెగడు, దూఱు.

ద్వి. అట్టి తండ్రికిఁ బుట్టి యభిమాన ముడిగి, ఎట్లకో నేర్పితి యీ కష్టదశకు, సెగ్గింపఁ బడిన యీజీవనం బేల నగ్నిలోఁ బడి చత్తు నవమానము నకు. రం. రా. ఉ. కాం. 181 పుట. 22 పం.

కం. తన హృదయమునం దెన్నఁడు, నను నించుక పొందనీఁడు నా యెదలోఁ దా, ననిశము నుండు నిదేమిటఁ, జనుచని మది మన్న విభుని సతి సెగ్గించెన్. కుమా. సం. 8. 147.

గీ. అనుచు తెఱసాలవారికి నప్పగించి, యాదవ కుమారుఁ గూఁతును వసుధవిభుఁడు, మనసు లోపల సెగ్గించి మరలిపోయె, నాత్మమందిరమునకుఁ గుంభాండుఁ గూడి. ఉ. హరి. 5. 274.

సెగ్గింపు వి. రోఁత

సెగ్గు వి. (సెగ్గము) వి. రోఁత.

సెజ్జ వి. శయ్య, పానుపు. (సం. శయ్యా)

తే. రాలియున్న పుష్పప్రకరము విదిర్చి, చెన్నుగా

మున్న సేసిన సెజ్జ యనఁగ వేగుటయుఁ జుక్క
లన్నియు విరిసి విశద, భాతిఁ జెలువొందె జూడ
నంబరతలంబు. భార. విరా. 2. 289.

ఆ. సెజ్జయందు మేను సేర్చి యర్జునకార్యచింతఁ
బలుకకుండ. భార. ద్రోణ. 2. 840.

సీ. స్వ్యంసహాకు, గానె సమకట్టు పుట్టంబు, గగ
నంబునకు నెల్లఁగలువసెజ్జ. భీమ. 3. 51.

గీ. దేవదేవుని విరిసెజ్జఁ దిరము సేసి. హర.
2. 87.

సీ. సెజ్జపైఁ బఱచిన చేమంతిరేకులు కలయ నిండి
వరదళము లయ్యె (ఇట యతి మైత్రిని బట్టి సెజ్జ
యనియే రూపము గాని "సజ్జ" యని కాదు)
విక్ర. 1. 187.

సీ. చెయిపట్టి వయమున సెజ్జసేర్చె. మను. 6. 8.

సీ గీ. ఆరజేపువన్నెఁ బతిసెజ్జ కరుగుఁ గూర్మి.
ఆము. 4. 50.

సెజ్జ = సెజ్జవేయువాఁడు? (1085) దా. శా.
1112.

సెటిసాని వి. వైశ్యభార్య. (రూ. సెట్టిసాని)

చం. జడమతిభార్యయొక్క సెటిసాని విదర్భుని
వీటనుండి నొంపడరఁగఁ గర్భులర్థిఁ గడుపై కదుఁ
బైకొనుదండి నొప్పులం బడు. వేం. పంచతం.
5. 39.

సెట్టి వి. వైశ్యుఁడు. వర్తకుడు. (సం. శ్రేష్ఠిః)

సీ. హరిదత్తుఁ డనుపేరఁ బఱగుకోమటియింటి
వరపుడు శూద్రాన్వవాయమున బ, తేః నించి
దానికి విటుఁడవై నీవు నిట్టి సంజ్ఞనా వైశ్యునకుఁ
బరిచర్య సేసి తిరుగుదువు సెట్టియు మురారి చరణ
కమలయుగళ నిశ్చలభక్తి సంయుతుఁడు గావ.
వరాహ. 8. 97.

కం. ధనమిత్రుం డనుసెట్టికి నమ వాగ్దత్తంబు
చేసినం. దశకు. 5. 77.

ఉ. అందలిసెట్టు లందఱు దయామతి నన్ దిగి
తెచ్చి యొండలో, నం దమయొద్ద కెట్టుకొని.
దశకు. 10. 59.

గీ. సింహవిక్రమపట్టణ శ్రేష్ఠు డయిన సెట్టి. హర.
1. 17.

2. కోమట్లలోనగువారి పట్టపుఁబేరు.

సీ. కాంచిలోఁ జిరకీర్తిఁ గాంచి మించినయట్టి
శ్రీగుప్తుఁ డనియెడు సెట్టి వట్టఁ... విక్ర. 7. 105.

సెట్టిశ్రేష్ఠి = పెద్దకోమటి.

సెనగ = సనగ.

ఉ. చిఱుసెనగలు (వ్యవహా.)

సెనగలు వి. బహు. వ. ధాన్యవిశేషము.

(సం. కణకాః)

కం. అనుములు గోధూమంబులు సెనగలును బండు
మేదిని.... భీమ. 4. 67.

సెపియించు స. క్రి. (రూ సెపించు) శపించు.

కం. నృప నీవు మదియం బగు, జపముఫలం బడిగి తేను
నమ్మతి నీఁగా, విపరీతఫణితు లాడిన సెపియింతుఁ
జామీ యొఱుంగఁజెప్పితి నీకున్. (శ. ర.) భా.
శాం. 4. 157.

సెబాసు హిం. విశే. ఆశ్చర్యకరమైన, వి. ఆశ్చర్యము.

చం. సెబాసగు ఘోడ యటంచు మెచ్చుచున్.
ఇందు. 5. 53.

సెబాసు అవ్య. ప్రశంసార్థకము.

చం. తెలుఁగునఁ జెప్పశక్యున సుధీజనులెల్ల సెబాసు
ధూర్జటి, బళి యని తక్కుగుల్కునగఁ బాటిలు
తేట మెఱుంగు మాటలన్, మెఱుకువ గాంచు
తెక్కు జిగిమించుప్రబంధతతుల్ ఘటి,తు వౌఁ,బలు
కుల ముద్దరాలిమిహి బంగరుటందెరవల్ సెలంగ
గన్. ఇందు. 1. 311.

చం. వక వక నవ్వి రావణి సెబాసుర యోరి
జయంత దేవతా, నికరములో బలాఢ్యుడవు. ఉ.
రా. 4. 318.

సెబాసురె అవ్య. (సెబాసు+రె) ఆశ్చర్యమును
దెలుపు నవ్యయము.

చం. ... వన్నువంటి తొ,య్యాలి విడనాడ నీ యెడ
నయారె సెబాసు రె యింటి వారి యం,దుల మహి

ముంబు గాక నిను దూఱఁగఁ బల్కఁ బనేమి? కుశ.
4. 40.

సెబ్బర విశే. చెడ్డది. (రూ. సెబ్రు)

సెబ్బర వి. చెదురు.

సెబ్రు విశే చెడ్డది.

మ. ... గుణమూ సెబ్రు, వివేకమూ వహి మనోగూఢ త్వమూ లేదు భావణమూ కల్ల. హంస. 5. 111.

సెబ్రుచెంచతము వి. చెడ్డదేగ, ప్రాణిహింస చేయువాఁడు.

తే. తలచు బ్రహ్మస్వ దేవస్వములకు వెగ్గు,కుప్పఁ దెచ్చిడి వేలాలు కొఱకఁ దివురు, గ్రహణ కాలంబువందు ముగ్గఁడు ఖలముం, సెబ్రుచెంచతమూ బ్రాహ్మణ బ్రువుండు. పాండు రంగ, 4. 165.

సెమ్మె వి. దీప స్తంభము.

సెర వి. (సం. శిరా.) రేఖ, కంటిలోని తీర

వ. ... వెడంద నిడువాలు కెఱ్ఱ సెరల కన్నులన్. ఆము. 6. 98.

వ. ఎఱ్ఱ సెరలతోడి కపిలకన్నుల వెడంగు చూపులను. హరి పూర్వ. 5. 143.

సీ. చెలువంబులగు నెఱ్ఱ సెరల విశాల విర్మల నేత్రములు వవక్మ్రకురాళి. హరి. ఉ. 8. 191.

ద్వి. చేవ విండ్లును నెఱ్ఱ సెరల కన్నులును. హరిశ్చం. పూర్వ. 562.

తే. లేచి కూర్చుండి కలయఁగఁ జూచి యెఱ్ఱ సెరల కాంతియు దంతరుచియును బెరయ. భార. అశ్వ. 4. 84.

కం. వరుఁ డలుక నొడమియును సుస్థిరుఁడై తన యెఱ్ఱసెరల చెలువునఁ గెందామర లందెగడెడు కన్నుల, వరుణచ్చుని నెఱయనిట్టు లనియె నరేంద్రా. భార. ఉద్యో. 2. 182.

కం... అప్పుడ జాతు లెఱ్ఱసెరలొప్ప నతని వీక్షించి యార్చి బరవస మలరన్. భార. ద్రోణ. 3. 170.

సీ. కఱ్ఱెఱ్ఱ సెరల దీర్ఘ విలోచనంబుల కడల నగ్నిస్ఫులింగంబు లురల. శృం. నై. 7. 46.

సెరగు దే. వి. అపద.

కం. ధరణీసుర వరులకుఁ గడు, సెరగై నెడ నెఱిఁగి యొదయు జేయుదురె మహాపురుషులని భార. ఆది. 8. 118.

సెఱవు దే. వి. (రూ. సెఱగు) ఆపద, హాని.

తే. గీ. భక్తిగిడ్డపడి వేనాని పనుపునేసి తడవు లేదేని గలిగి రేవడవు మొరడె. కుమార. సం. 10. 50.

సెల వి. 1. కొండ, ఱాయి (సం. శిలా)

సీ. కొండ మల్లయ్యచే నుండునందురు గాని జింకను గావ మేవంక నైన... అలకంబయ్య కానైనదేమో కాని సింగ మొక్కటరైన సెలల లేదు. యయా. 1. 106.

వ. సెలయేటి చిలువ చిలువ నీరు వగలు గగనమణి ధగధగని కిరణముల మిగుల సెగయు. పారి 2. 82.

కం. సెలయేఱులలోఁ జిల్లులు, చిలుకుట నాడు దురుముమల చివురుంబోణుల్. హర. 5. 56.

2. సెలయేఱు, కొండవాగు. నిర్ఝరము.

సీ. సెలవెప్పుకొని రొప్పుపులినైనఁ బిడించి పడ వైతుఁ దొచ్చి నీ పాద మాన. మను. 4. 184.

వ. ఎఱకలు విఱుగ నఱికిన యెడల సెలలకు నిగిడిన నెంగల హొలుపు వంకెఱు నెరగొని ధారలు జరద జగర నికరంబులును. పారి. 2. 86.

సీ. చలి గాలి దిండి మేఁతల జాతికొమ్మలు యాటల కిరవైన యట్టి సెలలు. ప్రబం. 1. 155.

కం. తలవరుల్ సెలవరులుం, బోలవరులున్ వచ్చి యంత భూపాలునితో, మలలందున్ సెలలందున్, శిలలందును నెల్ల నారసితి మే మందున్. సారంగ. 3. 289.

3. బాణపు ములికి. (శల్యమ్. సం.)

కం. ఆతతబలుఁడగు భీమ్ముని, చేతిబలుపు ద్రోణు నంపసెల లనియుటయుం, జూతురు. భార. ఉద్యో. 4. 192.

సీ. అలిగిన గాండివి యమ్ములొక్కమ్మడి, ముందటి దెనము బిఱిందివలన వలపట దాపట సెలలు పెక్కువిసిన తెలఁగువఁ గవిసిన విఱుగు విల్లు, దునియు ఖడ్గంబును. భార. ద్రోణ. 8. 48.

కం. గొడుగునను వింటికొమ్ములు, పిడమున నరదంబు సెల లవిసి కడున్. వడి నిగిడెడు రొప్పున నవ్వడ ముడి దెసనమ్ము లడరె వసుధాధీశా. భార. ద్రోణ. 4. 322.

చం. .... అంపపెన్ సెలగతి మాగతిన్ బెమకఁ జిక్కక మానదు. ఆము. 2. 27.

కం. వలచుట్ట పీడుకొనుచుం,బలుగు దొరల్ విభుని బొగడి పోవ నసుర గ,క్తిలి యేసెఁదామ పాత్రుముఁ సెలలవిసె ననంగఁ గప్పి చీఁకటు లెసఁగన్. రామా 8. 219.

తే. అచటి పందులఁ జెప్పంగ నలవి యగునె, చప్ప రింపంగ సెలవుల జాలుపొంగ, సెలల బెడిదంపుఁ గోలల సెలగఁ బట్టి, మట్టుమీఱిన కాఱగ్గిఁ బట్టు మంచు. చంద్రాంగ. 2. 60.

4. (బాణముల) పాది.

5. ఏదుపంది ముల్లు.

వ. లకోరికోలల చందంబున నందం బగు సెలల బృందంబు ఘలుఘలు మనంగఁ బొంగి బెడారున కొన్నింటి యవయవంబులు తూటుల కావలరీతిఁ జెల్లె డల భాతి జోరున నెత్తురు గురియు వెడఁద గండ్ల బోఁడిమి వెడఁదాఁకి వెన్నున జెన్నారు ముండ్లు బొమ్మన నాఁటి పీఁపున వెడల నెగిరి పైఁబడి కొఱతంబడిన లాగున గోరలు కొన్నింటి గవుల కీడ్పుక నరుగు నేదులు మెలంగు నెలవులను. చంద్రాంగ. 284.

6. పశురోగ విశేషము.

ద్వి. మొలవిడి సెలతెవుల్ ముగుబంతి నట, తల యేరు తొడకు వాతము కల్ల వాపు, వలదొల్ప తెవులును సాదిగా నెన్నఁ,గల పసరాల రోగములకు నెల్ల. నవనాథ. 1. 41. పు. 4 పం.

సెలకట్టియ వి. బాణము (రూ. సెలకట్టె)

చం. గఱులు మునుంగఁ దూలు సెలకట్టియ వాటులఁ గుంతకూలమున్. భా. రా. యుద్ధ. 977.

చం. కనుఁగొను నంతలోన సుమకార్ముకుఁ డాత్మ విరోధి కల్పునిన్. ఘమని మడింగలంచఁ దటి గప్పదె నంచుఁ గుతూహలాత్ముఁడై, కనుగల వింట దమ్మి సెలకట్టియఁ రెక్కడి చక్కగా నుర,మ్మున గురివేసిన సముత్కట మోహము నిల్పఁజాలమిన్. చెన్నబ. 2. 241.

ద్వి. సెలకట్టియలు గొప్పతేనడ,బులును సిల కట్టియలు పెక్కు చిక్కుల వలలు అ. మ. క 5 ఆ. 221 పు. 28 పం.

సీ. ఎగిరి పైకొనిమీఁద నెవ్వఁడు దలమూపకుండంగ దినము బాణోత్కరముఁ గప్పుటెలల సెలకట్టియలను ద్రేయుఁడు. హరి. ఉ. 1. 88.

ఉ. కట్టిన నీలిదిండ్లు సెలకట్టియ విండ్లును. మను. 4. 85.

వ. కట్టలుకం గట్టలు వడనేయు కట్టడి మరుని యంప సెలకట్టియలు వసు. 2. 141.

వ. అంగభవు కొంగవాలు లన సిరివట్టి సెలకట్టియ లననలరాజు భిండివాలంబులన. భీమ 1. 117.

2. బాణమువలె వేగముగాఁ బాఱు శ్యేన విశేషము.
ద్వి. సెలకట్టియలు పెక్కు చిక్కుల వలలు. అ. మ. క. 5 ఆ. 221. పు. 29. పం.

సెలకట్టు అ. క్రి. మొనకట్టు.

కం. సెలకట్టు కిటుల నిభలా, కలకట్టకడలకుఁ దక్కు జనములు తమ బం,ధులు కొట్టఁబడుచుఁ బరువన్ సెలకొట్టుచు నవ్వెరవుడు ఖేచర వీరుల్. లక్ష్మ. వి. 2. 89.

సెలకట్టె సెలకట్టె వాటునఁ జెలఁగి రెంటిని మూటఁ గూడ గుబ్బంబుల గుదులు గ్రుచ్చు. కేయూర. 1. 29.

వ. కాడివంకిణి నలకయూరె సెలకట్టె సిళ్ళను ద్వాత్రింశదాయుధంబులు. ప్రబం. 1. 78.

మ. వలువందం గడు పిట్టతెట్టరొద నన్నన్ సద్దు గావింపుచున్, సెలకట్టెం గొని జేఁడుమైల మృగ యుల్ చెట్లొక్కటం గొట్టఁగన్. చంద్రాంగ. 2. 107.

తే. గీ. అర్కనందను సెలకట్టెయంపకోల, పులుఁగు రాయని కాక్కాల పుణ్యభిత, కేతకీ పుష్పవాసనా

క్ప్రతిమాసి. వర్యతేంద్రంబు తర్కిలాదు పావతెరు క్రీడా. 1. 221.

అ. వె. చేత దేగఁబట్టి సెలకట్టె గైకొని, ప్రొద్దు బోక పాలము వోయెనేని, దినము వలసినన్ని తేవచ్చు వురుగుల. చంద్ర. 2. 12.

గీ. గొట్టె గ్రొవ్వియు సెలకట్టెఁ గొఱికినట్లు. భీమ 4. 48.

2. బాణమువలె వేగముగాఁ బాఱుశ్యేన విశేషము, దేగ.

కం. మొలదట్టి చెఱఁగుఁ జెక్కుచు, బలుదిట్ట కిరాఁతు డొకఁడు పటునగుముష్టిన్, సెలకట్టెఁ బట్టి వేఁటాక సెలకట్టెన్ గొట్టెవైచెఁ, జెమరుం గాకిన్. మను. 4. 57.

సెలకొట్టు అ. క్రి. కుమ్ము, పొడుచు (?)

ఉ. ... ఏకలంబు లా, పోవ మనవచ్చునే యని మహారభటిన్ సెలకొట్టె రొప్పినన్. చంద్ర. 1. 8.

సెలకొయ్య వి. (వి. సెలమకొయ్య? వృక్ష విశేషము తిరుపతి మండలము వాడుక) వద్రంగి యుపయోగించునది.

సెలగ(వ) వి. ఉపశాఖ, రెమ్మ.

సీ. రెమ్మ రెబ్బరి వటరివ్వ సెలగ చివ్వచివర మల్లె జబర చివర మరిగ. ఆం. భా. 2. 37.

సెలవ(గ)లు పలవలు = శాఖోపశాఖలు. ఉదా. ఆ శెట్టు సెలవలు పలవలుగా పెరిఁగినది.

2. ధాన్యములను కొల్చు మాన విశేషము. పాం. ని మాన. 52.

3. అమ్మువాఁడు కొనువానికి అదనముగా నిచ్చు నరుకు.

ఉదా. కొబ్బెర కాయలు మొ. వానికి సెలగ చేతులు వేయుదురు. ద్వి. వ. యో. వి. 66. 480.

4. దోసెడు గింజలు. శ. ర.

పందికోఱ యొక్క అగ్రము - (అని తోఁచినది) ?

తే అచటి పందులఁ జెప్పంగ నలవి యగునె, చప్పరించిన సెలవుల జారు సొంగ, సెలల జెడిదంపు గోఱల సెలగబట్టి, మట్టుమీఱిన కాఱగ్గిఁ బుట్టు మంచు. చంద్రాంగ. 2. 60.

సెలగట్టె వి. (సెల+కట్టె) సెలగొయ్య, గుది కఱ్ఱ. మెడలోఁ గట్టెడు కఱ్ఱ

తే కుడిచి కూర్చుండి మీ రేల కొఱఁత యైన, కుమ్ములాడెదరో యన్నదమ్ములార ! గొఱ్ఱె గ్రొవ్వియు సెలగట్టెఁ గొఱికినట్లు, కటకటా మీ వివేకంబు గాడుపడఁగ. భీమ. 4. 58.

సెలగత్తి వి. (సెలకొ+కత్తి) కల్లుగీఁచువాని కత్తి.

సీ....అడిద,మున బల్లెముల నీఁటియల సెలగత్తుల గుదియలఁ దూపుల గొడ్డళులను జెండు చెండాడి. అ. రా యుద్ధ. 2. 89.

సెలగదోసిలి వి కొలతలో ధాన్యమునకు నూటి కొక సారిగాని యిరువదింటి కొకసారెకాని వ్యవహరింపఁబడుమాట, ఇట్లన్నతరువాత మొత్తము లెక్క తెలియుటకై వేఱుగాఁ బోసిన దోసెడు గింజలు.

సీ. వెలయు రాసులఁ బొల్చు విమవీథి కళ్యాసఁ జెన్నందు సెలగదోసిళ్ళ వంగ. విప్ర. 3. 28.

సెలగనిపించు స. క్రి. (సెలగ+అనిపించు) సమృద్ధి నేయు.

గీ. అన్ని వస్తువులు సెలగనిపించుఁ ద్రైలోక్య భద్రకరులు వీటి శూద్రవరులు. కళ. 1. 129.

సెలగు(వు) స. క్రి. ఖండించు.

స్రగ్ధర. చెండాడెన్ సెలగె సెలుఁగులన్ జించెఁ గాఱ్పోతులన్ మైకండల్ గాఁజేసె నిల్లన్. యయా. 2. 32.

సెలగు అ. క్రి. ధ్వనించు, మాఱు సెలఁగు. అ. క్రి. మాఱుమ్రోయు.

ఉ. .... ఇంకఁ గథలిన్నియే నేటికిఁ జావుదక్కునే, దిక్కున నొండులే దనుచు దిక్కుల మాఱు సెలంగ నేడ్చుచున్. భా. రా. అర. 174.

సెలకొమ్మ వి. (సెలగ+కొమ్మ) ఉపశాఖ.

అ. కొమ్మకు సామిమాని సెలగొమ్మకు సాటియొకోటులయ్యెడన్. రామా. 4. 66.

సెలగోల వి. 1. పసుల మేపుగొల్లవాఁడు, ధరించుకోల (చేతికఱ్ఱ) (సెల+కోల)

కం. మొలసీలి కాసెయును బద,ముల నొడచ్చులు ధరించి ముదము దలిర్పన్, సెలగోలయు ములు బంతియు, బలపముఁ గత్తియును బూని పటు సాహసియై. హరిశ్చం. 5. 111.

చం... కాఁచీఁయు సెలగోల కత్తి. దశకు. 5.72.

చం. నునుసెలగోల నేకొని మనోహర మౌ తన మేనురాజుచూపును బ్రజచూడ్కులం దిగువ. భార. విరా. 1. 279.

మ. కనిచేతన్ సెలగోల పట్టికొనుచున్ గానిమ్ము గానిమ్మురా తవయా. భాగ. 10 స్కం. 862.

"సన్నంపు సెలగోల చేంకనిటికి" నీలా. 1.31.

2. త్రవ్వుట మున్నగు వానికై దొంగ లుపయోగించెడి సాధనము, ఆయుధ విశేషము

ఉ. కత్తెరం కావికప్పడము కాటుకయున్ సెలగోల చీరయున్, గుత్తపుటట్ట నంబువులు కుక్కల కట్టును పిండిబల్పమున్. చెన్నబ. 8. 294.

ద్వి. సెలగోల యొంటట్ట చెప్పులు వీర. బస. పురా. 128. పు. 1. పం.

3. బాణవిశేషము.

కం. సెలలగోలలచేఁ బులుగుల, బలుకోలల మృగకులములఁ బరిమార్చుగతిన్, సెలగోసెల గని పారిఁ గొని, రెలకోలలనే పదాతు లితరేతరులన్. లక్ష్మి. వి. 2. 78.

సెలగోసెలగ వి. యుద్ధమందు పదాతులనుకొను మాట.

కం. సెలగోలలచేఁ బులుగుల, బలుకోలల మృగకులములఁ బడిమార్చుగతిన్, సెలగోసెల గని పారి గొని, రెలగోలలనే పదాతు లితరేతరులన్. లక్ష్మివి. 2. 79

సెలవంది వి పదువంది, ముండ్లపంది.

సెలపుండు వి. నారికురుపు, నాడీవ్రణము.

సెలబుగ్గ వి. చిన్న సెలయేఱు.

ద్వి. ఉన్నతోన్నతమైన యుదయ శైలమునఁ, జెన్నొందు నమృతంపు సెలబుగ్గ యనఁగ, ద్వి. 4, 308. పు.

సెలయు = చెలయు స. క్రి. 1. చిమ్ము శ. ర. 2. కొమ్ములు మొ॥ వానితో పొడుచు.

సీ. అలవోకఁ గనకాద్రి సెలయుచో విరిసిన హరి వరాహము దంష్ట్రివవతరించె, పాండు 1.

సీ. కలఁచి కలశవారిధి బయల్ సెలసి కొమ్మున గొట్టినంటి వచ్చిన వాఁచుటుంటపుడమి. శ. ర. చంద్రాంగ. 1. 75.

సెలయు అ. క్రి. విజృంభించు.

సీ. కొన్ని జాగిలములు కోలాగ్రమున నిల్చి నొక కొన్ని తెమలకాలికిని నొడియు, నొడియుచో గ్రోడంబు పెడమరఁదిరిగి వని జారి యుదిరికి వట్ల కవియుఁ, గవియుచో మఱి యేకలమంది సెలసిన పెట్టుచే వని కిటి వెంటఁ బెట్టు. రాజవాహన. 8. 66.

ద్వి. ముక్కుల తెక్కలు మురువుగాఁ దీర్చి, చొక్కంపుశేమావి సుదకొమ్మ లెక్క, సెలసి తేఁగొన తెత్తి సెలవులఁ ద్రుంచి కలగొనలు కలుగనా వప్పళించి (ఇది కోకిలవిషయము) నవనాథ. 1 ఆ. 12 పు. 3 పం.

ద్వి. చేలఁ గట్టఁగ నన్ను సెలసి వట్టెదవు మేలమో యిది మందమేలమో యనుచు. అ. మ. క. 5 ఆ. 245 పు. 28 పం.

మహాస్రగ్ధర. గుఱుమట్టం బైన తోకం గొని విసరు వెసం గూలఁగాసాలపంక్తుల్, పఱచుం దాటించి దాడల్ వయిఁకొను సెలయున్ బల్మెఱుం గల్లు పెట్టున్. వరాహ. 12. 32,

సెలయూట (సెల + ఊట) వి. కొండయూట. (శ. ర.)

సెలయేఱు వి. (సెల + ఏఱు) పర్వతమునుండి పాఱెడు నది, నిర్ఝరము.

చం. ఒక సెలయేటిచెంతఁ గననొప్పు రసాలసువర్ణ పాటలీ, వకుళకదంబనింబవనవాటి. పె. శకుం. 2. 195.

తే. కవులు గొందఱు నెత్తురుగాఱఁ గూలి, తఱుచు జేవురు సెలయేళ్ళ నొఱపుగలిగి. భా. రా. యుద్ధ. 1259.

కం. కలువలు కెంకెవవ్వెన్, దోరమె సెలయేటి యవశేతుహినాంశుకరంబులు గని యవృకేటావలి గిలిగింత లెట్టె వాసికిన్ సరోజాక్షేన్. సారంగ. 2. 162.

లగడ శ్రీకరముగ వగ్గిరి మందాకిని సెలయేతై యనిశముఁ బ్రవహించు. వరాహ. 19. 144.

చం. ఎలమి పూరి వేసి సెలయేటులనీరులు ద్రాగి .... కుమారసం. 6. 107.

మ. సెలయేటుల్ గడలొత్తఁ జేయుచు లతాసీమంతినీవర్ణనంబులు గల్పించుచు మత్తబర్హి రుత ములో పాల్పొందఁగాఁ జేయుచున్, వలనై జానవ మారుతంబు దనకున్ వాఁఘామరూపంబుగా. హరి. ఉ. 1. 57.

సీ. కుందకంబు మదంబు కలశైలకూటంబు సెలయేటియాటలోఁ జెలిమిసేయ. రాజవాహన. 2. 50.

ఉ. చెలువు రెట్టిగాఁగఁ జేటువు సెలయేటు, లున్నతాచలమున నురలువట్లు. భార. భీష్మ. 3. 146.

తే. అనుచుఁ బోటులఁ దొరుఁగురక్తాంబుధార, లంగ మెల్లను గప్పిన నవ్వు దోప్పెఁ, గావి సెలయేటు లెల్లడఁ గలయఁబర్వఁ, బొలుచు కులపర్వతంబు రాదువన నతండు. భార. శల్య. 2. 191.

చం. సురపతిదాడి నంబునిధిఁజొచ్చిన యద్రులు నిచ్చ లప్పురిన్, దిరుగగ వాత్మఁగోరి శరధిన్ బరిఖాకృతిఁ గావువెట్టి తా, రయుడుగ భద్రసామజములై సెలయేటులు దానధారలై ...విక్ర. 188.

సీ. .... తే. నిద్ర మేల్కాంచి సెలయేట నీడఁ గాంచి ... విడుచు గజరాజు నీధాటి వింధ్యవాటి. ఆము. 1. 89.

సీ. సెలయేటి యిసుక లంకల వరాహంబులు ముత్తంబులై త్రవ్వికుస్తై రెత్త. మను. 2. 7.

వ. ప్రవహించు సెలయేటి నీటితుంపరల్ దొరసి. ఉ. రా. 3. 191.

సెలర్పు అ. క్రి. ఉత్సహించు.

చం. ఉరుటఁ చెమర్చి మ్రింగు...ఉప్పరం బెగయఁ జాతకపోతముల్ సెలర్చుచున్. కమా. సం. 6. 99.

సెలువాఱు అ. క్రి. (సెలవు+పాఱు) సెలవు చేయు.

గీ. ఏటు పోటు ప్రేటు నెవియు లేక వర్ణములు సెలవాఱి మానినట్టి, శీకరంబులైన శోకవ్రణంబుల కౌషధంబుచింత యఁ ద్రుంచుకులు. ప్రబోధచం. 5. 8'.

సెలవడు (సెలవు+పడు) అ. క్రి. (కులుపు) రంధ్రము పడు; సెలవాఱు.

కం. హరువటాలం బొలఁబడి శిరమునకున్ వెడలె నీరు సితఖండము చంద్రుర యది సెలవడి వేఁడున్, దొలఁగెడు పులినీరు గాంగ తోయము పేరన్. చంద్రాంగ. 5. 76.

సెలవాఱు ద్వి. అ. క్రి. (సెల+పాఱు) సెలవేయు.

గీ. త్రిపుర సంహార మొనరించునపుడు హరుఁడు, బండికల్లుగ నీమేను గండిచేసె, నదియు సెలవాఱి తెగటాఱవైతి చంద్ర, యకట రోహిణియెడ నవశ్యమునఁ జేసి. మను. 8. 40.

సెలవి వి. (సం. సృక్వి.) పెదవిమూల.

మ. సెలవింబాఱఁగ నవ్వుచుం బతికె నాశ్రేపించి యీ వేర్పుమాటలు మా ముందరసాగిరావు హరిశ్చ. 2. 190.

కం. దాలఁగ నిచ్చలు వెన్నయుఁ, బాలుం గుడక గాని తల్లి పట్టిక సెలవిన్. ద్రేలిడి యింతింతయటాఁ గోలించును. హరి. పూర్వ. 1. 197.

ద్వి. సెలవిపైఁ జిఱునవ్వు చిలికెడు మోము. హరిశ్చ. ఉత్త. 133.

కం. అని సెలవి జాఱనవ్విన, వనితం దిలకించి కోపవహ్నికణంబుల్, గముఁగొనల జారఁగా నిట్లని యెవ్ మిహికాధరాధరాత్మజ పెలుచన్. చెన్నబ. 1. 147.

సీ. తటినీ తటంబులు దటిసి యోరగ నిల్చి సెలవి కొమ్ములఁ గ్రుచ్చి చిమ్ముకొనుచు. కా. రా. 2. 6.

ఉ. చేతఁ దొడికి క్రింది సెలవికేలను బట్టి యనను

కీల ముష్టివిశిఖ పొదువఁ, గుళికనివహకిఁ గూలు కొండకై వడి నిలఁ, గూలి కాళ్లు గుద్దుకొనుచుఁ జచ్చె. పద్మ. 9. 186.

ద్వి. ముక్కల చెక్కలు ముదువుగాఁ దీర్చి, చొక్కంపుతేమావి సుదకొమ్మలెక్క, సెలసి తేఁగొన లెత్తి సెలవులఁ ద్రచ్చి, కలగొనలు కలకుగా నవ్వ శించి (ఇది కోకిలవిషయము). నవనాథ 1 ఆ. 42 పు. 8 పం.

.... సెలవుల్ వెస నాకుచుఁ బోయె ... ఆము. 8. 22.

సీ. సెలవుల వనదళములు మూఁగి నెఱవెట్ట. మను. 2. 7.

వ. మిమ్ము నాలుకలు గోయక సెలవులు ప్రీల్పక ప్రాణంబులు గొనక యెట్లు సైరింపవచ్చు. శృ. నై. 7. 88.

కం. వనిత సెలవివార నవ్వి వాని కనియె. స్వా. 2. 40.

ఉ. ... ధూర్తకోటితో, మచ్చరికించుచున్ సెలవి పాఱఁగ నవ్వుచుఁ గేకరించుచున్ విక్ర. 8. 8.

కం. అనవుడు విని సెలవులు వాఁర నగుచుఁ దమ తపము పోతరంబుననైనం, గనుగొను మీ నా రాయణు,నని పలికి సభాజనంబు లాశ్చర్య పడన్. వరాహ. 1. 140.

సెలవిచ్చు అ. క్రి. (సెలవు + ఇచ్చు) అర్పించు.

సీ. అనిలబాణము శత్రుజనులకు సెలవిచ్చు, జోగులై తోగులై స్రుక్కఁజేయ. కువల. 1. 91.

సెలవిచ్చు స. క్రి. ఆజ్ఞాపించు.

కం. ఈరీతి ధర్మతనయు మ,యూరధ్వజయజ్ఞవాహ యుగళవిహారం, బా రా జెఱింగి తన పరి,వారము సెలవిచ్చె వారువంబులఁ బట్టన్. జై. భా. 8. 4.

సెలవిల్లు వి. (రూ. సెలసువిల్లు) సెలసుబద్దలతోఁ జేసినవిల్లు.

బ. వ. సెలసువిండులు. ఇదే శ. ర. ము.

కం. సెలవిండు లెక్కుపెట్టుచు, సెలవిండు నృపాల యనుచుఁ జేరి కిరాతుల్, వలకేల ద్రొక్కి చూడుము, వలకేల మెకాలఁ దోలవలె మే మునికిన్. సారంగ. 1. 39.

కం. ... క్రీడా, భల్లుక కురంగములు సెల,విల్లం గై కాన్క భిల్లవిభుఁ డిడి మ్రొక్కెన్. రాజవాహన 2. 85.

గీ. ఒక్క యెలుకుతేఁడు వక్కకొమ్మును నిల్పి, గోరిజంబు జొన్నుఁ జూఱవన్ను, బిలిగఱుల యుంబ కోలలు సెలవిండ్లుఁ గానుకిచ్చి కరయుగంబు మొగిచి మను. 4. 14.

చం. వెదురుల ముత్తెముల్ సెలలవిండ్లు జవాది పునుంగుచట్టముల్, పెదపెదద తముల్ పునుగు పిల్లలు జల్లులు జుంటి తేనియల్, బదనిక చాలుఁ గాఱెనుముపాలు ననంటు లవంటుకప్రముల్ మొదలగు కానుకల్ నృపతి ముందట నుంచి కొహో రొనర్చుచున్. ఉ. రా. 7. 398.

సెలవు వి. 1. ఆజ్ఞ.

ద్వి. సెలవు పెట్టిన వంది సేనాధినిభుఁడు ద్వి. పరమ. 6. 463. పు.

మ. చెలులుం జుట్టలు హేమరత్నములు హస్తి స్యందనాశ్వంబులున్, బలవద్యోధసముత్కరంబులును సంపన్నంబుగాఁ గల్గియున్, సెలవేమీ యిటు లంతకాంత కహితశ్రేణీ సమాఘాత సంకలనం దూలి వశింప నిట్టి యభిషంగం బోర్వగా వచ్చునే. హరి. ఉ. 2. 98.

చం. సెలవులు వెట్టఁ గ్రోల్పులికిఁ జేయిడి ముప్పిడి గుప్పు శౌర్యవంతులఁ గని కర్ణముల్ విరియ నొక్కి వరాహము నెక్కు వీర్యవంతులఁ గని వేటవెంటఁ బడి దుత్తెడు మేరసపెట్టు వేగవంతులఁ గని మెచ్చి లేవగవుతోడ నభీష్టములెల్ల నిచ్చుచున్. వరాహ. 4. 88.

సెలవులువెట్టు = ఆజ్ఞాపించు.

వ. పుణ్యదేశంబులు చూర సెలవులేమి కుటుంబ సహితుండై కీకటదేశంబునకుం బోయి. కాశీ. 7. 249.

కం. పంకజముఖి విరహులపయిఁ, గింక న్నిజసైన్య కోటికిని సెలవిడుమీ, నాంకుని కరతల మవ నలకం

కేళిన్ జగదుగాలిఁ గదలెడుఁ గంచే. మను. 3. 81.

2. అనుజ్ఞ.

గీ. సెలవు గల్పించుకొనిపోయె గెలిచివచ్చు. నచటి కంకిరవములు. కళా. 1. 152.

ద్వి. సెలవిమ్ము రాఘవ శ్రీజానకీశ, సెలవిమ్ము పోయెద సెలవిమ్ము నాకు. రం. రా. బాలకాం. 81 పు. 1 పం.

కం. ... నిలవేము దొలఁగి చనుటకు సెల వీవలె ననుచు దనుజశేఖరుఁ డలుకన్. ఉ. రా. 4. 78.

3. సెలవు.

కం. ని న్నెదురెదురే చూడఁగ, నిన్నాళ్ళకు సెలవు గాఁగ నిట వచ్చితి వింక న్నీవు తిరిగి పోయెద, వన్న న్నేఁ బోవనిత్తునా వనమదనా సారంగ. 2. 90.

4. ఉపయోగము. (సెలగు. రూ.)

తే. నీవు మా మగఁటిమిఁ గని నిక్కువముగ, మెచ్చుకటియును వచ్చెడు మీఁద నింక, నిప్పు డూరక వాగ్వాద మించుకయును, సెలవులేదు విచ్చేయుము సిద్ధవర్య! హరి. ఉ. 6. 118.

తే. బందువనులకు సెలవులేకునికిఁ జేసి, యత్య సించితి శైశవమాదిగాఁగ, దండలానక విధముతు గుండలియును, త్రొక్కణంబు తెలుంగును బేరణంబు. భార. విరా. 1. 140.

గీ. అన్ని భాగ్యంబు లున్న నా యబ్జముఖి శ్రీ మహాలక్ష్మి గలుగఁగ నేమి సెలవు, పుత్రవదనావ లోకనోద్భూతమైన, యొక్క సౌఖ్యంబు గ్రాఁతియై యుండుఁగాన. శివరాత్రి. 2. 15.

కం. జనవర తపమునకుం జొచ్చినఁ గన్నులు మూసికొంచు సెలవింతియకా, క నిదిధ్యాసకు బ్రహ్మం, బెవయునె పరిభవవుకల్య మెదలో మెలమన్. ఆము. 3. 40.

సీ. గోపాల నవపుష్పగుచ్ఛంబు మూఁగిన పరిచారి కాద్విరేఫములలోన.

తే. గలయఁ దొలుకాఘుషోఘులు గలవు గాన సెలవులేక జన్మంబులు చెడియె నాకు. ఉ. హరి. 4. 187.

గీ. కన్నమోహంబు విడువదుగాన యేను, వగవుమై నెంతదూరిన వనజనాభ, సెలవు లే దింక గతజలసేతు బంధ,నంబు చేసిన వాదట నవ్వుఁబాటు. ఉ. హరి. 1. 187.

5. విడుదల (?)

కం. కడు సరసములకుఁ బ్రౌఢై,క్కడిది దురంతోప గూహగతులకుఁ బ్రౌఢై,క్కడిది యొక సెలవు నేసితె, కడజాముననవచ్చి చాల్ పొకారుకు బుద్ధిన్. వే పంచతం. 4. 235.

6. సత్యము.

తే. ధర్మవాదులు ధర్మతత్త్వప్రధాన, చిత్తులగు వారిఁ బూని రక్షించు ధర్మ,మందురది బొంకు గావించె వతులధర్మ, శీలుఁ డగు నన్ను ధర్మువు సెలవు లేద భార. కర్ణ. 3. 343.

7. చోటు, స్థలము.

కం. తిరిగితిమి గాలికై వం, బొరఁగూడని చోటు లెల్ల మూర్ఖమరీచుల్,వరఁగని సెలవులు (?) చూచేట, యరుదే యనిరుద్ధుఁ జూడ నలవడ దయ్యెన్. ఉ. హరి. 5. 313.

8. పోటు, దెబ్బ.

సెలవు స. క్రి. (సెలగు రూ.) ఖండించు.

సీ. చెవి దాల్చి విని చీమచిటుకన్న నొకపారి సెలవి వెంపరలాడు జిట్ట లెల్ల. మను. 4. 17.

సెలవు అ క్రి. పైకిఁజిమ్ము.

సీ ఈ నగాగ్రంబున నీన గాఁడిన యంత శిలనైన మిన్నెలు సెలవకున్నె. ఉ హరి. 2. 161.

సెలవుపెట్టు క్రి. విరామమునకు విజ్ఞప్తిచేయు ద్వి. పరమ. 6.468. పు.

సెలవుసేయు స. క్రి. (సెలవు+చేయు) బోధించు, అర్పించు.

కం. తా నేర్చు పూజ్యవిద్యా, శ్రీనిధి నెవ్వనికి

సెలవుసేయని దుష్టా,నూనాభిమాని చదివిన, శ్వానం బనఁ బరగు వీఁడు జగతిస్థలిపై. సావఁదో. 4. ఆ.

సెలసికొను స. క్రి. చిమ్ముకొను.

సీ. గాలి సోఁకినసైనఁ గనలి మై కొప్పరించి తటాన యట బయల్ సెలసికొనుచు.

(ఇది వరాహవిషయము) చంద్రాంగ. 2. 93.

సెలసు వి. ఒకానొక చెట్టు.

సీ. కలిగొట్టు మోదుగు కానుగు గలుగు వావిలి మేడి నేరేడు సెలసు బలుసు. వేం. పంచతం. 4. 471.

సెలసువిల్లు వి. సెలసు బద్దలతోఁ జేసిన విల్లు. (రూ. సెలవిల్లు)

తే. గీ. సెలసు విల్లును మొదలైన చేఁగవిండ్లు చులకగాఁ దీసి శబరేంద్రసూనుఁ డేయు. కాళ. 3. 35.

సీ. సెలసువిల్లు వహించు కిలసంబు గాదని వేణు కుండిక యొండు పాణిఁ బూనె. వాల్మీకి. 2. 116.

సీ చిలుకంప పొదికిఁ దార్చిన నెమ్మిపురి జల్లి చే వెక్కుడిన చేగసెలసు విల్లు. చంద్ర. 1. 3.

తే. చల్లడంబులు నొడదోళ్ళుఁ జలిదికూళ్ళు, చిక్కములు మడ్మ బిళ్ళల చెప్పుజోళ్ళు, సెలసు విండ్లును మొదలు గాఁగలవి దాల్చి, నల్లచాయల మేనుల భిల్లవరులు. వరాహ. 4. 72.

ద్వి. చెలరేగి విరహుల సెలను (సు ?) విల్వంచి. ద్వి. పరమ. 3. 246.

సెల్లా వి. అంచుకమ్ములు లేని తెల్లవస్త్రము.

కం. శిరసుతడి యొత్తి దుపటపు వెలి సెల్లాఁ గట్టి వారినిలయము వెడలన్. లక్ష్మి వి. 5. 36.

ఉ. పూని సఖీమణుల్ కుసుమపూజిగి పావడ గీలు కొల్పి యుం,పైన మిటారి బల్పిఱుఁదు నందు ఘటించిన జిల్లుచల్వ సె,ల్లా నెటిమించెఁ జెంగలువలం గలవుప్పొడి కప్పుకొన్న జాం,బూనదసైకతంబు పయిఁ బున్నమవెన్నెల గాయుకైవడిన్. భాను. 4. ఆ.

సెల్లుఁడు వై. వి. (సం. శల్య) శల్యుఁడు.

ఆ. సెల్లుఁ డట్లు నేలఁ ద్రెళ్ళ చెచ్చెర లేచి. యొడలు తుడిచికొనుచు నొయ్యఁ జనియె. భా. ఆది. 7. 202.

కం. సెల్లుఁడు యమతనయునితో, నెల్లగుణంబులను జాల నెలయుదు వని తా, మల్లమున నిశ్చయించున్. భార. స్త్రీ. 2. 104.

సెల్లెము వి. (సం. శల్యమ్) రూ. సెల్లియము.

వ బల్లెంబుల సెల్లెంబుల నొగిలించియు. విక్ర. 4. 78.

సెల్వు వి. (రూ. సెలవు) ఆజ్ఞ.

మ. దురితంబుల్ దొలఁగెన్ శుభంబు గలిగెన్ దొల్లింటి చందాన నా,పురికిం బోయెద సెల్వొసంగు మిఁక నో భూరిప్రభావోదయా! ఉ. రా. 7. 258.

సెవ వి. సెగ.

## సే

సేంద్రియము సం. విశ. (అ. ఆ. అ.). 1. ఇంద్రియములతోఁ గూడినది. 2. అంగవిశిష్టమైనది.

సేకపాత్రము సం. వి. అ. న. 1. నీరుచల్లుట కుపయోగించుపాత్ర. 2. బొక్కెన. 3. బకెట్టు.

సేకము సం వి అ. పుం. 1. చల్లుట. 2. చెట్లకు నీరు పోయుట 3. స్రవించుట. 4. రేతస్సు 5. రేతస్స్రవము. 6. కామక. 7. పూజోపహారము. 8. బిందువు. 9. శీకరస్నానము.

సేకరము వి సంగ్రహము. (శ. ర.)

సేకరించు స క్రి 1 రాఁబట్టు.

తే గీ. సేకరించుక తక్కిన మూకనెల్ల, మాయ లెడపఁ గలచు నొక్కబోయమిన్న, కొదమ సింగము నాయక గూటి కురుజ, ముచ్చుదొరకోలు నన్నాసి చిచ్చుపిడుగ. ప్రబం 1. 794.

2. సంగ్రహించు.

సేకరించు అ. క్రి. తెప్పిఱిల్లు.

సేకరించుకొను అ. క్రి. అలసట దీర్చుకొను.

వ ఘోటకంబు వెగ్గలంబుగ బ్రమ్మగ్గియు వగ్గలిక చెడక మోకరించుకొని కొన్ని యడుగులు సని సేకరించుకొని. మను. 4. 116.

సేకరించుకొను స. క్రి. కూడఁ బెట్టుకొను.

సేకిమము సం. వి. అ. న. ముల్లంగి.

సేక్తృ సం. వి. ఋ. పుం. 1. నీరు చిమ్మువాఁడు. 2. భర్త. 3. గర్భముఁగలిగించువాఁడు. 5. జలవాహకుఁడు.

సేక్త్రము సం. వి. అ. న. సేకపాత్రము, బొక్కెన.

సైగవము సం. వి. అ. పుం. 1. చిఱుత ప్రాయపు ఎండ్రకాయ, ఎండ్రి, శేఁతపీత.

సేగి దే. వి. కీడు, అపాయము, ఆపద, చేటు.

ఆ. కాని వెరలకున్న భానూదయంబున, వసుధి పురము ముంచికొనిన గణన, సేయరాని యట్టి సేగియుఁ బ్రయ్యు బాసంబు వగయు నెల్ల భంగిఁ గలుగు. భార. మౌస. 1 170.

చం. రతిపతిచేతివాలు ఘననాగనివాసము పీవరైరి దుర్గతి శతదుఃఖ మోహజనికారణ ముజ్జ్వలబోధ కాఁరా, పతినిబిడాశ్రితప్రదము శుభప్రతిబంధము దోషసంగసం, గత మగు సేగి జవ్వనము కన్న జగంబున వేఱె యున్నదే. భర్తృ. 2. 30.

కం. కానే మఱి గొల్లం డొక, చేను చెడ మ్మేపె నేవి చిక్కనడచి యాచేఁన గల సేగి యంతయు. వానిన యొప్పించు టొప్పు వసుధేశునకున్. విజ్ఞా. ప్రా. కాం. 12.

సీ. .... తను సేగిఁ జెప్పలో దయమీఱ విని చీరచించిచ్చు వారి దీవించువారు ... ఆము. 6. 85.

తే. అల నృపాలకబాలకుఁ డల్లనల్ల, నడుగు పెట్టం గడ గిన నడుగ నట్టి. రణ దైత్యులు నాఁ టి యయ్యఁదేవు, నడుగు పెట్టఁగలదె నేఁ డకట సేగి. రామా. 3. 144.

చం. ... అల్పబుద్ధుల వెడమాట కాఁకొనకు దోసము సేగియు వచ్చు నమ్మెయిన్. భార. ఉద్యో. 3. 331.

శా. ... నీ వింక నన్ బాధం బెట్టకు వాఁడిసూది మొన మోపంజాలు నంతైన నే, నీధాత్రీతల మీను వాఁడకు నా కేలింత సేగిం బడన్. భార. ఉద్యో. 2. 251.

చం. లలనలు బాహులన్ బదములన్ బిగిచేన్నులఁ గప్పుకొప్పులన్, బలుకులఁ బాటలన్ లతలఁ బల్లవ గుచ్ఛ మిళిందకీర కోకిలముల నెప్పటట్ల కలిగించ వనేందిర మించెఁ బూర్వభంగుల వపనీజ యుక్తి మనుకొమ్మలచే వని సేగిఁ జెందునే. ఉ. రా. 6. 64.

2. నష్టి.

కం. వెలగొని యమ్మిన బండము, విలిచినతని కిని వాఁడు వేగమె దానంగల లాభము బానిఁ దగుఁ, గల సేగియు నెఱిఁగి యరువఁగాఁదగుఁ బిదపన్. విజ్ఞా. ప్రా. కాం. 77.

చం. సచివులఁ జూచి యిప్పుడ వెసన్ మన మెద్దియక (మేగక) తక్కినంబకు ప్రచయము దప్పిపోవుఁ దుదిభంగము సేగియు వచ్చు. భార. విరా. 3. 140.

వ. అనిన విని యశోదాదేవి వేర్వేఱ వారి నను నయించి. కం. మీ సేగు లెల్ల నిచ్చెద, వేసరకుఁడు మీరు లేక వేగునె మాకున్, జేసిం జేయఁడు బాలకుఁ, డాసురపుం బనులు నిజము లనియెదరు బలే. హరి. పూర్వ. 5. 230.

3. అమంగళము.

గీ. ఎన్నడును సేగి లేనట్టి యమ్మహాశ్మశానమున యందుఁ గాఁపున్న జంతువులకు నేటి వాకంబు. కాశీ. 2. 45.

4. దుఃస్థితి.

సీ. యదువీరులు ప్రమత్తులని మున్న మెచ్చిన చట్టాలు వగ సేగి చూపె నమ్మ. ఉ హరి. 5. 280.

సేగిబోవు అ. క్రి. చెడిపోవు,

కం. చపలాక్షి నీ నిమిత్తము, తప మెల్లను సేగిఁ బోయెఁ దథ్యంబుగ నీ, యుపమ సురేంద్రుఁడు

చేసిన, పటము పై వింత పవ్వగల దొరైవన్. వి. పు. 2. 246.

సేచకము నం. విశే. (పుం. స్త్రీ. సేచికా. అ.) చిమ్మునది.

సేచకుడు నం వి. అ. పుం. మేఘము.

సేచనకము నం వి. అ. న. శిరస్స్నానము.

సేచనఘటము నం. వి. అ పుం. చెట్లకు నీరుపోయుట కుపయోగించు పాత్రము. సేకపాత్రము.

సేచనము నం వి. అ. న. 1. తడుపుట 2 చల్లుట. 3. ఓడలోనికి వచ్చిన నీటిని వెలికి తోడు జల్లెడు బొక్కెన 4. స్రవించుట. 5. ఊరుట

సేచని నం. వి. ఈ. స్త్రీ. బొక్కెన.

సేటువు నం. వి. ఉ. పుం. 1. ఒక విధమైన దోసకాయ 2. పుచ్చకాయ.

సేడుకత్తి వి. సాలెవాని సాధన విశేషము.

సేతిక నం వి. అ. స్త్రీ. అయోధ్య.

సేతుకము నం. వి. అ. పుం. తీరము, కట్ట, కనుమ, వంతెన.

సేతుబంధనము నం వి. అ. పుం. 1. కట్ట కట్టుట. 2. కోరమండల తీరము నుండి సింహళము వైపునకు బోవు కొండల వరుస. (రాముడు వానర సేవలతో లంక కేగుటకై ఇది నిర్మింపబడెనని చెప్పుదురు) 3. వంతెన లేక నీటికట్ట.

సేతుభేది నం. విశే. (న్. నీ. న్.). ఆటంకములను భేదించువాడు.

సేతుభేది నం. వి. న్. పుం. దంతివృక్షము.

సేతువు నం. వి ఉ. పుం. 1. వంతెన, కట్ట, మట్టిదిబ్బ, 2. కనుమ. 3. సరిహద్దు. 4. ఆటంకము 5. స్థిరమైనయాచారము. 6. ఓంకారము 7. తటాకము. 8. శృంఖల 9 వివరణము. 10. తీరము. 11. ఉలిమిడి చెట్టు.

సేద వి. శ్రమము, అలసట. (వై. స్వేదః)

కం అమునిసుత్రామునివశి, రాముని సేవింపవలయు రాజల్ల తిరా,థామమ్మునఁ బ్రేమమ్మున, సేమమ్మున నిలుము హరులు సేదలుదేరన్. కృ. కథం. 1.86.

తే. గీ. అలఁతి నీళ్ళని పాఱవియ్యఁక నిషదు, గాలను నిలమండెనేని కన్గొనఁగఁ జేసి, సేద దీఱిన తఱిఁ ద్రోవ సెప్పుమమ్మ, పుడమివేలున నెయ్యబు వాదల ననుఁడు. అ. రా. యుద్ధ. 413.

సీ. వేదవ విఁహులు సేదలు సెడి సంధు లెడలంగఁ బల్లాకు లెడ రెఁ పరుల ... కుమా. సం. 4. 445.

చం .... య,య్యతికచ సేదఁ దేర్చె వవ్రు డిందవు గందవు గొండపయ్యెరల్. రాజవాహన. 1. 80.

వ. బడలిక నొంది వడమిచి సేదగాంచి చిట ముడి గిరుట మడఁగి లావులు సడలుచు గొంత కొంత యడలుచు ప్రబం. 1. 783.

కం. ... గఃఫవహములు, శరీరముల సేదఁదేర్పఁ జమదెంచె రహిన్. పారి 2 103.

కం. ... కైకొ,మ్మా సముదంచన్మణిశవ, వాసీనత సేదఁదేటి యాతిథ్యంబున్. మను. 3. 46.

చం. అమరులు క్రొవ్విరుల్ గురిసిరంతట రాముఁడు పాకశాసనప్రముఖులు పెక్కుచందములఁ బ్రస్తుతిసేయ విమానమెక్కి మంత్రిముఖులఁగూడి కుంభభవునిన్ గన నేగెఁ గవేశవన్య కా,కమల రజోధురంధరసుగంధసమీరము సేదఁదీర్పఁగన్. ఉ. రా. 7. 260.

తే. కాంచి యవ్విభు తమపరిక్లాంతి యొఱఁగి, చేతి కుండికాజలముల సేదఁదేర్చె. విక్ర. 5 141.

2. మ్లాని, వాడుట.

సీ. చెక్కుటద్దములపైఁ జిఱునవ్వు చిలికించి చిన్నవోయిన మోము సేదదిర్చి. విక్ర. 1. 58.

3. మూర్ఛ.

వ. తన కొడుకుల గెలుపు సెప నాసమూలుట చేసి. ఆ. సొమ్మవోయి పడిన సుదతు లాక్రందన, రవ ముతోడ సత్వరముగ నెత్తి, యా నృపాలు సెజ్జయందిడి మెలపున, శిశిరవిధులు సేయ సేదదేఱి. వ. ఆసీనుండై యాతండు సూతసూనున కిట్లనియె. భార. ద్రోణ. 1. 95.

సేదగొను అ. క్రి. బడలు, శ్రమనొందు.

గీ. చిపుగు విలుకానిచెయ్యిగా సేసగొన్నయన్ను మిన్నఁ. అవ్య. తె. శా. అయో.

**సేదదేఱు** దే. అ. క్రి. శ్రమ నుండి తెప్పిఱు.
శ్రమంబున నిర్యోడ సేదదేఱితివ్. దశకు. 2. 51.

**సేదదేర్పు** వ. క్రి. (సేద + తేర్పు) శ్రమతీర్పు.
వ. ప్రవాహమూర్ధ్వావరవశు లగు జయంత వల కూలరచిత్రసేవాదులం గనకకమలదళపుటానీయ మానంబు లగు వ్రథ గంగాపానీయంబుల సేదదేర్చి. పారి. 7. 13.

**సేదదేఱు** అ. క్రి. శ్రమముపోలగు, ఆయాసము వదలు. తెప్పిఱిల్లు.
"సురతాంతసుఖమున సోలుఁదాంబూలంబు సేద యింప నించుక సేదతేఱు. కాశ. 2. 20.
మ. జలసేకంబుల సేదదేఱుచు వశశ్చారాశి కన్నన్ విశ్రుం,ఖలవృత్తిన్ మథియించి రాదితిజులు...దశా. 2. 209.
చం. తనయుఁడు సేదదేఱిన ముదంబునఁ గౌఁగిటఁ జేర్చి యంబుజా,సనునకు మ్రొక్కఁబంచి విక సద్వదనుం డయి వాయుదేవుఁ డెం,దు నిఖలదేవ కోటి వరితోష విధాయకమైన యాత్మవర్తన మొనరఁగఁజేసె నిర్వ. 7. 117.
ఉ. వచ్చె జనార్దనుం డనిన వార్తకుఁ బ్రాణము మేనికంతకున్, వచ్చిన సేదఁదేఱుఁ గురువంశ పవిత్రచరిత్ర గొంతి భార. ఉద్యో. 3. 184.
చం. తనగురుఁ డమ్మదాశయుఁడ తప్పక యట్లు మముం భజించి మున్,జని చనుదెంచి నాఁ డపుడు బాళడకుం దనువట్లు నాదు ద,ర్శనమున సేదదేఱె వని. కళా. 5. 54.

**సేదివాంసుఁడు** సం. విశ. (స్.దుషీ.స్.) 1. పొందిన వాఁడు.
శ్లో. ఏవం తయో రధ్వని దైవయోగా దాసేదుషో స్సఖ్య మచింత్యహేతు. సం. రఘు. 5. 60.
2. కూర్చున్నవాఁడు. ఇట్లే. ఆసేదివాంసుఁడు. మొ.

**సేద్యకాఁడు** వి. సేద్యము చేయువాఁడు, కృషీ వలుఁడు.

**సేద్యము** వి. 1. వ్యవసాయము
చం. ... మడిఁజేనఁ గల్పుల కొడంబడి మాసము లూడ్చు కూలివాం,డ్రకు నెడ సేద్యపుం బనుల డస్సి పడుండఁదలంచు పెద్ద యె,డ్లకు గలిగించె దైర్బల్యవికలస్థితి వాసరవఱ్ఱు లూఅటన్. వే. పంచతం. 1. 666.
2. పైరుపెట్టుట.

**సేన** సం. వి. ఆ. స్త్రీ 1. దండు 2. కుమారస్వామి భార్యపేరు. 3. మూఁడు ఏనుగులు మూడు రథములు తొమ్మిది గుఱ్ఱములు, పదునైదుగురు బంటులు గల చిన్నసైన్యము; వరసమూహము.

**సేన** దే. విశ. ఎక్కువ పెద్ద.
సీ. సేనప్రాతఱకొల్పు లేనిహాళికమౌళి బాసెడు పాలీని పాడియావు. పాంచాలీ. 5. 75

**సేనము** సం విశ (అ. ఆ. అ.) 1. ప్రభువు లేక నాయకుఁడు కలది సం. వి. అ. న. దేహము.

**సేనము** దే. వి. 1. చిన్న ఉలి (ఇది సానము అని కొన్నిచోట్ల వ్రాయఁబడియున్నది) శ. ర. 2. ఒక విధమగు గట్టిఱాయి.
"వల్లి సేనపు గుండులు" ఉ. హరి. 4. 26.

**సేనముదలియారి** వి. విష్వక్సేనుఁడు.
తే. శార్ఙ్గి రెండవమూర్తియై జగములేలు, ముని మనోహరి (శ్రీ)సేనముదలియారి చేయు పనులెల్ల సఫలముల్ సేయుఁగాత. పాండురంగ. 1. 7.

**సేనా** దే. విశ. (రూ. సేన) బహువు.
కం. కానని వాఁ డద్దము చేఁ,బూనినగతి దీక్షలేక పురుషుఁడు పూజల్, సేనాగా నొనరించిన, యా నీలగళుండు మెచ్చు నా యందైనన్. బ. ప్రభులింగ. 2. 55.

**సేనాంగము** సం. వి. అ న. (రథ, గజ, తురగ పదాతులు) సేనావిభాగము.

**సేనాకల్పుఁడు** సం. వి అ. పుం. శివుఁడు.

**సేనాగోపుఁడు** సం. వి. అ. పుం. సైన్యరక్షకుఁడు.

**సేనాగ్రగుఁడు** సం. వి. అ. పుం. దండనాథుఁడు.

**సేనాగ్రము** సం. వి. అ. న. సైన్యము ముందటి భాగము.

సేనాచరుఁడు సం. వి. అ. పుం. యోధుఁడు.

సేనాని సం. వి. ఈ. త్రి. 1. సేనానాయకుఁడు. 2. కుమారస్వామి.

సేనానివేశము సం. వి. అ. పుం. సేనవిడిసి యుండు స్థలము.

సేనాపతి సం. వి. ఇ. పుం. 1. సేనానాయకుఁడు. 2. శివుఁడు. 3. కార్త్తికేయుఁడు. 4. పదివత్తి విభాగముల నాయకుఁడు.

సేనాపత్యము సం. వి. అ. న. సేనాపతిత్వము.

సేనాపృష్ఠము సం. వి. అ. న. సేనవెనుకభాగము.

సేనాభంగము సం. వి. అ. న. 1. సైన్యము విడిపోవుట. 2 క్రమరహితముగా పాఱిపోవుట.

సేనాముఖము సం. వి. అ. న. సేనయొక్క అగ్రభాగము. 2. మూఁడు ఏనుఁగులు, మూఁడు రథములు, 9 గుఱ్ఱములు, 15 మంది భటులుగల సేనావిభాగము. 3. నగరద్వారమునకు ముందుండు గుట్ట.

సేనాయోగము సం. వి.అ.పుం. 1. సైన్యసన్నాహము.

సేనారక్షుఁడు సం. వి. అ. పుం. 1. సేనను రక్షించువాఁడు. 2. కావలియుండువాఁడు.

సేనావాసము సం. వి అ. పుం. సేనవిడిసి యుండు చోటు

సేనావాహుఁడు సం. వి. అ. పుం. సేనానాయకుఁడు

సేపు వి. కాలము.

ఉ అంతటఁ గొంత సేపునకు వగ్గజరాజును వచ్చి రత్న ...క్రాంత శరీరు నీశ్వరుని గన్గొని యెవ్వఁడో నేడు నక్షత్రా, సెంతమనంబు గప్పి యొకసెక్కెపుఁబూజ లొనర్చె. కాశ. 2. 112.

ఉ. పెల్లుగఁ బెద్దసేపు రణభీషణలీలఁ జెమర్చి డస్సియున్. భా. రా. యుద్ధ. 1878.

ఉ....ర,త్నాంగి యొకింత సేపటికి హా సుకుమార నేఁడు చిత్రాంగికి నప్పగించుకొంటకా. సారంగ. 3. 86.

కం. ఇతఁడున్న యంత సేపును మఱి నేమియు వెఱవవలదు, భార. ద్రోణ. 1. 229.

తే బలము లొక్కింత సేపు నిక్కలతఁ బోలిచె. భార. ద్రోణ. 1. 136,

చం. .... నీవు నొవ్వఁ బ,ల్కిన ఫల మందఁజేసెదఁ జలింపక యుంచుక సేపు నిల్వుమీ. భార. ద్రోణ. 2. 52.

కం. కొండొక సేపునకుఁ దెలిసి, చండగదాదండమున నపహ్యక్రోధో.ద్దండత బలు ద్రేయఁగ నా,తం డాగద విఱుగంగఁజేసె దనగద ద్రేఁతన్. హరి. ఉ. 1. 128.

వ. పెనంగొని యెల్ల తరువులకు నొక్కింతసేపు చందనద్రుమ సామ్యంబు సంపాదించు సామస్థలంబులం దిరుగు. హరి. ఉత్త. 1. 90.

కం. కదియుం గాష్ఠముఁ గాష్ఠము, వదిలో మఱి కొంత సేపునకుఁ బాయును. భార. శాంతి. 3. 10.

ఉ. వీనులఁ దియ్య మెక్క మునువిన్కిఁ బరస్పరరాగవృత్తిలో, మానివఁజూచు వేడుకల నువ్విళులూరెడు నెమ్మనంబు ల,చ్చో నొక యింత సేపు నెడ సొచ్చుట కోర్వక యుండ భార. విరా. 5. 393.

ఉ...గోకుల మిల్లులు తప్పకుండ ల,క్ష్మీపతి గ్రుమ్మరుఁ గడియ సేపున రేపున నిచ్చనిచ్చలున్. హరి. పూర్వ. 5. 200.

తే. అరయ దెసలేక నీధనం బడవిలోనఁ, జెల్ల చెదరయ్యె నీ వింతసేపు కుఱ్ఱ, యిట్టు లేమఱఁ బాడియె యీక్షణంబ, వెదలి చనుదెంచి వనుఁ బ్రోవవే కుమార! హరి. పూర్వ. 7. 39.

కం. అవనికిఁ దగిన సరసా, లాపంబులు గొంత సేపు లాలిత మృదు గో,ష్ఠి పరిణతుఁడై. హరి. పూర్వ. 3, 243.

కం...పరమ ధర్మాత్మక నీ, వనయము ధర నిచ్చట నిలిచిన బ్రదుకుదు మింకఁ గొంత సేపు నిలువవే. భార. స్వర్గా. 1. 22.

చం. ... చేష్టనష్టతం, బోరసె మహోమరాగ పరిపూర్తి నొసంచుక సేపు. శృ. నై. 6. 7.

గీ. నలువవట్టి యొందవాక యొక్కింతసే పూరకుండి. కాశీ. 1. 101.

గీ. మస్తకము వాంచి యును రని మానముద్ర, నేల బొటవ్రేల వ్రాయుచు నిలిచి కొంత, సేపు వెడవెరచింతించి శిర సొకింత, యెత్తి నన్నంపు కులుఁ గుతో నిట్టు లనియె. మను. 3. 97.

ము. .... కొంతసే పుండి ... ఆము. 4. 8,

గీ. చిపురు విఱుకానిచెయ్యిగా సేదగొన్నయన్ను మిన్నగా. అన్న. తె. శా. అయో.

**సేదదేరు** దే. అ. క్రి. శ్రమ నుండి తెప్పిఱు. శ్రమంబున నియ్యెడ సేదదేఱితిన్. దశకు. 2. 51.

**సేదదేర్చు** స. క్రి. (సేద + తేర్చు) శ్రమతీర్చు.

వ. ప్రవాహమూర్త్యుపరవశు లగు జయంత నల కూబరచిత్రసేనాదులం గనకకమలదళపుటానీయ మానంబు లగు వక్రగంగాపానీయంబుల సేదదేర్చి. పారి. 3. 13.

**సేదదేఱు** అ. క్రి. శ్రమముపోలగు, ఆయాసము వదలు. తెప్పిఱిల్లు.

"సురతాంతసుఖమున సోలుచాఁబూలంబు సేద యింప నించుక సేదఱేఱు. కాశీ. 2. 20.

మ. జలసేకంబుల సేదదేఱుచు వక్షస్స్రాలి కన్నన్ విశ్వం,ఖలవృత్తిన్ మథియించి రాదితిజులు...దశా. 2. 209.

చం. తనయుఁడు సేదదేఱిన ముదంబునఁ గౌఁగిటఁ జేర్చి యంబుజా,సమునకు మ్రొక్కఁబంచి విక సద్వదనుం డయి వాయుదేవుఁ డెం,దు నిఖలదేవ కోటి పరితోష విధాయకమైన యాత్మవర్తన మొనరఁగఁజేసె నిర్వ. 7. 117.

ఉ. వచ్చె జనార్దనుం డనిన వార్తకుఁ బ్రాణము మేనికంతకున్, వచ్చిన సేదఁదేఱుఁ గురువంశ పవిత్రచరిత్ర గొంతి భార. ఉద్యో. 3. 134.

చం. తనగురుఁ డమ్మరాశయుఁడ తప్పక యట్లు మముం భజించి మున్,జని చమదెంచి నాఁ డవుడు సాకడకుం దనువట్లు నాదు ద,ర్శనమున సేదదేఱ వని. కళా. 5. 54.

**సేదివాంసుఁడు** సం. విశే. (న్.దుషి.న్.) 1. పొందిన వాఁడు.

శ్లో. ఏవం తయో రధ్వని దైవయోగా దాసేదుషో స్సఖ్య మచింత్యహేతు. సం. రఘు. 5. 60.

2. కూర్చున్నవాఁడు. ఇట్లే. ఆసేదివాంసుఁడు. మొ.

**సేద్యకాఁడు** వి. సేద్యము చేయువాఁడు, కృషీవలుఁడు.

**సేద్యము** వి. 1. వ్యవసాయము

చం. ... మడిఁజేనఁ గల్గుల కొడంబడి మానము లూడ్చు కూలివాం,డ్రకు నెడ సేద్యపుం బనుల డిస్సి పడుండఁదలంచు పెద్ద యొ,ద్దకు గలిగించె దైర్భ్యలికస్థితి వానరవజ్ఞ్యు లూఱటన్. వే. పంచతం. 1. 666.

2. పైరుపెట్టుట.

**సేన** సం. వి. ఆ. స్త్రీ 1. దండు 2. కుమారస్వామి భార్యపేరు. 3. మూఁడు ఏనుగులు మూడు రథములు తొమ్మిది గుఱ్ఱములు, పదునైదుగురు బంటులు గల చిన్నసైన్యము; నరసమూహము.

**సేన** దే. విశే. ఎక్కువ పెద్ద.

సీ. సేనప్రాతఱకొల్చు లేనిపోకమొల వాసెడు పాలీని పాడియావు. పాంచాలీ. 5. 5

**సేనము** సం. విశే. (అ. ఆ అ.) 1. ప్రభువు లేక నాయకుఁడు కలది సం. వి. అ. న. దేహము.

**సేనము** దే. వి. 1. చిన్న ఉలి (ఇది సానము అని కొన్నిచోట్ల వ్రాయఁబడియున్నది) శ. ర. 2. ఒక విధమగు గట్టిఱాయి.

"నల్ల సేనపు గుండులు" ఉ. హరి 4. 26.

**సేనముదలియారి** వి. విష్వక్సేనుఁడు.

తే. శార్ఙ్గి రెండవమూర్తియై జగముఁలేలు, ముని మనోహారి శ్రీసేనముదలియారి చేయు పనులెల్ల సఫలముల్ సేయుఁగాత. పాండురంగ. 1. 7.

**సేనా** దే. విశే. (రూ. సేన) బహువు.

కం. కానని వాఁ డద్దము చేఁ,బూనినగతి దీక్షలేక పురుషుఁడు పూజల్, సేనాగా నొనరించిన, యా నీలగళుండు మెచ్చు నా యందైనన్. బ. ప్రభులింగ. 2. 55.

**సేనాంగము** సం. వి. అ. న. (రథ, గజ, తురగ పదాతులు) సేనావిభాగము.

**సేనాకల్పుఁడు** సం. వి అ. పుం. శివుఁడు.

**సేనాగోపుఁడు** సం. వి. అ. పుం. సైన్యరక్షకుఁడు.

**సేనాగ్రగుఁడు** సం. వి. అ. పుం. దండనాథుఁడు.

**సేనాగ్రము** సం. వి. అ. న. సైన్యము ముందటి భాగము.

సేనాచరుఁడు సం. వి. అ. పుం. యోధుఁడు.

సేనాని సం. వి. ఈ. స్త్రీ. 1. సేనానాయకుఁడు. 2. కుమారస్వామి.

సేనానివేశము సం. వి. అ. పుం. సేనవిడిసి యుండు స్థలము.

సేనాపతి సం. వి. ఇ. పుం. 1. సేనానాయకుఁడు. 2. శివుఁడు. 3. కార్తికేయుఁడు. 4. పదివత్తి విభాగములనాయకుఁడు.

సేనాపత్యము సం. వి. అ. న. సేనాపతిత్వము.

సేనాపృష్ఠము సం. వి. అ. న. సేనవెనుకభాగము.

సేనాభంగము సం. వి. అ. న. 1. సైన్యము విడిపోవుట. 2 క్రమరహితముగా పాఱిపోవుట.

సేనాముఖము సం. వి. అ. న. సేనయొక్క అగ్రభాగము. 2. మూఁడు ఏనుఁగులు, మూఁడు రథములు, 9 గుఱ్ఱములు, 15 మంది భటులుగల సేనావిభాగము. 3. నగరద్వారమునకు ముందుండు గుట్ట.

సేనాయోగము సం. వి.అ.పుం. 1. సైన్యసన్నాహము.

సేనారక్షుఁడు సం. వి. అ. పుం. 1. సేనను రక్షించువాఁడు. 2. కావలియుండువాఁడు.

సేనావాసము సం. వి. అ. పుం. సేనవిడిసి యుండు చోటు.

సేనావాహుఁడు సం. వి. అ. పుం. సేనానాయకుఁడు

సేపు వి. కాలము.

ఉ అంతటఁ గొంత సేపునకు వగ్గఱ రాజును వచ్చి రత్నకంకణ కాంత కరీరు నీశ్వరుని గన్గొని యెవ్వఁడో నేడు వజ్జ కా, సెంతమనంబు గప్పి యొకసెక్కెపుఁబూజ లొనర్చె. కాశ. 2. 112.

ఉ. పెల్లగఁ బెద్దసేపు రణభీషణలీలఁ జెమర్చి డస్సియున్. భా. రా. యుద్ధ. 1878.

ఉ....రత్నాంగి యొకింత సేపటికి వా సుకుమార నేఁడు చిత్రాంగికి నప్పగించుకొంటిరా. సారంగ. 3. 85.

కం. ఇతఁడున్న యంత సేపును మతి నేమియు వెఱవవలదు, భార. ద్రోణ. 1. 229.

తే బలము లొక్కింతసేపు నిశ్చలతఁ బొలిచె. భార. ద్రోణ. 1. 186,

చం. .... నీవు నొవ్వఁ బల్కిన ఫల మందఁజేసెదఁ జలింపక యించుక సేపు నిల్వుమీ. భార. ద్రోణ. 2. 52.

కం. కొండొక సేపునకుఁ దెలిసి, చండగదాదండ ముచ నపహస్త్యక్రోధోద్ధండత బలుద్రేయఁగ నాతం డాగద విఱుగఁగఁజేసె దనగద ద్రెంతన్. హరి. ఉ. 1. 128.

వ. పెనంగొని యెల్ల తరువులకు నొక్కింతసేపు చందనద్రుమ సామ్యంబు సంపాదించు సామర్థ్యంబు లం దిరుగు. హరి. ఉత్త. 1. 90.

కా. కదియుం గాఢముఁ గాఢము, వదిలో మఱి కొంతసేపునకుఁ బాయును. భార. శాంతి. 3. 10.

ఉ. వీనులఁ దియ్యమెక్క మునువిన్కిఁ బరస్పర రాగవృత్తిలో, నూనివఁజూచు వేడుకల నువ్విళులూరెడు నెమ్మనంబు లచ్చో నొక యింత సేపు నెడ సొమ్పుట కోర్వక యుండ భార. విరా. 5. 398.

ఉ...గోకుల మిల్లులు తప్పకుండ లక్ష్మీపతి గుమ్మరుం గడియ సేపున రేపున నిచ్చనిచ్చలున్. హరి. పూర్వ. 5. 200.

తే. అరయ దెనలేక నీధనం బడవిలోనఁ, జెల్ల చెదరయ్యె నీ వింతసేపు కుఱ్ఱ, యిట్టు లేమఱఁ బాడియె యూథనంబ, వెదలి చనుదెంచి వనుఁ ద్రోవవే కుమార! హరి. పూర్వ. 7. 39.

కం. అవనికిఁ దగిన వరసా, లాపంబులు గొంత సేపు లాలిత మృదు గోష్ఠి పరిణతుఁడై. హరి. పూర్వ. 3, 243.

కం...పరమ ధర్మాత్మక నీ, వనయము ధర నిచ్చుట నిలిచిన ద్రదుకుదు మింకఁ గొంత సేపు నిలువవే. భార. స్వర్గా. 1. 22.

చం. ... చేష్టవష్టతం, బొరసె మనోనురాగ పరిపూర్తి నొకించుక సేపు. శృ. నై. 6. 7.

గీ. నలువవట్టి యొండకాక యొక్కింతసే పూరకుండి. కాశీ. 1. 101.

గీ. మస్తకము వాంచి యును రని మౌనముద్ర, నేలబొటవ్రేల వ్రాయుచు నిలిచి కొంత, సేపు వెడ వెడచింతించి శిర సొకింత, యెత్తి నన్నంపు డెలుఁగుకతో నిట్టు లనియె. మను. 3. 97.

షు. .... కొంతసే పుండి ... ఆము. 4. 3,

ఉ. కొండొకసేవు నిల్చి చమకోరిక రాకొమరుండు. విక్ర. 3. 76.

శా....నీ కావాప్రకాశాపంబు ని,స్సీమంబే నొక కొంత సేవచేట మజ్జృంభించే రాఁజేయుమా! హర. 7. 62.

ఉ. అంతటఁ గొంత సేవటికి వచ్చుటికిన్ వివవచ్చె ధారుణిఁ గాంతు రఖాంతఃస్ఫురిత కాంచన నిర్మిత ఘంటికాధ్వనుల్. ఉ. రా. 4. 59.

సేవోర్పు అ. క్రి. (సేపు+ఓర్పు) కాలము నిలుచు.

కం. హరిచేతి కగ్గమై చెచ్చెరఁ గూలక యసుర యింత సేవోర్చెఁ గదం, బరు దితనిలావు తెలియఁగని, యరిష్టుఁ గొనియాడి గంధర్వాంతర చారుల్. హరి. పూ. 8. 42.

సేఫము సం. వి. అ. పుం. మగగుఱి.

సేబాసు అవ్య. (రూ. సెబాసు).

ఆశ్చర్యార్థకము, ప్రశంసార్థకము, బళి, బళా,

మ. భళిరా కన్నులు మీలకే పొగను రూపా చాల సేబాసురా. కువలయా. 328.

మ. .... అయ్యంబు జా,వన సేబాసు బలా జాణవు దన్నాయింత తెంపొంద కుం,డిన వాఁడే మగ వాఁడు. శుక. 4. 12.

మ. బళిరే మై సిరితీరునిక్కడలు సేబా నయ్యారే పేరణీ, కలనం కౌర పచాశికాభినయ వైఖర్యంబు మజ్జారె కోపుల వైచిత్రి యహో వినిర్మలక రాంభో జాతవిన్యాస మం, చలివేణుల్ వినుతింప నల్పె నటనం బా కొమ్మ తత్సన్నిధిన్. చంద్రికా. 2. 97.

ఉ. ఈ నుఁడ పొన్న యెక్కి మతికెక్కిన కమ్మని పువ్వు లెల్ల నేఁ, గోసెదఁ జూడుమీ యనుచుఁ గోమలి యా తరు వెక్కి యొక్కపూఁ, గోసి నుతించి మూర్కొనుచు గుత్సిత బుద్ధి నిలేశుఁ జూచి సేబా సిటు లేనుజూడఁ జెలికామినితో రమియింపఁ జాడియె విక్ర. 8. 66.

కం... సంగ్రామాంచలమున నిరె నను మెచ్చించితి నేవఘడు నిన్ను సేబా సందున్. హర. 7. 64.

సేమంతి సం. వి. ఈ. స్త్రీ. చేమంతి చెట్టు. చేమంతి పూవు.

సీ. శిఖిపిఛ దళ పరిష్కృతములై సేమంతి విరులటి దగు శిరోవేష్టనములు. మను. 6. 44.

సేమంతిక సం. వి. ఆ. స్త్రీ. చేమంతి.

కం. సేమంతికాస్రగంచిక, సీమంతవతీ కుచోష్ణ జితశీతభయ, శ్రీమంతంబై గొబ్బున, హేమంతము దోఁచె మదను దేచె విరహులన్. భాగ. దశ. పూ. 798.

సేమము వై. వి. (సం. క్షేమమ్) శుభము. కుశలము, క్షేమము.

కం. సేమపుఁదెరు వొక్కటి గలదే మెచ్చితి దాని నడుగు మెయ్యది యని. భాగ. శాం. 1. 57.

కం. జననాథ సుఖమె నీకున్, జనకునకును రాజ హంసునకు సేమంబే. రాజవాహన. 2. 88.

ఉ. అంబకు సేమమే మన జయంతుఁడు లెస్సయి యున్నవాఁడె? ... దశా 2. 126.

సీ. అన్న యెవ్వరివాఁడ వయ్య? సేమమె నీకు? శృ. నై. 3. 46.

చం. కని ప్రణమిల్లి సేమ మడుగంబడి వైశ్యుఁడు తాను బోయి వచ్చిన కథయెల్లఁ దెల్లముగఁ జెప్పిన. విక్ర. 2. 227.

కం. చనుదెంచితి నల్పల్లిదుఁ డనుప గ మీ సేమ మెల్ల నారయుకొఱకున్. నీలా 1. 54.

గీ. భరతు సేమంబు గన వాయుభవునిఁ బంపి. ఉ. రా. 131.

కం. తామస రాజస గుణములు, నీమనమున బొందఁ దగునె నీ వాద్యుఁడవున్, సేము వికార గుణంబులు, సేమంబునఁ గన్నమమ్ము శిక్షింపదగున్. ఉ. హరి. 6. 258.

గీ. యుగ్రసేనుండు మొదలుగా నున్న సాత్వతు లకు నెల్లను సేమమే దురితదూర. ఉ. హరి. 4. 177.

వ. అర్థలాభంబును, సువర్దర్శనంబును సేమంబు నయ్యెఁడు. హర. 3. 58.

సేరము నం. వి. అ. పుం. సేరు.

సేరాలము నం. విశ. (అ. ఆ. అ). లేఁతపసుపు వన్నెకలది.

సేరాహము నం. వి. అ. పుం. తెల్లని గుఱ్ఱము.

సేరి వి. ఈనాముకాని పొలము (శ. ర.).

సేరు వి. ఎనుఁబది తులముల మాన విశేషము. ఎనుఁబది తులముల యెత్తు. 24 తులముల యెత్తు (కొన్నిచోట్ల).

సేరుమాను వి. లోహాభేదము (తిరుపతి, బళ్లారి వాడుక)

సేరువు నం. విశ. ఉ. 1. కట్టువది. 2. బంధించునది.

సేర్ష్యము నం. విశ. (అ. ఆ. అ.). అసూయతోఁ గూడినది.

సేల వి. వస్త్రము.

సేలు వి. (రూ. సాలు) సన్న వస్త్రము.

సేలువ వి. రాంకవము, మృగరోమజము.

వ. మేలివలిపె సరిగంచు చలువ పైఠాణి సేలువ మేలుముసుం గిడి. ఉ. రా. 4. 178.

సేలువు సేలువ? = సాలువు, సాలు (నం. చేలమ్)

గీ. అనుచుఁ బచ్చల కడియముల్ హారతతులు, తాళి చౌకట్లు జాళువా తగటుపాగ, బంగరు మెఱుంగు సేలువు లుంగరములు, సరిపెనల్ చాల నొసఁగె వజ్జనవరుండు. ఇందు. 1. 35.

సీ. ఆకోకకుచ కట్ట నీకోక వగలన్న వలిప సేలువు వల్లెవాటువైచి. బహు. 5. 110,

సేళము వి. (నం. కారంభ) ఒకానొక చెట్టు.

సేవంతి వి. చేమంతి.

ద్వి. తావిపన్నీటను దడిసిన వచ్చ, సేవంతి పూసరుల్ చెచ్చెరఁ బూని. వల. 1. 181.

సీ. సేవంతి తెలిచాయ పావడఁ దడియొత్తి, తగటి చెఱంగు నెత్తమ్మిగ వింత,వగ |వాఁతపని జిల్గు సాగ సుకుచ్చెల లెచ్చుగులుకఁ గట్టి మెఱుంగు కొప్పు వెట్టి. సమీర. 2. 20.

ఉ. క తురి పూజసేయుదము కాం చన పుష్పచ యంబు లివు సే[illegible]తులు నీవు [illegible] వి[illegible]లు పొన్నలు నీవు నీవు వా[illegible] [illegible] [illegible]గులు చంపక మంజరు లివు దెమ్మ మా[illegible] [illegible]వాం బులని వావిరిఁ గోయఁ [illegible] [illegible] దలున్. భోజరా. 6. 165.

సేవ నం. వి. ఆ. స్త్రీ. 1. పరిచర్య. 2. పూజ. 3. ఆసక్తి. 4. తత్పరత్వము, 5. ఉపయోగము. 6. పాగడ.

సేవకము నం. విశ. (అ. ఆ. అ. 1 పరిచర్య చేయునది. 2. పూజించునది. 3. అనుసరించునది 4 స్వతంత్రమైనది.

సేవకము నం. వి. అ. పుం. సంచి.

సేవకుఁడు నం. వి. అ. పుం. 1. నౌకరు. 2. పూజించువాఁడు. 3. దర్జీవాఁడు.

సేవతి నం. వి. ఈ. స్త్రీ. 1. సూది. 2. అతుకు. 3. కుట్టు.

సేవన నం. వి. అ. స్త్రీ. 1. సేవనము.

సేవనము నం. వి. అ. న. 1. కొలుచుట. 2. పరిచర్య చేయుట. 3. పూజించుట 4. అనుసరించుట. 5. నివసించుట. 6. బంధించుట. 7. కుట్టుట.

సేవలు వి బ. భక్ష్యవిశేషము,

వ. ఒబ్బట్లు సాంసత్తులు సేవలు గూళ్ళాపిడలాది గాఁగల భక్ష్యంబులు. హం.స, 1. 105.

సేవాకాకువు నం. వి. ఉ. పుం. దాస్యము వంటి ఎలుగు మార్పు.

సేవాకారము నం. విశ. (అ. ఆ. అ.) దాస్య రూపమైనది.

సేవాధర్మము నం. వి. అ. పుం. 1. కొలువుడుకాని తనము. 2. సేవకుని విధి.

సేవావిలాసిని నం. వి. ఈ. స్త్రీ. దాసి.

సేవావృత్తి నం. వి ఇ. స్త్రీ. కొలువుచేసి జీవించుట, దాస్యన్యాయము.

సేవించు వం. స. క్రి. కొలుచు.

సేవి నం. వి. అ. న. 1. రేగు. 2. సీమరేగు.

సేవి నం. విశే. న్ సీ. న్. 1. కొలుచువాఁడు. 2. అనుసరించువాఁడు. 3. నివసించువాఁడు, 4. ఆసక్తుఁడు.

సేవి నం. వి న. పుం. సేవకుఁడు.

సేవిక నం. వి. అ. స్త్రీ. 1. దాసి. 2. భక్ష్యవిశేషము, (గోధుమ నూకతో సన్నగా తాలికలు చేసి పాలతో వండి చేసెడు భక్ష్యవిశేషము).

సీ. గోధూమ సేవికా గుచ్ఛంబు లల్లార్చి ఖండ శర్కరలతోఁ గలపి గలపి. శృం. నై. ఆ 6. 120.

సేవిత నం. వి. అ. స్త్రీ. 1. దాస్యము 2. పరిచర్య.

సేవిత నం. వి. ఋ. పుం. 1. సేవకుఁడు. 2. దాసుఁడు.

సేవితమన్మథుఁడు నం. విశే. అ. (పుం) కామాసక్తుఁడు.

సేవితము నం. విశే. (అ. అ. అ.) 1. శుశ్రూష చేయఁబడినది. 1. పూజింపఁబడినది. 3. అనుసరించఁబడినది. 4. రక్షింపఁబడినది. 5. అనుభవింపఁబడినది.

సేవితము నం. వి. అ. న. రేగు, కొండరేగు.

సేవియ వి. (రూ. సేవె) భక్ష్యవిశేషము, జ తిగ.

సీ. తెగిన జంబెము లేలతెచ్చెద వనఁగావు విమఁడివి సన్న సేవియలుగాని. హై. భా. 8. 202.

సేవె వి (రూ. సేవియ) గోధుమ నూకతో సన్నగా తాలికలు చేసి పాలఁబోసి వండెడు భక్ష్యవిశేషము

సీ. ఖండశర్కర జున్ను కండచక్కెరలు దోసెలు వడలేవె పాసెముల తోడ. భీమ. 1. 60.

సేవ్యము నం. విశే. (అ. అ. అ) 1. కొలువఁదగినది. 2. పరిచర్య చేయఁదగినది. 3. అనుభవింపఁదగినది. 4. చరువఁదగినది 5. రక్షింపఁదగినది 6. నిలువ చేయఁదగినది. నం. వి. అ పుం. 1. అశ్వత్థవృక్షము. 2. పిచ్చుక. 3. మత్తు కలిగించు పానీయము. నం. వి. అ. న. 1. రక్తచందనము. 2. సముద్రలవణము. 3 నీరు. 4 ఒక రకమైన వేరు (వట్టివేరు) 5. దున్ని సిద్ధము చేసిన పొలము.

సేవ్యసేవకులు నం. వి. అ పుం. ద్వి. ప్రభువును, నౌకరును.

సేవ్యుఁడు నం. వి అ పుం. 1. ప్రభువు. 2. యజమానుఁడు.

సేస వి. పాపట.

సీ. చిన్నారి జాబిల్లి సేసకొప్పెర పువ్వు మెట్ట రాజడిదాపు పుట్టినిల్లు. తే గీ. గాగ జగములు గడితంపుఁ గనికరంపు, పెంపు రాజింప నెపుడుఁ జాలింపు చుండు, సర్వమంగళ మాకు నఖర్వ సర్వ మంగళావాప్తి నొదఁ గూర్చి మనుచుఁగాత రసిక. 1. 2.

తే. గీ. సేస కొప్పునఁ గపురంపుచిత్రికంబు, గళమునఁ గుచాద్రులను దళ్కు గందవొడియు. శుక. 1-148.

2. కివించునప్పుడు వేయు వక్షతలు.

"అనుచు నప్పుడుఁ జెలిముత్తియంపు సేసఁబ్రాలు చల్లి రి" నీలా. 5. 52.

వ. దేవేంద్రుని యానతి ముత్యాల సేసంబో లెశిరంబునం దాల్చి. వాం. 3. 63.

ఉ. ఆసమయంబునన్ మొరసె నభ్రపథంబున దేవదుందుభుల్, సేసలు చల్లి రచ్చరలు. మను. 6. 59. 3. అక్షతల బొట్టు.

సీ. పన్నీటితోఁ గవంబముఁ జేసి మృగనాభిఁ బూసి కుంకుమ సేస బొట్టుదీర్చి. మను. 6, 5.

సీ తలచుట్టుకొన్న చింపుల బైరవాసంబు చెమటచేఁ గరఁగెడు సేసబొట్టు శుక. 2. 442.

తలఁబ్రాలు, సేసఁబ్రాలు (నం. శేషా).

చం. కెరలు స్రవంతి పై యిసుక క్రిందగు వేళ నిముందు మేఘపుం, దెర నసఁ జల్లఁగా విరహదీప్త కరప్లుతమౌ సజీరకోత్కరంగుడ మట్ల పద్మినులఁ గ్రమ్ము నకేసర మార్ద్వి పొల్చెఁ బైఁ, గరమరుదారెఁ దేంట్లు సెసగందిన ముత్తెపు సేసలో యనన్. ఆము. 4. 15.

చం. ... లతాలలవల్ మృదులానిలానవఃర్జిత కుసుమాతతానకులు సేసలు వెట్టిన యట్టి రైరి. భారం. ఆది. 4. 17.

కం. కై సేసి తాను సుతులు, సేసలు వెట్టుటకు
కై బ్యాతంబున నుల్లాన మోప్ప నెదుర్కొనిరి,
యానందిజనయన గనియె వదనము పేదన్.
హరి. పూర్వ. 8. 152.

సీ. సరిబ్రాహ్మి మొదలైన సప్త మాతృకలు
దగ్గాడ సేసలు చల్లె గోగులమ్మ. భీమ. 4 153.

చం. రతి రతి రాజమూర్తులగు రాముయు రాణామ
రుండు నొండొరుల్, సితలలితాక్షతావళులు
సేసలు వెట్టిరి. విక్ర. 7. 78.

5. పుష్పాంజలి.

సీ. తావిగల్గిన బంధు జీవప్రసూనముల్ సేసగాఁ
జై వి వర్ణించినట్లు దశా. 4. 137.

సేసఁబ్రాలు వి. ఐ. తలఁబ్రాలు.

తే గీ. ఇంతిదోయిట సేసఁబ్రా లెత్తుచోట. ఆము
6. 138.

ఉ.... అఁదుఁ గదుఁ బొల్చెను దీవన సేసఁబ్రాలనా,
రీతటినీజలామలహరిచ్ఛ్యుత సాబ్జరజ స్తుషారముల్.
పర. 2. 98.

మ. సకిపైనా నృపమౌళి నింప నలకఁ జాతాక్షి
గోత్రాధినా, యకుపై సింపఁగ సేసఁబ్రా ల్దనరె
సామ్యస్ఫూర్తి నవ్వేళఁ దత్సుక రాలంకృతి నాద
వాదములు దోడ్తో మిచ సాహిత్య పోషకుఁ
దజ్ఞాస్త్రీఁడు దార్పు వర్షసనుణీ జాలాభిషేకంబు
నన్. చంద్రికా. 6. 70.

ఉ. (శ్రీ) మెఱయం బురోహిత విశిష్టమతంబున
విక్రమార్కధాత్రీ మహిశేశ్వరుండు సముద్దీప్తత
నించిన సేసఁబ్రాలు కాంతామణి కేశభారమునఁ
దద్దయు నొప్పె. విక్ర. 4 140.

చం. ... కేలుదోయి నొంటొరువయి సమ్మదంబు
లిగురొత్తఁగ మాటికిఁజల్లు సేసఁబ్రా ల్నైనెవవఁగ
బ్రాఁలె గుహాళివిగళన్నవ కోరకావళుల్. పారి.
52.

సేసకొప్పు వి. కొండెసిగ. (శ. ర. బ్రౌ.)

సీ. సేసకొప్పున జాఱు చెంగల్వ మొగడలు జాగ
రారుణ కటాక్షముల నెనయ ప్రసురాజ విహా
వర్ణనము) వసు. 4. 78.

సేసలు చల్లు నాటి కొప్పు పెండ్లికొప్పు అని
బ్రౌను చెప్పినాఁడు కాని అయ్యది మీ ప్రయోగము
నందు పొసఁగదు. 'చెందకొప్పు' అని వసు.
వ్యాఖ్యాత. శుక ప్రయోగము గ్రాహ్యముగా
కాన్పించదు కొప్పున సేసయును సేస పుష్పాంజలి"
అని ఆం. భా. 2. 181. కొప్పున దోపిడు పువు
లును అనఁగా పుష్ప సముదాయమును గళమున
చిత్రకమును కుచము లందు గందవొడియును వలపు
గులుక అనియే చెప్పవలయునని తోఁచుచున్నది)
శుక. 1. 148.

తిరుపతి కొప్పులు బోడితలలు (బ్రౌ. తిరుపతి
యాత్రఁబోవు వారు అట జుట్టు నర్పించుట ప్రసిద్ధా
చారము) సా. ఒక యింటిలో ముప్పది జుట్టు లిము
డును గాని మూఁడు కొప్పు లిముడవు.

సీ. వలపులు గులుకు చెంగలువ క్రొవ్విరుల జేఁకులు
గానరా సేసకొప్పు ముడిచి ... తే. పసిఁడి సింగిణి
ధరియించి రసిక జనన,మేతుఁడై దుర్జయ శ్యామ్ల తరేశ్వ
రుండు, వచ్చె నెదుటికి నారాజవదన గొలుచు
నిచు విలుకాఁడు సాక్షాత్కరించె నవఁగ. వ రాహ.
8 111.

ఎ గీ పొంద వారిజముఖులు పెంపొంద యనుచు
సేసకొప్పులు కదలంగ సేసఁజల్ల ....దశా. 7. 508

సీ. సేసకొప్పునఁ జుట్టుఁ శిఖిపింఛరించ్ఛోళి మక్కళిం
చిన జిల్గుముఱుఁగు పాగ. కాశీ. 3. 118.

సీ. సేసకొప్పున జారు చెంగల్వ మొగడలు జాగ
రారుణ కటాక్షముల నెనయ. వసు. 4. 89.

తే కుసుమ బాణాసనుని సేసకొప్పులోనఁ,దవిలి
యొప్పారు సంపంగి దండవోలె శృ నై. 5. 92.

గీ. సేసకొప్పునఁ గపురంపు చిత్రకంబు, గళమునఁ
గుచాద్రులను దట్టు గంధవొడియు, వలపుగులు
కఁగ. శుక. 1. 148.

సేసనబ్రాలు వి తలఁబ్రాలు.

చం. ముకిపెముతో సువాసినులు ముత్తైవు సేసన

ప్రాలు [illegible] ముల దేర హస్తయుగళిన్ [illegible] ముంచి. లక్ష్మీవి. 5. 83.

**సేనప్రాలు** వి. తలఁబ్రాలు.

ద్వి. దేవకామినులు భూదేవకామినులు, సేవించి దీవించి సేసప్రా లిడఁగ. ద్వి. ప:మ. 4. 844 పు.

**సేనబొట్టు** వి. పావటబొట్టు.

చ:. [illegible] దండు దాడిఁ అని పెంపునఁ గ్రమ్మలు దాక పీడియం,బును సిరిగందముల్ విరులు మట్టిక యుండఁదగున్ బొలంతి తే,జునఁ గడునొప్పు మట్టసపు సొమ్ములతోఁ గురుమాపు చీరతోఁ, దనకనిగొప్పుతో మిగులఁ దార్కొను ముత్తెపు సేన బొట్టుతోన్. యయా. 4. 134.

2. అక్షతలతో బెట్టిన తిలకము.

సీ. పన్నీటితోఁ గదంబము జేసి మృగనాభి పూసి కుంకుమ సేన బొట్టు దీర్చి మను; 6. 5.

**సేనముత్తెము** వి ఆశీర్వదించునపుడు చల్లు నక్షతలకు మారుగా వేయు ముత్యములు.

చం....మణిగోపుర సంస్థిత సౌధభామినీ, జనములు [illegible] ముత్తెములు చల్లగ [illegible] గుడై. పారి, [illegible].

**సేనయిడు** సేసవెట్టు.

ద్వి. ఘనతమై మాయింటికడ కేగుదెంచి, యడగి చుట్టటిక మేపారంగ సేస,యిడి నీవు గొని పోవుటం తియ కాక. ద్వి. పరమ 5. 424. పు.

**సేసలు** వి బ అక్షతలు, దీవనఁబ్రాలు

గీ. మందిరాభ్యంతరమున కానందలీలఁ, దాండు పుత్రులు దక్కటి బంధు జనులుఁ, దానుఁ జని విప్రులును వ:శాజనంబు, సేసలొలుక సింహాసనా సీనుఁడయ్యె. భార. విరా. 5. 282.

ద్వి. చెలఁగి పుణ్యస్త్రీలు సేసలు సల్లి, పలుతెఱంగు లనుశోభనములు పాడ. నల 2. 668.

ఉ. వానవు మీఁదఁ బోవు దశవక్త్రుఁడు గెల్పు వహింప వి[illegible]మో,ల్లాసి పలాశి సంగతిఁ తెలంగు లశాంగన లింపొసంగు ళ్ళం,గీ సముదారగానముల గ్రేవలఁ బెమ్మరరాల్పు గ్రొవ్విరుల్, సేసలు పెట్టి రొక్కమొగి శ్రీకర పల్లవ రాగముల్ దగన్. ఉ. రా. 4. 148.

చం. సమదిక చంద్రికా ధవళ సౌధసమున్నత చంద్ర శాలలం, బ్రమదము మీఱ నిల్చి పురభామలు సేసలు చల్లు క్రొత్త ముత్తెములు దనర్చె నమ్మ దవతీమనుజేంద్రుల మీఁద వేలుపుం, గొమిరెలు కల్ప భూజనవకోరకముల్ గురియించిరో యనన్.

**సేసవెట్టు** అ. క్రి. (సేస+పెట్టు) అక్షతలు మున్నగు వానిని చల్లుట.

తే అంబ మూంలికిఁ గల్యాణమైన నాఁడె, వాని గలక్ష్మి లక్ష్మికి సేసవెట్టె. పాండురంగ. 1. 41.

**సేశ్వరసాంఖ్యము** సం. వి. అ. న. ఈశ్వరుని అస్తిత్వము నంగీకరించు సాంఖ్యమతము.

**సేశ్వరుఁడు** సం వి. అ. పుం. ఆస్తికుఁడు.

# సై

**సై వై.** ఉప. సహాశబ్దార్థకము. (సైదోడు. మొ.) మొదట రూపము సయి. శ. ర

**సైందూరము** సం. విశ. (అ. ఆ. అ.) సిందూర వర్ణము కలది.

**సైంధవకము** సం. విశ. (అ. ఈ. అ.) సైంధవులకు సంబంధించినది.

**సైంధవకుఁడు** సం. వి. అ. పుం. సింధుదేశమున వసించువాఁడు.

**సైంధవఘనము** సం. వి. అ. పుం. ఉప్పురాశి.

**సైంధవము** సం. విశ. (అ. ఈ. అ.) 1. సింధు దేశమున పుట్టినది. 2. సింధువదికి సంబంధించినది. 3. నదియందుఁ బుట్టినది. 4. సముద్రమునకు సంబంధించినది.

**సైంధవము** సం. వి. అ. పుం. 1. గుఱ్ఱము (సింధు దేశమునఁ బుట్టినది) 2. ఒక విధమైన రాతి ఉప్పు (ఈ యర్థమున నిది నపుంసక లింగమునఁ గూడనున్నది) 3. ఒకదేశము పేరు.

సైంధవశిల సం. వి. ఆ. స్త్రీ ఒక విధమైన రాతి ఉప్పు.

సైంధవుఁడు సం. వి. అ. పుం 1 ఒక ముని. 2. జయద్రథుఁడు (సింధుదేశపు రాజు) బహువ. సింధుదేశపు ప్రజలు.

సైంధి సం వి. ఈ. స్త్రీ. ఒక విధమైన మద్యము.

సైంహము సం. విశే. (అ. ఈ. అ.) సింహమునకు సంబంధించినది.

సైంహలకము సం. వి. అ పుం ఇత్తడి.

సైంహలము సం. విశే. అ. ఆ అ సింహళమునఁ బుట్టినది

సైంహలి సం వి. ఈ. స్త్రీ ఒకవిధమైనమిరియము.

సైంహికుడు, సింహకేయుఁడు సం. వి. అ. పుం. రాహుగ్రహము.

సైచే అ. క్రి. (రూ. సయించే) 1. ఇష్టమగు.

రగడ. పాలఁతి సైపవు మాకయి నీకయ పోలుఁ బోలులివడిన కల్లలు పారి. 4. 16

సీ. కస్తూరిచేఁ దిలకముఁ దీర్పవే నేఁడు జీవ్వాది యతనికి సైఁచదేమొ. పార్వ. 2. 161.

కం. అనవుఁడు శలుఁ డిట్లని యొం, జమ నిను బుత్తేర వతఁడు సాలుదు వీవుం,గాని పోవ దురంగంబులఁ, జనుమీ దుర్భాషితములు సైఁపవు మాకున్ భార. అర. 4. 345,

2. రుచించే.

అద్ది శ్రావఁగ సైఁప కట్టిట్టు గన్గొని ప్రతిబింబ మీక్షించి భ్రమసి యుబుకు. మను. 3. 16.

3. సహించే, ఓర్చు.

మ. సురదంతావళ దానగంధలహరిన్ సొంపొందు సారావగాం, బురుహోళింద మిళిందబృందము మహామోదంబునన్ బైకొనెన్, బంనీలాచల భాసురాసు రబల స్తంబేర మోద్యత్కటాం, తర చంచన్మద మాహరింప రిపులన్నన్ సైఁప రెవ్వారలున్. ఉ. రా. 2. 37.

కం. ఉరులును బోనులు గూళ్లును, బరుసని చెయ్దములు గాలివడగలు బొరిఁగిం, కరులం బొడిపించెడియా, సఁభసములఁ దక్కనొందు సైఁప వశనికిన్. కేయూ. 3. 136

కం. చూచి మనోభవశిత నా,రాచములం దవిలి దుఃఖపు మోహామునే, సైఁచక గా ధర్వంబున, నీ చెలిగై కొంటి జనము తెలుఁగక యుండన్. పె. శకుం. 3. 20

చం. వినఁడు ప్రమోదలీల బృథివీవరుఁ డంపిన రాజకాంక్షపు, దినపరులన్ ... ముఖుమాటఁ బల్కఁడే, చనవరులం దలంపఁడు హుషారుగ సారెకు వేఁటఁబోవఁడా, జనవరసూతి యందొకటి సైఁచునె దానల నెంచు వారికిన్. ఇందు. 2. 203.

చం. అనవరతానురాగముగ నంగజకేళి భజింపు మిఁక నొం,డని యొకసేనితెలి కుసుమాస్త్రుఁడు సైఁపఁడు నన్నుఁ బావకా! భాం. అం. 5. 201.

చం. శతమఖ బుద్ధిఁ జేసి కడు సైఁపక శాఁకిర నన్ను నల్కతోన్. భాల. ఆ. 4. 32.

ఉ. అంపలిలోనఁ బెద్ద మహిమాన్విత రుక్మిణిగాన గో,విందుఁడు దాసి కిచ్చెఁ దగవేయని లక్షణ యోర్చి సైఁచెఁ గాళింది శమించె భద్ర. పారి. 1. 62.

చం. .... పరోన్నతికి సైఁపవు .... దశా. 2. 81.

సైఁచే స. క్రి. (రూ. సయిచే) 1. ఓర్చుకొను. సహించే.

తే. నికటమున నుండి శ్రుతిపుట నిష్ఠురముగ, వదరి కాకులు బిట్టు పెద్దఱచినప్పు, డుదధి రాయంచ యూరక యుంట లెస్స, సైఁపరాకున్న నెందేని జనుట యొప్పు. భీ. 1. 14.

ఉ ఏమి నిమిత్తమో యెఱుఁగ మీపురి చేరువబిల్వ వాటి కా,సీమఁ బ్రతిష్ఠపంబు వరసీరుహాలోచన యోర్తు దానవస్తోమ కశాభిఘాతములఁ దోరపు వేదవ సైఁపలేక. విక్ర. 2. 240.

మ ...ధ్యానానుసంధానముల్, వ్యవధానం బొక యింత సైఁచవౌకా. హం. 7. 65.

తే. పగఱఁగని సైఁతురేనియు మృగకులంబుఁ గని

సహించిన రాజులు మొదలి వారిఁ గ్రాంచఁగఁ
బెంపుడు నప్పుడు ఛిదిపి, కాని మాయా బలం
బునఁ జనడు చెప్ప. భా. ఆది. 5. 16

చం. ... నీ,యుడిక కన్నె మైన యొకలొప్ప గణిం
పఁగ నాగ్రజాన్మునీ, యనఁతనంబు సైఁచె మది
యమ్మరో యొకటకై టకఁ జూడుమా ఉ. రా 6.
265.

ఉ. కడఁగి మునింత హేతువను గర్భము నొంచితి
దీనిఁదప్పుగాఁ, దడవక సైఁకగా వలయుఁ దల్లి
నిమం గొనియాడ లోకముల్ హరి. పూర్వ
1. 87.

చ....నీవు దండ్రియు గడు దుం డ్రిముందు వని
ప్రీతి యొనర్చెఁబూ వైరికిన్, జయ మొన
రింతుగాక యని సైఁతువె దప్పము సూపకుందువే?
భార. ద్రోణ. 4. 148.

చం. .... పరాభవ మొందియు మున్నువారి
దుర్గుణములు సైఁచేఁటివు నొక కొంత యొఱుం
గుడు వింత యేటికిన్ భార. ఉద్యో. 1. 325.

మ. కమలాప్తోన్న మదాంకుజాలములు దిగ్భాగం
బునం గ్రమ్మినం. గముదాంతస్థిత లక్ష్మి యొండ
వడనోకుల్ సైఁపఁగా లేక ప,త్రముల న్మాటుగఁ
జేసి కప్పుకొనియెన్ హరి. 2. 65.

ఆ. పొలఁతి ముదముతోడఁ బూజించె వచ్చియు,త్స
వముఁ జూచి దాని సైఁప కపుడు. భా. ఆది.
7. 158.

కం. .... కరుణా, నిపుణుఁడవై నీ మఱఁదికి,
నపరాధశతంబు సైఁపుమయ్య యుపేంద్రా.
భార. సభా. 2. 57.

పీను లలర సైఁపకుండిన సింతియు చాలుగాని.
నీలా. 2. 188.

మ. ఇవకోట్సింగ నివాన వాసనవా రాజన్య హ
స్తాశ్రితమ,గ్నన సౌభాగ్యామృత పానవశ్యమునవో
సైఁచెన్ శిలాయోజనం, బని సాధ్వుల్వొగడన్
గ్రియాంఘ్రి సనెకల్ హత్తించె భూజాని వసు.
6. 82.

సైఁదము వి. గోధుమ పిండి.

సీ. పాయసంబులు సపూపములు సైఁదపు బిండి
వంటలు బప్పును వలయునట్టి, ఫలశాకములు వండఁ
బంపుఁడు భాగ. 10 స్కం. పూర్వ 808.

సైఁపు వి. సహనము, ఓర్పు, శాల్మి. రూ. సయిపు.

ఉ ఐనను జిత్తగింపు ద్రుపదాత్మజ నా సభ నట్లు
సేసినపి, దానికి సైఁప లెప్పయని దైవ్యముఁ
బొందుటకోర్చి యమ్మెయిం, గానన భూమికిం
జనుట కారుణికోత్తమ నీ వెఱుంగవే. భార.
ఉద్యో. 3. 75.

సైఁపు స. క్రి. క్షమించు.

కం. కృపగల్గి భీమనాయక, యపరాధము సైఁపు
తండ్రివాడో కాదో, కృపగల్గి సుతుఁడు చేసిన,
యపరాధము తండ్రి సైఁపు టర్హంబె కదా. భీమ.
5. 208

సైఁపుడు వై. వి. ఓర్పు. (మొదటి రూపము సయి
పుడు) శ. ర.

సైకతము (సం విశే. త్రి. అ.) ఇసుకతోఁ జేయఁ
బడినది. 2. ఇసుకతోఁ గూడినది.

సైకతము సం వి. అ. న. 1 ఇసుక తీరము 2.ఇసుక
తీరములతోఁ గూడిన ద్వీపము. 3. తీరము.
4. సికతా సమూహము.

సైకతము సం వి. అ పుం (బహు) ఒకానొక కుటుం
బమునకుఁ జెందిన ఋషులు.

సైకతికము సం. విశే. (అ. ఈ. అ.) 1. సైకతమునకు
సంబంధించినది. 2. సందేహముతోఁ గూడినది.
శుభమునకై మెడకుఁగాని మణికట్టునఁగాని కట్టు
కొను దారము (మంగళ సూత్రము).

సైకతికుఁడు సం వి అ. పుం. సన్యాసి.

సైకతిని సం. వి. ఈ స్త్రీ. ఇసుకతో నిండినది

సైకదనము వి. (సైఁకము) సూక్ష్మత్వము.

ద్వి. నొసలి యొప్పిదము వీనుల చక్కఁదనము
బసమించు నారు లోపలి సైకదనము. ద్వి పరమ.
5. 142.

సైకము సం విశే (అ. ఆ. అ.) (స+ఏకము) ఒక
టితోఁ గూడినది.

సైకము. విశే. స్వల్పము; సూక్ష్మము; చిన్నది. కొంత (రూ. సయికము)

సీ. శశికలాభరణంబు సరణి నొదలమీఁద సైకమౌ గొజ్జఁగి తెకుఁజూచి. కృ. శకుం. 1. 202.

సీ. కళలు దేఱెడు నెమ్మొగమున సైకముగాఁగ, మంచి కస్తూరి నామంబుదీర్చి. సాంగ. 3. 128.

వ. సైకపుం బైదలి మూఁక లగపడెనని చెలంగు ఘాతుకదైతేయులును. ఉ. హరి. 1. 59.

కం. సైకము నడుము విలాసర, సైకము నెమ్మొగము దీని మృదు మధురోక్తుల్, సైకముఁ దెగడున్నవలా, సైకములో నెల్ల మేలుబంతిది బళిరా! విజ. 2. 107.

సైకము వి. (రూ. నయికము) సూక్ష్మత్వము.

చం. జలరుహగంధి వీనుల పసల్ నవసంఖ్య వరేమి లెక్కనున్, తెలియ నఖాంకురాశి నెల చేడియ సైకముఁదాను చుక్కనున్, బొలఁతుక గబ్బిచన్నుఁగవ పువ్వుల చెండ్లను లేదు బంతనున్, గలికి ముఖార వింద ముల కల్వలరాయనిఁ దోసిరాజనున్. విజ. 1. 87.

ద్వి పోగైన వాలంబు సొబగు నెన్నడిమి సైకంబు నడలోని సరసత వరువు. ద్వి. పరమ. 3. 228.

సైకా వి (అర్థము విచార్యము) వస్త్రవిశేషము.

సీ. గడితంపు మేలిపచ్చడము గప్పుట మాని దుప్పట్లు సైకాలుఁ గప్పఁ దొడఁగె. నిరం. 1. 16.

సైక్షవము సం. విశే. (అ. ఆ ఆ.) పంచదారతోఁ గూడినది.

సైగ వి. (రూ. సయిగ) 1. జాడ, సన్న, (సం. సంజ్ఞ)

తే. లెస్సఁగాఁ జూచి చెప్పుము లేమిచేత, జనని నాపతి శీఘ్రంబె సఫలుఁడై సురక్షితంబుగ వచ్చునో రాఁడొ యనుచుఁ, దెలవ యడిగిన నాసైగఁ దెలిసి యతఁడు. హంస. 4 54.

సీ. పనిలేని పనియైనఁ బరిచారకుని సైగ సేయఁగాఁ జూచు ఘూనాయకుండు. ఇందు. 5. 116.

2. సంజ్ఞ, హస్తాదుల సంజ్ఞ.

[illegible] సైగ [illegible] చూచి. [illegible]

తే. [illegible] నవెడి, సైగగాఁ బుష్పములఁ [illegible] చేయు చును మించి రాచూలి [illegible], వపుడు దిగ్గున నాలేమ యతనిఁజూచి. వెంకటాచలమా. 4. 260.

కం. అపన్న సైఁగ లారసి, ఘూముసతి గిల్లు వెడలి పొమ్మని సైఁగ యిడ సాధ్విందుకము)

సైద్దు అం. వి (ప్రక్క, పుట (శ. ర.)

సైతము అవ్య. (రూ సయితము) కూడ (సం. సహితమ్)

ఉ ఈ చతురాత్మతోఁ గాయ టించుకచాలదె యేము సైతమున్, వాఁచిన వాఁయట్లు గరువంబునఁ గన్గొను చుంటి మమ్మిఘున్. వి. పు. 6. 102.

సీ. మునిఁడి ప్రమాకున సైతమును కండ్లు గల్పించి చెఱకున కేల సృజింపఁడాయె వైజ. 3. 121.

తే. నోరెఱుంగని యట్టి జంతువులు సైత, మంబ జానవ యిచ్చా విహార మందుఁ, బలుక నేర్చిన తను వాశపతి నొసంగి, బంగరము వంటి మనసు గెంటంగ నేల. శుక. 1. 442.

తే కటకటా సృష్టి చీఁకట్లు గవిసె నింది, రాధ వుఁడు సైతమును గానరాక పోయె. వరాహ. 9. 118.

చం.....లేనియార్ష్యతోఁ, బెనచుక నెంతగా యవిధి బెట్టెను మిమ్ముల మాకు సైతమున్, మనసులు రోసె మానులకు మచ్చరముల్ దగునయ్య యొచ్చటన్. ఉత్తర హరిశ్చం. 1. 24.

సీ. ఎంద అబ్బరు నీకు నేను సైతంబుగాఁ బర్వ తాత్మజ పట్టుపడ్డయప్పు. కాశీ 6. 225.

పి. ......జాతు లేనంబు జేతణ పద్మినులు సైతము మన్న యెడ జాతులునికి యరుదె ... ఆము. 2. 19.

ఉ. ముసలమ్మకు సైతము కమ్మనూనె మై,నంటి నలుంగుతో జలకమార్చి యొసంగిర ధౌత వస్త్రముల్. భార. 2. 89,

చం. కలనరి ముక్తి కల్మష వికార వివర్జులు ఘోర నాకస్థులు నగు వీరు సైతమును సువ్రత నీవు మదన్వయ-జ.వ: గలిగితిగాన.

**సైతవాహిని** సం. వి. ఈ. స్త్రీ. బాహుదానది శ. ర. వరాహ. 2. 10..

**సైతాను** హి. వి. పిశాచముల అధిపతి (శ. ర.) శని.

**సైత్యము** సం. వి. అ. న. తెల్లదనము.

**సైదు** వి. మహమ్మదీయులలో నొకజాతి.

మ. ....పై కారవ:,బుల మొల్లా పఠియించుచున్. మధుజలంబుల్ జల్లి వేగాడ్పు ఖా,నులచేఁ జైత్రవు సైదు జీర్ణదళవహ్నుల్ గంటె త్రొక్కించఁగన్. చంద్రాంగ. 4. 208.

తే. పాదుషా వారి మీరు బరిదు సైదు, ధక్కను మొగల్లరిబు పఠాణులాది, పౌఁజులఁ బలాయన మొనర్పు పటిమగల్గు, తురక దొరలము మాకు హిందువులు భరమె. రంగా. 2. 89.

**సైదోడు** వి. (వి. సై + తోడు) 1. సహోదరుఁడు. 2. తోఁబుట్టువు (రూ. సయిదోడు)

సీ. కటకట సైదోడ క్రాల్గంటి కార్ముకంబులచేతఁ బొలిసెనో యలుకఁజేసి అ రా అరణ్య. 8. 5.

తే. గీ. మంచి సురధేను వుదయించు మందపట్టు. దివ్యరత్నముల్ పొడమిన దిక్కు శివుని,యు విద సైదోడు భయ మందియున్న గొంది, యఖిల సౌభాగ్యరాశి యీ యంబురాశి చిత్రభార. 5.6.

తే. గీ. చంద్రు సైదోడు పూఁబోడి జలుకు తలుకు, వాలుగమ్నుల బెళుకులవై పుసూపు, వాలుగన్నుల తలపింపవలయు నని యొ, దేవమాయ వుమీన మైథిలి పయోధి. దశా 1. 212.

తే. గీ. అల యశోదాశిశోరకం బానుభద్ర, కలికి సైదోడు నాపాలఁ గలిగెనేఁడు, మమ్మరే యని పులకించి మందయాన, తుందిలానంద కందళకంద మయ్యె. రాజవాహన. 1. 82.

మ. అలరుంగైదువ జోడు కూర్మి సయిదోడై మాధవ శ్రీతపః, ఫలమై యాడు మరుత్కుమారుఁ బ్రియ మొప్పం దేనె నీరార్పి. వసు. 1.128

వ చదలేటి నీటి వంవ సోదరియ స్నేహాబ్ధంబు లుఁబోని పావనత్వ శుచిత్వ గాంభీర్య మాధుర్యం బులు చరిత మనస్స్వభావవచనంబుల ధరియించి సైదోడుఁ బోదిని (చతుర్థ వర్ణ వర్ణనము) భీమ, 1. 61

**సైద్ధాంతికము** సం. విశే. (అ. ఈ. అ.) సిద్ధాంతమునకు సంబంధించినది.

**సైద్ధాంతికుఁడు** సం. వి. అ. పుం. సత్యము నెఱుంగువాఁడు.

**సైనాపత్యము** (సేనాపత్యము) సం. వి. అ న. సేనాపతిత్వము.

**సైనికము** సం. విశే. (అ. ఈ. అ.) సేనకు సంబంధించినది.

**సైనికుఁడు** సం. వి. అ. పుం. 1. యోధుఁడు. 2. నగరరక్షకుఁడు.

**సైన్యక్షోభము** సం. వి. అ. పుం. సేనయందలి తిరుగఁబాటు.

**సైన్యదుర్గము** సం. వి. అ. న. ఒక విధమైన దుర్గము

**సైన్యము** సం. విశే. సేనతోఁ గూడినది. (శ. ర.)

**సైన్యము** సం. వి. అ న సేన.

**సైన్యము** సం. వి అ. పుం. కృష్ణుని రథమునకుఁ గట్టు గుఱ్ఱములలో నొకటి.

**సైన్యుఁడు** సం. వి. అ. పుం. 1. యోధుఁడు. 2. పారావాఁడు. 3. కావలివాఁడు.

**సైపు** వి. (హిం. సైఫ్) ఖడ్గము, కత్తి.

సీ. తే. గీ. కెంజిగురు సైపు కేల నంకించుకొనుచు మదను పాదుసహా దండు కదలె నపుడు. అని 3. 14.

**సైబు** హిం వి ఖడ్గము ?

వ. చాయలం గ్రక్కు నుక్కువని పెంపెక్కు వజీబు సైబు పట్టా వట్టెట్టు ఝళిపించుచుఁ దెంపు సొంపు దీపింప రయంబున మల్లుపురా. 2. 48.

**సైమంతికము** సం. వి. అ. న. సిందూరము.

సైరింపఁజాలని శాంభవిఁ గని. ఉ. రా. 1. 34.

సైరికము సం. విశే. (అ. ఈ. అ.) నాఁగలికి సంబంధించినది

సైరికము సం. వి. అ. పుం. దుక్కిటెద్దు

సైరికుఁడు సం. వి. అ. పుం. కర్షకుఁడు.

సైరిభము సం. వి. అ. పుం. దున్నపోతు. 1. స్వర్గము. 3. ఆకాశము.

సైరి(రే)య(క)ము సం. వి. అ. పుం. ఒక మొక్క (వృ. వి.).

సైలగుఁడు సం. వి. అ. పుం. దొంగ.

సైనకము సం. విశే. (అ. ఈ. అ.) సీసముతోఁ జేయఁబడినది.

సైసిక వి. వాద్యభేదము.

తే. గీ. ఛత్రకర్తరితో ధారణి ఝుంకెసరళి, పాట సైసికయు ఝుంకెమీటు కంపి,శాహతంబులు పౌళియు బ్రహ్యాహతమును, స్ఫురితములు వాద్యముల వయసరణి మీటి. ప్రబం. 1. 100.

# సొ

సొంటి వి. పక్వముచేసి యెండఁ బెట్టిన అల్లము.

సొంటికొమ్ము వి. ఎండిన సొంటి నిడుపాటి గడ్డ.

సీ. దాసర్లమిత్తి సన్యాసుల తెంబొమ్మ జోగిజంగాలకు సొంటికొమ్ము.

తె. అనఁగ విఖ్యాతిఁ గాంచు నా యాఁడుఁ గూచి. శుక. 3. ఆశ్వా.

సొంటు వి. 1. తప్పు. దోషము. శ. ర.

తే గీ. వెంట వరుదెంచు తన మచ్చికంటి తీరు సొంట్లు సోదింపఁ గడకంటిఁ జూచుకొనుచు. శుక. 2. 15.

("సొంట్లు సోదింప" శ. ర. పాఠము, సొంట్లు శోధింప. ముద్రిత పాఠము,)పాండు. 3. 30. ప్రా. ప్ర.

2 తృణ విశేషము.

సొంటుకుందురు వి. తృణవిశేషము

ఎ. గీ. పొలికి వెనుకెడ కుందేటి పొరుజూగరక, పరిక సాళ్వము సొంటు కుందురు గరిమిడి హంస. 5. 45.

సొంతము విశే. స్వకీయము.

"ఈ యిల్లు నాకు సొంతము" వ్యా. వృత్తియందు వికల్పముగ అంత్యవర్ణలోపము. సొంతపని.

సొంపరి వి సొగసరి.

పంచ చామరము ... మెలంగి ముజ్జగంబు జొక్కమీఱు సొంపరి. అచ్చ తె. భారవి. 2. 35.

సొంపఱు (సొంపు+ఱు) అ క్రి సొంపు చెడు.

మ. ...దుష్టజనంబు సద్గుణ విభూతిన్ సొంపఱన్ జేయుఁ జెల్లరె సాతంకము సర్వమున్ సురభిమల్లా. మల్లభూ. వైరాగ్యశ 32.

సొంపారు అ. క్రి. 1. మనోహరమగు.

సీ. సొంపార రతులచే సుఖయింపనేర్చునే మండుమఱి రంభ సరస మున్న. సీతారా. 3. 43.

2. ప్రకాశించు.

వ. కోమలకోరకంబులం గరంబు సొంపారు సంపెంగలును. శృం. నై. 1. 95.

సొంపిరి వి. అనందాతిశయము, ఉత్సాహము.

బంధురము కొదవడక యిఁకన్ గొబ్బున వచ్చు బలే సకల. ప్రకుట లితనికి వలిసులభత వనుచున్ సొంపిరి పొంపిరివోవు మదిన్. పర. 5. 161.

సొంపిల్లు అ క్రి. (రూ.) సొంపిలు. సొంపగు.

సొంపు వి. 1. సమృద్ధి.

మ. ప్రకుటలన్ వన్నియ కెక్కె శాస్త్రములచే సొంపగ్గలించెన్. విక్ర. 1. 25.

చం. సురుచిర రత్నదీధితుల సొంపున రోహణపర్వతంబులై, పురమున దేవగేహములు పొల్పెనలారను వైభవోన్నతిన్ విక్ర 1. 67.

ఛం. వను విను రాజసేశ్వర రణంబున నీతని ద్రుంచి

వైచి నీ, మన మలరింతుఁ జొచ్చి పటుమార్గణ సంపద సొంపు సూపెదన్. భా. రా. అర. 227.

తే. చూచె నొక దివ్యరత్న నిస్తుల గృహంబు, నందు హేమవతీకన్య నలరుధన్య, వరల సొంపుల కెంకి జవాదివంకి, జాతిరతిలీల నా రాజదూతి హేల. హంస. 1. 81.

తే. ... అగ్రహారములను, గలిగి విలసిల్లు చోళ మండలము లాత్మ మెచ్చుచు నట కొంత యరిగి యరిగి. పర. 2. 93.

కం. భూసురుల రత్నకాంచన, వాసోఽలంకార ధేనువసుధాదాన. శ్రీసొంపున సంపన్నులఁ, జేసెఁ గరంధముఁడు ప్రీతచిత్తుం డగుచున్. మార్కం. 8. 207.

కం. ... దానవానీకంబుల్, పెంపటి సన్నాహం బుల సొంపటి భూసుతుని వెనుకఁ జొచ్చెన్ విచ్చెన్. భాగ. 10 స్కం. ఉత్త. 185.

ఉ. చుట్టము లెల్ల నాత్మ సముశోభిత సంపద నొంద నొప్పెఁ దాఁ, జుట్టపు మేరువ న్వినుతి సొంపున వేమ నరేంద్రుఁ డున్నతిన్. హరి. పూర్వ. 1. 20.

2. అతిశయము.

వ. కర్కంధూఫలోన్మిశ్ర శాకపాకంబుల తాలిం పుల కమ్మనికంపు పాంథఘ్రాణంబుల కింపుసొంపు సంపాదింప.

3. ప్రాశస్త్యము.

గీ. పరిపరివిధంపుఁ జన్నంపుఁ బరికంపు సొంపు సంపద నిఖల నిలింపసభయు. మను 2. 11.

4. విశేషము.

కం. అని సొంపు వినియు నాకుం, దనివి సనదు శల్య పార్థతనయుల సమరం,బున తెఱఁగు సెప్పుము. భార. ద్రోణ. 1. 179.

5. సుఖము.

కం. పూఁబోణులకును విటులకు, వేఁబోఁకలఁ దలరు సొంపు వీడ్కొలుపు కురిన్, వేఁ బోఁక తోఁ టల, పూఁతాశల కమ్మతావిఁ బొదలిన గాడ్పుల్. భీమ. 1. 95.

కం. చుట్టంబులుఁ జెలులుం దన, చుట్టుఁ దిరిగి యుండ ముదము సొం పెసలారన్. శృ. నై. 2. 4.

కం. చెలువున వృషపర్వుం డను, బలియుని గారాపు బట్టి పసిబిడ్డ సుమీ, వలరాచపనులు వెలగాఁ గలి గిన సొంపులను నడపఁగాఁ దగు దీనిన్. యయా. 4. 147.

6. సౌందర్యము, మనోజ్ఞత.

చం. సుదతి ముఖేందుమండలము సొంపున రాగ రసాంబురాశి యభ్యుదయము బొందె. శృ. నై. 3. 148.

ఉ. ... నిషధభూపతి దైవత కార్యకల్పనా, మాత్రము దప్పు నీ కెలమి సొంపుమదిం దలకొల్పి. శృ. నై. 4. 84.

మ. .... సొంపు వాటించు నీ, బహుళాంధ్రోక్తిమ యప్రపంచమునఁ దత్త్వాగల్భ్య మూహించెదన్. వసు. 1. 10.

చం....తడఁబాటును దత్తరముం జేలంబులో, నడ రఁగ గోపవేగమున వగ్గలమైన మనోజబాధలం, బడి మదహస్తి హస్తగత పద్మినియుంబలె సొంపు పెంప అన్. పారి. 1. 101.

తే. రంభయే యిది కాదో లేఁబ్రాయపుఁ జెలు, వంబు నుజ్జ్వల రూపలావణ్యములను, నగు మొగము సొంపు నింత యెన్నడును గాన, దీనికి వింతమహిమ సంధిల్లుటెట్లు. కళా. 3. 23.

సీ. .... తెలిదమ్మి విరియింటి తెలిగంటి కెంపు వా తెఁ సొంపె పవడంపు తీఁగెగుంపు .... దశా. 1. 164.

7. శివి.

ఎ. గీ. వెల్ల గౌరు నెక్కి సర్వామరులు గొల్వ నిఁపు సొంపు లమర నమరావతికి నేగె నమర విభుఁడు. దశా. 7. 443.

8. సంతోషము.

కం. ... అయ్యాలగళ్ళఁ దనియింతురు సొం పడర సిరిదాముఁ డను నొక కొడుకును మఱి నీల యనెడు కూతు రొక ర్తున్. నీలా. 1. 53.

చం ...తమ దండపుఁ గోలల నున్న మాఱుగోచులు వెనుబుచ్చివై చి కడు సొంపులుగాఁ బొగడించుకోఖు మీ, తలఁపఁగ నిప్పు డింత తెగదారుల మైతిమి భద్ర నావుడున్. ప్రభా. 1. 102.

కం. చెప్పంగఁ దగిన మాటలు సెప్పి మరాళంబు వమపఁ జిత్తంబున సొం, పుప్పతిల నిల్లు వెలువడి, యప్పగిదిన్ విష్ణుదాసుఁ డరిగెడు వేళన్. హంస. 1. 111.

9. కాంతి, ప్రకాశము.

వ. పొడవు కెంపుసొంపునింపు ... కెంపురివ చెక్కడంపు .... దశా. 1 14.

10 విధము, రీతి.

"కఱకుటమ్ముల గుంపుఁ సొంపునఁ జెంపారు కలువల క్రొవ్విరులును. నీలా. 3. 10.

చం.... వారి బల్లొడవుల రాలి ముత్యములు తోరములై తొరగెం బురంబునల్లడలఁ బ్రసూన కోరకని కాయము నింపిన సొంపుపెంపులన్. వసు. 1. 147.

సీ. వల్లవితపాదపంబుల ఫలిత భూజములను బుష్పిత తరువుల ముద్దుగుమ్మ, పికవిలాసినికై వడి శుక వధూటి, పోల్కి మధుకర రమణి సొంపున జరంచె. కవిరాజ. 2. 147.

11. దృష్టి విశేషము.

తే. గీ. సొగను తెలివాలుమను సోగసొంపు తళుకు, బెళుకు చికిలి యొయారంపు దేలింపు చుఱుకు టోర, కలికి బెదరెచ్చు చూపుల కలికిఁ జూచి. ప్రబం. 1. 103.

**సొంపుగను** అ. క్రి. (సొంపు + కను) సొంపగు. ఒప్పు.

గీ. కుందకళికాఖ్యఁ దగు ననంగుడు ధరించు, ప్రదర మెదరించు దాళి కదిరి చెదరి, ప్రథమవర్ణరహిత దరగతిని దిరిగి, పెంపటియుఁ దరిద్రదైన్యపు సొంపుఁ గనియె 5. 113.

**సొంపుడుగోల** వి. (అర్థము విచార్యము) చేత ధరించు నొక రకమైన కఱ్ఱ:

ద్వి. సోగైన వలకేలి సొంపుడుగోల బాగైన ముంగేలిపై జాళిడిగ. ... సం. ...

**సొంపెనయు** అ. క్రి. (సొంపు + ఎనయు) సొంపగు.

సీ. బహుసిద్ధోపాయములు సుమ్ము మెనిమిదికోట్లు సొం పెనయఁగూర్చి. ...

**సొంపెనయు** స. క్రి. (సొంపు + ఎనయు) సొంపొందు.

**సొంపొందు** అ. క్రి. ఒప్పిదముగు, ఎసఁగు.

మ. కరిగ-దస్రుత దానవారి యమునాకల్లోల ముల్ వాహాలాలాంబువుల్ సురకల్లోలినిగాఁ త్రివేణికరుణన్ సొ పొందె జ్ఞాతేయ సంగర భూభాగము. దశా 3 488.

**సొంపొనరించు** అ. క్రి. సొంపొందు, సొంపగు.

ఉ. చొచ్చి చతుర్జాతకముల సొం పొనరించు ప్రసూన సంపదల్, మెచ్చుచు నొండొరుం గడచి...యుంద్రువనంబున సంచరించు నయ్యిచ్చర ముద్దుగుమ్మల క్రిసం బుఁదోఁట మెలంగి రంగ వల్. ఇందు. 2. 31.

**సొక్కు** వి (సుఖము) 1. ఇంచుకంత శరీరవిస్మృతి (రూ. చొక్కు).

తే. ... శ్రుతులు వె. ... ప్వరముల చొప్పువిడక, చాల శుద్ధతఁ గనుట దోషములఁబాసి, ఘనవిధము గాన షడ్జములు గలసి మెలసి, యక్కవలవారి గానంబు సొక్కొనర్చె శు. రా. 8. 52.

సీ. కలిన్మసూకిన నూన్న ధాతుమును బోలెఁ జక్కగ నిక్కమై సొక్కుమంచె ... తే. గీ. కాల కంఠుండు త్రిపుర సతుడు మొనర్చ, నెక్కు వెట్టిన యపుడు భోగీశ్వరునకు. భీమ. 4. 130.

ద్వి ముడుపులు కతిరి పై మొగిసొక్కుఁ జల్ల, నడుగు దాచేకపోయి యారల నడవ, నాయంత పొలుపరి నలితాయతాక్షి, బోయరాజులతోనఁ బొడగావ మెందు. పల. 4. 26.

వ. ఈ యువవగన యుండమ చందము తక్కులు సొక్కులు వన్నెలు చిన్నెలు చూపులు కోపులు చూచి. మృత్యుంజయ. 1. 19.

ద్వి. టక్కులు దేవలు డంబకంబులును సొక్కులు

నేర్పులు నూటిమాటలను పండితా. పురాతన 122.

సీ. సున్నంబులోపల సొక్కుమందులు పెట్టి కలిగిన వంచించి తలఁగువారు ప్రబం. 1. 770

2. పారవశ్యము.

ఎ గీ. మదిం సొక్కున గోపికామానవతులు. దశా 9. 125

సొక్కు అ. క్రి (రూ. చొక్కు) పరవశమగు

ఎ గీ. ... రత్నకాంతులు వెలయంగ రాణివాస, సతులసేవల సొక్కు శ్రీపతిని గాంచి. దశా. 4 103

సొగటాలు వి బ. 1. బాలక్రీడా విశేషము.

సీ దాయాలు సొగటాలు దాట్రాయి చదరంగ మును కోటురాళ్లును మూఁతపొడువు హంస. 3. 146.

2. పగడసాలాట.

మ. జగదాశ్చర్యకరప్రభావ మగు నీ సర్వజ్ఞ విఖ్యాతి యేఁనుఁగు దిన్నట్టివెలఁగకాయ గతి నొందున్ లోన లోకైబయల్, సొగసై యుండె డిదో విశుద్ధతరమో చూడంగ నాతోడుతన్ సొగటా లాడెద వేదవేద్యుడు సమస్తోత్తవ్యజూటాంతికా. నిరం. 3. 8.

3. పాచికలు, ఆడదమాడెడు సారెలు.

కం. నిరతముఁ జదరంగంబున గిరిజల సొగటాల నారికేళఫలములన్, సరిచేసి యొడ్డువిడువులు, చెలి కులఁ బందె మిడి గెలువుఁ జేకొని యపలన్. ప్రబం. 1. 615.

కం. మిగులగు నేర్పరి ననఁదగి, తిగుటన్ సొగటా లనే నతిప్రౌఢుండన్. ద్వా. 10. 92.

సీ. కచ్చించి సొగటాలు గణికలతోఁ గుక్కుటాండ ముల్ పణముగా నాడువారు. వై జ. 3. 69.

సీ. సొగటాలపైఁ గోర్కి సుదకువచ్చినయంత వింత మీటల గారవింపనేర్చు. నిరం. 2. 83.

4. పాచికలు సారెలు గల సొగటాలపలక.

సీ. పట్టుపుట్టంబు సొగటాలపాళి నేత్రప్రాఁత చిటి చాఁప మంచివిపంచి. బహు. 5. 179.

సొగటు వి. మ్లాని, వాడు.

సీ పగలింటి సెగలచే సొగటొందు పూఁదీఁగె వడువున నెమ్మేను వాడుదేఱ. అని. 3. 131.

తే కృష్ణు ననుమతి రుక్మిణీకిరవాణి. వచ్చి భోజన మిశదలవంచి యగ్గలంబయినచింత వలని యొల్లమి నతండు, సొగటులను బోయి కసిగాటులుగ భుజించె. విజ. 3. 4.

సొగపు వి. చొక్కు, పారవశ్యము (దా. కృ. సొగయుట).

ద్వి. నిడుద తుమ్మెదకప్పు నెఱివేణిఁగట్టి, మిగిలిన జడ లేని మెయినిండ నూలు, సొగపున నిరుమూడు, చుట్టలుసుట్టి. ద్వి పరమ. 4. 369.

కం. అదియు నదియు నేటిది యో, మది నెఱుఁగని కనని సొగపుమఱువని వలపున్, బొదలఁగ గేవల దర్పోన్మదలై క్రీడింతు రా సమస్తాంగనలున్. హరి పూ. 8. 23.

చం. మగువ ముఖేందువం దమృతమధ్యమునన్ మునుఁగంగఁ జాలి యో, మగువ కుచద్వయంబు నతుమం బడి రాయిడి దండసిల యో, మగువ గభీరనాభిబిలమార్గము దూరి పరిభ్రమించి యో, సొగపున రాజనందనుని చూపులు నిల్చె దదంత రంబులన్. కృ. వై. 3. 149.

చం. దిటమున రెడ్డిపాటువడి తెచ్చియిడంగను గూటిప్రొద్దు సం, కటితటి వెన్నమజ్జిగలు కంకటిపైఁ బవలింటినిద్రలుం, బెటుకు.... శుక. 2. 334.

సొగయించు స క్రి. (సొగయు. ధా. ప్రే.) సుఖంపఁ జేయు.

కం ప్రేవల్లెనుండి ప్రేతల, పై పాటున పిచ్చుగించు పని యేమిటి కిట్లిప్రోలి మించుఁబోణుల, చూపులు మేఁగందకుండ సొగయింపంగన్. అచ్చతె. భారవి. 1. 3 పు.

సీ. బిగువుఁగౌఁగిటిలోన సొగయించి సొగయించి నవ్వురుగా మైదీవ నివిరి నివిరి. కృ. శకుం. 1. 141.

సీ. పరిరంభణములచే భావంబు సొగయించి యథశా

మృతమున మోహంబు నిలిని, —, అర్ధచంద్రాని వను లాదియైన బంధభేదముల నోలి వలపించు విన రుహాక్షి. రుక్మాం, 2. 121.

ఎ. గీ. ఎడద సొగయించు మాటల నెలమి మిగుల' నిన్ను వనురక్తిఁ గొలుచు వన్నెలఁత లుండ, నీర జాకార సైరంధ్రిఁ గోరఁ దగునె. భార. విరా. 2. 64.

సొగయించు అ. క్రి. సుఖయించు.

చం. వడఁతుక యేను రావణుఁడ బాహుబలంబున నింద్రువీటిపై, వడచుచుమండి యున్నగముపన్ విడి యించిలి సేన నిప్పు డి, య్యెడ కలవోక వచ్చి సొగ యించు విధంబునఁ బోవుచున్న నిన్, బొడగని కాముబల్మతకముల్ వను నిమ్మోయి వెట్టఁజేసివన్. నిర్వ. 6. 62.

సొగయిక వి. 1. చొక్కు, పారవశ్యము, సొగపు.

సొగయు అ. క్రి. పరవశ మగు, చొక్కు.

కం. సాదుతొగలఁ సెగమిగులన్, మోదముగల వాని పేదుముల పోఁడిమిచే, నైదువగల కైదువు గలి, కోదువగల మిగుల నొగిలి సొగయుచునుండెన్. ఇందు. 4. 73.

సీ. ఒడలెల్లఁ జూపుగాఁ గడు వ్రబపడి చూచు, సొగయ నొయ్యారంపుఁ జూడ్కిఁ జూచు. కవి రాజ. 2. 13.

ద్వి. వ్రతయుక్తి రుద్రాక్షవలయా యనంగ, సొగసి శుభ్రాజటాజూటా యనంగ. పండితా. దీక్షా 14.

కం. గిరిజ లలితాంగకమ్ములు సొరిఁబొరిఁ గనుఁ గొని సొగసి....మహేశ్వరుమనము వికలంబయ్యెన్. కుమా. సం. 5. 516.

సీ. బాణప్రయోగపారీణత యొలక, నారీకటాక్ష బాణముల సొగయు. విక్ర. 3. 14.

సీ. అతడు కళారహస్యంబుల యిక్కలు సొగసి యొండొరులంటు చోటులెల్ల. ఉ. రా. 5. 116.

2. సుఖించు.

చం. గగనతరంగిణీ వికచకాంచనకంజవనీ గృహంబు లన్, సొగసి రమించుచున్నయవి చూచితె చారుచ కోరలోచనా! వాల్మీకి. 3. 92.

3. మూర్ఛిల్లు.

సీ. శుకశారికలు రాత్రి సొగసె విస్వరముల జంతువు వేఱొక్క జంతువుఁ గనె. భార. 11. స్కం. 87.

సీ. కోకాగ్ని తనికిన సొగయు నీతమ్ముల మద వన్నవాక్యామృతోపయుక్తి. భార. శాం. 1. 87.

సీ.....దైవతకులేంద్రు. వద్దానవుండు మాయాబలం బున మోహితునిఁ జేయ సొగయుడు ముని సమాజ. తే. సంస్తుతముగ రథంతర సామశక్తిఁ జేసి. భార. శాంతి. 5. 428.

తే. ఇట్టు లొండొంటిఁ గదియంగ నెలమి నడచి. బలము లొక్కింతసేపు నిశ్చలతఁ బొలిచె, మవ్వ మెసఁగువనంబులు మాపు లెంత, యైనఁ జెలువార సొగసియున్నట్లు పోలె. భార. ద్రోణ. 1. 186.

4. నొచ్చు.

కం. ఎఱకలు విచ్చుదుఁ దుండము, తెఱచుచు వ్రేగ దరి సొగసి, త్రెళ్ళి వివశుఁడై, యఱచిన నోడకు మని వారి, నెటేఁవక్కఁగఁ ద్రోచియెత్తె నెగ యంగఁ గృపన్.

"ఆర్తి" మూ. భార. ఉద్యో. 3. 301.

5. విహరించు.

సీ. చంద్రికా మధు వాని చాకోరము ల్నిక్కి దేవతా సౌధ వీథికల సొగయు. భీమ. 2. 42.

6. చొచ్చు.

వ. కినలయముకుళకుసుమఫలాటు భరితంబై విన రుహబాంధవుని కిరణవివరంబుల సొగయనీయక మనమనసై యిరు లనలుకొనుచు. కాశీ. 1. 93.

సొగసు వి. అందము (దీనినిఁ జూచువారు సొగయుదు రని వ్యుత్పత్తి).

ద్వి. సొగసులు నిగుడ నాపురలెల్లఁ బొగడ. ద్వి. పరమ. 3. 170. పు.

ద్వి. సొగసులై సొలయక సొలయు భావములఁ

గలిగి యొప్పారు జగన్మోహనాంగి. ద్వి. పంమ. 2. 103. వు.

గీ. ప్రొద్దుపోఁకకుఁ గస్తూరిబొట్టుఁ బెట్టి, కీలుజడ యల్లి సురటావిపూలు చుట్టి, సొగసుఁ జేసి యొగాదిగఁ జూచి సిగ్గు, మురిపెమును బొందు నసుఁ జేరి ముద్దు పెట్టి. కువల. 4. 177.

సీ. పతిపత్ని వని మేనఁ బసపు పూసికొనంగ సొగసులా యని ముంతపొగ ఘటించు. శుక. 1. 115.

తే. అనుచుఁ దమలోనఁ గడు నొచ్చుకొనుచుఁ బసల సోగసొగసును గల వృషమూను నగరి కేఁగి, సారంగ. 2. 264.

"సొగసుల దీవులో" నీలా. 1. 40.

"త్రాడుగట్టక సొగసెల్లఁ దటిమి. నీలా. 1. 103.

శా. ప్రాతర్వేళల నట్టివెట్ట సొగసై పాటిల్లె ... ఆము. 2. 55.

2. ఒయ్యారము.

తే. చెలివలుకుఁ గేరడించుచుఁ జిలిగోళ్ళ, సొగసు సోకులఁ గళలు నించుచు. వసు. 5. 76.

3. ఆనందము,

కం. విడువక మీ గానము సొగసిడుటయు మటి పాడుఁడమట యొగ్గే ... ఆము. 5. 58.

4. సౌఖ్యము.

తే. పెట్టుపోతల సొగసాని సెట్టిసాని, యింటికడ నుండి యత్తాడు బఁటువాఁడు. శుక. 2. 203.

5. దృష్టి విశేషము.

తే. గీ. సొగసు తెలివాలి మమ సోగసొంపు తళుకు, బెళుకు చిరిలి యొయారంపుబేరె ముదుటు, సొలఁపు విడియంపు దేలింపు చులుకు టోర, కలికి బెదరెమ్ప చూపుల కలికిఁ జూచి. ప్రబం. 1. 106.

6. విధము, రీతి

వ. కాంతలు పొలయల్కల మాటు మొగంబులు పెట్టిన సొగసున నిరువాగిరు వాగై జోడుపట్ల వీడిన జాడతోడనె నిజబలంబులఁ బద్మాతుండు చిలువగవు మొగమునఁ దెంగలింప కాంత స్వాంతం ఖుతో దయ దైవాఱఁ గనుంగొని. ప్రబం. 1. 788.

వ, దట్టంపు నిట్టూరుపు పొగలు నిగుడు సొగసున్. వసు. 2 140.

సొగసు విశ. ఇంపు పుట్టించు.

తే. గీ· చుంబనంబులఁ జొక్కించు సొగసువగలు. దశా. ... 3. 141.

సొగసుకత్తె విశ. అందగత్తె.

సొగసుకత్తె వి. విటకత్తె.

సొగసుకాఁడు వి. విటుఁడు, అందగాఁడు.

సీ. వేఱొక్కకడ కేగు వేళల నటు తొంగిచూచి పోఁదలఁ చని సొగసుకాఁడు హంస. 5. 217.

మ. పలుముద్దుల్ పలురజ్జులన్ బదరునల్ప వ్రజలున్ గుబ్బచన్నులు గుల్కించు మెలంతలున్ సొగసుకాండ్రుం గూడ నొ నాఁటిపాటల వాండ్రున్ గొలు గాక రాజులకు. మల్లభూ. వైరాగ్యశ. 56.

ఉ. గ్రక్కున నేగి యా సొగసుకానికి నా వెత లెల్ల దెల్పి యీ, చక్కికిఁ దోడితెచ్చి మది సంతస మందఁగఁ గూర్చువారు నా కిక్కడ నెవ్వరు? చెన్నబ. 4. 269.

సొగసులాఁడి వి. సౌందర్యము గలయాఁడుది.

సీ. కలువకంటి యొకర్తు చలువ పావడ వైచె సొగసులాఁడి యొకర్తు సురటి విసరె. ఉ. రా. 6. 131.

సొగియించు అ. క్రి. (స. సుఖయించు) సుఖము నొందు.

కం. తగుమాటలఁ జిత్తంబులు, సిగురొత్తఁగఁ గలసి మెలసి చెన్నగుగోష్ఠిన్, సొగియించు వెడ ముకుందుని, మగువకు శచి యిట్టు లనియె. మంజుల ఫణితిన్. హరి. ఉ. 4. 992.

సీ. బిగియారు కౌఁగిట సొగియించి సొగియింపఁ జిట్టంటుచేఁతలఁ జెనకి చెనకి. విప్ర. 3. 90.

ఉ. చందనచారు పత్రకము సంస్తుత కౌస్తుభ కర్ణికంబు న,స్యందిత లాంఛన భ్రమర సంగమనోజ్ఞము నైన యట్టి గో,విందు నురస్థలంబు యరవిందముగా సొగియించి యున్నయయ్యిందిర చూచుఁగాతఁ

కృప నింపగ చూపుల భక్తసంతతిన్ నృసింహ పు. పీఠి 2.

సొగియించు స. క్రి. సొగియు ధా. ప్రే. సుఖంపc జేయు, చొక్కించు.

చం. వెడవెడ నిద్రవోcది కనువిచ్చిన పాంథుల మీcద దాడివోc, దడcబడ నొండొరుం బిలుచు దర్పకు పంపు బలcబులోని యల్కూడు కరడిం తెలంగె శుకకోకిల భృంగతతుల్ వనంబులం దెడ నెడc బల్కుc గూయ సొగియింపcగ మ్రోయcగc దద్విరావముల్. భార. ఉద్యో. 2. 111.

కం. చెవిని సొగియించు వీణారవమును గానంబు వేణురావము నిత్యోత్సవముగ విను రాజుల కడ. భార. స్త్రీ. 2. 15.

సొగియు అ. క్రి. సుఖించు, ఆనందపడు.

తే. సురుచిరోక్తులు నాచెవుల్ సొగియc బల్కు కాముకేళిc గైకొని నన్నుc గావు. భా. రా. సుంద. 185.

సీ. రాజ్యలక్ష్మి మందిర ప్రాcగణం బైన, వక్షః స్థలంబున ప్రాలి సొగియ.

గీ. నప్పళించుc దివురు నక్షాడు మదిలోన. కేయూర. 4 9.

కం తగుమగనిc బడసి కౌcగిట, సొగియc గనుట గాదె యంయ కోటికి నధికం, బగు భాగ్యఫలము నాకుం,పుగ నింకెవ్వcడొకో యిట్టి పోcడిమి గలుగున్. హరి. ఉ. 7. 61.

మ. అలపన్నిద్దఱు సూరులందును సముద్యల్లీలcగా వున్న వెగ్గలపుం దాపము బావనా నిజమనఃకం జాత సంజాత పుష్కల మార్ద్వీకఝరిన్ముంరారి సొగియంగాc జొక్కి ధన్యాత్ములౌ, నిలపన్నిద్దఱు సూరులం దలcతు ... అము. 1. 10.

సొచ్చెము వి. పెచ్చు, అధికము.

ఉ. .... ధనేశునిధుల్ తమ యప్పువడ్డికిన్, వచ్చిన సొచ్చె మెంతయును నవ్వదు రవ్వురిలోని కోమటుల్. శశాంక విజయ 2.

సొజ్జి వి. భక్ష్యవిశేషము.

ద్వి. చాcపట్టులును బాయసము సొజ్జి బూరె, లోcపిన వారల కోcపంతకాలది.

ఆ. మ. క, 5. ఆ. 286 పు. 13. పం.

సొజ్జె వి. వేయించిన బియ్యముతోc జేసిన పిండి మొదలగునది.

ఉ. కమ్మని కాలిపు సొజ్జెపిండితో, నొప్పులుగా భుజించిరి బుధోత్తము లాcకటి చిచ్చు పెచ్చువన్. భీమ. 2. 189.

సొజ్జెబూరియ దే. వి. భక్ష్యవిశేషము, బూరె.

సీ. వడలు మండెcగ లుండ్రములును పేణీలును సారెసత్తులు సొజ్జెబూరియలును. బ. ప్రభులింగ. 5. 82.

సొజ్జెబూరె వి. భక్ష్యవిశేషము.

ద్వి. జోరువ నెయిగారు సొజ్జెబూరులును. ప్రభులింగ. 4. అ. 150. పు. 24 పం.

పి. లింగరంబులు పొజ్జెబూరె .... గులునేవ లుక్కెర లరిసెలుc బక్కిలములు. కళా. 7. 81.

సొటసొటలు వి. బ. కార్శ్యము.

సీ. ... గీ. ఇట్టి రాతిరిపూటనే నేమిసేతు, సొట సొటలువోయె నాకట ప్రుక్కె నొడలు, నింట నిల్లాలు బిడ్డలు నెదురుచూతు, రకట నే నిందునుండ నేమగుదురొకొ. సాన దో. 5. అ.

కం. కటపెట తొటతొట రాలెడు, పొటపొట చిను కుల ధరిత్రి పొడవట్టువడన్, సొటసొట నాcకట పోలుచుc, దటతటపడు చాతకముల దైన్యము వాసెన్. వైజ. 2. 146.

2. కారుటయందగు వనుకరణము

కం. నిటలమ్ము లవిసి నెత్తురు సొటసొట వడియంగ సమరభూరోత్తముతై .కీడా. 1. 229.

3. నెత్తురు చింకఁటయం దగు ననుకరణము

సీ. కుటిల నఖంబుల సొటసొట నెత్తురు చింద రక్కసి బొమ్ముఁ జించు కినుక. సిం నారసిం శ. 14.

**సొటసొటలుపోవు** అ. క్రి. (సొటసొట + పోవు) రూ. సొటసొటపోవు. కృశించు, చిక్కు.

సీ. ఈ నిండు వెన్నెల లామచకోరముల్, గనుగంద కున్న వా కంబుకంఠి, యీతూఁడ్ను భుజియించు జాతి యంచలు సొటసొటలు వోకున్నవా శోభనాంగి.

తే. తెలిసి రా మ్మ కలద సందియము చాల, సుకికి పద కవి తెస్సలై యుండెనేని, వజ్రకాయములే యాను వాని కెల్ల, నపుడు విరహులయవధికి నవధి లేదు. విజ. 3. 62.

(ఈ యర్థమున సొటసొటలాడు అనురూపము మిక్కిలి వాడుకలో నున్నది)

తే. ఎంత పాపాత్ము రాలని యింక మీఁద, బ్రహ్మ నిజఫాల ఫలకాక్షరములు గట్టి, పెట్టువట్టులఁ గస్తూరి పట్టు వెట్టి, సొటసొటలుపోవు విన్నపై సొంపు దఱిఁగి. సారంగ 2. 150

**సొట్ట** వి. వంకర.

సీ. లొట్టి పిట్టలకును సొట్టచాల దలంచు గొఱతఁ దెల్పుచు నుండు గూనుమేను. పార్వ. 4 108.

చం. రసములు భుక్తిలోధ్వని విరంగి రవుల్కొనుచో నలంక్రియు,ల్పసిఁడిని గొన్న వేళ యని భావము గల్గిన (దుష్కవుల్కటా, వినుదక సత్ప) బంధములు విప్పను డప్పనుకొందు రా మరా, లసగజగామి నీగతి విలాసము సొట్టని పేరు లాకరే. పార్వ. 1. 8.

2. చెంబు లోనగు వానికి దెబ్బ తగిలినప్పుడు పడు నొక్కు (వ్యవ.) ఆ చెంబునకు నాలుగు సొట్టలున్నవి.

3. రోగాదులవలన దేహమునందు కలుగునొక్కు (వ్యవ) ఉబ్బురోగమునందు నొక్కినచోట నెల్ల సొట్టలు పడును.

**సొట్ట** విశే. రోగాదులచేత నొక్కుపడినది, గుంట పడినది

చం. ... ఇప్పలుకు సిద్ధముగా దని యాడినన్ బ్రకంపనమునకుఁ గేలుసొట్ట యని పల్కుదురే నద లోకు లిద్ధ న్ సిక. 1. 81.

ద్వి. సొట్టైన రత్నంబు జుట్టును బసిఁడి, గట్టిన భావన ... పండితా. దీక్షా. 6. పు.

**సొట్టనలు** వి. పరిహాసములు, వంకరమాటలు.

ఉ. జక్కవ లంచు నొక్క చెలిచన్నుల నొక్క తె పట్ట నాచేతిఁ, గెక్కడఁ బద్దదంచే నల యింతియు నవ్వెలి యారుఁద్రోయ మేల్చొక్క మటంచే నిర్వురికి సొట్టనలాడుచు నొర్తు వారి బల్విక్కలఁ జూచి హా మొసలిపిల్ల లటం చని పాఱు నచ్చటన్. పార్వ. 1. 72.

**సొడసొడ** వి. క్రమ్ముటయం దగు ననుకరణము.

చం. అడిదపు వ్రేటునం బఱియలైన శరీరమునందు నెత్తురుల్, సొడసొడఁ గమ్మఁ నెమ్మనము సొమ్మలు పైకొన. హరి ఉ. 4. 28.

**సొడసొడల్పోవు** స. క్రి. మాఱుకొను, ఎదుర్కొను.

ద్వి. ... అటు ద్విజునిఁ బొమ్మని త్రోవ, సొడ సొడల్ వోవుచు సోలుచు శాకి, బడిపూజ కుండలు బగులదన్నుచును. పండితా. మహిమా. 2. 7?.

**సొద్దు** వి 1. కొఱత, న్యూనత. (శ ర).

చం. వడినరపాలు భోగరతి వావులు నాకుఁ బనేమి యంటి వం,గడమున కెల్ల సొద్దనిడఁగా దటునేనల చిన్నవాఁడ వేఁ,వ్పడితి నటన్నఁ బోవునె స్వభావము సారంగ. 2. 108.

2. ఆటలో నొక వానిమీఁద వేయుదెబ్బ

ఆ. వె. సోమయాజిఁ బట్టి సొద్దువేసెను రంభ, యొంటె సోమయాజి నొంగఁబెట్టె. క్రతువు జేయు ఫలము గల్గెరా చేజేత విశ్వదాభిరామ వినురవేమ. వేమ. 2. 59.

**సొత్తు** వి. సొమ్ము.

ఆ. వె. వేదశాస్త్రములను విన నేమి గుడిచిరి, యరిగి తిరిగి సొత్తు లందరిల్లు, బ్రహ్మమహిమ దెలిసి బ్రతుకుట నిజమయా, విశ్వదాభిరామ వినురవేమ 3. 188.

సొద వి. ...వి (సం. చితా)

ద్వి. సొదనే...డసనంద చోటుకు మాద ద్వి. పారిజా... ఉ. 14.

కం. అని నిశ్చయించి సొదపేర్చి నిజేశున్ సుతులఁ దఁడ్రి జేర్చి హుతాశం, బొనగూర్చి తాను దఱియన్, వనితారూపంబు మాని నాఁడుఁ దగుచున్. వరాహ. 103.

ఆ. వె. దేవి ఱేఁడ మయుఁడు సావును ముదిమియు, గలుగ కుండునట్లుగా నొనర్చె, వట్టులగుటఁ జేసి యకట నీతో సొద, సేరఁబోల దేమి సేయుదావ. ఆ. రా. యుద్ధ. 4. 70.

ద్వి. ఆ సుమిత్రాపుత్రుఁ డతని తల్లియును ఈ సొద విని శోక మెట్లణంచెదరు.

రం. రా అయోధ్యాకాం. 94. పుట. 5 పం.

కం. కృపిముమ్నగ శిష్యులు సొద, యవసవ్యము గాఁగఁ దిరిగి యరిగిరి శోకా, ర్తపు టొడలులతో. భార. స్త్రీ. 2. 124.

కం. సొదపై నుండఁగ వారలు, పదుంద్రుడునుం జూచి దాని భక్షింపంగా. భార. ఆ. 3. 2.210.

కం. కడు నర్మిలిఁ గ్రేపుం జను, గుడుపఁ దొడఁగె నొక్కనుఁభి గురుపా ల్పెరయుం, బడు వక్ష వక్త్రి ఫేనము, సుడిగాలిం దూలిపడియె సొదపై నవఘా భార. శాం. 3. 517.

వ. బగబగవ మండు చిరుఁగు సొద మంటల కడ్డంబు వట్టి. మను. 4. 60.

కం. అని నిశ్చయించి సొద పేర్చి నిజేశున్ సుతులఁ దండ్రిఁ జేర్చి హుతాశం, బొనఁగూర్చి తాను దఱియన్, వనితారూపంబు మాని నాఁడుఁ దగుచున్. వరాహ. 9. 106.

సొదగొను అ. క్రి సొదచొచ్చు?

ద్వి. చోడని దేశంబు సొదగొనఁ జొచ్చె, చోడండు చెఱుపంగఁ జూచె నిప్పురము. పండితా. మహిమా. 256.

సొద్దెము విశ. ఆశ్చర్యకరమైనది.

ఉ. సొద్దెపుఁదేఁటి ఱెక్క కొన సోఁకులచే దవళించు తమ్మిపూ, ముద్దెడ మామి సద్దర మోదఁగు నేఁజయు గల్వకీడిమున్ గద్దువలాడు పూబొమిడి కంబు దలిర్చి. ప్రబం. 1. 514.

సొన వి. నూఁగు.

తే. జాఱునలరుల తేనియ గార యుచ్చి, గాడ్పు సంధించునయ కాని యూర్పు వెలచు, నెందు నయ్యోక విరితోఁట నింద ముఖుల, నగవు నును మంచు సొనవోలె నయము దఱుగ. పాండురంగ. 5. 295.

2. ఆకులు మొదలగు వాని నుండి వచ్చు ద్రవము. సీ. సొనదేఱ పొటమరించి నెఱెవాసిన యట్టి యాకురాలుపు గండ్లయందుఁ దొలఁగి. సొన దేఱు.

అ. క్రి సొవస్రవించు. మను. 6. 27,

సొనచిక్కుఁడు వి. ఉలవకాయ వంటి కాయలు గల ఒకచెట్టు.

సొనారి వి. కంసాలి.

సీ. సాదాపని మెఱుంగుజాడఁ గాంచు సొనారి కుందనంబున మణుల్ గూర్చఁగలఁడె. రామ. 4. 86.

సొన్నము వి. (సం. సువర్ణము) 1. మాడ, అరవరహా కం. జాలెలఁ బట్టింపుము పది,వేలు నయును వేలు రెండువేలు నరయు సొ,న్నాలరి కుంతలునకు మన, యేలిక తన్మంత్రి యతని యింటికిఁ బనుపన్. జై. భా. 8. 54.

సీ. ... వన్నెమి...చినవాఁడు సొన్నంపుఁ బడి యాలు నన్నె మిం చిన వరెవాటువాఁడు . దశా. 9. 171.

2. బంగారము.

ఉ. సొన్నపు సన్నచేలఁ గటి జుట్టి కిరిటము మౌళిఁ దాల్చిరే, మన్ని...తోడఁ...ట్లు పెను మానిక మక్కునఁ జేర్చవచ్చి చెంత న్నిలిచెన్ దయాంబ మెదం బొదువన్ యగువ...గ్రహ, రాన్నిధి పూర్ణిమా విశదంత్మి దటిన్మి చాయవత్నిఁదై. విజ. 2. 84.

(వృత్తియందు దీనికి మువర్ణమునకు దీర్ఘమును నగును. ఉదా : సొన్నాటంకము)

సొన్నా వై. వి. సొన్న (సం. స్వర్ణ) బంగారము.

వ. అత్తలోదరి తనమగని చేతికి నొక్క సొన్నా టంకం బిచ్చి యిప్పట్టణంబున నాహారం బడిగి, తెమ్మనుటయు విక్ర. 6. 100;

కం. అన్నరపతి తగులాగువ, వన్నగరము చొచ్చి యెల్లయంగళ్ళందున్, సొన్నాటంకం బిచ్చెవ, నన్న మిడెడు వాడు గలరె యని యడుగు తఱిన్. విక్ర. 6. 101.

సొన్నారి వి. (సం. సువర్ణకారుఁడు. హిం, సోనార్) సువర్ణ శబ్దవికృతి (సొన్నము + అరి), బంగారపుపని చేయువాఁడు. అగసాలెవాఁడు, స్వర్ణకారుఁడు.

గీ. వాని పిలుపువాఁడు వరరత్న భూషణ, వ్రజము బూను శెల్లివాఁడు రత్న, శుద్ధి యెఱిఁగి యెఱుఁగు సొన్నారి కపటంబు, గాన వానిఁ దాల్తు వాని యొద్ద. కేయూర. 2. 61.

కం. మునొక్క పట్టణంబున, సొన్నారి మిటారి నేర్పుశూరత్వము గై, కొన్నదియై నడచిన కథ చెన్నుగ విని పొమ్ము కడువిచిత్రము కొమ్మా హంస. 2. 177.

మ. .... కావించు సిద్ధాంకమున్ గన్పడన్, జత సొన్నారి బెడంగువన్ దనరె వర్షావేళ విన్నంగడిన్. చంద్రాంగ 1. 11.

సొన్నలాపురి వి. ఒకానొక గ్రామము

ఉ. ఆ విధ మానతీవలయు నన్నఁ గటంబులు మోడ్చి పల్కె నో ధీవరులార తత్క్రమము దెల్పెద నెప్పుడు సొన్నసాపురిం దా విహరించు ముద్దయ యనన్ భవపాదపయోజభక్తుఁ డా, పావనుఁ డిలనిం గనియె భర్గజయాప్తి శుభాంగియందువన్. చెన్నబ. 3. 29.

సొబగారు స. క్రి. సొంపొందు, సొగసును వహించు.

కం. సొబగారు విశ్వభూవరు, ప్రబల జయశ్రీలఁ జూడఁ బఱతెంచు తఱిన్, గబరీకుచజఘనంబుల, నిబిడిత వసియాడెఁ బురము నెలఁతల నడుముల్. కావ్యా. 1. 82.

సొబగు వి (సం. సుభగః) చక్కఁదనము.

ఉ. వాసవిరూప చిహ్నములు వార్తలు మున్ విని యుండుదుం గదా, యాసొబగెల్ల నేఁడు గన నయ్యెను వీరల యందునైన స, న్న్యాస మసంగతం బగు. విజ. 2. 169.

సీ. మఱచితప్పియు నన్యమహిమ విమర్శింపఁ జూడ వీవన్యుని సొబగు వేడ్క. కళా. 4. 129.

వ. అరవిందమందిరకుం బుట్టినింటి సొబగుచూపి. మను. 3. 28.

సీ. రమణీయ సిందూరజము సొబగు. కాశీ. 7. 75.

ఉ. ... ఆ, వ్యాదృత రాంగిమూర్తి సొబగెల్ల నొకం తగఁ జూచు నాత్మలోన్. ప్రభా. 2. 109.

సీ. వగి తటాలున నెదురైనఁ దొరయు సిగ్గునఁ దల వాంచి కన్నొనలఁ జూచుఁ జూచి రాకొమరుని సొబగు భ్రమసి మాటిమాటికి వలవు నెమ్మదిని నిలుపు. విజయ నం వి 2. 8.

సీ. లలిత కస్తూరికాతిలక మధ్యంబున సొబగొందు ముత్యాలచుక్క నిలిపి. శృ. నై. 28.

సీ. మకరంద నిష్యంద మందార మాలిక కబరీభరంబున సొబగు మీఱ. విక్ర. 1. 8.

కం. గానము సొబగుఁ బోనై, తేనెలరానై, సరస్వతీకర వీణా, తానపుఁ జక్కి యమృత వి, తానము తానై తగును సుదతిగూడన్. రాజవాహన. 4. 108.

మ....జిగిసెమ్మోని సొబంగు వింతయయి భాసిల్లఁ గ నెల్లప్పుడున్, దగుదుగ్ధాబ్ధితనూజ మాకొసఁగు గాతన్ నిత్యకల్యాణముల్. ప్రద్యుమ్న చరిత్రము. 1. 2.

సీ. వీని చెవ్వము వార్త విన్నఁ దయంబున వ్రీహి గర్భంబులు విరియకున్నె

గీ. సోయగముచేత బటువైన సొబగుచేత, బోల్ప నొండొంటిఁ దమలోనఁ బోలుఁగాక, వీని కుపమాన ముండునే వేఱ యనుచు, విభుని జంఘలఁ బొగడి రవ్విబుధవరులు. కవి. 5. 154.

ఉ. కొమ్మ మెఱుఁగుఁ జన్నుఁగవ క్రొత్త లభిన్నము లైన యాత్మకుం, భమ్ములఁ జూచి యాచవి సొబంగు తొడల్ దొడఁగెన్ వగర్పు హ, స్తమ్ములఁ జూచి తన్మృదుపదంబులు పృష్ఠమూన వ్రాలుచా, గమ్ములఁ ద్రోవ బాల గజగామిని యన్ బిరుదంబు గైకొనెన్. కృ శకుం. 2. 16.

2. (సం. శోభ) ఒప్పిదము.

సీ. .. ఘన భర్తృహరి శతకత్రయంబునఁ బ్రతి శ్లోకంబునను వింతఁజూపు సొబగు...దశా. 1. 43

సీ. రత్నంపుఁ జిలుకలు రాయంచప్రతిమలు, పసిడి పువ్వులవ్రాత పనుల సొబగు. కళా. 2. 15

కం. సుబలతనయ గుణమహిమన్, బ్రబలిన తన కులాచారధర్మపాలనలీలన్. సొబగొంది వన్నెఁదేఁగా, విబుధస్తుతుఁ డవ్విభుండు వెలసెన్ ధరణిన్. రాఘ.

(భారతార్థమున:- సౌభాగ్యము, సుమంగళియగుట, రామాయణార్థమున ఒప్పిదము రెండర్థములందును సరిగా - సొబగొంది = ఒప్పినదై అని వ్యాఖ్యానము )

3. సౌభాగ్యము.

వ. శాంతి - సొబగు. కాశీ. 3. 185.

4. విధము, శోభ.

వ. మానధనుల చరిత్రంబు సొబగున నకల్మష జీవనంబై భాగ. 10 స్కం. పూర్వ 765.

వ. బ్రహ్మలయందు భృగువు సొబగున సిద్ధులయందుఁ గపిలునిలీల భాగ. 12 స్కం. 48.

సొబగు విశే సుందరము.

సీ. హరినీలముల చాయ నడిగొళమ్ముల సొబగుగాఁ, కన్నిటిసోన గురియ. హర. 3. 92.

సొబగుఁడు వై వి. 1. చక్కనివాఁడు, (ప్రకృ. సుభగః) అందగాఁడు.

సీ. స్వర్గార్థి...దీనిఁ దగిలించి తగులక తాన ధైర్యవంతుఁడై యున్న సొబగుఁ డెవ్వండొ జగతి. కుమా. సం. 7. 846.

ద్వి. చుంబనసిద్ధికై సొబగుఁడు మఱియు, మానిని తోడ నవాక్షాత్మరసగోచరానంద మొంది యొయ్యన యనివార్య కేళులఁ దెలిఁ గఱఁగించి తా గఱఁగి. మృత్యుంజయ 3. 86.

తే. పద్మకోశాభినయహస్తపల్లవంబుఁ జూపె నొకమచ్చెకంటికి సొబగుఁ డొకఁడు. శృం. నై. 6. 135.

2 విటుఁడు, పల్లవుఁడు.

మ. బలియుండా సొబగుండు భావభవదర్పభ్రాంతుడై వచ్చి. భార. విరా. 2. 281.

సొబగుఁడు విశే. చక్కనివాఁడు, రూపరి, అందగాఁడు

కం. వామాక్షి నీకుఁ గుశలమె, నీ మన సెవ్వారి యందు నిత్యప్రేమ, పై మెఱయునట్టి సొబగులు, నీ వగలేవురకు నిపుడు నెమ్మదియె మదిన్. భార. విరా. 6. 120.

సీ. వీఁడె గోవిందవివిఁశతి యీతండు సొబగుండు మెలఁతలు సుట్టునెప్పుడు. భార. స్త్రీ. 2. 69.

సొబగుమించు అ. క్రి. శోభిల్లు.

సీ. వింజామటీవని విగళత్కదంబ ప్రసూన ప క్తుల తోడ సొబగు మించి.

గీ. విమల కైవల్యపదము శ్రీ విష్ణుపదము. ఇందు. 1. 45.

సొబగుమీఱు ఒప్పు

సీ. మకరందనిష్యంద మందారమాలిక కబరీభరంబున సొబగుమీఱ. విక్ర. 1. 8.

సొబగులాడి వి. అందగత్తె, స్త్రీ

తే. గీ. పూన్చె మణిభూషణము లొప్పఁ బువ్వుఁబోఁడి, చూపె ముకురంబు సతి కొక్క సొబగులాడి. చంపూరా. 3. 115.

సొబసు వి. బడబచూలు. అం. భా. (శ. ర.)

సొమరు దే. అ. క్రి. వికాసము తప్పు, వెలవెలఁ బాఱు.

తే గీ. పుడికివైచిన మవ్వంపుఁ బొఱయపోలె, వాడి సొమరుచు మేఁదీగ వంది కంది ... కుమా. సం. 6. 660.

**సొమ్మ** వి. మూర్ఛ.

కం... అత్తులువ మొరపాలుచే గ్రక్కున యుని దొక బొడిచి సొమ్మపాలుగఁ జేసెన్ అ. రా. యుద్ధ. 283.

చం. అడిదము వ్రేటునం బఱియలైన శరీరము నందు నెత్తురుల్, పొడసూడఁ గ్రమ్మ నెమ్మనము సొమ్ములు వైకొన మూర్ఛ లొక్కటై, నిడుగలు గాఁగఁ బ్రాణములు నిల్వక తల్లడిలంగ. హరి ఉ. 4. 28.

**సొమ్మగొను** అ. క్రి. మూర్ఛిల్లు.

కం. నొప్పివడి వాఁడు దద్దయు, నుప్పర మద్రువంగ నార్చి యొక వాలుందూ, పప్పాలము ద్రిమ్మరి పయిన్, గుప్పున వడరింప సొమ్మగొని యుండునెడన్. అ. రా. యుద్ధ. 191.

**సొమ్మఁబోవు** అ. క్రి. (సొమ్మ + పోవు) సొమ్మసిల్లు, మూర్ఛనొందు.

చం. వెదకితి మెల్లచోటఁ బృథివీసుతఁ గానము యింక నేమిసేయుదు మని సొమ్మఁబోవు మఱి యొయ్యనఁ దేఱు విషాదమొందు. భా. రా. అర. 2, 801.

**సొమ్మల** వి. సొమ్మసిలుట.

కం. అవయవము నెవ్వనమునఁ బాయుచు సొమ్మల పేరు మూర్ఛయనఁగాఁ బరగున్, దనరెడు నింద్రియ గుణవర్తన వైకల్యమున నెఱుఁగఁ దగుఁ దత్‌జ్ఞులకున్. కా-వ్యా. 2. ఉల్లా. 82 వ.

**సొమ్మలఁబోవు** దే. అ. క్రి. మూర్ఛిల్లు.

పతిసొమ్మలఁ బోయె రథోపరిస్థలిన్. దశకు. 2. 86.

**సొమ్ములువోవు** అ. క్రి. (సొమ్ములు + వోవు) రూ. సొమ్మవోవు. మూర్ఛిల్లు.

వ. కుఱియు వానజల్లు వెల్లుగ నిమ్మలుగాని సొమ్ములు వోయి గోకులం బాకులం బయి. భాగ. 2. 186.

వ. విద్యుల్లతా విలోకంబున రిమ్మలు గొని సొమ్ములు వోవుచున్న తేఁకలు భాగ. 10 స్కం. పూర్వ. 804

ఉ ఉమ్మలికమ్మువన్ బాసి యుస్సురి మెల్లన వ్రాలెఁ బాన్పుపై... సొమ్ములు వోవుటన్ సఖులు చూచి భయంపడఁ గాసువడనన్. కుమా. సం. 5. 632.

సీ. కడుఁ దెక్కుపోటులఁ బడి రక్తమిమ్ముగా వడిసి సొమ్ములు వోయి వ్రాలుచోట... కుమా. సం. సం. 11. 702.

చం. హలధరుఁ డేసె హంసు బదియమ్ముల నైదిట నేసె హంసుఁ డాహలధరు నాతఁ డాశరము లైదిట నైదిట నాఁగి రేఁగి మొక్కలమున నాంసం బొకటిగాఁడఁగ వానిలలాట మేయుచున్, సొలసి యతండు తేరిపయి సొమ్ములువోయె నచేతన స్థితిన్. ఉ. హరి. 4. 242.

ఉ. ... గాఢతరక్షతిఁ దూలి నేలపై, జానులు మోపి మాగధుఁడు సత్త్వమఱంబడి సొమ్మవోయినన్. హరి. ఉ. 1. 198.

వ. తన కొడుకుల గెలుపున నాసమాలుటుం జేసి ఆ॥ సొమ్మువోయి పడిన సుదతు లాక్రందన, రవము తోడ సత్వరముగ నెత్తి, యా నృపాలు సెజ్జయందిడి మెలపున, శిశిరవిధులు సేయ సేదదేఱి. భార. ద్రోణ. 1. 95.

కం. ఒలుఁడు గదఁ బూన్చి ధ్రువుఁ నడు, తలవైచిన సొమ్మవోయి తక్షణమాత్రన్, దెలిసి. హరి. ఉ. 10. 62.

వ. భీషణశక్తి వైచిన నొడిసిపట్టి మగుడఁ దద్వక్షుంబు లక్ష్యంబుగా వైచిన నప్పాటున నమ్మేటి మగండు సొమ్మవోయి తేరి పయిఁ బడినంగని. హరి. ఉ. 6. 181.

తే. పొదవి నిడు వాలుగొమ్మునఁ బొడిచి యెత్తి, ధరణిపై వైచి వెసపట్టి ఖురపుటములఁ, జిమ్మి టయు డవ్వగాఁ దూలి సొమ్మవోయిం పడియె నాతఁడు చూపఱు భయము నొంద. హరి. పూర్వ. 6. 150.

చం. అలులకు నుల్కు ... నిండు వెన్నెలఁ గని

సొమ్మవోవు ధ శిథనందన కామువేదనన్ కుమా. సం. ౧. ౬౭౩.

తే. గీ. అనుచుఁ గడలేని మక్కువ వఱచి యఱచి సైఁపఁజాలక యా రాచచలి వెలుఁగు, నేలఁబడి సొమ్మవోయి జేజేల ప్రోలి, కేఁగెనట రాముఁడును ద్రోవ నేఁగి యేఁగి. అ. రా. అయోధ్యా. ౯౯.

సొమ్మసిల్లు అ. క్రి రూ. సొమ్మసిలు, మూర్ఛిల్లు.

మ. అనిశం గాలినకూలము ల్పైవులలో నఁటించి వత్తైన నూఁదిన పెందిమ్మన సొమ్మసిల్లి మఁగుడ న్వైతేరి. సారంగ 2. ౯౯.

సీ. మాకుఁ జూడఁగ సొమ్మసిలి పడ్డదిగాని, తెగ టారఁ జచ్చుట తెలియరాదు, కావున నీపాతకం బసివోవ జాహ్నవిఁ దెచ్చుటకుఁ బ్రయత్నంబు నీవు చేయుము. వరాహ 10. 45.

తే. గీ. అనుమఁ దవ తొంటిరూపుఁ జూపివ పడంకి, యన్నుతలమిన్న బెబ్బులిఁ గన్న లేడి, జోటియుం బోలె నేలపై సొమ్మసిలినఁ, జూచి యభ్యేరజపు రక్కసుండు వేగ. అ. రా. అరణ్య. 6. 1.

చం... దానవవీరుఁ డస్రధారలు దొరఁగంగ సొమ్మసిలి రౌద్రరసం బొదవంగఁ దేజి. భా. రా. యుద్ధ. 1750.

చం. జడిసిన చిల్వగుంపు నొకసారియు మ్రింగమి సొమ్మసిల్లి ప్రమత్తపడనగుజాని నొల్లని దకాయని కిన్. శుక. ౨. 4౫8.

"డిల్లవడి మెల్లన సొమ్మసిల్లిన" నీలా. ౩. ౩౨.

వ. ఆరామ .... సొమ్మసిలం బోయి లేచి వసం తునిం గనుంగొని. హర. ౩. ౯౩.

"అటుకుఁ జిడిముడిపడు సొమ్మసిలు దటమ్ము లేక కన్నీరు నించు. నీలా. ౨. 85.

తే. గీ. మోదమున నైదు తూపుల పాదుపాదు, తమ్మిదోరుమ్మిఁగొంది డెందమ్ము గుమ్మి, క్రమ్ము కొని దొమ్మి సేసిన సొమ్మసిల్లి, యమ్మహామహుఁ డిట్లను నెమ్మనమున. ఉ. రా. 7. 456.

ఉ. క్రౌంచ విభేదశాలి యగుస్కందుని చందముఁ జెంది ముందెన, క్రౌంచరరాజు పేరురము గాడఁగ ముద్గరమెత్తి వ్రేసి నొప్పించిన సొమ్మసిల్లి ధృతి పెంపునఁ దెప్పిటి వాఁడు రాజ నివ్వంచెద నేఁడు దండికదకం చతిరోషకషాయితాత్ముఁడై. ఉ. రా. 4. ౮7.

సొమ్ము వి 1. ద్రవ్యము, ధనము.

ఎ. గీ. కురుకుమారుల నరి ప్రమింగి నకు మొదల, సొమ్మునకు నాసపడఁ దగ దమ్మ వారి, పాలు వారలతోఁగూడి బ్రదుకు మనుము. భార. ఉద్యో. 1, 37౮.

సీ. అవనీశ త్రిదశేంద్రుచూపు బరికన్యాగండ పాళిన్వయియా, నవలావణ్యాంసంబుఁ గొల్లగొని యంతం జెంత పాలవు రాజు విలోకించి చలించి కైకొనిన యా సొమ్మెల్ల ఘర్మాంబుకైతవ మొప్పన్ వెసడించి తూఱఁ గవరీ తాపించకుంజాం తమున్. మను. 5. 8౩.

వ. ... దక్కె సొమ్మని ... అము. 4. 35.

గీ. జెరిసి చేఁదప్పిపడ్డ సొమ్మనినట్లు. హర. 2.44.

"ఎఱమి వల్వలును సొమ్ములు నొసఁగు" నీలా. 1. 4౯.

సీ పరుల సొమ్ముల కాసపడెడు వారు. శృ. నై. 7. 5౨.

ఉ ... నీ, సొమ్మది యెంత యంతయును. విశకు. 5, 62.

తే. సొమ్ము గోరిన యంతన సుఖముగలుగ, దది యు పార్జింపఁగా సిద్ధియగుట నిజమె, కలిగెనేని యనేక చింతల నొనర్పు. భార. శాం. 4. 47.

2 ఆభరణ వస్తువు, సొక్కు.

సీ. అత్యద్భుతములైన యిమ్ముల సొమ్ములు కుటిల మార్గమునఁ గైకొనఁగ వచ్చు. విక్ర. 4 11౩.

కం. రమ్మనుమా తమ్మునిఁ దన, సొమ్మును మా లంక. ఉ. రా. ౨. ౨4౨.

ఆ. వె. అతఁడు వీర్యశుల్క యగు రాజసుత నట్లు దవదు, సొమ్ముఁ జేసికొని భృశప్రకాశితాస్య, వంతుఁడై శోభిలెను మామక సదృశ ప్రమోద మావహిల్ల. రాఘ. 2. 57.

సీ. తెలితే యిదియేమి యొకరి సొమ్మో. పారి. 4. 58. (సొక్కు)

ఉ....కొమ్మ సీ, సొమ్మని వజ్రమిచ్చి మధుసూదనుఁ డాలకు సీ దలంచినన్. పారి. 5. 59.

తే. అస్త్ర వీర్యంబుఁ జెలిచె నట్లగుట వీఁడు, పొద్దు మార్కొని మానంబుఁ బ్రాణముఁ గొను, దనకు సొమ్ముగ దక్కించుకొనగ లేమి, యెల్లవారికి నెంతయుఁ దెల్ల మధిప. భార. ఉద్యో. 4. 234.

ఉ. ఏకడ సర్వభూత దయయే తమ సొమ్ముగ దీన మానస వ్యాకులతాపనోదన ధనాఢ్యులనన్ విల సిల్లి రేవురన్ పాండురంగ. 4. 265.

కం. వినినంతఁ బెన్నిధానముఁ, గనుఁగొన్న దరిద్రుఁ బోలి ఘనుఁ డాజయకే, తనుఁ దలతలో దరియుటి, తన సొమ్మని తలఁచి యతులిత త్వరమతియై. శుక. 1. 230.

కం భండారముతో హాయమద శుండాల ఘటాళి దనదు సొమ్మై. ఆము. 4. 237.

ఉ. ఎమ్మెలు చెప్పనేల జగ మెన్నఁగఁ బన్నగ రాజశాయికిన్, సొమ్ముగ వాక్యసంపదలు సూఱలు నేసిన వాని. భాగ. 6. 12.

3. ఆభరణము; తొడవు.

సీ మణుల సొమ్ములు మేన మట్టు పఱచి మను. 6. 5.

ఉ వేల పుష్పమాని పూవు గ జేసిన సొమ్ముఁ లంక ములఁ బేర్చి సధూసరణి నాదరించుచున్. పారి 5. 42.

ద్వి నా సొమ్ములను నీవు నగచరాధీశ, నీసొమ్ము లని చూడు నీదుచిత్తమున. రం రా. ఉ కాం. 4ు పు. 27. పం.

వ. నన మేళగాండ్ర నాలోకించి యిబ్బాలికలు మన వాలకపు సొమ్ము లందు నేమేనియు నపహరించుటకు నట్టాడుచున్న వారు మీర రొమ్ముచ్చు నెచ్చరిక గనిపట్టుకొని యుండుఁ డనుటయు. ప్రభా. 1. 107.

కం నుఱుయానిల సంగతిఁ జూతలతిక లంకూర జాలదోహ్వానమునై, యబయి సడలించిన సొమ్ములనై పడిఁ బాండు పత్రములు వెసఁజాఱెన్. పార. 3. 47.

ఆ. వె న రియెక్క గిత్త నాకులు సొమ్ములు, చేదు మెడను బునుక చెరుబాది, నుదుట సరలు గొన్నరదు రాక లెదఁగల్లు,నయ్య యొరపు దెలుప నలవియగునె. చెన్నబ 5. 29.

ద్వి. సూర్యుండు ధరియించి సుమతి భజించి, సూర్యాశ్వ మని దనసొమ్ముగాఁ బడసె. పండితా. దీక్షా. 19, పుట.

చం సొరిది విచిత్రచిత్రముగ సొమ్ములు నేయ నతఁడు నేరిచెన్ హంస. 2. 182.

ఉ కాలకళావమాళి దినకాంతి వాసంతికలోన యామినీ-బాలకు సొమ్ము సేయుటకు భాస్కరుఁ డన్ కనకంబు గ్రాఁచి కల్గో వతివరాంతరము లోనిడఁ దోఁచిన ధూమ పుంజమో, జాలము పర్వె చాలవలచాడ్పునఁ దాఁలు వొల్పె నెంత యున్. హంస. 1. 117.

ఉ. పెంచిన మైత్రిఁ బద్మినుల కెల్లి ఘనాత్మయ కాఁకుండు సొమ్మచ్చ పడంగఁ జేయుటకునై... ఉష. 4. 145.

గీ. చిలువ సొమ్ములు విశనాడి చెలువు మెఱయ, లలిత నవరత్న భూషణంబులు ధరించి. జాహ్నవీ. 0. 18.

4. గోధనము, ఆభరణము.

సీ. దొడ్డిపట్టుల గొప్పనొంసాముల' యొడళ్ళ సొమ్ములు, సొమ్ములు సొంపు నెఱప.
(ఇది రెండర్థములకు నుదాహరణము). శ. ర. అచ్చు బాల. కాం.

5. అలంకారము.

ఆ. గీ కడలిఁ బొడమిన సిగ్గు చొక్కంపు గెంపు. సొమ్మునాఁడు నెమలి కుంచె సొమ్మువాఁడు. రాజ వాహన. 1. 71.

వ. వగ లొలుకు భాగధగ్యపు. జిగి గుల్కెడు నుబ్బి

గడ. సొరిది మధువృష్టి వంజులకములఁ దిలక
ములఁ గురిసెఁ జెదరుచు దేంట్లకులకముల జలక
ముల. రాఘ. 2. 6.

. వరుస, పంక్తి.

మ. సొరిదిం జేర్చినతీఁగ మల్లియలు. ఆము.
1 66.

తే గీ సొరిదిఁ గనుపట్టి హేమకుడ్మలు సెలంగఁ,
బొడపుకత మవ సూక్ష్మమై పొల్చుఁజూడఁ, బట్టి
ణము కోటకొమ్మలపంక్తి గగన, మండల శ్రీకి
సంపఁగిదండవోలె. ఆము. 2. 5.

మ. ధర కెంధూళులు కృష్ణరాయల చమూధాటీ
గతిన్ వింధ్యగ,హ్వరముల్ దూఱఁగఁ జూచి శార
చటఁ,గాఁపై యుండుటం జాల వచ్చెరువై యొట్టని
వింతచీకటులు వచ్చెం జూడరే యందు వే,సొరిదిం
జొతురు వీఁరుద్రగజరాట్పుద్ధాంతముగ్ధాంగనల్
మను. 1. 33.

3. శీఘ్రము

తే. గీ. చోద్య మప్పుడు భవరోగవైద్యుఁ డైన,
యంబుజోదరు డాసిన యంతమాత్ర, నపగతా
సాధ్యగదుఁ డయ్యె యతభర్త, సొరిది రుద్రులు
నిర్ముక్త శూలురైరి. పారి 5. 11.

4. యుక్తముగా,

తే. మరుని నాళీకసాయకోత్కరము కరము,
ధరముఁ దర మిడి మెరముశే యరిదిసొరిది,
మరిదినవి మెట్లు తెగఁగోయ మరునదీర్ఘు,రంబుల
జనింపవో శతారములు గావొ వసు. 2. 115.

సొరిదోఁకి విశ. క్రూరుఁడు, దుర్మార్గుఁడు, దురా
చారుఁడు (శ. ర.)

సీ. (చెలికత్తె చిత్రపటము చూపి) సుదతి నీమది
లోని సొరిదోఁకి మదనుండు తన కొండు చోటంకఁ
దడవుఁగాక, కాంత నీపలుకులు గరజాణ చిలుకల
వెదకి నాలుకముల్లు విఱుచుగాక. ఉ. హరి.
5. 141.

సొరుగు అ. క్రి. మూర్ఛిల్లు.

తే. గీ. (పర్వ) పుట్టలను దిట్టలను కెట్ల బొట్ల

గట్ల, వంకలను డొంకలను బీళ్లఁ బాళ్ళ జాళ్ళఁ,
గుప్పలను దిప్పలను మళ్ళ గుళ్ళ నూళ్ళ, దిరిగి
యాహార మందక సొంగి యరిగి. హంస. 1. 189.

వ అని పలికి యశరీరవాణి యరుగ వెఱఁగుపడి
రాకొమరుండు పైఁబైఁ బెరుగుసొరుగువన్ ధరం
బడి పొరలి మొఱ లిడుచుండె. సారంగ. 3. 174.

కం. మది సిగ్గు వెలికి ద్రోయఁగ, మదనుఁడు మధు
రసము నించి మఱిపాతగలం, గదలింప నూఁగు
పోలిక, సుదతికి మధుసేవఁ దనువు సొరుగఁగఁ
బొచ్చెన్. కవి. 4. 159.

సీ. పొగసె దిక్కులు మొకంబుల యంగములు
పెల్లె సొరిగెఁ బిట్టలు చెడఁదిరిగె మరుఁడు.
(గ్రీష్మవర్ణనము) చంద్రాంగ. 2. 24.

కం అతను శరహతుల సొరిగెను, సతి విరహాతప
స్సమాధిజనితవ్రత యై. నరసభూ. 3. 81.

వ. మరుమరీచిపీచికల దిరిగి తిరిగి సొరిగి హరిణాం
కోపలఫలకకులకలితాలవాల జాలమ్ముల నిండిన
పజ్జ నలరుగొజ్జఁగితీవల నీరుఁ గొంతసేపు ద్రావుచు.
అచలా. 2. 71.

తే. గీ. దరికొని వహించునక్కాఁకఁ దాళలేక,
తెంలి మృగములు మృగతృష్ణకరిగి సొరుగు, మండు
వేసవిఁ బంచాగ్నిమధ్యమునను, గుంభకర్ణుఁడు
గావించె ఘోరతపము. ఉ. రా. 2 161.

మ. అనినన్ జిత్తము జల్లనన్ సొరుగు నయ్యం
భోజపత్రాక్షి లోఁ,చనగోళంబులఁ జిమ్మలై
చిలుపలై జాలై తరంగంబులై, చనుదోయిన్
గొనబౌ కురంగమదచర్చల్ జొఁచిపో నొక్క
యొ,డ్డున బాష్పాంబుఝరంబు లుప్పతిలెఁ
బోటుంబాటుగా నెంతయున్. మను. 3. 186.

తే. గీ. ఏ సుఖము నింక నేలని యెంచి యెంచి,
నేత్రముల శోకబాష్పముల్ నించి నించి, సొరిగి
పలుమాఱుఁ బాన్పుపై వ్రాఁఱిగి యొఱిగి, యలియు
విభుఁ జూచి లక్ష్మణుం డార్తుఁ డగుచు. ఉ. రా.
6. 344.

సొరుగువోవు అ. క్రి. మూర్ఛపోవు.

శా. నిమ్నన్ మించిరి సైన్యముల్ సొరుగుపోనీ దీన నా కేమియున్, విన్నంబాటు ఘటింపనేరదు. పి. శకుం. 3 132.

**సొరువు** వి సొరుగు. ఎండిన (యాకు', అట్టి సొరుగు

**సొఅ** వి తుంబి, అసుగు (వ్య. వి.)

**సొఅపుంగాయ** వి (సొఅము + కాయ) తుంబి, అనుగవుఁగాయ.

వ. కడ బున ధరియించిన యా సొఅపుంగాయ లోని ఖస్మ విచ్చిన. హరి. 1. 29

**సొజ్జ** = సొఅ

స ... చివిక కంపలఁ గాచిన వెట్టి సొజ్జుతీపలు.... పంచ.

**సొలచు** అ క్రి. 1 తగ్గు

కం తలయాగతి నెవలియై, సొలవక నెత్తురులు గ్రక్కుచును దైవముతోఁ, బోలుపటిన కాశి యాహిని, తెలుచన నొక్కట వెలితి పీనుగుఁ జేసెన్ వి పు. ... 6.

2 విజృంభించు, చెలరేఁగు

కం అమరారి శిఖిముఖపాళి, సుమనోగణ దర్పమణగె సొలవక .. కు. సం 10. 905.

3 వైముఖ్యము నొందు.

సీ. సొలవకు మదిగొనవచ్చునటన్నఁ బోలివాఁడిటు వచ్చి యెంత రాకెంత యనుచు కువల. 5. 39.

**సొలపు** విశ. పరవశత కలుగనది.

మ సొలపుంజూపులు తెక్కు జేడినలటంచున్ ఒట్టన కించి ... దశా. 3 64.

వి పారవశ్యము.

ద్వి పొలుపులై సొలపులై పూవిల్తువా మెలుపులై వలపులై మించు పాదములు. ద్వి. పరమ 3 188. పొ

గీ. వారచొక్కులు బెక్కులు వారి వగలు, వారి వన్నెలు చిన్నెలు వారి నవ్వులు,........ వారి వలపులు సొలపులు వశమె పొగడ ఉ. రా. 6. 166.

గీ. సొలపు వలపును గొలుపు నిచ్చలపుఁ దెలుపు, వగపు మల్లెల కొక్క వింతనయము దెలుపఁ, గోడె కాంద్రకు విరులమ్ము కొందు రెపుడు, పువ్వుల మ్మెడి ప్రోడ లాప్రోలిలోన యయా. 1 12.

2. శ్రమ. బడలిక.

ద్వి నిలిచెదర మిచ్చోట నీసమీపమున, సొలపు దీఱఁగ మునిసుతులతోఁగూడి ద్వి. హరిశ్చ. పూ 1806.

ద్వి. ఇవియన్ని యేటికి నీ శిశువుడు, శివిరి విప్రుఁడు గాక తిరిగెడు వాఁడు, సొలపు దీఱఁగ వసిష్ఠుని యింటఁగుడిచి, తొలఁగిపోవుచు నెన్ని దొసఁగులు నేసె. ద్వి. హరిశ్చ. ఉత్త 446.

మూర్ఛ

ఁగడ. మితిలేక పరగెంతి మెలపులను సొలపులను, నతివ లెంతయు మఱచి రలపులును సొలపులును. రాఘవ. 2. 6.

+ దీనభావము.

చం. చిత్రగృహంబున నుండి పోవుచున్, సొలపున నీవు నన్మరలిమాడఁ ద్రిశుద్ధిగ నేలితంచు నే వలంతిఁగాని భావజుని కగ్గము సేయు చెలుంగ భామిని వసు. 4. 64.

5. పంక్తి.

చం తెలిమగజాల కంబములఁ దీటిన బంగరు కీలుబొమ్మగుఁ, పులకు మెఱుంగుఁ గొప్పు సొలపుల్ మొలిపించెదు కప్పురాలలో, పలఁగల కల్వచప్పరపు వన్నెలఁ జెన్నగు నొక్క మేడలో. ఉ రా. 1. 317.

లయవిశాతి .. వెమ్మె, యలపులకుఁ జాదిపపు సొలపులకుఁ గ్రమ్ముకొను తలఁపులకు ముమ్మరపు వలపులకుఁ జెల్వై, న్నెలలకును గొమ్మగను కలలకును జెతఁదగు మలలకును గోర్కులను వలలకును లోగున్ యయా 5. 104.

6. విధము.

వ. మరుని మెఱుఁగమ్ములు తమకు హస్తగతమ్ములై యున్నవని తెలుపు సొలపువఁ గనకవుండ

రిః శాండంబులందోని బంగరు కోలలు కేలం బూని. ల. వి. 1. 74.

సీ. నగవు వెన్నెలజాలు మగఱాలపిడివాలు సొగసు సొమ్ములడాలు సొలపువెలయ. చెన్న. 4. 264.

7. విలాసము.

సీ. చెమటచేఁ దిలకమ్ము చెదరెనోయని వింత సొలపుతో నద్దంబు చూచి చూచి కువల. 4. 98.

కం. కులుకు నెలవంక కన్బొమ, సొలపులనీయింతి వాలుఁ జూపులఁ జూడన్, వలరాజు వంటి వాఁడును, విలునమ్ములు వైచి దాసవృత్తికిఁ జొరఁడే. శశాంక. 3. 46.

8. మృదుత్వము.

సీ. తళుకు కెంజిగురాకు సొలపూను నీయంఘ్రి సూచిపై మెట్టిన సొంపు చెడదె. చంద్రికా. 2. 107.

9. దృష్టి విశేషము.

గీ. సొగసు తెలివాలునను సోగసొంపు తళుకు, బెళుకు చికిలి యొయారంపుఁ బేరెముదుటు, సొలపు యంపు దేలింపు చుఱుకుటోర, కలికి బెదరెచ్చు చూపుల కలికిఁ జూచి. ప్రబంధ. 1. 106.

అ. క్రి. వెనుదీయు, జంకు.

చం. వలపులరాయ! యిచ్చిగురు వాతెఱకొమ్మ నలంచుటెల్లన, వ్వాలసుల బోనపుం దొరకుఁ బుట్టిన గాదిలి కూతురంచునో, సొలపక యాడుదానిఁ దెగఁజూచిన రోయరె నిన్ను నయ్యయో, తెలియవు నీకుఁ దండ్రి పగదీఱునె దీనిఁ గలంచినంతటన్. యయా. 5. 78.

సొలయించు స. క్రి. సొలయఁజేయు.

ద్వి. విలసించు నలయించు విలుమించు బొమలు, సొలయించి సొలయించి సోలఁతులవ్వేళఁ, గొంచ పట్టుటకునై కొంచనియించ, గొంచ బోనీకువే యలివేణి వేణి అ. మ. క. 2. 115 పా. 18 పం.

సీ. అలయించు నొకవేళఁ బొలయల్క చిక్కుల సొలయించు నొకవేళ సొగసువగల. శశాంక. 4. 56.

సొలయిక వి. వైముఖ్యము.

వ. అలయిక సొలయికల నొక వింతయొయ్యారంబు చూపుచూపుల పసకుంజాల పసివాళ్ళు వాడిన క్రీడావతంసితకర్ణ నీలోత్పల దళంబులు కళా. 6. 224.

సొలయు అ. క్రి. 1. పరవశమగు

గీ. సొలసి మూర్ఛిల్లి యొక్కింత దెలియువారు, దెలిసి కైదువు లంకించి నిలుచువారు. భా. రా. యుద్ధ. 1449.

గీ. అతివ యూగతి నుపరతి నలసి సొలసి, యప్పళించుక ప్రాలె నాయకుని యెదను. దశా. 7. 103.

2. వైరస్యము నందు; వైముఖ్యము నందు.

చం. కలఁగెడు బంధువర్గమును గారియఁబొందెడు తల్లిదండ్రులన్, సొలయు సభాజనావళులఁ జూచి విపక్ష పక్షాపహారసం, కలనముఁ గ్రోధదేవతకు గ్రక్కునఁ జేయఁ దలంచి ..హరి. పూ. 9 133.

రగడ. సొలయక జయించు నతిసుప్తియు నసుప్తియును. దెలిసికను నాత్మసుఖతృప్తియును జ్ఞప్తియును సీతా రా. 3. 111.

కం. సొలయక తూనిగలం గొట్టులఁ బెట్టితి నీవు నీ చిఱుతకాలము ... భార. ఆది. 4. 270.

గీ. అతిథిఁ బూజించు వేడ్క నాకగ్గలంబు, వెలఁది నీవును ననుకూలవృత్తిఁ దాల్చి, సొలయ కప్పని నడపఁగావలయు ... ... భార. అను. 1. 66.

కం. జననీ యిట్లగుటను మజ్జనకు పలుకు మీఱఁ గాదు సమకొల్పుధృతిన్, మనమున నగవకు మిట్టిట్టని సొలయకు రాజునలన.... భా. రా. అయో. 66.

3. వెనుదీయు, జంకు

చం. సొలసుగవుల్ గడుంగడురఁ బొట్టుకుఁ గగ్గ నటంచు నార్చుచున్, సొలయక నమ్మశాటకఁ గనుంగొని రా జడదారి తాముతోన్. యయా. 2. 7.

గీ. ... నిదిగో వచ్చెదఁ బదఁపడి. యని సొలయు సీత త్రోవలోఁ జనుచునపుడు. దశా. 6. 18.

4. మిక్కిలి యలసటనొందు, బాధపడు.

మ. సొలయున్ జూచు నగున్ బయల్ పలుక రించున్ బల్కు నూకొట్టు బిట్టలుగున్ ద్రొక్కు...చంద్రా. 3. 4.

సీ. పవలెల్ల దీప్తి కాంబువుచల్లు బోరాడ సొలసి మృణాళికోజ్జ్వలములైన, బాహువుల్ తమదు కూర్పరముల కెదురుగా మలఁచి మూఁపులఁ గర తలము లునిచి. ఆము. 2. 61

చం. సొలసి తటిల్లతాంగి జిగిసూపువెలుంగలచేఁ గలధ్వనుల్, గలకలకంఠులన్ గదిమి ... వసు 3. 67.

గీ. అచ్చరలు దక్కగలవార లలసి సొలసి, ప్రాణ ముక్తియ యుక్తిగా ననుమతించి ... నైష. 3. 36.

కం నీవేమిచేయు దింకను, నీ వలనన్ సొలయ నేను నిను వేడెద స, ద్భావమున నాదుకోరిక, గావిం పుము సమ్మదమున గాంధమూరన్ భా. రా. బాల. 488

5 మూర్ఛపోవు

గీ. సొలసి మాటాట నుడిగిపడ దలఁచి మోము, దేఁకొని చూచునపుడ కన్నీరు వొడమె. మనుచ 3. 9 .

కం. అనునంతట నయ్యంగన, యనయముఁ బ్రబల మగునట్టి యఁగజ తాపంబున నుస్సురుస్సు రనుచుం, గనుఱెప్పలు దేలవైచి కడు సొలయుట యున్. కళా 6. 249

గీ. ఆయదూర్వహు నై వంగ నడి వెరవున, నొడిసి పట్టి యాబలియుఁ డత్యుగ్రలీల, మగుడ నతనిన వైచె నమ్మగధపతియు, సొలసి వేగ యాలోవన తెలిసి నిలిచి హరి. ఉ. 1 120.

6. విసుగుపడు.

చం. సొలయక యెల్లదేశములఁ జూచితి నందుఁ బ్రసిద్ధులైన రాజుల . భాగ. ఆది. 7. 3.

చం. పులుఁగులఁ జూడమే యెడద బోధము గల్గియు మోహ మెట్టిదో, సొలయక యాకటన్ నవయు చున్ జని మేఁపొగి తెచ్చి తెచ్చి....మార్క. 6. 30.

7. ఒప్పు

సీ. ఇనునితో జోడుగాఁ దనరెద ననుచునో యుగ్ర రూపస్ఫూర్తి యొనరుచెల్ల, సోమనామము దాల్చి సొలసెద ననుచునో వేడి వెన్నెలలచే వేఁచు చెల్ల. కృష్ణ 4. 84.

8. వ్యాపించు.

సీ ఇవిహత్తి సొలసిన మృగనాభి మృగినెత్తురులు గప్పళించిన నెలవులయ్యె. రా. వి. 3 57.

9. పరిమళించు, వలచు.

సీ. ఇంచువిల్తుఁడు ప్రయోగించు వాల్తూపులు సొలసి యొండొరుఁజూచు చూపులెల్ల. ఉ. రా 6. 166.

సొలుగు అ. క్రి. వళించు, తీఱు.

కం. బుధులోక విభుని యంతటి, శుభలక్షణ లక్షితు నకు సొలిగెనె నహుష, ప్రథవాప్రథ యిప్పటి, కభిమానం బెడలుకంటె హైన్యము కలదే ? రంగా. 2. 240.

సొలుపు(ల్పు) వి. 1 గర్భిణీ స్త్రీ లక్షణ విశేషము.

కం. అలపున్ సొలపున్ వేసట, తలఁవున్ జన్మ నలనలుపు తమమధ్యమునన్, బలుపున్ మై తెలుపున్ జెలి, సొలుపున్ గాంచి గుసగుసలఁ బోవుచుఁ గాంతల్. ఉ హరిశ్చ. 2. 92.

2. విధము

చం పెదవుల కెంపులున్ మదుటఁ జేరిన కప్రము సొల్పుఁ జూపులున్, నిదురలు లేమిఁ గన్గొనల నిండిన జాజు లెలర్పుచుండఁగా ... యయా. 4. 149.

కం. వేల్పు చెలి మెట్టులత్తుక, చాల్పున్ జాల్ పువ్వు బంతి జారెడు సొల్పున్, సొల్పువిరులొత్తు సెజ్జలు, వాల్పడ వాల్పడఁతిఁ గూడు వలనున్ దెలిపెన్. అచ్చ. భారవి. 2 28. పొ.

సొవ వి. సవ్వడి.

గీ. ఇరుగుపొరుగుల దంపతు లేపు రేఁగి, సంగమ క్రీడలోలాడి సరసమాడు, సొవసొవలు విన్నమాత్ర నుస్సురుమటంచు, మన్మథుని శారి గొత్తైయై మగువ దలఁతు. హంస. 5. 158.

## సో

సోంకించు స. క్రి. సోఁకఁజేయు.

ద్వి. సోంకు పొంకములుగా శ్రుతిపుటంబులకు, సోంకించి మాయున్న సుఖమెల్ల నడిగి. ద్వి. భార. విరా. 3. 52. పొ.

సోంకు సోఁకు, వి. స్పర్శ, తాకుడు.

కం. పోంక నళినీ రజస్వల, సోంకున దోషంబు వాయ సూర్యుఁడు గళితా, శంకను సపరాం బుధిలో, గ్రుంకెనొకో యనఁగఁ ప్రొద్దు గ్రుంకుడు నంతన్. కు. సం. 8. 89.

ద్వి సోంకు పొంకములుగా శ్రుతిపుటంబులకు, సోంకించి మాయున్న సుఖమెల్లనడిగి. ద్వి భార. విరా 3 52. పొ.

సోఁకించు స. క్రి. సోఁకఁజేయు, తగిలించు; కొట్టు; తాఁకించు.

సీ. తరళాక్షి తనులతఁ దనసుందరాంగంబు సోఁకించి సంస్పర్శ సుఖముఁ బొందు. మార్క. 5. 126

మ. జలజాప్తోగ్ర మయూఖపుం జెకుముకిన్ సప్తాశ్వ కాంతోపల,ముల్లల సోఁకించి తదుద్గతాగ్నిలవముం బోధించి ... శుక. 3. 449.

వ. గదలు సోఁకించియు ... ఉ. హరి. 3 70

సోఁకు స. క్రి. 1. స్పృశించు, తాఁకు.

శా. బేటం బేటముగా నిభంబు కరిణిం బ్రేమం బుతోఁ జేరి ... వరాంగములు సోఁకుం బుష్కరా గ్రంబువం, చాటోపం బొవరించుఁ గూడఁ బ్రియఁ గామాసక్తి నాసక్తిమై. కు. సం. 1. 100.

సీ బరిమేని గరుడుని మురువడిమైనెక్కి పవపదమని సారెవన్నె సోఁకి. వాల్మీ. 1. 106.

మ పదియార్వన్నె పసిండి పట్ట మవనీపాలావతం సంబు నె, న్నుదుటం గట్టె లతాంగి యొర్తు కడ పినుల్ సోఁక నేర్పొప్పఁగా. నైష. 8. 68.

సీ. విరహులమై సోఁకి వేడియౌ వెన్నెలఁ బచ్చి వెన్నెల నులివెచ్చఁ జేసి. పారి. 2. 48.

దం. నీ మెట్టకెంధామరం బుట్టి చెన్నారు మిన్నేటి నీరింతమై పోఁకఁ బున్నెంబు లెన్నెనియుం గల్గు... .. నీలా. 2. 41.

గీ. సుకృతహీనుల తమువులు సోఁకెనేని, కజ్జలము భావమున నొందుఁ దజ్జలంబు. విక్ర. 5. 70.

ఉ. ఎప్పుడు గౌఁగిలింతు వల యింతికుచాద్రు లురంబు సోఁకనా, కప్పుడుగాదె సౌఖ్యపదమం దుట.... శుక. 1. 30.

గీ. అకట యాతనియందు వమ్మయ్యె నాదు, శక్తి యుపలంబు సోఁకిన శస్త్రమట్ల. వా. రా. 2. 10.

ఉ. ఉత్కళమైన మంచి మనువొప్పెడు నాహ యరత్న మెక్కినన్, గక్కసమేమి లేక రవగాలును జోడన యడ్డవేడెముల్, దుక్కు దువాళి జంగ వడలున్ గనిపించుచుఁ బోయిపోయిరా, జక్కడ వన్నెసోఁక నటు హా యనివం గదలెం జరీలునన్. సారంగ. 1. 82.

2. ఆవేశించు.

సీ. పరవధూటుల మైల పరిధానములు గట్టు చూలాంద్రఁ గొందఱు సోఁకుఁడనియు. వరాహ. 11. 131.

సీ. విరహామాలిన్య దుర్విధుఁ గాని సోఁకవు, కలి దోషమవె నీవు కాయజుండ. నైష. 2. 138.

అ అదియుఁగాక రాజ్యమున్నహా భూతంబు, సోఁకి నప్పు డెట్టి సుజనులకును, లేనిచీఁకుదనము లేని మూఁగతనంబు, లేని చెవుడు గొంతయైనఁ గలదు. కళా. 5. 290.

అ. క్రి. తగులు, సక్తమగు.

గీ. అనుపనీతద్విజుండును వాడుదియును, శూద్రుఁ డును నీశులోకమాటు సోఁకఁ జెదవి, యంటు నప్పుడె శుద్ధాత్ములగుట నిక్క, మనిరి ధర్మజ్ఞులైన

వగా వీథి నుండువారు.... దైత్యభటులు. మల్లుపు. 2-4.

**హుంకృతము** సం. వి. అ. న. 1. మంత్రోచ్చారణము 2. అడవిపంది యొక్క ఘుర్ఘురము. 3. మేఘ గర్జనము.

**హుంకృతి** సం. వి. ఇ. స్త్రీ. హుంకారము.

**హుండనము** సం. వి. అ. న. మొద్దువాఱుట.

**హుండము** సం. వి. అ. పుం. 1. పులి. పొట్టేలు. 2. ఊరపంది.

**హుండి** సం. వి ఇ న. స్త్రీ. బియ్యపురాశి.

**హుండిక** సం. వి. అ. స్త్రీ. 1. మారకపుహుండి. 2. సైనికుల పోషణమునకై చేయఁబడు నేర్పాటు

**హుండ్రిక్కు** వి. డీ కొలుపుటయందగు ధ్వని కను కరణము.

ద్వి. రిక్కలుపెట్టి హుండ్రిక్కురటంచు, డీకొల్పి వికవికఁదెగడు వల్లియలు, చేకొని వారింపఁజేరు గోపికలు. ఆ.మ.క. 1-24. పా. 10. పం.

**హుండీ** హిం. వి. 1. సొమ్మిచ్చుట కాజ్ఞాపత్రిక. (శ.ర.) 2. మ్రొక్కుబళ్లకైన ధనాదులనువేయు పాత్ర విశేషము.

వ్యవ. ఈరూకను హుండీలోవేయుము.

**హుండుఁడు** సం. వి. అ. పుం. 1. రాక్షసుఁడు. 2. మూర్ఖుడు.

**హుకుము** వి. (హిం. హుకుమ్) ఉత్తరువు, ఆజ్ఞ.

గీ. మీరు సరకారు తా జమీన్దారుఁడరయ, నెదిరి సత్త్వంబు తన సత్త్వ మెఱిఁగికొనక, హుకుము చొప్పున వదవక వికటమతిని, దిరుగఁబడియుంట సరసంపుఁదెఱఁగె యనియె రంగా. 2-258.

**హుజురు**=హుజూరు. వి. సన్నిధి, సమ్ముఖము.

సీ. పెంపుమీఱు వసంతవేషువా హుజురున నుండి చెలామణి హొవరు దెలుప. గీ... మదనుపాదుసహా దండు గదలెనపుడు. అని. 3-19.

గీ. హుజురు కొలువులు గలిగె సొ పొలుకుతేఁ, నీటికొలఁకులలోఁ బెండునిండు పగలఁ, దెప్పలై బొండు మల్లెల చొప్పరములు, నెరయఁజేసినవారికి దొరలచేత. కువల. 1-98.

**హుజూరు**=హుజురు. వి. (హిం.హుజూర్.) సమ్ముఖము, సన్నిధి.

కం. వచ్చినమంత్రుల నృపతిని, యచ్చర నాయకు ననుజనవసర సచివుల్, చెచ్చెర హుజూరునకుఁబిల, వచ్చిన డిగ్గున నరుంగు వడి డిగ్గితగన్. రావి. 5-36.

**హుటాహుటి** వి. గమన వేగము.

కం. కుటిలాలక చూడుము వి,స్ఫుటమణిరాసె భృంగముల చాలు నిశా,విభ బింబముఁ బట్ట హుటాహుటి వచ్చువిధుంతుదువకు నుపమానంబై. వ రాహ 8-87.

పంచచామరము. హుటాహుటిన్ హలాయుధుండ హోవుహోగ్రుఁడై తనం, తటంపటాననిప్పుడీ విధం బెఱింగి వచ్చెనో, ఘటాఘటీల నెల్లఁద్రోవగట్టి పట్టబంచెనో. యటోయిటో యెటో భటోద్భటా ర్భటుల్ ఘటిల్లెడున్. విజ. వి. 3-142.

లయగ్రాహి. వేతాములు వాఱుచుఁమీరునిహుటాహుటిని, గేరడము లాడుచు మహారయముతో న, య్యారె యనమిటి..... సారంగ. 1.121.

విణ. అతిత్వరితము.

కం. .... భువినంత దవ్వు నేమును, తవతవ లేకరుగుదుము హుటాహుటి నడలన్. మనుచ. 1. 76.

**హుడము** సం. వి అ. పుం 1. పొట్టేలు. 2. భూమిలోఁ బాతిన వాడిగల యినుపకొట్టు. 3. కోటబురుజు 4 దడ్డుకఱ్ఱ

**హుడుక్క** సం వి. అ. స్త్రీ వాద్యవిశేష ము. ఉడుబుడుక్క

ఉ పల్లకి చక్కికాహళము వంశము ధక్కహుడుక్క ఝుర్ఝరుల్, ఝల్లరి యాదిగాఁ గలుగు శబ్దపరంపర కాశశబ్దమై, యుల్లసిలన్...... కాశీ. 1-56.

**హుడుక్కము** సం వి. అ. పుం. ఉడుక, వాద్య విశేషము. (శ.ర )

**హుడువు** సం వి.ఉ. పుం మగగొఱ్ఱె.

**హుతభుక్కు** సం వి. క్. పుం. అగ్నిహోత్రుఁడు. (ఇట్లే హుతాశనుఁడు మొ.)

**హుతవహుఁడు** సం. వి. అ పుం అగ్నిహోత్రుఁడు.

**హుమా**=హుమాయి. వి. గుఱ్ఱము.

కం. జక్కులదొర చెలికానికిఁ, గొక్కుహుమా జోద వయ్యెకుం జొక్కపులేఁ, జక్కులఁజేనిని వేలుపు జక్కరనౌదలను దాల్చు జగవేల్పునకున్. అచ్చరా. శాల 21.

చం పులుఁగుహుమా వజీరునకుఁ బుట్టిన దిట్టవు... నీలా 3-18.

**హుమాయి(యీ)**=హుమా. వి. గుఱ్ఱము.

గీ చిలువదిండి హుమాయిపై మెలఁగువాఁడు లీలఁబెనుపాముపైఁ బవ్వళించువాఁడు, నీమనోరథ మీడేర్చ నిక్కముగను... ఉ రా. 5-191.

చం ఉడిగపువారు... వెం,బడిఁ బలుమాఱు నెచ్చరిక వల్కుచుఁ గుల్కుచు రాహుమాయిత, త్తడి దుమికించుచుం జనునతండు వయాళిహయాళిగొల్పఁగన్. చంద్ర. -110.

2 వాహనము,

మ. ఎలమిన్ బంగరు టెక్క పక్కెర హుమాయీ తేజి దాటించుచున్, నలుమోమయ్య హుటాహుటిం గదలె... దశా. 2-62.

**హుమారము** వి. సవారి.

సీ జాబిల్లి చిన్నంపు బాబా హుమారంపు సరదారుని యుదార తరజవఁబు అచలా. 1-20.

**హురుట్టకము** వి ఏనుగుల కుపయోగించు నొకవిధమైన గడియ, లేక కొక్కెము.

**హు(ర్మ్) రుమత్తు** విశ. 1. పెద్దది.

గీ ఆశ్రమంబున మునివరులాడుకొనఁగ, సందెలని జపములని బల్ సవనములని, నియమనిష్ఠలనందుపై నేర్చుకొనియె, సరియె హురుమత్తువేళలఁ జిక్కఁబడునె. (హురుమత్తు వేళలన్=పెద్దకాలమున వార్ధకమున.) పాం. 1-34.

2. అధికమైనది, గొప్పది.

సీ ఒక్కనిబ్బరముగా హురుమత్తు పరువెత్తు సల్లించు శక్లెముల్ ఘల్లనఁగ కృష్ణ. 1.53.

ఉ. అత్తటిఁ దోడిచెల్వ లహాహా యిదిగో వలిగాడ్పు మమ్మెఁదూ, ర్పెత్తె వసంతు డెంతయు రహించఁగ నాకులపాటుఁ జూపె హు, మ్మత్తుగఁదోఁచె మింట నెదురన్ ద్విజరాజొకఁ డుద్ధతిన్ మధూ, దృత్తగ వారి వెల్వడెఁ బరత్తురగుండయి చూడు కోమలీ. చంద్రా. 3-56.

వి. అతివేగము.

వ, ...తమకంబుల గమకింపుచు హురుమత్తునఁ దూఁటి యుంపఱల పరంపరల వెంపరలాడిన హుసి యని. ప్రబంధ. 708.

**హురుము(మ)ంజి(జీ)**=ఉరుముంజి. హుర్ముంజి, వి. 1. పారసీక దేశమందలి యొకమండలము, అచ్చటి సముద్రము.

ఉ. ముక్కరివెట్టి గట్టిహురుముంజి చొగారపు ముత్తియంబు చేర్చుక్క యమర్చి... పాంచాలీ. 2-7.

సీ. పచ్చనిహురుమంజి పనివాగె పక్కెరపారసి పల్లంబుపట్టమయము. మనుచ 4-28.

సీ. హురుమంజి ముత్యాల యొంటుల చకచకల్ తళుకుఁ జెక్కులదండఁ దాండవింప. చం. రా. 2-62.

సీ, హురుముంజిముత్యాల యొరుగు పాగ మెఱుంగు నొసలిబత్తరిబొట్టుమునుఁగువేయ. సారంగ. 1-79. మ. చెలువంబై కళలన్ వెలుంగు హురుమంజీ దేశపున్ ముత్తియం, బులతోఁ గూర్చిన చేరుచుక్క.... అని. 5-72.

2. ఆణిముత్తెము, శ్రేష్ఠమైన ముత్యము.

సీ. ఉదయాద్రిక మీఁద హురుమంజి చౌడాలు వెడవింటి పాదుశా వెల్లగొడుగు. మృ. వి. 2-33.

సీ మురువుగా హురుమంజి మురువుతో వీనులకట్టా ణిగొప్పచౌకట్లుదాల్చి దశా. 7-250.

**హుర్ము(ర్మ్)ంజి**=హురుమంజి.

సీ. తోతెంచె నొక్కొ మధూకపుష్పములను నాసహుర్ముంజి ముత్యములవలన. పాండు 4. 234.

**హుర్మంజిపూస** (హుర్మంజి + పూస.) మంచి ముత్యము.

మ. నెలజూసంతవనిగ్గులుప్పతిలు తిన్నెల్ మూలరా పెద్దటా, కుటనిర్ధపు జగాహజారమునఁ దళ్కుం గుల్కు హుర్మంజి పూ, సలసింగంబు మెఱుంగుఁ జెక్కడపుగల్ జాగా చొగాగద్దియన్. చంద్రా. 2. 117.

**హూర్చనము** సం వి అ. న. మోసము వంచన. కుటిలత్వము.

**హులము** సం. వి అ. పుం ఒకవిధమైనపనిముట్టు.

**హులహులి** సం. వి. ఈ. స్త్రీ. ఆనందసమయములందు స్త్రీలచే నుచ్చరింపబడు ధ్వనివిశేషము.

**హులిహులి** సం వి. ఈ. స్త్రీ 1. శోభనగానము. 2. గర్జించుట, కూఁతపెట్టుట.

**హుడువు** సం. వి. ఉ. పుం. పొట్టేలు.

**హుళి** = హుళక్కి. వి. నాస్త్యర్థకము.

మ. .. మా, గ్గణముఖ్యావనశీలమా శశకశృంగ ప్రాయ మాప్తాదితో, షణమాదబ్బఱ సత్యమా హుళి గణించన్ వాని కద్రిస్తనీ. (హుళికి అని శ.ర.) హంస. 5. 111. ప్రబంధ. 110.

**హుళికి** = హుళిక్కి. వి. (శ.ర.)

**హుళిళక్కి** వి. నాస్త్యర్థకము, అభావమును దెలుపును.

గీ. ఏమిసేయుదు నెక్కడి కేఁగువాఁడ, ధనము నిప్ప చ్చరంబు విద్యయు హుళక్కి. కాశీ. 4. 111.

గీ. నిలుకడ హుళక్కి కావులు పాలనువట్టు, నిట్టి మాటోంట్లతోఁ జెల్మి యెట్లు పొసఁగు. వసు. 2. 132

**హుష్వ** వి. ఉమియుట మొదలగువానియందగు ధ్వని కనుకరణము.

సీ అల విధూదయ హేతువగు తూర్పుఁ జూళాలు హుష్వన మమియు చిట్టమ్ము లనఁగ, విప్ర. 8. 28.

**హు(శా, సా)షారు** వి. (హిం. హుష్యార్.) 1. జాగరూకత, జాగ్రత్త.

చం. అటువలెవేఁగుచుండి మగఁడత్తయు మామయు నింటలేమి వెల్పటికి హుషారువం జని. హంస. 5. 160.

కం. ఉకోలాహల మరుదని, యాకర్ణింపుచు విభుండు హయము డిగి హుసారై కైజా చేసి మహో, న్నోక హతలమున నిలిచి కనుంగొనుచుండన్. చంద్రా. 2. 111.

2. సంతోషము

కం. ఈ వేడ్కఁ జూడు ముందఱ, సావళమదె విడు వఁగా హుసారువ నెగిమా, జావపొదనోవఁ గొఁజులు, లేవఁగొట్టెదును మోయలేమన బోయల్. పార్వ 6 78.

చం. వివఁడు ప్రమోదలీల ... ఏచవపులం దలంపఁడు హుషారుగ సారెకు వేఁటఁ బోవఁగా, జనవరసూళి యందొకటి సైఁచునె కానల నెంచు వారికిన్.

3. ఉత్సాహము.

ఉ. చక్కని వారకాంతలు హుషారుగ నాట్యము సల్పుచుంట నొం, పెక్కఁగ రాజవీథుల మహీతల నాథుఁడు రాజసంబునన్. ఉ. హరిశ్చ. 4. 21.

విశ. సంతోషకరము.

చం. చలువలు గట్టి చన్నుల హుసారుగ గంధము లందికప్పురం, బలరెడి ముత్తెపుం బరణులంది ... కువల 1. 85.

సీ. చిగురాకు తెగసారు వగరాజులు హుశారు వగ మీఱు రత్నాలవహి గుడార్లు. కృష్ణ 8. 75.

హుసి వి యుద్ధాసక్తి యందగు ధ్వని కనుకరణము.

వ. తమకంబుల గమకింపుచు హురుమత్తున దూఱి యంపఱల పరంపరల వెంపరలాడిన హుసియని దొందడిని పుళిందులు కలకుమీఱి చుఱుకు చూపులు చూచి. ప్రబంధ. 7. 88,

**హుసివోవు** = ఉసివోవు. అ. క్రి. వ్యర్థమగు; తప్పిపోవు.

చం. కొలుచు సమగ్రభంగి నొవఁగూడ దివాణపు వారిచేతికా, కలు హుసి వోవఁగాఁ గలవు కాల

మెఱుంగక .... కో భియుగు రెక్కలిక్కలు ముదేస పిల్లలవంగ నచ్చుటన్. శుక. 2. 406.

**హుహువు** సం. వి. ఉ. పుం. ఒక గంధర్వుఁడు.

## హూ

హూ[1] అవ్య వేత్రహస్తులు చేయు హెచ్చరిక.

శా. ఓహో భైరవ నీలరుద్ర నిలు సాహో వీరభద్రేశకుం,భా! హూంగాకు నికుంభ యంచు వగి సమ్మర్దంబు వారించుచున్. వరాహ. 11. 9.

హూ[2] **వి. ఆవులించుట యందలి ధ్వని విశేషము.**

సీ ఒడిగిలి కనువిచ్చి హూయని బిట్టావులించి కొండొక చేఁజివేచి నీల్గి. భాగ. ఆర. 7. 45.

**హూడము** సం. వి. అ. పుం. పొట్టేలు.

**హూణము** సం. వి. అ పుం. 1. దేశవిశేషము 2 ఒక విధమైన బంగారు నాణెము,

**హూణుఁడు** సం వి అ పుం. 1. విదేశీయుఁడు. 2. అనాగరకుఁడు. 3. పర్షియాదేశములోని యొక జాతి జనుఁడు, 4. ఆంగ్లేయుఁడు.

**హూతము** సం. విశే. (అ. ఆ. అ.) పిలువఁబడినది వి. అ. న. పిలుచుట

**హూతి** సం వి ఇ. స్త్రీ. పిలుపు, ఆహ్వానము.

**హూరవము** సం. వి. అ. పుం. నక్క.

**హూహువు** సం. వి. ఊ. పుం 1. ఒకానొక దేవగాయకుఁడు. 2. గంధర్వుఁడు.

**హూహూ** వి. చలిబాధ యందగు ధ్వని కనుగుణము.

సీ. జనులు హూహూయను చలివేళఁ గుత్తుక బంటి తోయముల లోపల వసించి. భాగ. 4. 614.

## హృ

**హృచ్ఛయము** సం. వి అ. పుం. 1. ప్రేమ. 2. ఆత్మ. 3. అంతరాత్మ.

**హృచ్ఛయుఁడు** సం వి అ. పుం. మన్మథుఁడు.

**హృణి** సం. వి. ఇ. పుం. 1. కోపము. 2. మందుట.

**హృణీ(ణి)యు** సం. వి. ఆ. స్త్రీ 1. నింద. 2. జాలి. 3. సిగ్గు.

**హృతము** సం. విశే. (అ. ఆ. అ.) 1. గ్రహింపఁబడినది. 2. హరింపఁబడినది. 3. ఆకర్షింపఁబడినది. 4 ఆమోదింపఁబడినది. వి. అ. న. భాగము.

**హృత్స్తంభము** సం వి. అ. పుం. హృదయ పక్షవాతము.

**హృతి** సం. వి. ఇ. స్త్రీ. 1. హరణము. 2. నాశము.

**హృత్తు** సం. వి. ద్. పుం 1. హృదయము. 2. రొమ్ము. 3. ఆత్మ 4. అంతస్సారము.

**హృత్వ** సం. వి. న్. పుం. 1. జాలరి. 2. శివుఁడు.

**హృత్సారము** సం వి అ పుం. ధైర్యము.

**హృదయంగమము** సం. విశే. (అ. ఆ అ.) 1. మనోహరము. 2. అందమైనది. 3. సమ్మతమైనది. 4. ప్రియమైనది 5. ఇష్టము. వి అ. న. పుం ఉచితభాషణము.

**హృదయగ్రహము** సం వి అ. పుం. హృదయమాంద్యము.

**హృదయజుఁడు** సం. వి అ. పుం. కొడుకు.

**హృదయదీపకము** సం. వి అ. పుం. గోపదేవుడు రచించిన వైద్యశాస్త్ర నిఘంటువు.

**హృదయపురుషము** సం. వి. అ. పుం. గుండెకొట్టుకొనుట.

**హృదయప్రమాథి** సం.విశే. (న్. నీ. న్.) హృదయమును గలఁచునది.

**హృదయప్రస్తరము** సం. విశే. (అ. ఆ. అ ) క్రూరమైనది.

**హృదయమిచ్చు** మి. అ. క్రి. (హృదయము+ఇచ్చు) మనసిచ్చు; రహస్యమెఱిగించు.

కం. నీతి గణింపక జార, వ్రాతములకు హృదయమిచ్చి వర్తిలుటన్.... శుక. 3. 535.

**హృదయము** సం. వి. అ. న. 1. మనస్సు, ఎద 2. ఆత్మ. 3. రొమ్ము 4. ప్రేమ. 5. అంతర్యాము 6. అంతస్సారము. 7. శాస్త్రము. (ఆశ్వహృద

యము ఇత్యాదులు) 8. తత్త్వజ్ఞానము. 9. వేదము 10. కోరిక. 11. అహంకారము.

**హృదయమునసెక్కు** మి అ. క్రి. (హృదయము నకున్ + ఎక్కు.) ఇష్టుఁడగు, ప్రియుఁడగు, ప్రియ మగు.

ఉ. అంబుధియల్లుకుట్టు మనయచ్చరజాతికి జావవేల్పు పీ, తాంబరుఁడెట్టులట్ల హృదయంబునకెక్కె నితం డటంచు... కకు. 1. 172.

**హృదయరజ్జువు.** నం వి. ఉ పుం క్షేత్రగణితములో మధ్యరేఖ.

**హృదయసంఘట్టము** నం. వి. అ పుం. హృదయ స్తంభము.

**హృదయసమ్మితము** నం. విశ. (అ. ఆ. అ.) ఱొమ్ము ఱంటి.

**హృదయాత్మము** నం. వి న్. పుం. నారాయణపక్షి.

**హృదయాళువు** నం. విశ. (ఉ. ఉ. ఉ.) మంచి మనస్సుగలది.

**హృదయోదంకము** నం. వి. అ. పుం హృదయో చ్ఛ్వసము.

**హృదయ్యము** నం. విశ. (అ ఆ. అ.) హృదయము నకుఁ బ్రియమైనది.

**హృదావర్తము** నం. వి అ. పుం శ్రీవృషకము, గుఱ్ఱము ఱొమ్మునందుగల సుడి.

**హృది** నం. వి. న్. న. మనస్సు, ఎద.

మ. హృదిచైతన్యముఁబొందఁ దెప్పిఱి నిషా దేశుండు నంరబ్ధతన్, గదచేతఁగొని... ఉ. హరి. 3. 81.

**హృది(దీ)కుఁడు** నం. వి. అ. పుం. యాదవరాజు

**హృదిస్పృశము** నం. విశ. (శ్. శ్. శ్.) 1. హృద యమును తాఁకునది. 2 ప్రియమైనది. 3. సుందర మైనది. 4. సమ్మతము. (ఉక్లే హృదిస్పృక్కు.)

**హృద్య** నం. వి. ఆ స్త్రీ. 1. ఆఁడుమేఁక. 2. రక్త పాషాణము. 3. బుద్ధియనెడి యోషధి.

**హృద్యగంధ** నం వి. ఆ స్త్రీ మల్లెతీఁగ.

**హృద్యగంధము** నం. వి అ. పుం బిల్వవృక్షము. న. 1. సన్నజీలకఱ్ఱ. 2. లవణ విశేషము.

**హృద్యము** నం విశ ఆ ఆ అ.) హృదయంగ మము. వి అ న పుం తెల్లజీలకఱ్ఱ. పుం వశీక రణవేదమంత్రము.

**హృద్వంటకము** నం వి అ. పుం కడుపు.

**హృల్లాసము** నం. వి. అ. పుం. 1. ఎక్కిళి. 2. చింత.

**హృల్లేఖ** నం వి. ఆ. స్త్రీ. 1. చింత. 2. మాయా బీజము. (హ్రీమ్ అనునది) 3. ఇష్టార్థమందలి యుద్యోగము.

**హృల్లేఖము** నం. వి. అ. పుం. 1. జ్ఞానము. 2. వివే కము. 3. గుండెనొప్పి. 4. తర్కము. 5. ఊహ.

**హృషి** నం. వి. ఇ. పుం. స్త్రీ. 1. సంతోషము. 2. తృప్తి. 3. వైభవము. ఇ. పుం. అసత్యవాది.

**హృషితము** నం. విశ. (అ. ఆ. అ ) 1. సంతోషించి నది. 2. పులకించినది. 3. ఆశ్చర్యము నొందినది. 4. వంగినది. 5. నిరాశచెందినది 6 నిర్మలమైనది 7. క్రొత్తది. 8. కవచితము. 9. కుంఠితము.

**హృషీకము** నం వి. అ. పుం. న. ఇంద్రియము.

**హృషీకేశుఁడు** నం. వి. అ. పుం 1. విష్ణువు. 2. కృష్ణుఁడు.

**హృషుఁడు** నం. విశ. (ఉ ఉ ఉ.) 1. సంతోషించిన వాఁడు. 2. అబద్ధము చెప్పువాఁడు. వి ఉ. పుం. 1. అగ్ని. 2. సూర్యుఁడు. 3. చంద్రుఁడు.

**హృష్టము** నం. విశ. (అ. ఆ. అ.) 1. సంతోషించినది. 2. పులకించినది. 3. మొక్కవోయినది. 4. కఠినము 5. ఆశ్చర్యము పొందినది.

**హృష్టి** నం. వి. ఇ. స్త్రీ. 1. సంతోషము. 2. సౌఖ్యము 3. గర్వము. 4. అజ్ఞానము.

**హృష్టియోని** నం. వి. ఇ. పుం. అర్ధనపుంసకుఁడు,

# హె

హెగ్గడి వి. 1. అంతఃపురమందలి కావలివాఁడు.

సీ. తగువాహావముల వంతఃపురకాంతలనిడిదిద్దుచై పించు హెగ్గడులును. కళా. 8. 29.

ద్వి. కడిఁది హెగ్గళ్ళు హెగ్గడికత్తియలును, బడి బడి వడిబరాబరి సేయుచుండ. అ.మ.క. 5. 241. పొ. 24. పం., యయా. 4. 154.

2. అంతఃపురపు కావలికత్తె. (శ.ర.) 3. నపుంసకుఁడు.

ద్వి. ఎందుండి వచ్చితిరేమని యవఁడు, మందుఁడో జడుఁడో సోమరియో హెగ్గడియో. ద్వి. పరమ. 4. 281. పొ.

హెగ్గడికత్తె/త్తియ) వి. (హెగ్గడి + కత్తె) అంతఃపురపుఁ గావలికత్తె.

గీ. ఒక్కనాఁ డంతిపురమున నుదుటబిగువు, గబ్బి గుబ్బెతగము లూడిగములు సలుప, రాజవర్య పరాకజారమున దొరలు, కాచినారని హెగ్గడికత్తె దెలుప. కువల. 2. 3.

గీ కలిగివవియెల్ల నేర్పుతోఁ దలిరుబోండ్లు, కడఁగ మ్రోయింప హెగ్గడికత్తె లరిది, పైఁడికోలలు పూని వే పదఁడటంచుఁ, బల్లకీముందఱను బరాబరులు సేయ యయా. 5. 158.

హెగ్గడికాఁడు వి. (హెగ్గడి + కాఁడు.) అంత.పుర రక్షకుఁడు. (శ.ర.)

హెగ్గడీఁడు వి. (హెగ్గడి + ఈఁడు) హెగ్గడికాఁడు.

గీ. అతఁడు తెచ్చిన రత్నభూషాంబరాదు, లందు కొన హెగ్గడీలతో నావతిమ్ముఁ, సత్య. సాం. 4.

హెగ్గాళె వి. వాద్య విశేషము.

ది... తప్పెటఁ జిత్రగతులబాయింప. గాళెలుమించు హెగ్గాళెలు సన్న, గాళెలు . రొఁతు లగ్గలముగా మొఱయ. అ.మ.క. 4. 198. పొ. 28 పం.

హెచ్చరించు = ఎచ్చరించు. స. క్రి. (√హెచ్చు.) 1. ప్రోత్సహించు. పురికొలుపు.

చం....విక్రయింపఁగా, గలరణశూరులైన యవిశారుల వీరుల హెచ్చరించి... ఉ.రా. 4. 272.

2. అవధానమును దెలుపు.

మ...నలుమోమయ్య హుటాహుటిన్ గదలెఁ జెంతంజేరి జేజేలరా, యలు సాహోయని హెచ్చరింప... దశా. 2. 67.

వ...ఇదిగో వ్రేసెదఁ దప్పించుకొమ్మని హెచ్చరించుచు... ఉ. రా. 3. 246.

హెచ్చరిక = ఎచ్చరిక. వి. (√. హెచ్చు) 1. అవధానము, జాగరూకత.

ఉ. ఇచ్చట మేము వేఱుమఱియెవ్వరి తోడను మాటలాడఁగా, వచ్చెద మచ్యుతాత్మజ దివస్పతి పంపున గృఁష్ణుపాలికిన్, వచ్చి యతండు వీడ్కొలుప వారల యిద్దఱ యాజ్ఞలున్ గడున్, హెచ్చరికన్ ధరించి యిపు డేఁగెదు లాగిది యొక్కచోటికిన్. ప్రభా. 2. 44.

గీ. నెరని వేపాకు పుడుటింట నెరయఁజెక్కి, హెచ్చరిక గల్గియుండరె యింతులారా. ఇందు. 2. 5.

2. ప్రభువుల యవధానమునకై వేత్రధరు లుపయోగించు మాట.

గీ. వసిఁడిబెత్తుల వా రిరుదెసలఁ గ్రమ్మి, జతవదేవ వరాకు హెచ్చరికయనుచుఁ,గరము వేడుకతో బరాబరు లొనర్ప. రసిక. 1. 80.

చం. హరిహయవహ్ని సౌరి దమజాధిపువాయుకుబేర శంకరుల్, వరనతగొల్పు మ్రొక్కులిడి స్వామి పరాకవధారు దేవ హెచ్చరిక యటంచుఁ గంచుకులు సారెకు నూరెల మగ్గడింపఁగా... దశా. 1. 233.

హెచ్చరికించు = ఎచ్చరికించు. (చి. ని,. శ. ర.)

హెచ్చించు స. క్రి. (√హెచ్చు) పెంచు, అతిశయింపఁ జేయు.

సీ. పంజీవకునితోడి సఖ్యంబుపై వచ్చె హెచ్చించి యాపదఁదెచ్చుకొంటి, నొంటపాటున నాతఁ డొక నాడు నాతోడ నోడక నీసుద్దు లుగ్గడించి. వేం. పంచ. 1. 369.

**హెచ్చిరిల్లు(లు)**=ఎచ్చిరిల్లు. అ. క్రి. (√. హెచ్చు.)
1. విజృంభించు.

చం. తన తనువెల్ల దాచికొని దక్షిణమారుత చోర కుంజు వేఁడ్రువఁ జనుదెంచి తావిఁగొనిపో వన దేవత హెచ్చరిల్లి కో, యన పెనుబోటుఁగూఁత విడువట్టగతిన్ వినవచ్చె వింటివే, యనుపమగాత్రి కోకిలకులాకులకేళికుహూకుహూధ్వనుల్. కువల. 3. 124.

2. వర్ధిల్లు, అధికమగు.
కం. ఆమగువ మోముతోడను, నేమిటనో హెచ్చిరిల్లి హిమకరుఁ డోకనాఁ, డేమో పోలువఁటయికం, దామర తాఁబోలుదునన దైవమునగదే. రాజ. చ. 2. 179

కం అట కొంత కాల మరిగిన, నటవాఁడు సుమంతు నకు మహైశ్వర్యంబు, తక్కటమై గడియకుడుకునీ, రటువలె హెచ్చిరిలి రాఁగ నతిమత్సరుడై. సారంగ 3. 128.

**హెచ్చిల్లు(లు)** = ఎచ్చిల్లు. అ. క్రి. (√హెచ్చు.) అతిశయించు, పెంపొందు.

చం. అలరుచుఁ గేకయాధిపతి యంపిన గార్గ్యునికిన్ వినీతి హె, చ్చిల నెదురేఁగి... ఉ. రా. 8. 153.

కం. నిలిచి దగదీర్చుకొని హె, చ్చిలుకోపముతోడ నింత జేసిన దీనిం, దలవచ్చుక క్రిమింగెదను... శుక. ౩. 118

**హెచ్చు**=ఎచ్చు. అ. క్రి. 1. అతిశయించు, మించు.
సీ. అరవిందముల కచ్చులడఁగించుతిగి హెచ్చునాయ తంబగు కన్నుదోయితోడ. ఆము 1 12.

గీ. అంతమాగధ వైతాళికాతిమంజు, లారవంబుల మేల్కని హరివరంపుఁ, బెంపువఁ దదాస్యకళ హెచ్చి సొంపుమీఱు, ననుచు మును జాఱెనా నెల యపుడు క్రుంకె రా.వి. 1. 78.

కం. వారు శివద్రోహులుగద, యీరసమునశైవము తము హెచ్చఁగరాదం. చేరీతినైనఁ జెఱుతురు... శుక. 3. 72.

2 ఉద్రేకించు.

ఉ ఏనయి యొన్నడైనఁ దమి హెచ్చినచోఁ దనుఁజేరి యొంతప్రౌ, ఢైనఁ బదంబులొత్త తఱి మప్పటికేమి ఘటించుఁ గోరికల్. దశా. 3. 25.

చం... తమి హెచ్చువొచ్చె మె, య్యెడలను లేని బల్ హాయలు నిమ్ముగ గోరుచుఁజాలఁ బ్రౌఢలై యడరెడు గొల్లకన్నె లహహా తొలుజాముల నేమి నోఁచిరో. నీలా. 1. 108.

3. విజృంభించు.

ఉ. కాఁక నెదిర్చి సంగరముఖంబున హెచ్చిన రాజ వంశమున్; గూఁకటివేళ్లతోఁ బెఱికి గోత్రవధంబున జేసినట్టియా, ప్రేకపుఁగీడుగాక ప్రజవేచ దలంచిన గోరుచుట్టుపై, రోఁకటిపోటుచందముగ రోసి జనుల్ నను జూచి తిట్టరే జై. భా. 1. 64.

విశ. అధికము.

గీ. ఇచ్చు మెచ్చు, దెచ్చు హెచ్చుగ ద్రావిడ దేశ మధిప దశా. 1. 118

వి. గొప్పతనము, ఆధిక్యము.

చం. మొనలకు హెచ్చుగా మనముమున్నగడంగినఁ గాక శత్రులం, గనుగొని యిట్టు లొండొరు మొగం బులు సూచుచునున్నఁ బోవునే భార విరా.4.111.

కం. కావున వారల నటనా, ప్రావీణ్యము హెచ్చు గుందుఁ బ్రకటించుటకై, దేవరఁ దోడ్కొని రమ్మని దేవేంద్రుఁడు పనిచె... విక్ర. 2. 78.

సీ. అధరంబు బింబంబు నగలించులే హెచ్చు శుక రాజ తుండవిస్ఫురణఁ బోదల. దశా. 2. ౭69.

**హెచ్చుకంటిదొర** వి. (హెచ్చు+కన్ను+దొర) శివుఁడు, ముక్కంటి.
విశాలచాపది హెచ్చుకంటిదొర నేదివప్రోడ పొచ్చెము లెంచకపూలువిలుకాఁడ. ప్రబంధ. 246.

**హెచ్చుకుందాడు** అ. క్రి. (హెచ్చు+కుందు+ఆడు) ఎక్కువతక్కువలాడు వివాదపడు;

సీ. నిష్ప్రతీపంబైన నీప్రతాపంబుతో హెచ్చుకుం దాడె బీఱ డవేఁడి. నైష. 8. 91.

స. క్రి. తృణీకరించు, ఇంచుమించులాడు.

వ. కొందఱిచ్చావతులు ప్రియుఁడు తమకునేమి యిచ్చిన మెచ్చుక హెచ్చుకుందాడుదురు. కాశీ. 2. 7౪.

**హెచ్చుకుందు** విశే. (హెచ్చు+కుందు) ఎక్కువ తక్కువ.

గీ. ఏల వదరెదు నీకును హెచ్చుకుందు, మాటలకు నేఁత యిన్నాళ్లు మాకు లేని, వటువు నడురేయి యొదుండి వచ్చెఁ జెపుమ. విప్ర. ౫. 57.

**హెజ్జిజ్జి** వి. ముప్పది రెండు నపుంసక రాగములలో నొకటి. (సంగీ)

గీ. .... హెజ్జిజ్జి నీలాంబరియు ననంగఁ, బొసఁగు ముప్పదిరెండు నపుంసకములు. హంస. ౫. 12.

గీ. ... నాట, జౌళిదేశాక్షి తోడి వరాళి శ్రీవ,రాళి హెజ్జిజ్జి కేదారగౌళపాడి. ప్రబంధ. 96.

## హే

**హే** అవ్య. పశ్వాదులను ద్రోలుట యందగు ధ్వని కను కరణము.

శా. ....వల్లె త్రా, డెంతేఁ గైకొని హే యటంచు గదియన్ హేలావినోదంబువన్. దశా. 9. 16.

**హేక్క** సం. వి. ఆ. స్త్రీ. ఎక్కిలి.

**హేజీబు** వి. మంత్రి.

గీ. జిష్ణుతో మాటలాడ హేజీబు నమతు, రౌర తిప్ప నృపాల బాహాసి నిహతు, లైనయల హిందు ఖాన సేనాధిపతులు, సిండిసురపట్టనము చెంతదండు విడిసి. కువల. 1. 38.

గీ. ఉభయకటముల శ్రీముద్రలూర్ధ్వ పుండ్ర, సంగతాంగార నవయవకారలోహి, తాతత శ్రీల హేజీబులపుడు వచ్చి, రగణితస్థితి సాహేబు నగరి కడకు. రా. వి. ౫. 3౫

సీ. రాయబారము వచ్చెనా యిత్తఱి నయోధ్య కింద్రు హేజీబులం దెవ్వఁడైన. చం. రా. 4. 8౪.

**హేజుబారి** వి. (హిం.) రాయబారి.

గీ. ఇట్లు గనుఁగొన్న మన్నినిహేజుబారి, కప్ప రాసుల యొకిమీఁదు చెప్పరాని, మెప్పురాఁ గప్పురపు వీడ్య మప్పు డొసఁగి, కుశల సంప్రశ్న మొనరించి కుతుక మొదవ. రంగా. ౨ 115.

**హేఠము** సం. వి. అ. పుం. 1. ఆటంకము. 2. హాని, గాయము, 3. కలఁత.

**హేడజము** సం. వి. అ. పుం. 1. కోపము. 2. అసంతృప్తి.

**హేడము** సం. వి. అ. పుం. అవమానము.

**హేడాబు(వు)కుఁడు** సం. వి. అ. పుం. అశ్వవ్యాపారి

**హేడుఁడు** సం. వి. అ. పుం. అంతఃపురపుఁ గావలివాఁడు. విశే. మూర్ఖుఁడు.

**హేతి** సం. వి. ఇ. స్త్రీ. 1. ఆయుధము. బాణము. 2. దెబ్బ, గాయము. 3. సూర్య కిరణము. 4. వెలుతురు. ౫. మంట, 6. పనిముట్టు. 7. లేఁత మొలక.

**హేతుకము** సం. వి. అ. పుం. 1. కారణము. 2. సాధనము, పనిముట్టు.

**హేతుదుఁడు** సం. వి అ. పుం. తార్కికుఁడు.

**హేతుదుష్టము** సం విశే. (అ. ఆ. అ.) అయుక్తము, న్యాయవిరుద్ధము.

**హేతుదృష్టి** సం వి. ఇ స్త్రీ. భగవంతుని యస్తిత్వ విషయమును సందేహించు స్వభావము.

**హేతుమంతము** సం. విశే. (త్. తీ. త్.) కారణము కలది. వి త్. న. కార్యము.

**హేతుమన్నిగదము** సం. వి. అ. పుం. హేతువును సూచించు వేదవచనము.

**హేతువాదము** సం. వి. అ. పుం. 1. వివాదము. 2. కపటము. 3. భగవంతుని యస్తిత్వమును సందేహించుచుఁ గావించు వాదము.

**హేతువాది** సం. వి. న్. పుం. 1. తర్కించువాఁడు. 2. దేవుని యునికిని సందేహించువాఁడు.

**హేతువు** సం. వి. ఉ. పుం. 1. కారణము. 2. ఉద్దే

శము. 3 సమూలము. 4 సాధనము 5 తర్కము 6. హేతువాదము. 7. ఒక యలంకారము 8. ప్రేరణక్రియకుఁ గర్త. 9. మూల కారణము (బౌద్ధ.). 10. బాహ్యప్రపంచము. ఇంద్రియములు (పాశుపతులమతము) 11. విధము 12. వెల, మూల్యము.

హేతుశాస్త్రము సం. వి. అ. న. 1 తర్కయుక్తముగా రచింపఁబడిన గ్రంథము. 2. శ్రుతిస్మృతుల ప్రమాణమును నిరసించు గ్రంథము.

హేతుహేతుమద్భావము సం. వి. అ. పుం. కార్య కారణములకుఁ గల సంబంధము.

హేత్వవధారణము సం. వి. అ. న. (నాటక) తర్కించుట, హేతువాదము,

హేత్వాభాసము సం. వి. అ. పుం. మిథ్యాహేతువు. (1. సవ్యభిచారము, అనైకాంతికము. 2.విరుద్ధము 3. అసిద్ధము. 4. సత్ప్రతిపక్షము. 5. బాధితము. అని యిది అయిదు విధములు.)

హేమ సం. వి. అ. స్త్రీ. 1. భూమి. 2. అందకత్తె.

హేమంతనాథము సం. వి. అ. పుం. వెలఁగచెట్టు.

హేమంతము సం. వి. అ. పుం న. మార్గశీర్ష పుష్య మాసములతోఁ గూడిన ఋతువు.

హేమంతి సం. వి. ఈ. స్త్రీ. శీతకాలము.

హేమకందలము సం. వి. అ. పుం. పగడము.

హేమకము సం. వి. అ. న. బంగారము.

హేమకింజల్కము సం. వి. అ. న. నాగకేసర పుష్పము.

హేమకూటము సం. వి. అ. పుం. ఒక పర్వతము.

హేమకేతకి సం. వి. ఈ. స్త్రీ. స్వర్ణకేతకి, పచ్చపూ మొగిలి.

హేమకేలి సం. వి. ఇ. పుం. అగ్ని.

హేమకేశుఁడు సం. వి. అ. పుం. శివుఁడు

హేమగంధిని సం. వి. ఈ. స్త్రీ. రేణుకయను సువాసనా ద్రవ్యము.

హేమగౌరవము సం. వి. అ. పుం. అశోకవృక్షము.

హేమఘ్నము సం. వి. అ. న. సీసము. (లోహము)

హేమఘ్ని సం. వి. ఈ. స్త్రీ. పసుపు.

హేమచంద్రుఁడు సం. వి. అ. పుం. 1. ఇక్ష్వాకుని మనుమఁడు. 2 ఒకనైన నిఘంటుకర్త.

హేమజ్వాలుఁడు సం. వి. అ. పుం. అగ్ని.

హేమతరువు సం. వి. ఉ. పుం. ఉమ్మెత్తచెట్టు.

హేమతారము సం. వి. అ. న. మైలుతుత్తము.

హేమదుగ్ధ(క)ము సం. వి. అ. పుం. మేడిచెట్టు

హేమధాన్యకము సం. వి. అ. పుం. ఒకటిన్నర మాష ముల తూనిక.

హేమపక్షము సం. విణ. (అ. ఆ. అ.) బంగారు గోడలు కలది. వి. అ. పుం బంగారుటొడ్డాణము.

హేమపుష్ప(క)ము సం. వి. అ. పుం 1. అశోక వృక్షము. 2. లోధ్రవృక్షము. 3. చంపకవృక్షము. న 1. అశోకపుష్పము. 2. మందార పుష్పము.

హేమపుష్పిక సం. వి. ఆ. స్త్రీ. 1. చేమంతిపువ్వు. 2 పచ్చ అడవిమొల్ల.

హేమపృష్ఠము సం. విణ. (అ. ఆ. అ.) బంగారు పూఁత పూసినది.

హేమమాక్షికము సం. వి. అ. న. అగ్నిశిల.

హేమమాల సం. వి. ఆ. స్త్రీ. యమునిభార్య.

హేమమాలి సం. వి. న్. పుం. సూర్యుఁడు.

హేమము సం. వి. అ. న. 1. బంగారము. 2. ఉమ్మెత్త (వృ. వి.). పుం. నల్లనిరంగ గల గుఱ్ఱము. న్. న. 1. బంగారము. 2. జలము. 3. మంచు. 4. ఉమ్మెత్త. 5. కేసరపుష్పము. 6. శీతకాలము.

హేమయూథిక సం. వి. ఆ. స్త్రీ. హేమపుష్పిక, చేమంతి

హేమరాగిణి సం. వి ఈ. స్త్రీ. పసుపు.

హేమరేణువు సం. వి. ఉ. పుం. త్రసరేణువు.

హేమలము సం. వి. అ. పుం. 1. ఒరిపిడిరాయి. 2. తొండ.
హేమలుఁడు సం. వి. అ. పుం. అగసాలెవాఁడు.
హేమవ(బ)లము సం. వి. అ. న. ముత్యము.
హేమశంఖుఁడు సం. వి. అ. పుం. విష్ణువు.
హేమసారము సం. వి. అ. న. మైలుతుత్తము.
హేమసూత్ర(క)ము సం. వి. అ. న. ఒకవిధమైన కంఠహారము.
హేమాంగము సం. విశే. (అ. ఆ. అ.) సువర్ణ వికారమైనది. వి. అ. పుం. 1. సుమేరు పర్వతము. 2 సింహము. 3. చంపకవృక్షము.
హేమాంగుఁడు సం. వి. అ. పుం. 1. గరుడుఁడు. 2. బ్రాహ్మణుఁడు, విష్ణువు.
హేమాద్రి సం. వి. ఇ. పుం. 1. సుమేరుపర్వతము. 2. చతుర్వర్గచింతామణికర్త.
హేమాహేమీ ము లు విశే.బ. అధికులు, గొప్పవారు, పూజ్యులు.

శా. మాహాత్మ్యంబులు తేజముల్ విభవసంపత్తుల్ విమర్శింపఁగా, నోహో భేదములేదు నిండుసభలో నొక్కింత మాత్రంబు హే, మాహేమీలు ఘటాఘటీలతిరథుల్ మాంధాత శిసాములే, లాహీనాధిక భావముల్ తడవరాదంచున్ వికాకుండనై. వరాహ. 11. 8.

కం. మదమొదవు కోడెవిటులకు. హృదయపుటాంతరములోన హేమాహేమీల్, పదివేలమన్మథులువు, ట్టుదు రాసీమాటకుచ పటుత్వముగన్నన్. హంస. 1. 212.

సీ. బహుత వన్యులఁ దెల్పుపట్ల హేమాహేములను పల్కు పూజ్యార్థ మగుచునుండు. ఆం భా. 3. 16

హేమాహ్వము సం. వి. అ. పుం. 1. వనచంపక వృక్షము 2. ఉమ్మెత్త. (వ్యు. వి.)
హేమించు సం. అ. క్రి. బంగారమగు (శ.ర.) స. క్రి బంగారముచేయు.

మ ఇలఁద్రవ్వున్ నిధివాంఛ ధాతువితతుల్ హేమింప నూఁదున్ మహీ, తులఁగొల్చున్ ....... మల్ల. వైరాగ్య. 8.

హేమ్నుఁడు సం. వి. అ. పుం. బుధుఁడు.
హేమ్యము సం. విశే. (అ. ఆ. అ.) సువర్ణవికారమైనది.
హేయము సం. విశే. (అ. ఆ. అ.) విడువఁదగినది
హేరంబము సం. వి. అ. పుం. మహిషము.
హేరంబహట్టము సం. వి. అ. పుం. ఒకదేశము.
హేరంబుఁడు సం. వి. అ. పుం. 1. గణేశుఁడు, 2. ప్రగల్భవచనుఁడైన నాయకుఁడు.
హేర(రి)కుఁడు సం. వి. అ. పుం.. గూఢచారి.
హేరము సం. వి. అ. న. 1. కిరీటము. 2. పసుపు. 3. దయ్యపుమాయ.
హేర(రా)వళి వి. పాదవన్నెకోల. (శ.ర.)
హేరామి వి. హింసించుట, ఉపద్రవపెట్టుట.

ఉ. రాముఁ డనఁగఁ జెప్పుము ధరాసురుఁడో జమదగ్నిపుత్రుఁడై, సోమకిరీటికిన్ శరణు చొచ్చి గుహుండును దానుగూడి పో, రాములతోడనుం బరశురాముఁడవన్ విలువిద్యనేర్చి హే, రాముల దండ్రి నాఁటిరిపులందును మాడినయట్టి రాముడో. భల్లా. 2 (శ.ర.)

హేరాళము=పెరాళము. విశే. (క. హేరాళ, త. పెరాళమ్. తు. పెరాళ.) 1. అధికము. మిక్కుటము.

కం. వీలని వలలొడ్డిరి హే, రాళముగా లోకపాలరమణులు మృగయా, శీలఁ గనుఁగొనఁగఁ జేసిన, జాలక జాలములుగల దిశాభిత్తులనన్. వరాహ. 4. 74.

2. నిరాతంకము, అడ్డులేనిది.

కం. సారమతి దక్షవాటిక, తూరుపు గవనింబ్ర సిద్ధితో వసియించున్, హేరాళక్రీడానం, దారిణీ నూకాంబ భక్తజన రక్షణకై. భీమ. 1. 100.

(ఈ ప్రయోగమునుబట్టి శ.ర. దీనిని తత్సమముగా గ్రహించెను. కాని సంస్కృత నిఘంటువులలో నీ పదము కానరాదు, శ్రీనాథుఁ డచ్చటచ్చట దేశ్య పదములను సిద్ధసమాసములలోఁ జొప్పించుట కలదు. కన్నడ తమిళములందును హేరాళ, పెరాళ పదములు కలవు. కావున నిదిదేశ్యముగా

గ్రహింపఁబడినది. చూ. కైవారము.)

**హేరికుఁడు** సం. వి. అ. పుం. వేగులవాఁడు.

**హేరుకుఁడు** సం. వి. అ. పుం. శివకింకరుఁడు. 2. గణేశుఁడు. 3. బుద్ధుఁడు (చక్రసంబరుఁడు). అ న శివలింగము

**హేల** సం. వి. ఆ. స్త్రీ. 1. అవమానము 2. ద్వేషము. 3. శృంగార విలాసము. 4. ఆనందము 4. సంభోగేచ్ఛ. 6. సౌలభ్యము. 7. వెన్నెల. 8. విరామము (సంగీ).

**హేలంబి** సం. వి. ఆ. స్త్రీ. ఒకమూలిక.

**హేలనము** సం. వి. అ. న. 1 అనుమానించుట 2. విలాసముగా వినోదించుట.

**హేలావంతము** సం. విశే. (త్. తీ త్. 1. అంతుకు భావముతోఁ గూడినది. 2. చులకనగాఁ జూచునది.

**హేలావుక్కుఁడు** సం. వి. అ. పుం. అశ్వవర్తకుఁడు.

**హేలి** సం. వి ఇ. పుం సూర్యుఁడు. స్త్రీ. 1. శృంగార క్రీడ 2. ఆలింగనము. 3. పెండ్లియూరేగింపు.

**హే(హై)లిహిలము** సం. విశే (అ ఆ. అ.) విలాసశీలమైనది

**హేవాకము** సం. వి. అ. పుం. అత్యంతాసక్తి (ఈ పదమును బిల్హణాద్యర్వాచీన సంస్కృతకవులు ప్రయోగించిరి. ఇది పారసీక పదమో అంబీ పదమో యై యుండునని, ఆ.ప్ర.ని. ప్రౌఢిమ అని శ. ర.)

కం. స్థావర రాజతనూభవ, యావేళన డాయవచ్చె నభవుని సేవాహేవాక ప్రౌఢిని ... హరి. 3 67.

కం. రేవా త ంగశీకర, సేవాహేవాకపార శిశిర నురుత్ప్రస్తావపరికంప్యమానజ, టావళి యగు చతఁడు వింధ్య మల్లనఁ జేరెన్. కాశీ 1. 88.

**హేవాకి** సం. విశే. (న్ సి న్.) అత్యాసక్తి గలవాఁడు.

**హేవానకము** సం విశే. (అ. ఆ. అ.) 1. అధికమైనది 2. నిశితము.

**హేషము** సం. వి. ఆ. స్త్రీ. అ. న. గుఱ్ఱపు సకిలింపు.

**హేషి** సం. వి. న్. పుం. గుఱ్ఱము.

**హేషించు** సం. అ. క్రి. (గుఱ్ఱము) సకిలించు.

గీ జన్మవేళన యాతఁ డుచ్చైశ్శ్రవంబు, భంగి హేషించెఁ బృథివి గంపంబు నొంద. భార. ద్రోణ. 5. 341.

**హేషితము** సం. వి. అ. న. గుఱ్ఱపు సకిలింపు.

**హేహే** అవ్య. బిగ్గఱగాఁ బిలుచునపుడు సంబోధనకై వాడు పదము.

## హై

**హై** అవ్య సంబోధనార్థకము.

**హైడింబి** సం. వి. ఇ. పుం. ఘటోత్కచుఁడు.

**హైడింబుఁడు** సం. వి. అ. పుం. ఘటోత్కచుఁడు.

**హైతుకము** సం. విశే (అ ఈ. అ) హేతు సంబంధమైనది హేతువాదపూర్వకమైనది.

**హైతుకుఁడు** సం. వి. అ. పుం 1 తార్కికముగా వాదించువాఁడు, 2. మీమాంసా సిద్ధాంతముల నవలంబించువాఁడు 3 విరుద్ధ మతావలంబకుఁడు.

**హైమ** సం. వి. అ. స్త్రీ. చేమంతి. (మల్లె)

**హైమంతికము** సం. విశే. (అ. ఆ. అ,) 1 చల్లనిది 2. హేమంతమునఁ బెరుగునది వి. న. పుం. ఒక విధమైన వరి ధాన్యము (హేమంత ఋతువునఁ బండెడిది.)

**హైమనము** సం విశే (అ. ఆ. అ.) 1. చల్లనిది. 2 శీతకాలమునకు సంబంధించినది 3. శీతకాలమునఁ బెరుగునది. 4, స్వర్ణమయము. వి. అ పుం. 1. మార్గశీర్ష మాసము. 2. హేమంతఋతువు 3 శీతకాలమునఁ బెరుగు వరిధాన్యము (పుష్టికము)

**హైమము** సం విశే. (అ. ఆ అ.) 1 చల్లనిది. 2 మంచు చేతఁ గలిగింపఁబడినది. 3. బ. గాఁబవన్నెగలది. వి. అ. న. మంచు, తుషారము.

**హైమముద్ర (ద్రిక)** సం వి. ఆ. స్త్రీ. బంగారు నాణెము.

**హైమలము** సం. వి. అ. న. పుం. హేమంతము.

**హైమవతము** సం. విశే. (అ. ఆ. అ.) 1. మంచుతో గూడినది. 2. హిమవత్పర్వతము నుండి ప్రవహించు నది. 3. హిమాలయము నందుండునది. వి. అ. పుం ఒక విధమైన విషము. న. భారత వర్షము. (ఇండియా )

**హైమావతి** సం. వి. ఈ. స్త్రీ. 1. పార్వతి. 2. గంగా నది. 3. ఒక యోషధి 4 గోధుమవన్నె ద్రాక్ష. 5. అవిసెచెట్టు. 8. త్రిఫలములలో నొకటి.

**హైమి** సం. వి. ఈ. స్త్రీ. చేమంతిపువ్వు. (మల్లె)

**హైముఁడు** సం. వి. అ. పుం. శివుఁడు.

**హైయంగవము** సం. వి. అ. న. 1. తొలినాఁడు చిలికి యెత్తిన యావు వెన్న. 2. అట్టి వెన్న కాఁచిన నెయ్యి. (ఇట్లే హైయంగవీనము.)

**హైరణ్యకుఁడు** సం వి అ పుం. అగసాలెవాఁడు.

**హైరాను** హిం విశే 1 ఎటు తోఁచని. 2. తొందర పడిన (శ. ర.)

**హైరికుఁడు** సం. వి. అ. పుం. చోరుఁడు.

**హైసరే** = హాయిసరే. అవ్య ప్రశంసార్థకము సెబాసు.

సీ. హైసరే యతని పేరనిన మాత్రముననే కురు దేశ మేల్రాజుగుండెలదరె. కృష్ణ. 2. 45.

సీ. మందహాసంబుల యందంబు హైసరే సరిలేదు మెడకంట సరికినెందు. వాల్మీ. 2. 50.

**హైహయుఁడు** సం. వి. అ. పుం. యదువుముని మనుమఁడు, కార్తవీర్యార్జునుఁడు. (బహు) హైహాయ దేశము; ఆదేశమున నివసించు ప్రజలు.

**హైహేయుఁడు** సం. వి. అ. పుం. కార్తవీర్యార్జునుఁడు.

## హొ

**హొ** విశే వృత్తి యందు హొన్ను శబ్దమునకు మీఁద వర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. దీనికిఁ బరుష సరళములు పరంబు లగునపుడు నుగాగమం బగు. హొంగారె, హొంబట్టు శ. ర.

**హొంత** వి పరిశ్రమము: నేర్పు.

సీ. ఇంపుసొంపుల క్రుమ్మరింపు మాటలు వీణ పలుకుల కఠరాభ్యాస మొసఁగు, మందంపు నడపులు మాయూరగతులకుఁ బలుమాఱు తిన్నని ఫణితి. జూపు, నరసంపునాసిక సంపెంగ మొగ్గల కెక్కువ తక్కువల్ చక్కదిద్దుఁ, జొక్కంపు గుబ్బలు జక్కవ కవలకు దిట్టతనం బుపదేశమిచ్చు.

గీ. హొంతఁగాడుట వనవిహారోత్సవంబు, నలుపుట యుఁ బుష్ప వితతివాసనలు గొనుట, నెఱి సరసిఁ గ్రీడలాడుట నెపములుగను, వఠివ సౌందర్య మింక నేమని వచింతు. అని. 2. 31.

**హొంతకాఁడు** వి (హొంత + కాఁడు) జెట్టిమల్లుఁడు

మ. ఉరుసంధ్యా తపశోణమృత్కలితమై యొప్పారు బ్రహ్మాండమన్, గరికిన్ గాలవు హొంతకాఁడు చరమాగస్కంధముం జేర్చుని, బ్బరపున్ సంగడ మోయనన్ శశి డిగెన్. ప్రాగ్భూమి భృత్తైకతవే, తర బాహాగ్రపు సంగడంబనఁగ మార్తాండుండు దోఁచెన్ దివిన్. మనుచ. 3. 59.

**హొంతకారి** వి (√హొంత) జెట్టి, మల్లుఁడు.

గీ. జెట్టితండంబుతోడఁ జేపట్టి హొంత, కారిపఱిచిన యట్టు లగ్గలిక విఱుతు. భార. విరా. 1. 81.

గీ. కవులు బుధులును గాయకుల్ గవనికాండ్రు హొంతకారులు దగువందు లుండునండ. మల్లుపు. 1 13.

సీ. గరిడిలో నెఱహొంతకారులై సాముల మీఱిన రాజకుమారమణులు. హంస. 2. 9.

విశే. 1. దృఢచిత్తురాలు, మనస్విని.

గీ. వారిలో వారిలోలకల్హారకమల, వనరటద్భృంగ గంగఁ జేకొనిరి సురలు, మారుని మిటారి చికటారి గౌరి యనెడు, హొంతకారి వరించె నయ్యంతకారి. చం. రా. 3. 4.

ఉ. అక్కట యెందుఁబోయెనొ యొయారపు నంచల ముద్దుగుమ్మ యే, చక్కని డాఁగెనో కలికి జక్కవ లెక్కువ గుబ్బలాఁడియే, దిక్కన మన్నదో సొలుపు దేజెడి చూపుల హొంతకారి యే, యిక్కవ నిల్చెనో యెలవు నీనెడు చిల్కలకొల్కి దైవమా. కువల. 4. 98.

2. నేర్పరి.

సీ. అష్టభాషల యందు శాంధ్యంబు లేకుండు హొంతకారి కవీంద్రులొక్కవంక. కవలి. 1. 14.

**హొంబట్టు** వి. (హొన్ను+పట్టు) 1. బంగారు వన్నె గల పట్టు.

సీ. .... హొంబట్టు తలుగు గెంటెంబుతోడ. మనుచ. 6. 102.

సీ. పటువులై హొంబట్టుబటువు లోయన నొప్పు రమ చమ్ముదోయిఁ బాదములు నేర్చి. కళా. 2. 157.

సీ. పైఁగప్పుకొన్న హొంబట్టు దుప్పటి ... నీలా. 1 60.

2. పచ్చని పట్టుబట్ట.

మ. అనఘుల్ గన్గొనరోఁచు రాఘవుని యాథ్యాత్మ్యంబు భావించుచో, ల నధోవల్కల ద్వ్యనాన హసిమీలన్నెత్తుఁడై మున్నుగ, ట్టినహొంబట్టు నడల్పనేమి కొదవుకైతే గోటికందర్పమో, హను నెమ్మేనికటంచు వాక్పతిసుతుం డార్తిన్ మంల్పెన్ మతిన్. చం. రా. 4. 60

సీ. బొమ్మంచు ముయ్యంచు పొప్పళిహొంబట్టు నుద యరాగము....

గీ. మొదలుగా వల్వలు ధరించి ముదితలపుడు. ప్రబంధ. 272.

వ. సన్నవలిపంబులును వెలిపట్టులును హొంబట్టులును... ద్వా. 3. 206.

**హొనకా** వి. దేశవిశేషము.

రగడ. సకళాతులుంచెలువు చలికప్పడంబులును, హొంబొట్టు లోడీలు హొనకాదుకూలాలు. హం స. 5. 266.

**హొనరు**=ఒనరు. వి. పొందిక, ఒప్పు.

సీ. పెంపుమీఱుపసంత ఫేషువా హుజారువనుండి చెలామణి హొనరుదెలువ....గీ. మదనుపాడునవా దండు గదలెనపుడు. అని. 3. 19.

**హొన్గుబ్బలి** వి. (హొన్ను+గుబ్బలి.) మేరుపర్వతము, బంగరుకొండ.

సీ. వెలిబూదిపూఁత ప్రాఁబలుకుటందియలు హొన్గుబ్బలి సింగాణిగిబ్బ మాపు. అచ్చ. రా. యు. 598.

**హొన్నంచు** వి. (హొన్ను+అంచు) బంగారు పనిపీ గలయంచు.

ఉ....హొ,న్నంచు రథంబు చాఁగుబళియంచు పక్షులు మ్రోయనెక్కెవన్. మనుచ. 5. 42.

సీ. ఒఱగంటమెఱుఁగెక్కు నొరయంగఁగల ఱెక్క హొన్నంచుపక్కెర యుదుటుచూప. దశా. 266.

వ. సుళువు తాప్తాకురాడంబులు పరంగిపీటలు చదరంగంబులు పగడసాలలు హొన్నంచు సురటులు. ప్రబంధ. 605.

**హొన్నగరు** వి. బౌ. అసా. (హొన్ను+నగరు) బంగారు నగరు; రాజగృహము.

చం. పగడపుఁజాయజాజు నినుపంగనుపట్టు విదేహరాజుహొన్న గరునకుం బరిష్కరిణ నాటిక లేటికి మాటిమాటికిన్. చం. రా. 3. 113.

**హొన్ను**=పొన్ను. వి. (దీనికి వృత్తియందు వికల్పముగఁ దొలియచ్చుమీదివర్ణములకు లోపమును బరుషసరళములుపగమైనచోను గాగమంబునుగల్గును (ఉదా. హొంబట్టు, హొంగట్టు) 1. సువర్ణము, బంగారము.

వ...పదాఱువన్నెహొన్ను పసులన్ జూడన్ జూడ... ఉ. రా. 3. 22

2 బంగారునాణెము, వరహా.

ద్వి ఒడిలోనఁ బట్టిన హొన్నులమూట, పాడవు నూతిని బడిపోయిన యట్లు, ద్వి. తి సా. 1. 84. పా. 8 పం,

గీ ఉంగరఁబులు కెంపులము గరయును, మొదలు గల సొమ్ములనుకాల్చి మురిపెమమర, దిరుగుచును విట కోటులధృతి గలంచి, హొన్నులుగడి తు మరు నాన చిన్నదాన. చంద్ర. వి. 2. 19.

విశ. మనోహరము, అందమైనది.

వ ...పచ్చికపట్టుల హొన్నగు విన్నావ| కేవ వేలు

రాచెలులవిడిదలును.... అచ్చ. శా. 3. 38.

హొన్నుగట్టు వి. (హొన్ను+గట్టు) బంగరుకొండ. మేరుపర్వతము.

సీ పట్టపేనుంగు లాంట్టాశ్వములు హొన్నుగట్టుల మెచ్చని ఘనరథములు. ఉ. రా. 5. 67.

హొన్నరిగె వి. (హొన్ను+సరిగె.) బంగరుజరీ

మ...రాసుతుఁడు దోర్దో సైన్యముల్ గొల్వఁగా సొరిదిన్ పన్నరుమాలు హొన్నరిగె కుచ్చుల్ చెన్ను నన్ జౌశీం, చ గువాంబుగ వాద్యనాదములు దిక్చక్రంబునన్ నిండఁగన్. ఇందు. 2. 55.

హొమ్ము విశ (ఒమ్మునకు మొదటి రూపము.) పెద్ద. స్థూలము. వి. స్థాల్యము.

హొయలు వి. 1. విలాసము.

గీ. హొరంగల కోరమీసల హొయలు వాని, నొఅవు నెఱపెడు వెడలువుటుఁ ముపానిఁ, గాంచి పులకిత గాత్రియై కలువకంటి. కృ. శకుం. 2. 45.

ఉ. కావున వేశ్యచందమును గైకొనుమీవు హొయల్ చెలంగఁగా. వేం. మా. 1. 128.

సీ. జాఱుపయ్యెంట భుజంబు మీఁదికిఁద్రోని చెలఁగు డాపలివంకఁ జెక్కు హొయలు. దశా. 2. 160.

2. సొగసు.

ఉ...మేలికడానిడాల్ హొయలుమీఱెడు...నీలా. 1. 1.

3. వేడుక. వినోదము.

ఉ.... నేనెప్పుడు గాంతుఁ బెండ్లి హొయ లెప్పుడు పొందొనరింతునంచు మేల్ చొప్పడ భావరుం డెదురు చూచుచునుండఁగ సత్వరంబునన్. కృష్ణ. 4. 32.

హొయల్ (లు) బండి వి (హొయలు+బండి) ధని కులు విలాసమునకై యెక్కిపోవు శకటము. క్రీడా శకటము

వ. జనులకనువండువులగు హొయల్ బండులును. ప్రబంధ. 605.

హొరంగు వి. 1. సొగసు.

వ...అంతరాంతర దంతురిత నిరంతర కర్ణికార ప్రముఖ వివిధ ప్రసవనిర్గళదవర్గళ విచిత్రతరపరాగ రాజితంబగు ధరణీతలంబు రంగవల్లికాలంకృతం బగు మెఱుంగుహొరంగుమీఱ ... ఇందు. 2. 44.

సీ. కావులరివి కప్రవపుధూమములకావి జిగిలెలరంగు రచ్చలహొరంగు. రసిక. 1. 36.

2. కాంతి.

సీ...వెలుగురాజాహొరంగులు వెలుంగ. నీలా. 2 48.

చం. మెడ నిగుడించి సోయగపుమేని హొరంగు రంగలింపఁగా. రసిక. 5. 2. (విలాసము. అని. శ ర)

హొరపు వి. హోదా, అధికారము.

కీ. ఊళ్లాయములమీఁద హొజపుత్తరువు గన్న రాయకై జీతంబు రాయువారు. రా. వి. 5. 18. (హొఁపుత్తరువు=అధికారపత్రము.)

హొవ విశ. మనోజ్ఞము, చక్కనిది.

సీ హొసతమ్మి నూల్వంటి యనదుశేఁగొనుపై నోరగాఁగఁ బరుండి యొరగఁగొంకి. ప్రబంధ. 750.

## హో

హో అవ్య. 1. ప్రశంసార్థకము.

చం. అలఘు నిశాతవస్త్రమున వంగములన్నియు నిర్వికారుడై, యొలుపఁదొడంగి నట్టియెడ హోయని కిన్నరయక్ష సిద్ధసాధ్యులు దివినుండి యార్చుచును దూర్యరవంబు సెలంగ నద్భుతం బెలయఁగఁ బుష్పవృష్టిఁ గురియించిరి కర్ణుపయిం యంబునన్. భార, అర. 7. 373.

2. పిలుచుటయందగు ధ్వనికనుకరణము.

చ పులియదె దివనావలము పొంగున గ్రమోఁగుచు నున్కియట్టెయి,మ్ములనొకపాడి గోవపుడు ముంద టికిం జనుదెంచునట్టె హో, నిలుమనినం బయింబడక నిల్చి కసుంగొనునట్టె కాపురే, కలఁగక యాడుమాట లయకాలునినైన శమింపజేయదే ? భోజరా 4. 182.

హోడ సం, వి ఋ పుం. చోరుఁడు.

హోడము సం. వి అ. పుం. ఓడ, నావ.

హోఢము సం వి. అ. న. దొంగిలింపఁబడిన వస్తువు(లు).

హోత సం. విశ. (ఋ. త్రి. ఋ.) యజ్ఞముచేయు వాఁడు, అగ్నియందు హవిరాదులను వేల్చువాడు

వి. ఋ. పుం. 1. ఋత్విజుఁడు. (యజ్ఞసమయమున ఋక్కులను బఠించువాఁడు.) 2. అగ్ని. 3. యజ్ఞము చేయువాఁడు.

**హోతృ(త్ర)కుఁడు** సం. వి. అ. పుం. హోతృ సహాయుఁడు.

**హోతృషదనము** సం. వి. అ. న. హోత యాసనము.

**హోత్ర** సం. వి. ఆ. స్త్రీ. 1. యజ్ఞము॥ 2. స్తుతి. 3. వేదవచనము. 4. హోతృక వ్యాపారము వి. అ. న. 1. హోమము చేయఁదగిన నేయి మున్నగునది. 2. హవిస్సు. 3. యజ్ఞము.

**హోత్రి** సం. వి. ఇ. పుం. హోత. (శ. ర.)

**హోత్రియము** సం. విశే. (అ. ఆ. అ.) హోమమునకు సంబంధించినది వి. అ. న. యజ్ఞశాల.

**హోత్రియుఁడు** సం. వి. అ. పుం. దేవతలకై హోమము చేయు ఋత్విజుఁడు

**హోత్వ** సం. వి. న్. పుం. యజ్ఞము చేయువాఁడు.

**హోమకుఁడు** సం. వి. అ. పుం. హోత.

**హోమతురంగము** సం. వి. అ. పుం. యజ్ఞాశ్వము

**హోమధానము** సం. వి. అ. న. యజ్ఞగృహము.

**హోమధాన్యము** సం. వి. అ. న. నువ్వులు, శార్లి.

**హోమధేనువు** సం. వి. ఉ. స్త్రీ హవిస్సునకై పాలిచ్చు గోవు.

**హోమము** సం. వి. అ. పుం. 1. దేవయజ్ఞము (పంచయజ్ఞములలో నొకటి.) 2. హవిస్సు. 3. యజ్ఞము 4. వైశ్వదేవము. (శ. ర.)

**హోమి** సం. వి. ఇ. పుం. 1. వన్నె. 2. జలము. 3. అగ్ని 4. చిత్రక వృక్షము న్. పుం. హోమము చేయువాఁడు.

**హోమీయము = హోమ్యము** సం. విశే. (అ. ఆ. అ.) హోమము చేయఁదగినది.

**హోమ్యము** సం. వి. అ. న. 1. నేయి. 2. హోమద్రవ్యము.

**హోర** వి. ప్రసిద్ధి.

గీ. హోరంగల కోరమీసాల హొయలువాని, నొఅవు నెఱపెడు వెడలుపుటురమువానిఁ ... గాంచి పులకిత గాత్రయై కలువకంటి. కృ. శకుం. . 45.

(వ్యవ.) అతని పని యిప్పుడు మంచి హోరగానున్నది.

**హోర** సం. వి. ఆ. స్త్రీ. 1. అహోరాత్రము. 2. రాశ్యంశము. 3. లగ్నభేదము. 4. శాస్త్ర విశేషము. 5. గంట. 6. జాతకము.

**హోరాట** వి. ఆటోపము.

మ. ఒకనాఁడాతమముందటన్ బలుమఱున్ హోరాటమైనేల యెత్తి,కొనంగా బవరంబులన్ గెలువఁగా దెల్లంబుగాఁ జూచి .... భార. ఉద్యో. 1. 279.

శా. రుద్రాదిత్య మరుద్వసు ప్రభృతు లార్పుల్ నింగి ముట్టంగవీ,రోద్రేకంబున డాపలన్ వలపలన్ హోరాటమైముంచి స.ర్వద్రోహింబరిమార్తమంచు వికటభ్రూమ్యద్భుజామండలీ, రౌద్రాకారతఁ దాఁకదాఁకెరిపు ధైర్యస్రావణున్ రావణున్. నిర్వ. 6. 137.

**హోరాహోరీ** క్రి. విశే. అవిరామముగా, ఎడతెగక.

శా. రావై రాగ్యముఁ బూని నీవు కడునిర్దాక్షిణ్య చిత్తంబునన్, రా వైతేఁజవిగానియిందులకుహోరాహోరిగఁ బోరి యే, లావాలయము సేయఁగా... మనుచ. 3. 84.

కం. వారిరువురు దమలోపల, వేరముగొని రాజ్యకాంక్ష విజిగీషువులై, హోరాహోరిగఁ బోరిరి. ఆము. 3. 15.

**హోరు = ఓరు** వి. గాలి వీచుట, వాన కురియుట మున్నగు వాని యందలి ధ్వని కనుకరణము.

సీ. హోరంత ప్రొద్దును హోరని విసరుచుఁ గెరలు కరువలి వకిలుగాఁగ. వరాహ. 10. 29.

ఉ. దారుణవచ్చి వీచె సముదారసుశీర సమీర పోతముల్, హోరన సన్నుతించెనపు డుర్విజనాళి తదీయ శౌర్యముల్. చమ. 3. 8.

గీ ...కడవ వంచి,వట్లు హోంని ధారౌఘ మైక్యమంది మిన్నుమన్నును నొకటిగా వృష్టి బలసె. ఆము. 4. 91.

గీ పూని హోరున జడిదంపువాన గురియు. కళా. 4. 85.

ఉ. ...హోయమని యేడ్చుచుఁ బెద్ద యెలుంగుతోడ మా,తల్లిని డించిపోయెదను దాపస కామినులార కూర్మి సం,ధిల్లఁగఁ బ్రోవరే యనుచు దీనత లక్ష్మణుఁ డేఁగె నయ్యెడన్ ఉ. రా. 6. 295.

ఉ. ... రోదన్ మహాగిరులు హోరవఁ బ్రస్తుతి
బ్రాలి. ఆము. 2 47.

వ. ...అంచ బెగ్గురు మలిపులంగలియు నొడ్డారయు
నీరుహోరు లాతనికి మేలివాయిదంబులనగు సంతసం
బలవడ. ఆచ్చ కా. 2. 31 పొ.

హోల సం. వి. అ. స్త్రీ. హోళీ పండుగ.

హోలకము సం. వి. అ. పుం. 1. సెనగపిండి. 2 గడ్డి
నిప్పులలో సగము పక్వమగునట్లు కాల్చిన వేరుసెనగ
మొదలగు కాయధాన్యము.

హోలాక సం. వి. అ. స్త్రీ. 1. హోళీపండుగ.(ఫాల్గున
శుద్ధ పూర్ణిమకు ముందొనర్పఁబడువసంతోత్సవము)
2 ఫాల్గున శుద్ధపూర్ణిమ

హోలాకము సం. వి. అ. పుం. ఒక విధమైన యావిరి
స్నానము; ఊఁదరపెట్టుట న. ప్రాచ్య శాఖ
వాసులు చేయు నొకానొక మతకర్మము, వసంతో
త్సవము.

హోలాకాధికరణన్యాయము సం. వి. అ. పుం. స్మృతు
లందును గల్పసూత్రములందును జెప్పఁబడిన దాని
కాధారముగా శ్రుతివచనము లేనప్పుడు అట్టి సాధా
రణ శ్రుతివచన మేదో యుండెనని యూహింపవచ్చు
నని చెప్పు న్యాయము జైమినియు,శబరస్వామి యు
నీ న్యాయమును గూర్చి చర్చించిరి· (సామాన్యశ్రుతి
కల్పనాయా మస్తి ప్రమాణం న విశేషశ్రుతి కల్ప
నాయామ్.)

హోలి సం. వి. ఈ. స్త్రీ. హోలాక, కాముని పండుగ.

హోలిక సం. వి. అ. స్త్రీ హోలి.

హోళి వి. కాముని పడుగ యందు కడపటివాఁడు
తగులఁబెట్టుటకై ప్రోగు చేసెడు గడ్డికంప. అన్య
దేశ్యము అని, శ, ర,

హోళిగ వి. (కన్న) భక్ష్య విశేషము. శ. ర.

## హౌ

హౌ అవ్య. సంబోధనార్థకము.

హౌతభుజము సం వి అ. న. కృత్తికా నక్షత్రము,

హౌతృకము సం. విశే. (అ ఆ అ.) హోతకు సంబం
ధించినది,

హౌత్రము సం. వి. అ న. హోతృ వ్యాపారము,

హౌదా హిం. వి. (హిం. హౌదమ్.) ఏనుఁగు మీఁది
యంబారి.

సీ. సౌవర్ణ కలశముల్ సవరించిన విలాతి నకలాతు
హౌదాల సామజములు, రంగా, 1, 156,

హౌమ్యము సం. వి. అ. న. వెన్న, హోమి.

హౌసు వి 1. సొగసు

ఉ దేవ వరాకు హౌసు కళదేఱెడు నీదగురూప
వైభవం,బు ... హంస 2. 44.

సీ. యాగపాత్రలు దెచ్చి హౌసుగా పడిలుడికి చిప్ప
లుగఁ జేసి కేరువారు. సిం. శార, 20,

2, ఇంపు.

సీ, ఈ మూపఁగానేల యీ మూనగంధంబు హౌ
సొన... ఇందు. 4. 59.

3. కోరిక.

సీ. బటువుగుబ్బల నొత్తిపక్కకు హత్తినాహౌసు
చెల్లించిన యందగత్తె. శశాం. 4. 59.

4, ఔద్ధత్యము, బొగరు.

సీ, వేలుపు వెలయాండ్ర వీథిలోఁ గనువారి హౌసు
మించె నటంచు నాజ్ఞ చేసి. పార్వ. 2. 93.

5. ఒయ్యారము, (శ. ర )

హౌసుకత్తె వి. (హౌసు+కత్తె)అందగత్తె, సౌందర్య
వతి,

గీ. అచ్చరలలోన నొక్కతె హౌసుకత్తె, నీవు
పట్టపుదేవిగా నేలికొనుము. మల్లుపు 2 43.

హౌసుకాఁడు వి, హౌసు+కాఁడు , హౌసుకాఁడు,
సొగసుకాఁడు, ఒయ్యారికాఁడు (శ ర.).

## హ్న

హ్నపనము సం. వి. అ. న. హ్నవము, దాఁచుట,

హ్నవము సం. వి. అ. పుం. దాఁచుట,

## హ్ను

హ్నుతి సం. వి. ఈ. స్త్రీ 1. దాఁచుట. 2. తిరస్క
రించుట. 3. దొంగిలించుట.

## హ్య

హ్యస్ అవ్య. (తెలుగున దీనికి వ్యస్తప్రయోగము
మృగ్యము,) కడచినదినము, నిన్న.

హ్యస్తనము సం. విశే. (అ. ఆ. అ.) నిన్నటిది.

హ్యస్త్యము సం. విశే. అ. ఆ. అ.) పూర్వదినమునకు
సంబంధించినది, హ్యస్తనము,

హ్యోభవము సం. విశే. అ. ఆ. అ.) నిన్న జరిగినది,

## హ్ర

హ్రణీయ సం. వి. ఆ. స్త్రీ. 1. నింద. 2. సిగ్గు.

హ్రదగ్రహము సం. వి అ. పుం. మొసలి.

హ్రదము సం. వి. అ. పుం. 1 లోతైన కాసారము. 2. ఏటినడుమ లోతుగఁ జోటు. 3 లోతుగల నిడుపాటి నీటిపల్లము, 4. లోతైన రంధ్రము, 5. కాంతి కిరణము.

హ్రదిని సం. వి. ఈ స్త్రీ. 1. నది. 2. మెఱుపు.

హ్రసకము సం. విశ. (అ. ఆ. అ.) తగ్గించునది.

హ్రసము సం. వి. అ. పుం. 1 ధ్వని. 2. తగ్గుట. 3. అల్పసంఖ్య 4. అభావము.

హ్రసితము సం. విశ. (అ. ఆ. అ.) 1. వాయింపఁబడినది. 2. పొట్టిచేయఁబడినది; తగ్గింపఁబడినది.

హ్రసిష్ఠము సం. విశ. (అ. ఆ. అ.) మిక్కిలి హ్రస్వము, హ్రస్వతమము.

హ్రసీయము సం. విశ. (స్. సీ. స్. హ్రస్వతరము.

హ్రస్వగర్భము సం. వి. అ. పుం. కుశ, దర్భ,

హ్రస్వగవేధుక సం. వి. ఆ. స్త్రీ. బీఱ.

హ్రస్వపత్రిక సం. వి. ఆ. స్త్రీ కండ్లరాని. (వృ.వి.)

హ్రస్వవర్ణము సం. వి. అ. పుం. లఘువింపరి (వృ.వి)

హ్రస్వఫలము సం. వి. అ. పుం. ఖర్జూరవృక్షము

హ్రస్వము సం. విశ (అ. ఆ. అ.) 1. చిన్నది. 2. పొట్టిది. 3. తక్కువ వయస్సు కలది. 4. అప్రధానము. వి. అ. పుం. 1. కుబ్జుఁడు, 2. పొట్టి యచ్చు. న. ఒక రసాయన ద్రవ్యము.

హ్రస్వమూలము సం. వి. అ. పుం. ఎఱ్ఱని పొట్టిబెత్తము.

హ్రస్వాంగము సం. వి. అ. పుం. జీవకమను గంధ ద్రవ్యము (శ. ర.).

హ్రాదము సం. వి. అ. పుం. ధ్వని.

హ్రాది సం. విశ. (న్. నీ. న్. ధ్వనిచేయునది గర్జించునది.

హ్రాదిని సం. వి. ఈ. స్త్రీ 1. నది 2. సల్లకీవృక్షము. 3 మెఱుపు. 4 ఇంద్రుని వజ్రాయుధము.

హ్రాదుని సం. వి. ఈ. స్త్రీ ఇ. పుం. వడగల్లు.

హ్రాసనము సం. వి. అ. న. 1. గజసప్తమదావస్థలలోఁ జివరిది. 2. తగ్గుదల.

హ్రామ్ అవ్య. మంత్ర బీజాక్షరము. (ఇట్లే హ్రీమ్, హ్రూమ్.)

హ్రీణీయ సం. వి. ఆ. స్త్రీ. = హ్రాణీయ. 1. నింద; రోత. 2. సిగ్గు. 3. జాలి.

హ్రీ సం. వి. ఈ స్త్రీ 1. సిగ్గు, 2. వినయము.

హ్రీక సం. వి. ఆ. స్త్రీ. 1. సిగ్గు. 2. పిఱికితనము.

హ్రీకము సం. వి. అ. పుం. ముంగిస.

హ్రీకుఁడు సం. వి. అ. పుం. తంఁడి.

హ్రీకువు సం. విశ. (ఉ. ఉ. ఉ.) 1. సిగ్గుగలది. 2. వినయము గలది. వి. ఉ. పుం. 1. పిల్లి 2. లక్క. 3. తగరము

హ్రీజితుఁడు సం. విశ. (అ. ఆ. అ.) లజ్జాక్రాంతుఁడు (ఇట్లే హ్రీమూఢుఁడు మొ.)

హ్రీణము సం. విశ. (అ. ఆ. అ) సిగ్గు పొందినది, (ఇట్లే హ్రీతము)

హ్రీతముఖము సం. విశ. (అ. ఆ. అ.) 1. సిగ్గు గలది. 2. వినయవంతము.

హ్రీతము సం. వి. ఈ. స్త్రీ 1. సిగ్గు, 2. వినయము.

హ్రీవిషేధుఁడు సం. విశ (అ. ఆ. అ.) 1. వినయము లేనివాఁడు. 2. సిగ్గు లేనివాఁడు

హ్రీబలుఁడు సం. విశ. (అ. ఆ. అ.) అత్యంత వినయవంతుఁడు.

హ్రీవేర(ల)ము సం. వి. అ. న. కురువేరు. (వృ.వి.) (హ్రీబేరము అని. శ. ర.)

హ్రేపణము సం. వి. అ. న. 1. సిగ్గుపడుచుట. 2 అతిశయించుట. 3. కలఁత.

హ్రేపితము సం. విశ. (అ. ఆ. అ.) 1. సిగ్గు పఱుపఁబడినది 2. అతిశయితము

హ్రేష సం. వి. ఆ. స్త్రీ. సకిలింపు.

హ్రేషి సం. విశ. (నౌ ణీ న్. సకిలించునది.

హ్రేషితము సం. వి. అ. న. హ్రేష. సకలింపు.

హ్రేషుకము సం. వి. అ. పుం. ఒక విధమైన పాఱ.

## హ్లా

హ్లత్తి సం. వి. ఇ. స్త్రీ. సంతోషము,

హ్లన్ని సం. వి. ఇ. స్త్రీ. = హ్లత్తి, సంతోషము,

హ్లాద(క)ము సం. వి. అ. పుం. సంతోషము, ఆనందము.

హ్లాదనము సం. వి. అ. న. 1. సంతోషించుట. 2 సంతోషింపఁజేయుట 3. సేద దేర్చుట

హ్లాది సం. విశ. (న్. నీ. న్.) సంతోషింపఁజేయువాఁడు. 2. ధ్వనిచేయునది.

హ్లాదితము సం. విశ. అ. ఆ. అ.) 1. సంతోషించినది 2. సేదదేఱినది.

హ్లీకుఁడు సం. విశ. (అ. ఆ. అ.) లజ్జాహతుఁడు.

హ్లీకువు సం. విశ. (ఉ. ఉ. ఉ.) లజ్జాహతుఁడు.

హ్లేష సం. వి. ఆ. స్త్రీ. హ్రేష. సకిలింపు.

## హ్వా

హ్వల సం. వి. అ. స్త్రీ. 1. అపజయము. 2. దారితప్పుట.

హ్వా సం. వి. ఆ. స్త్రీ. 1. పేరు. 2. జిహ్వా 3. తరు. 4 నది.

హ్వాతవ్యము సం. విశ. (అ. ఆ. అ.) పిలువదగినది.

హ్వానము సం. వి. అ. న. 1. పిలుచుట. 2. కేక. 3. ధ్వని.

హ్వాయకము సం. విశ. (అ. ఆ. అ.) ఆహ్వానించునది. 2. పిలుచునది,

హ్వార్యము సం. వి. అ. పుం. 1. పాము. 2. గుఱ్ఱము.

హ్వాలము సం. వి. అ. పుం. 1. అపజయము, 2. ముగింపు.